శ్రీరస్తు.

# శ్రీ మహాభారతము

## ఆంధ్రవచనము.

శాంతిపర్వము (391-749.)

శ్రీదేవరాజసుధీమణిప్రణీతము.



మద్రాసు
ఆనందముద్రణాలయమునందు
ముద్రితము.
ఆ. వేంకటేశ్వర్ అన్డ్ కంపెనివారిచేఁ బ్రకటితము.
1916.

---

# విషయసూచిక.



# పటముల పట్టిక.



## రాజధర్మపర్వము.

{ భీష్ముఁడు బ్రాహ్మణాదుల కాపద్ధర్మము లివియని యుధిష్ఠిరునకుఁ జెప్పుట. }

యుధిష్ఠిరుఁడు:— 'బ్రాహ్మణుఁ డాపత్సమయములందు క్షత్రియధర్మములచేత బ్రతుకు చూచుకొనవచ్చునని చెప్పితిరి. అతఁ డెప్పుడేని వైశ్యధర్మముచేతను బ్రతుకు జరుపుకొన వచ్చునా ?' యని యడిగెను. అందులకు భీష్ముఁడు 'బ్రాహ్మణుఁడు తన బ్రతుకున కపాయముచేత వ్యసనమందుఁ జిక్కియున్నపుడు క్షత్రధర్మముచొప్పున నడచుకొన శక్తుఁడు గాఁడేని, వైశ్య ధర్మము నవలంబించి, సేద్యము గోరక్షణమును నాచరించి బ్రతుకవచ్చును' అనెను. యుధిష్ఠిరుఁడు 'భరతర్షభా ! బ్రాహ్మ ణుఁడు వైశ్యధర్మము చొప్పున నడచునపుడు వాఁడు స్వర్గ లోకము తనకుఁ దప్పకుండునట్లుగా నేయేయంగడిసరకు లమ్మ వచ్చును ?' అని యడిగెను. భీష్ముఁడు 'యుధిష్ఠిరా! కల్లు, ఉప్పు, నువ్వులు, జూలుగల మృగములు, పశువులు, ఎద్దులు, తేనె, మాంసము, వండినయన్నము ననెడి వీనిని సకలమయిన యవస్థలందును బ్రాహ్మణుఁడు వర్జింపవలయును. బ్రాహ్మణుఁడు వీని నమ్మినయెడల నరకమందుఁ బడును. బ్రాహ్మణుఁడు మేఁక నమ్మినయెడల నగ్నిదేవు నమ్మిన పాపము నొందును; గొఱియ నమ్మునేని జలదేవుఁ డగు వరుణునమ్మిన పాపమును, గుఱ్ఱము నమ్ము నేని సూర్యు నమ్మిన పాపమును, వండినయన్నము నమ్మినయెడల భూమి నమ్మిన పాపమును, గోవు నమ్మినయెడల యజ్ఞమును సోమ రసమును నమ్మినపాపమును బొందుచున్నాఁడు. కనుక బ్రాహ్మ

ణుఁడు వీని నమ్మరాదు. సాధువులు, వండినయన్నము నిచ్చి వండనియన్నమును మార్చుకొనుట నెంతమాత్రము మెచ్చరు. వండనియన్నము నిచ్చి వండినదానిని గొనుట తప్పుగాదు.'మేము నీవండినయన్నమును భుజించెదము. (మేము బదులుగా నిచ్చెడి) యీ వండనివానిని (ఆమమును) వండుకొనవచ్చు.' నని యీయొడంబడిక చేసికొనుటయందుఁ బాపము లేదు. యుధిష్ఠిరా! వ్యవహారముచొప్పునఁ బ్రవర్తనముగలిగి యున్న పెద్దలాదినుండి జరుపుచున్న సనాతనధర్మమును నీకుఁ దెలుపుచున్నాను. దానిని దెలిసికొనుము. 'నేనిది నీకిచ్చుచున్నాను. నీ విది బదులుగా మాకిమ్ము' అని యిట్లొడంబడికమీఁద మార్చుకొనుట ధర్మము. బలవంతముగాఁ దీసికొనుట పాపమే. ఋషులును దక్కినవార లును బూర్వమునుండి నడచుకొనుచున్న వ్యవహారము లిట్లు వర్తించుచున్నవి. ఇది నిస్సందేహముగా న్యాయము' అనెను. యుధిష్ఠిరుఁడు 'తండ్రీ! సకలవర్ణములవారును దమతమ ధర్మములను దిగవిడిచి రాజున కెదురై యాయుధము లెత్తికొని రేని యపుడు రాజుబలము తగ్గుచున్నది.అప్పుడు రాజేవిధమునఁ బ్రజలకు రక్షకుఁడై ధర్మమునకుఁ బెనుపాత్రిపై యుండఁగలఁడు? నాకుఁగల యీసందేహమును సవిస్తరముగాఁ జెప్పి తీర్పుము' అనెను. భీష్ముఁడు 'అట్టి సమయములందు బ్రాహ్మణులు మొదలగువర్ణములవారు దానముచేతను, దపస్సుచేతను, యజ్ఞముచేతను, ద్రోహము లేమిచేతను, దమముచేతను, దమతమ క్షేమములు గావించుకొనఁ దివురవలయును. వారియందు వేదబల సంపన్నులగువారు నలుగడల నుద్యమించి లేచి, మహేంద్రునకు దేవతలు బలముగూర్చునట్లు, రాజునకు బలమును వేదవిధులచేఁ

గూర్పవలయును. రాజుబలము క్షీణించుచుండునపుడు బ్రాహ్మ ణులె యతనికిఁ బెద్దప్రాపని చెప్పుదురు. కనుకఁ దెలివిగలరాజు బ్రాహ్మణబలముచేతనే తనశక్తి వృద్ధినొందింపఁ జూడవలయును. రాజు విజయమునొంది రాష్ట్రమునందు క్షేమమును సమకూర్చి నపుడు సకలవర్ణములవారును దమతమ ధర్మముల చొప్పునఁ గర్మములందుఁ బ్రవర్తింతురు. చోరులు కట్టుపాట్లను మీఱి యెల్లయెడల సంకరము గలిగించినపుడు,సకలవర్ణములాయుధము లెత్తికొని వారిని దలపడవచ్చును. అందువలన వారికి దోషము గలుగదు' అనెను. యుధిష్ఠిరుఁడు 'క్షత్రియు లెల్లవారును బ్రాహ్మణులతో విరోధించినయెడల నపుడు బ్రాహ్మణులనును వేదములనును గాచువారెవరు ? అప్పుడు బ్రాహ్మణు లనుష్ఠింప వలయు ధర్మమేది ? వారికిఁ బెనుప్రాపెవరు ?' అని యడిగెను. భీష్ముఁడు తపస్సుచేతను, బ్రహ్మచర్యముచేతను, శస్త్రముచేతను, దేహబలముచేతను, వీనిని వంచనచేతఁగాని వంచనమాలికాని యుపయోగించియు, క్షత్రియుల నప్పు డడఁచిపుచ్చవలయును. క్షత్రియుఁడు మేరమీఱి, యందును విశేషించి బ్రాహ్మణుల యందుఁ, బ్రవర్తించునేని వేదములే వాని నడఁచి పుచ్చఁగలవు. ఏలన క్షత్రియులు బ్రాహ్మణులవలననుండి పుట్టినవారు. జలము నుండి యగ్నియు, బ్రాహ్మణులవలన నుండి క్షత్రియులును, ఱాతి వలననుండి యినుమును బుట్టినవి. వీనికిఁ గలతేజమును నన్ని యెడల నడ్డులేక నిగుడుచుండునుగాని తమతమ పుట్టుచోటు లందుమాత్ర మడఁగిపోవుచున్నవి. ఇనుము ఱాతిని ఛేదించి నపుడును, అగ్ని జలములతోఁ దలపడునపుడును, క్షత్రియులు బ్రాహ్మణులను ద్వేషించునపుడును, నామూఁటి బలములును

దూలిపోవుచున్నవి. యుధిష్ఠిరా ! కావున క్షత్రియుల తేజములును బలములు నెంత గొప్పవియు గెలువఁదరముగానివియు నయినను, బ్రాహ్మణులపట్ల నడఁగిపోవుచున్నవి' యనెను.* యుధిష్ఠిరుఁడు 'బ్రాహ్మణులవీర్యము మెత్తనయి క్షత్రియులవీర్యమును దుర్బలమై, సకలవర్ణములవారును బ్రాహ్మణులయెడల దుష్టులై ప్రవర్తించిరేని, యపు డెవ్వరు తమప్రాణములను బాటింపక యుద్ధముసేసి బ్రాహ్మణుల నలుగడల రక్షించి వారిలోకములను బొందుదురు?' రని యడిగెను. అందులకు భీష్ముఁడు 'అప్పుడు గొప్ప మనస్సుగలిగి యిట్టిస్థితికి నెంతయుఁ గోపముఁ బూనినవారై యుద్ధముసేయఁగల వారెల్ల నా బ్రాహ్మణులనును ధర్మమునను దమ్మును రక్షించుకొనుచుఁ బుణ్యలోకములను బొందుచున్నారు. సమస్తజనులును బ్రాహ్మణులను రక్షించుకొఱకు నాయుధము లెత్తికొనుట యుక్తము. అట్లు బ్రాహ్మణులకై పోరాడుశూరులు మిక్కిలి శ్రద్ధతో వేదాధ్యయనము చేసినవారును, మిక్కిలి గొప్పతపములు చేసినవారును, ఉపవాసముండినపిదపఁ దమ దేహములను నగ్నిహోత్రములందు వేల్చినవారును, బొందునట్టి యుత్తమగతిని బొందుచున్నారు. బ్రాహ్మణుఁడు తక్కిన మూఁడువర్ణములవారికై యాయుధ మెత్తికొనునేని దానివలన దోషమునొందఁడు. ఇట్టి సమయములందు ధర్మరక్షణార్థము ప్రాణములు విడుచుటకంటె నెక్కుడయిన ధర్మము జనులు లేరందురు. బ్రాహ్మణుల విరోధులను దండించుటకై తమప్రాణ

---

* ఇచట నడుమ యుధిష్ఠిరవాక్యము ఉత్తరదేశకోశములందు లేదు. అంతయు భీష్మునివాక్యముగానే యున్నది. అయినను దాక్షిణాత్యకోశాను సారముగా నిట తెలిఁగింపఁబడినది.

ముల సర్పించునట్టి వారలకు నమస్కరించుచున్నాను. వారలకు భద్రమగుఁగాక. మనకు వారితోడి లోకము గలుగుఁగాత. అట్టి శూరులు బ్రహ్మలోకమును బొందుచున్నారని మనువు చెప్పెను. జను లశ్వమేధమందలి యవభృథమునందు స్నానముచేసి పవిత్రు లెట్లగుదురో యట్లె, దుర్జనులతో యుద్ధముసేయునపుడు వారి శస్త్రములు దగిలి హతు లయినసుజనులుగూడఁ బవిత్రులగు దురు. ఆయాకాలమును బట్టియు దేశమునుబట్టియు ధర్మమధర్మ మగుచున్నది. అధర్మము ధర్మమగుచున్నది. మనుష్యుల నడవడినిబుణ్యముగాఁగానిపాపముగాఁగానిచేయుటయందుఁగాల దేశములశక్తి యిట్టిదిగా నున్నది. జను లెల్లవారితోడి మైత్రి గలిగియుండువారు క్రూరకృత్యములు చేసినను నుత్తమ మయిన స్వర్గమునొందిన వారయిరి. ధర్మాత్ము లగు క్షత్రియులు పాపములు చేయుచున్నను నుత్తమం బగుగతిని బొందు చున్నారు. బ్రాహ్మణుఁడు మూఁడుకాలములందును- అనఁగా తన్ను రక్షించుకొనుటకును, దక్కిన వర్ణములవారినిస్వధర్మము లందుఁ బ్రవర్తింపజేయుటకును, దొంగలను దండించుటకును-నాయుధ మెత్తుకొనుటచే దోషమునొందఁడు' అనెను. యుధిష్ఠిరుఁడు 'దొంగలబలిమి చెలరేఁగి వర్ణసంకరము గలిగి క్షత్రియులు నశక్తులై యుండఁగా, క్షత్రియుఁడు గానివాఁడు ప్రజ

---

* '(బ్రాహ్మణస్త్రి) షులోకేషు శస్త్రం గృహ్ణన్న దుష్యతి । ఆత్మత్రాణే వర్ణదోషే దుర్గమ్యే నియమేషు చ' అని మూలము. 'ఆత్మత్రాణే దస్యుదోషే సర్వస్వహరణేతథా' అని దా. పా. తన్నుఁగాచుకొనుటయందును దొంగల దోషము నడఁచుటయందును, గలధనమంతయు గోలుపోవునపుడును నాయుధ మెత్తికొనుట పాపముగాదని యీపాఠమున కర్థము.

లను రక్షించుటకై యాచారులను నడఁచిపుచ్చెనని తలంతము. ఆబలవంతుఁడు బ్రాహ్మణుఁడో, వైశ్యుఁడో, శూద్రుఁడో యగు నేని, దండమును ధర్మముగాఁ జెల్లించి ప్రజలను రక్షించిన వాఁడయ్యె నేని, వాఁడట్లుచేయుట ధర్మమా? లేక యట్లు చేయకుండు విధమున వాని నివారింపవలయునా?' యని యడిగెను. భీష్ముఁడు దాఁటు దిక్కు లేని ప్రవాహమందు నెవఁడు దాఁటించు తెప్ప యగునో, లేక దరిలేనిదానియం దొకదరి యగునో, యట్టివాఁడు శూద్రుఁడుగాని మఱి యేవర్ణమువాఁడుగాని సర్వవిధములఁ బూజ్యత కర్హుఁడగుచున్నాఁడు. ప్రజలు చోరులచే మిక్కిలియుఁ బీడితులై తపించుచు దిక్కుమాలి యున్నపుడు తా మెవ్వని నాశ్రయించి యెప్పటివలె సుఖముగా నుండఁగలుగుదురో యట్టివానినే వారు తమ సొంతబంధువునుం బోలెఁ బ్రీతిగడలుకొనఁ బూజింతురు. ఇతరుల భయమును బోఁగొట్టి వారికెంతయు నభీష్టమొనఁగూర్చునట్టివాఁడు సన్మానమున కర్హుఁ డగుచున్నాఁడు. మోయలేని యెద్దులతోఁ గాని, పాడిలేని యావులతోఁగాని, గొడ్డురా లయిన యిల్లాలితోఁగాని, పనియేమి? అట్లె ప్రజలను రక్షింపలేనిరాజువలనఁ బ్రయోజన మేమి? మ్రానిచేతఁ జేయఁబడిన యేనుఁగువలెను, తోలిచే రచింపఁబడిన జింకవలెను, ధనము లేని మనుజునివలెను, పేడివలెను, జవిటినేలవలెను, వేదాధ్యయనము లేని బ్రాహ్మణుఁడును బ్రజల రక్షింపలేనిరాజును నున్నారు. వా రందఱును వానకురియని మేఘమువలె నిరర్థకులే యగుదురు. ఎవ్వఁ డెల్లపుడును సజ్జనులను రక్షించుచును,దుర్జనుల నడఁచుచును నుండునో యట్టి

వాఁడే రాజు గాఁదగును. వాఁడే జగము నంతయుఁ బాలింప నేర్చును' అనెను. ఇది డెబ్బదియెనిమిదవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

### భీష్ముఁడు యుధిష్ఠిరునకు ఋత్విక్లక్షణాదులను జెప్పుట.

యుధిష్ఠిరుఁడు.—'పితామహా! ఋత్విజు లగు వా రెట్టికర్మములు నెట్టిశీలమును గలవారుగా నుండవలయును? వారెటువంటివారుగా నుండవలయును? నీవు మాటకారులందు మేటివి గదే. ఇది చెప్పుము' అని యడిగెను.

భీష్ముఁడు.—ఋత్విక్కర్మమునకుఁ బాత్రు లగుద్విజులు సామాదులగు ఛందస్సులును శ్రుతులయందలి విధులును దెలిసి రాజునకు నభ్యుదయము గలిగించు కర్మములెల్లను నడపఁజాలినవారై యుండవలయునని విధింపఁబడియున్నది. వారు రాజునందే యాసక్తులై ధీరులై ప్రియవాదులై యుండవలయును. వారొకరియెడ నొకరుసుహృదులై తక్కినవాని యన్నింటియెడల సమదృష్టిగలిగి యుండవలయును. అక్రూరత్వము, సత్యవాక్యము, అహింస, దమము. ఆర్జవము, అద్రోహము, అభిమానము లేకుండుట, సిగ్గు, తితిక్ష, శమము ననెడి యివి యెవనియందుఁ గనుపట్టుచున్నవో వాఁడు పురోహితుఁడని చెప్పఁబడుచున్నాఁడు. మఱియు బుద్ధిమంతుఁడును, ఉడివోని ధైర్యముగలవాఁడును, శాంతుఁడును. భూతములకు హింసగావింపనివాఁడును, గామద్వేషములు లేనివాఁడును, మూఁడు శుద్ధగుణములుగలవాఁడును, అసూయలేనివాఁడును, జ్ఞానముచేతఁ దృప్తినొందిన వాఁడును నగువాఁడు బ్రహ్మాసనమునకు నర్హుఁడగును. ఇట్టిగుణ

ములుగలవారు గొప్ప ఋత్విజు లగుదురుగాన యిట్టివారెందును దగురీతిని మిక్కిలియు మాన్యులగుదురు' అనెను. యుధిష్ఠిరుఁడు 'వేదములు దక్షిణ లీయవలయునని చెప్పుచున్నవి. కాని, యింత యీఁగవలయునని యెచ్చటఁగాని విధి కలుగదు. దక్షిణ లీయవలయుననెడి యీవిధి ధనమును విభాగించుటనుగూర్చి కలిగినదిగాదు. కర్త యందులకు నశక్తుఁడయినచో నాశాస్త్రము మిక్కిలి భయంకరముగా నున్నది. ఆశాస్త్రము యజమానుని శక్తిని బరికింపదు. మనుజుఁడు శ్రద్ధతోడ యజ్ఞము సేయవలయునని వేదములందు వినఁబడుచున్నది. యజ్ఞము *పొల్లుతోఁ గూడియుండినయెడల శ్రద్ధ యేమిచేయఁగలదు?' అని యడిగెను.

భీష్ముఁడు 'వేదములను నిరాకరించుటవలనఁ గాని శఠత్వము చేతఁగాని మాయచేతఁగాని యెవ్వఁడును మేలునొందఁడు. నీవిది యిట్లుగాదని బుద్ధిని దలఁపవలదు. నాయనా! దక్షిణ యజ్ఞమున కొకయంగము. అది వేదములకుఁ బెంపు గావించుచున్నది. దక్షిణ లేని యాగము పురుషుని సంసారమును నేవిధముననను దరింపఁజేయఁజాలదు. ఒక్క †పూర్ణపాత్రమునకుఁ గలశక్తి యెంత

* పొల్లుతోఁ గూడియుండుటయనఁగా విహితము లయినదక్షిణలకు బదులుగా వేఱగువాని నేర్పఱచుట. ఒకయావునకు మాఱుగా అన్నపిండములును, వస్త్రమునకు బదులుగా యవలును, బంగారమునకుఁ బ్రతిగా రాగి నాణెము, నని తెలియునది.

† యజమానుఁడు వేదములందు విధింపఁబడిన దక్షిణనీయ శక్తుఁడుగాకున్నను వానికిఁ బ్రతియగువాని నిచ్చుటవలన వానికి ఫలము చెడకుండును. ఏలనఁగా ఒకపూర్ణపాత్రము అనఁగా ఇన్నూటయేఁబదియాఱు పిడికిళ్లబియ్యము శ్రద్ధతో నీయఁగా, అది మిక్కిలి విలువగల దక్షిణతోఁబాటిగా ఫలకారియగుచున్నది.

విలువ గలదక్షిణ కయినను సాటి యగునుగాని వెనుదీయదు. కనుక మూఁడువర్ణములవారును దమతమశక్తికొలఁదిని యజ్ఞము తప్పక చేయవలయును. సోముఁడు బ్రాహ్మణులకు రాజని వేదములందు వినఁబడుచున్నది. అయినను బ్రాహ్మణులు దానిని యజ్ఞములు చేయుటకై విక్రయించుచున్నారు. కాని దాని వలన బ్రతుకు జరుపుటకుఁగాదు. ధర్మములందుఁ బండితులగు ఋషులాసోమమును విక్రయింపఁగా వచ్చినధనముచేత యాగమును జేయఁగా నాయాగము పయిపయిని యాగములను బెంచుచున్నదని ధర్మయుక్తముగాఁ జెప్పియున్నారు. * పురుషుఁడు, యజ్ఞము, సోమము ననెడియీమూఁడును న్యాయముగ నడవడి గలిగి యుండవలయును. అన్యాయంబగు నడవడి గల పురుషుఁ డిహమునకును బరమునకును బాత్రుఁడు గాఁడు. మిక్కిలియు దేహకష్టముచేత గడించిన ధనమునుగొని మహాత్ములగు బ్రాహ్మణులు గావించెడి యజ్ఞ మంతగా గొప్పధర్మము నొసంగదని వేదములందు వినఁబడుచున్నది. తపస్సు యజ్ఞమున కంటె శ్రేష్ఠమయినదని వేదములందు మిక్కిలి ప్రతిపాదింపఁబడుచున్నది. ఆ తపమును నీకుఁ జెప్పుచున్నాను. విద్వాంసుఁడవు గదే. దానిని సయితము నేను జెప్పఁగావినుము. అహింస, సత్యవచనము, అక్రూరత్వము, దమము, దయ యనునివియె ధీరులగువారు తపమని తెలియుదురుగాని శరీరమును శుష్కించుట గాదు. వేదములను నిరాకరించుట, శాస్త్రముల నుల్లంఘించుట, మర్యాదలనెల్లఁ బాటింపకుండుట యను నివియె తనకు నాశనమగును. యుధిష్ఠిరా ! 'తపస్సనెడియజ్ఞము చేయువారికి బ్రహ్మ

* ఇట పురుషుఁడనఁగా యజమానుఁడు. యజ్ఞము చేయువాఁడని తెలియునది.

ముతోఁ బడయఁగోరిన యోగము, స్రుక్కు, చిత్త మాజ్యము, ఉత్తమమగు జ్ఞానము, పవిత్రము, సమస్తమయిన కుటిలత్వ మును, మృత్యువు, ఆర్జవమెల్ల బ్రహ్మపదము. జ్ఞానవిషయ మింతియె. కుదృష్టివాదుల ప్రలాపములు దీని నేమిచేయఁగలదు' అని దినమునకుఁ బదిమాఱు లగ్నిహోత్రమందు వేల్చుచుండు వారు (దశహోతలు) విధించి యున్న దానిని, యుధిష్ఠిరా! వినుము' అనెను. ఇది డెబ్బదితొమ్మిదవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

### భీష్ముఁడు ధర్మరాజునకు మిత్రులయు నమిత్రులయు లక్షణములను జెప్పుట.

ధర్మరాజు 'పితామహా! మిక్కిలి యల్పమయిన కార్యమును సయితము మనుష్యుఁడు సహాయము లేక యొక్కఁడే చేయుట దుష్కరముగా నున్నది. ఇఁక రాజ్యమువంటి దానిని సహాయము లేక చేయుట యెట్టిదో చెప్పనేల? కాఁబట్టి రాజునకు సహాయుఁ డగు మంత్రి యెట్టిశీలమును నాచారమును గలవాఁడుగ నుండవల యును? రా జెట్టివానియందు నమ్మికయుంపవచ్చును? ఎట్టివాని యం దుంపరాదు?' అని యడిగెను.

భీష్ముఁడు 'రాజా! రాజులకు నాలుగువిధములయిన మంత్రులు గలరు. వారలు సహార్థుఁడు (రాజుతోఁ పాటి ప్రయోజనము గల వాఁడు) భజమానుఁడు (రాజును భక్తితోఁ గొలుచువాఁడు)

---

* సహార్థుఁడు, రాజుతోఁ బాటిగా 'మన మిరువుర మీశత్రువును నిర్మూలుని చేసి యీరాజ్యము నిరువురు పంచుకొనవలయునని కలసినవాఁడు. భజమానుఁడు,

సహజుఁడు (రాజు తోఁబుట్టుకచే సంబంధించినవాఁడు) కృత్రిముఁడు (దానాదులచే వశీకృతుఁడయినవాఁడు) అని నలుగురు. రెండుపక్షములను గొలువక యొకపక్షమునే యనువర్తించునట్టి ధర్మాత్ముం డగు పురుషుఁడు రాజు మిత్రములలో నైదవవాఁడు. అతఁ డేపక్షమందు ధర్మముగలదో యాపక్షమందే యుండును. లేక యేపక్షమును జేరక మధ్యస్థుఁడుగా నుండును. (ధార్మికుఁ డగు రా జట్టివానిని గయికొనవచ్చును కాని) వానికి రుచింపనివిషయమును రాజు వానికి వెల్లడింపరాదు. మిత్త్రుఁడని యొక ప్రకృతిలేదు. శత్రు వనియు నొక ప్రకృతిలేదు. ఉపకారమువలన మిత్త్రుఁడును నపకారమువలన శత్రుఁడును నగును. మనుష్యుఁడు తా నెవనిమరణమును గోరునో, కాలము కొంచెము కడవఁగానే వాని బ్రతుకునే కోరును. కాన మిత్త్రుత్వ శత్రుత్వములు స్వభావసిద్ధములుగావు. జయింపఁ గోరురాజులు ధర్మంబునను నధర్మంబునను జరింతురు. నాలుగు విధములయిన మిత్త్రులలో నడిమివారగు రెండవవాఁడును మూఁడవవాఁడును శ్రేష్ఠులు. మొదటివానిని నాలుగవవానిని నెప్పుడును సందేహించుచుండవలయును. రాజు తానే చక్కఁజేయవలసిన కార్యము బూరోక్తులయిన యెవ్వరయందు సందేహింప వలయును. మిత్త్రులను రక్షించువిషయమందు రా జెంతమాత్రము పరాకు పడరాదు; అట్లు పరాకుపడినరాజును లోకులు మిక్కిలియుఁ గీడ్పఱతురు. అసాధువు సాధువు గాను సాధు వసాధువుగాను నగుచున్నాఁడు. శత్త్రువును మిత్త్రుఁడగును. మిత్త్రుఁ

---

తాతముత్తాతల వరుసనుండి కొలువుగలవాఁడు. సహజుఁడు, పినతల్లికొడుకు మొదలయినవాఁడు. కృత్రిముఁడు, ధనాదులచే వశీకృతుఁడయినవాఁడు.

డును మిక్కిలి దుష్టుఁడు కావచ్చును. మనుష్యుని చిత్త మెప్పుడును నొక్కతీరున నుండదు. కాబట్టి వాని నొకప్పుడును నెవఁడు నమ్మును? కాబట్టి ముఖ్య మయినకార్యమును రాజు చక్కఁగానే చేయవలయును. ఒక్కచో యెడతెగని విశ్వాసము, ధర్మార్థములను మూలముట్టుగ నాశముసేయును. అందఱయెడ విశ్వాసము లేకుండుటగూడ, మృత్యువుకంటె నెక్కుడయినది. విశ్వాసము కాలమృత్యువగును. అవిశ్వాసము విపత్తుగాఁ బర్యవసించును. ఒకఁడు మఱొకనిఁ బూర్ణముగా విశ్వసించెనేని, యామఱియొకఁడు తనయెడ మంచికోరిక కలిగియుండు నంతవఱకుఁ దాను బ్రదుకును. ఈకారణమునుబట్టి కొందఱయెడ నమ్మికయు, శంకయు రెండును గలిగి యుండవలయును. ఇది రాజనీతిగతి. ఇది సనాతనమయిన సంపత్తి. ఒకఁడు 'నేను గతించినయెడల నాధనము వీనికిఁ జేరవచ్చు' నని యెవనినిగూర్చి తలంచునో యట్టి వానియెడ నెప్పుడును సందేహించుచుండవలయును. పండితులట్టివాని నమిత్రునిఁగా నెన్నుదురు. ఎవనిపొలము దారిని, మఱొకని పొలమునకు నీరుపాఱుచున్నదో యా మనుష్యుని యిష్టములేక యిక్కడనుండు కట్టలు తెగిపోనేరవు. అట్లే మిక్కిలి నీటికి భయపడి యామనుష్యుఁడు గనిమను ద్రెంపఁగోరును.* ఇటువంటి లక్షణముగలవాఁడై శత్రువులు చొచ్చుటకు దారియైన

* పెద్దచెఱువు ననకట్టదాపున పొలము గలవాఁ డా కట్టను గాచుచుండెనేని దానిక్రింది పొలములు నిమ్మళముగా పంటలు పండుచుండును; వాఁడా కట్టను దెగఁగొట్టినా క్రింది పొలములకెల్లఁ జెఱుపు గలుగును. అట్లే గొప్ప శత్రువుండఁగా రాజ్యంపు పొలిమేరను గాచువాఁడు (సీమాంతపాలుఁడు) దానిని బదిలముగాఁ గాచుచుండినచో పరరాష్ట్రమునుండి మంచిసరకులు (ప

రాజ్యంపునెల్ల గాచుచుండునట్టి వాని నెప్పుడును శంకించుచుండ వలయును. బుధులు వానిని శత్రువుగా నెన్నుచున్నారు. రాజు వృద్ధినొందుట కెంతమాత్రము తపింపక యత్యంతము సంతోషించువాఁడును, రాజు క్షీణతనొందెనా మిక్కిలి దీనతనొందు వాఁడును నగుట యుత్తముఁ డయినమిత్రునిలక్షణముగాఁ జెప్పుదురు. ఎవనినిగూర్చి 'నేను బాడిమాలితినా వీఁడును బాడి మాలు'నని తలంతువో యట్టివానియందు, తండ్రి యందుం బోలె విశ్వాస ముంపవలయును. అట్టివానిని రాజు తనశక్తి కొలఁదిని సర్వవిధముల వృద్ధినొందింపవలయును. ఎవఁడు నీధర్మ కార్యములందు నీకుఁ గీడురాకుండ వారింపఁజూచునో యట్టి వాఁడు, తక్కిన కార్యములందుఁ గీడువాటిల్లకుండునట్లు చూచు చుండును. ఇట్లుండుటయె యుత్తమం బగు మిత్రలక్షణము. ఎవ్వరెవ్వని క్షీణతనుగోరుదురో వారువానికి శత్రువులని చెప్పం బడెదరు. నీకు వ్యసనము కలిగినప్పుడు మిక్కిలి భయపడు వాఁడును, నీకుఁ బెంపు సొంపారునపు డసూయలేక యుప్పొంగు వాఁడును, నగుమిత్రుఁడు నీకు సమానుఁడని చెప్పఁబడును. మంచి రూప మును, మేని చాయయుఁ, దియ్యని యెలుఁగును గలిగి యోర్పుగలవాఁడై యసూయలేక మంచికులమునఁ బుట్టి మంచి స్వభావము చెలఁగుచున్న పురుషుఁడు, రాజునకు వెను వెనుక ముఖ్యుఁడుగా (అనఁగాఁ బ్రధానమంత్రిగా) నుండవలయును.

---

న్యాములు)వచ్చుటచే స్వరాష్ట్రము సుఖమునొందును. ఆపొలిమేరను భేదించెనా స్వరాజ్యము శత్రువులు చొచ్చుటచే నశించును. ఇట్లు శత్రువు వానికధీనుఁ డుగా నున్నాఁడుగాన యట్టి సీమాంతపాలుని వలనను శంకించుచుండవలయు నని భావము.

ఋత్విజుఁడయినను, గురువయినను, మిత్త్రుఁడయినను, మేధావియు మంచి జ్ఞాపకశక్తి గలవాఁడును, సమర్థుఁడును, స్వభావమునఁ గ్రూరుఁడు గానివాఁడును,దన్ను గౌరవించినను గౌరవింపక పోయినను మనసునఁ గొంచెమైనను భేదము నొందనివాఁడును నగు పురుషుఁడు నీగృహమందు నిలిచి యమాత్యుఁడుగా నుండఁ గోరు నేని నీవు పూజించుచుండవలయును. అతనికి నీపరమరహస్యము లయిన మంత్త్రాలోచనములును నీధర్మార్థముల కలస్థితియుఁ దెలుపవచ్చును. అతనియందుఁ దండ్రియందుంబోలె నీవు విశ్వసింపవలయును. ఒక కార్యమునకు నొక్కనినే నియమింపవలయును గాని యిద్దఱను ముగ్గురను గూడదు. ఏలన వారొకరి నొకరు సైఁపక పోవచ్చును. ఒక్క కార్యమునందుఁ బెక్కండ్రను నియమించినపుడు వారలకు భేదము గలుగుట యెప్పుడును జూపట్టుచున్నది. కీర్తి ప్రధానము గాఁ గలవాఁడై, సమయములన్నిటను

'స తే విద్యాత్పరం మంత్రం ప్రకృతిం చార్థధర్మయోః' అని ఔ. మూలము. 'సంవిద్యాః పరమం మిత్రం ప్రకృతి ..' అని దా. మూలము. ధర్మార్థములు రెంటికిని ప్రకృతిగానుండు మిత్రుని మిక్కిలి యుత్తమునిఁ గాఁ దెలియవలయునని యర్థము. ప్రకృతి యనఁగా ముఖ్యకారణము. ఇది అర్థమునకును ధర్మమునకును ధర్మార్థములు రెంటికిని బ్రకృతిగా మూఁడువిధములగును:—ఇందుఁ 'కృషి, వర్తకము,కోట, మేర, ఏనుఁగులు పట్టుచోటు, బంగారు రత్నములు మొదలయినవి యెత్తుచోటు, కప్పముతీయుట, దస్కులేంచోటు' అని యీ యెనిమిదియు అర్థసంబంధియగు ప్రకృతి. ధర్మాధికారియగు నొకఁడు ధర్మప్రకృతి యగును. కోటయధ్యక్షుఁడు, సేనాపతి, రాజు, పురోహితుఁడు, వైద్యుఁడు, జోస్యుఁడు నను నీ యీయార్వురును, ధర్మార్థములు రెంటికిని బ్రకృతియగుదురు - అని అఱవ వ్యాఖ్యానము.

దప్పక వర్తించుచు, సమర్థులగు వారిని ద్వేషింపక, యనర్థముల నాచరింపక, కామమువలనఁగాని భయమువలనఁగాని లోభ క్రోధములవలనఁగాని ధర్మమును దిగవిడువక, సమర్థుఁడయి వలయునంత మాటాడు దిట్టతనము గలిగియున్న పురుషుఁడు నీకు వెనువెనుకఁ బ్రధానుఁ డగు మంత్రిగా నుండవలయును. మంచి కులమునఁ బుట్టినవారును, శీలసంపన్నులును, ఓరుపు గలవారులును, తన్నుఁదాను బొగడుకొననివారును, శూరులును, గొప్పతనముగలవారును, విద్వాంసులును, కర్తవ్య మిదియని నిశ్చయింప నేర్చినవారును నయిన యిట్టిపురుషులను, నీకార్యము లన్నింటిని జూచుటకు మంత్రులుగా నేర్పఱుపవలయును. వీరు నీవలనఁ బూజితులై వలయువస్తువుల నొంది, నీమేలునందే నిష్ఠ కలిగి నీకెంతయు సహాయులై యుందురు. అర్థమును సంబంధించిన యాదాయ వ్యయములు మొదలయిన కార్యములందును మఱియు గొప్ప కార్యములందును నియుక్తులై వీరు మిక్కిలియు శ్రేయమును గలిగింతురు. మఱియు,వీరొండొరులకు మేలు చేయతాము కాఁగోరుచు, వలయునపు డొకరినొకరు గలసి యాలోచించుచు, అర్థమును సంబంధించిన కార్యముల నెల్లఁ గావించుచుందురు. ఎప్పుడును జ్ఞాతులను జూచినచో మృత్యువుంబోలె నెన్ని భయపడవలయును. జ్ఞాతి సామంతునివలెనే యెప్పుడును రాజు పెంపును సయింపఁడు. కపటము లేక, మెత్తఁదనముగలిగి మిక్కిలి దాతయు, నకార్యములందు లజ్జగలవాఁడును, సత్యవచనుఁడును నగు రాజు నాశమునకు జ్ఞాతితప్పఁ దక్కిన వాఁడెవ్వఁడును సంతోషింపఁడు. ఒకప్పుడు జ్ఞాతులు గానివారును దుఃఖము కలిగింతురు; జ్ఞాతులును సుఖము గలిగింతురు. జ్ఞాతులు లేనివా

నిని దక్కినజనులును గీడ్పఱుతురు. పరులచే నవమానితుఁ డయిన మనుష్యునకుఁ దనజ్ఞాతియె ముఖ్యమయిన ప్రాపగును. తనజ్ఞాతికిఁ గలిగిన యవమానమును జ్ఞాతియొక్కఁడె సైఁపఁడు. తక్కినవాఁ డట్లుండఁడు. బంధువు తనజ్ఞాతికిఁ జేసిన యవమానమును దనకుఁ జేసినట్లే తలంచును. కాఁబట్టి, జ్ఞాతులయందును గుణమును దోషమును రెండును గానంబడుచున్నవి. జ్ఞాతిలేని మనుష్యుఁడు సంతోషమును బొందఁడు. వృద్ధియుఁ బొందఁడు. జ్ఞాతి వర్గమందు మంచి సెబ్బరలు రెండును గనుపట్టుచున్నవి. జ్ఞాతులను వాక్కుచేతను గార్యములచేతను నెప్పుడును గౌరవముతోఁ బూజింపవలయును. వారలకుఁ బ్రియమే చేయవలయును. అప్రియ మెంతమాత్రమును జేయరాదు. వారి యెడల మనస్సునందు నమ్మిక లేకుండినను, ఎప్పుడును నమ్మిక గలవానివలె నుండవలయును. వారియందు గుణమనికాని దోషమనికాని దృఢముగా నిరూపించుట శక్యముగాదు. ఇట్లు పరాకులేక ప్రవర్తించుచువచ్చు మనుష్యునియందుఁ బగవారును గలంకలేక మిత్రులగుదురు. ఇట్లు శత్రువు, మిత్రుఁడు, ఉదాసీనుఁడు, జ్ఞాతి, బంధువు లనువీరలయందు నెప్పుడును బ్రవర్తించుచు వచ్చు మనుష్యుఁడు చిరకాలము మంచికీర్తిని బొంది వెలయుచుండును." అనెను. ఇది యెనుబదియవయధ్యాయము.

---

రాజధర్మపర్వము.

{భీష్ముఁడు ధర్మరాజునకు జ్ఞాతివిషయమై కృష్ణునకును నారదునకును జరిగినసంవాదమునుజెప్పుట.}

ధర్మరాజు 'ఇట్లు పరస్పర మసూయ గలజ్ఞాతులను బాంధ

వులను మిత్రులను శత్రువులను దనవశము చేసికొనుట యిట్లు కష్టముగా నున్నదిగాన వారల మనసులను వశము చేసికొనుటకు దారియేద్ది?' యని యడిగెను.

భీష్ముఁడు ఈవిషయమై, దేవర్షియగు నారదునకును వాసు దేవునకును నొకసంవాదము జరిగెను. పురాతనమయిన యా యితిహాసము నుదాహరించెదరు. వాసుదేవుఁడు 'నారదా! పండి తుఁడుగాని మిత్రుఁడును, బండితుఁ డయ్యును మంచి తెలివిలేని యమిత్రుఁడును, బరమమయిన మంత్రమును (రహస్యమును) దెలిసికొనఁ దగినవారుగారు. కాఁబట్టి, నీకుఁ గలపరిపూర్ణజ్ఞాన మును మంచిచెలిమిని దృఢముగా నేను గనుఁగొన్న వాఁడను గాన కొన్నివిషయముల నడుగుచున్నాను. నేను* రాజని పేరుగలిగి జ్ఞాతులకు నూడిగము చేయుచున్నాను. భుజింపఁదగిన వాని యందు, సగముమాత్రమే భుజించుచున్నాను. తక్కినసగమును జ్ఞాతుల కిచ్చుచున్నాను. వారల వాక్కులనుండి వెలువడు పరు సంపుమాటలను సహించుచున్నాను. అగ్గిని గోరినవాఁ డరణిని జిలుకునట్లు, ఆపరుసనిమాటలు నామనస్సును మథించుచున్నవి. దేవర్షీ ! వారల వాక్కులనుండి వెడలు క్రూరంపుఁబలుకులు నన్నెప్పుడును దహించుచున్నవి. నారదా! బలదేవుఁడు బలమున మిన్న. గదుఁడు సౌకుమార్యమునను బ్రద్యుమ్నుఁడు చక్కఁ దనమునను మదించి యున్నవారు. నాకు సహాయుఁ డొక్కఁ డును లేఁడు. నారదా ! తక్కినవా రయినయంధకులును వృష్ణు

---

* దాస్యమైశ్వర్యవాదేవ జ్ఞాతీనాం వైకరోమ్యహమ్' అని దా. మూలము. '...వ కరోమ్యహమ్' అని ఔ. మూలము. నాదాయాదుల యైశ్వర్యము నెత్తి పొగడుచు వారికి నూడిగమును నెప్పుడునుజేయుదు' అని ప్రతాపచంద్రరాయలు.

లును మిక్కిలియు భాగ్యవంతులై బలవంతులు నై పరులకుఁ జెనకరాకున్నారు. వారెడ తెగనిప్రాణికయుఁగలరు. వారెవ్వని పక్షమునఁ జేరరో వాఁడు నశించును. ఎవ్వని పక్షమునఁ జేరుదురో వాని కన్నియుఁ గలుగుచున్నవి. ఆహుకుఁడును అక్రూరుఁడు నిరువురును దమయందు నాకధిక మగునెయ్యము లేదని నన్ను విడిచియున్నారు. కాన వారియం దొకరిపక్షమును జేరలేకున్నాను. ఈ యిరువుర పక్షమున నుండుటయు దుఃఖముగానున్నది. ఈ యిరువురను విడిచి పుచ్చుటయు నంతకంటె దుఃఖముగానున్నది. మహర్షీ ! ఒక తల్లి తనయిరువురు కొడుకులును జూడరా, నపు డిరువురకును గెలుపును గోరినట్లు, నేనును వారియందొకరికి గెలుపును మఱొకరికి నోటమియుఁ గోరకున్నాను. నారదా! ఈ యిరువురనుబట్టి యిట్లు దుఃఖపడుచున్నాను గాన, నా నిమిత్తము నాకును జ్ఞాతులకును శ్రేయం బయినమార్గమును నీవు చెప్పవలయును' అని యడిగెను.

నారదుఁడు ' వృష్ణికులతిలకా ! మనుష్యునకు బాహ్యము ఆభ్యంతరము నని రెండు విధములయిన యాపదలుగలవు వీనియందుఁ దనచేతఁ గావింపబడినది యాభ్యంతర మనియుఁ,బరులచేతఁ గావింపఁబడినది బాహ్యమనియుఁ జెప్పఁబడును. ఇప్పుడు నీకుఁ గలిగియున్నయాపద యాభ్యంతరము. ఇది నీ కర్మముల వలననే కలిగినది. బలదేవుఁడు మొదలయిన భోజవంశమువా రక్రూరునితో సంబంధించి, ధనమునుబట్టియో, యిచ్చచేతనో, మాటలచేతనో, ద్వేషము చేతనో,పురికొనియో యతని పక్షముసఁ జేరినవారయిరి. నీ వన్ననో, నీవు గడించినధనమును మఱొకనికిచ్చివైచితివి.నీకు స్నేహితులు గావలసినందఱుమనుష్యు లున్నను

నీవు చేసినపనివలననే,యీబెడదదెచ్చుకొంటివి.ఆధనమును గ్రక్కి-నకూటినింబోలె మరలఁగయికొనుట శక్యముగాదు. బభ్రువునుం డియు*నుగ్రసేనునివలన నుండియు రాజ్యమును మరలఁ బడయుట యలవిగాదు. నీవు నీయంతటను, విశేషించి జ్ఞాతులలో భేదము కలుగు ననుభయమువలనను, దానిని గయికొనుట దరము గాదు. ఒకవేళ నా ప్రయత్నము సిద్ధించినను నది మిక్కిలి ప్రయాసమున మహాదుష్కరమును జేసినపిదపనే కలుగును. దాని వలన గొప్పక్షయమును గొప్పధననాశమును, లేక పూర్ణ నాశమును సంభవించును. కాఁబట్టి యినుముచేతఁ జేయఁబడని సాధనము నుపయోగింపుము. అది మృదువయ్యు హృదయముల ఛేదించునదిగా నుండవలయును. దానిని దీటి దీటి నీజ్ఞాతులందఱ నాలుకలను గోసివుచ్చుము' అనెను. వాసుదేవుఁడు 'నన్ను దీటి దీటి నాజ్ఞాతుల నాలుకలను జక్కఁబఱుపుమని చెప్పితివే. ఇనుము కాక మృదువయ్యు హృదయములను ఛేదించునట్టి యాయాయుధమెద్ది ?' యని యడిగెను.

నారదుఁడు 'నీశక్తికొలఁది నెప్పుడు నన్నము పెట్టుట,ఓరుపు, నిష్కాపట్యము, మెత్తఁదనము, పూజ్యులగు వారిని బరువుకొలఁదిని బూజించుట యనునివియె యినుముకాని యాయుధము.

---

* ఆహుకుఁడును అక్రూరుఁడును పరస్పరము మిక్కిలి వైరముగలిగియుండిరి. ఈ యిరువురును గృష్ణుని తమతమ ప్రక్కఁజేరఁ బురికొలిపినను నతఁడట్లు చేయక యిరువురయెడ సముఁడై యుండెను. కాన వారి కితనియందుఁ బక్షములేకుండెనని తెలియునది.

ఇక్కడ నుగ్రసేనునకు రాజ్యమిచ్చి వేయుటయే కృష్ణునియందుఁ దప్పుగా నారదుఁడు చెప్పుట తెలియునది.

కటువుగాను జులకగాను నీజ్ఞాతులు మాటలాడఁ గోరుచున్న
పుడు నీవు వారలమనసును, వాక్కును, హృదయమును మంచి
తిన్నని మాటలచేతనే యడంపుము. మహాపురుషుఁడు గానివాఁ
డును,మంచిబుద్ధి లేనివాఁడును,సహాయము లేనివాఁడు నగు నొక
మనుష్యుఁడు తగినంత పెనుబరువును నెంతపాటుపడినను బ్రొమ్మున
మోవంజాలఁడు. నీ విట్టిబరువును (వృష్ణులను బరిపాలించు
టను) నీ మూఁపున భరింపుము. ఎద్దులన్నియును మిట్టపల్లము
లులేనిదారిని పెనుబరువును మోయును; పోవఁ గటు వయిన
దారియందుఁ బ్రసిద్ధిగన్న మేలియెద్దు మాత్రమే పెనుబరువును
మోయును. కేశవా ! నీవు నీసంఘమందు ముఖ్యుఁడవుగా ను
న్నావు. ఈ సంఘము భేదిల్లెనా పెనునాశము గలుగును. కాఁబట్టి
యీ సంఘము నిన్నుఁబొంది కీడ్పడకుండునట్లుగా నీవు గావింప
వలయును. ప్రాజ్ఞుం డగు వానియందు బుద్ధియు క్షమయునింద్రి
యనిగ్రహమును ధనమునిచ్చుటయు నుండునే కాని తక్కిన
గుణము లుండవు. కృష్ణా ! ఎప్పుడును దనపక్షమువారిని రక్షిం
చుట, ధనమును గీర్తిని నాయువును వృద్ధిఁబొందించును. కాఁబట్టి
జ్ఞాతులకు నేకొదవయు లేకుండునట్లుగా నీవు చేయవలయును.
ప్రభూ ! సంధి విగ్రహము మొదలయిన యాఱు గుణములను
బ్రయోగించుటయు దండయాత్ర సలుపుటయు రాఁగలకాలము
నను వర్తమానకాలమునను గలదియు నీకుఁ దెలియుని దొక్క
టియు లేదు. మహాబాహూ ! యాదవులు, కుకురులు, భో
జులు, అంధకులు, వృష్ణులు, లోకములు, లోకపతులు నంద
ఱును ని న్నాశ్రయించినవారై యున్నారు. మాధవా ! ఋషు
లును నీయభివృద్ధిని గోరుచున్నారు. నీవు సమస్త ప్రాణులం

దును బెద్దవు. నీవు పరమం బయినగతి నెఱుఁగుదువు. యదువు లందు మిన్నవు. నిన్ను నండఁగొని యాదవులు సుఖముగా వర్ధిల్లుదురు' అనెను. ఇది యెనుబదియొకండవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

{ భీష్ముఁడు, అమాత్యపరీక్షను గుఱించి కాలక వృక్షీయోపాఖ్యానమును జెప్పుట. }

భీష్ముఁడు 'అమాత్య పరీక్ష విషయమై నే నిపుడు చెప్పినది ప్రథమవిధి. రెండవవిధిని జెప్పెదను వినుము. రాజునర్థమును వృద్ధిఁ బొందించుమనుష్యుని రా జెప్పుడును రక్షింపవలయును. బొక్కసము నశించుచుండునపుడు, అమాత్యుఁడే దాని నపహరించుచున్నాడని తెలిసి వేతనము పుచ్చుకొనువాఁడో మఱి యితరుఁడో దానిని నీకుఁ జెప్పవచ్చునేని, వాఁడుచెప్పునది మంతనమున విన నవధరించి యాయమాత్యుని బారినుండి వానిని రక్షింపవలయును. అపహరింపఁ దొడఁగిన యమాత్యులు రాజునకు మిక్కిలి వలయునట్టివారిని రూపుమాపఁజూతురు. రాజుకోశమును నపహరింపఁ జూచు మనుష్యులందఱును నొక్కటిగాఁ గూడికొని దానిని గావం గోరువానిని బాధింప నుంకింతురు. కాన వానిని రాజు రక్షింపనిచో వాఁడు తప్పక నశించును. ఈ విషయమై కాలకవృక్షీయుఁ డనుముని కోసలరాజును జూచి చెప్పిన యీ పురాతన మగునితిహాసమును నుదాహరించుచున్నారు. క్షేమదర్శి యనువాఁడు కోసలదేశమునకు నధిపతి. వాని యొద్దకుఁ గాలకవృక్షీయుఁ డనుముని పోయెనని మాకు వినికి.

అతఁ డొకగూఁటియందు నొక కాకిని బంధించికొని క్షేమదర్శి క్రింది యధికారు లందఱు నడవళ్లను బరిశీలించుకొనుచు నారాజు దేశమునందు మాటిమాటికిఁ గ్రుమ్మఱినవాఁడయ్యె. అతఁడు 'నేను గాకిని సంబంధించినవిద్యను గఱచియున్నాను. జరిగిన దియు జరుగుచున్నదియు జరుగఁగలదియు నన్నియు నాకుఁ గాకులు దెలియఁబఱుచుచున్నవి' యని యారాజ్యమందుఁ బెక్కుండ్రకుఁ జెప్పుకొనుచుఁ జుట్టును సంచరించు చుండెను. అతనిని బెక్కుజనులు బలసికొని యుండుటవలన నతఁడు రాజు నియోగుల యందఱు యుపచారములను గనుఁగొన సాగెను. ఇట్లతఁ డా రాజ్యమందుఁ గలకార్యమునంతయు, అందందుఁగల యధికారుల దోషములను, అశేషముగాఁ దెలిసికొని యంత 'నాకు నీరాజ్యమునందలి వన్నియుఁ దెలియు' నని చెప్పికొనుచు రాజును జూడంగోరి కాకముతోఁ గూడఁ బోయెను. అతఁడు కోసలరాజుకడకుఁ బోయి యందు భూషణాలంకృతుఁడై యున్నయమాత్యునిఁ జూచి 'అమాత్యా! నీ వీయీచోట నీయీకార్యమును జేసితివి. దీనిని వీఁడును వీఁడును నెఱుఁగుదురు. రాజుబొక్కసము నపహరించితివి. ఈవిషయమును గాకి చెప్పుచున్నది. కాన దీనిని శీఘ్రముగ నాలోచింపుము' అనెను. అతఁ డప్పు డాతీరుగనే యందు బొక్కసము నపహరించి యున్నతక్కిన వారిని గూర్చియుఁ జెప్పెను. ఆముని చెప్పినమాట యించుకయినను బొల్లగుటలేదని యెందును బ్రసిద్ధిగాంచియుండెను. ఇట్లాఋషి యపరాధులం గావించిన యధికారు లందఱును నొక్కటిగాఁ గూడి రాత్రియం దతఁడు నిదురించు చుండఁగా నతనిని మీఱి యాకాకమును జంపివైచిరి. తెల్లవాఱఁగానే

యాముని గూఁటియందుఁగాకె బాణముచేఁగొట్టువడియుండుట నుజూచి క్షేమదర్శియొద్దకుఁబోయి 'రాజా! నీవు ప్రాణములకును ధనమునకును బ్రభుఁడవు; ఈశ్వరుండవును. కాన నీవలన నభయ ము వేఁడెదను. నీయాజ్ఞనుగొని నీకు హితంబగు వచనముఁ జెప్పఁ గోరుచున్నాను. నీవు శూరుండవై యున్నను, నీ వలననుండియు ధనము లవ్వారిగా నపహరింపఁ బడుచున్నవి. ఈ విషయమై మి క్కిలియు దుఃఖితుఁడనయ్యు, మిత్రుల కార్యమునందు మిక్కిలి యక్కఱ కలిమింబట్టియు, నేను నీహితమునుగోరి, సారథి మంచి గుఱ్ఱమును మీఱునట్లు, నిన్ను మీఱియైనను నీకుఁ దెలుపవల యు ననుతలంపునఁ బ్రేమ దయివాఱ నిందు వచ్చితిని. మిత్రుఁ డగువాఁ డొకఁడు తనకు హితము సేయఁగోరి యందులకై యతి మాత్రకోపమును భక్తియుఁ బెనఁగొన బలవంతముగాఁ దన్ను మీఱి తెలుపవచ్చె నేని, తనమేలును దెలిసి తనయైశ్వర్యము నభి వృద్ధిని గోరునట్టిప్రాజ్ఞుం డగుపురుషుఁ డతనిని క్షమింపవల యును.' అనెను. రా జతనిం జూచి 'నీవేది కోరుదువో దానిని నాకుఁ జెప్పవచ్చును. నేను నాహితమును గోరినవాఁడను గాన నీ వేది చెప్పినను నాకోరుపు లేకుండుటకుఁ గారణమేమి? ఈ విషయమై నీ విష్టపడునది చెప్పుము. ఇట్లని నీకు గట్టిగాఁ బ్రతిజ్ఞ సేయుచున్నాను. బ్రాహ్మణోత్తమా! నీవు చెప్పిన మాట చొప్పున నేను జేసెదను' అనెను.

ముని *'నేను నీక్రింది కొలువుడుగాం డ్రగుణములను దోష

---

* విద్వాన్నయానపాయాంశ్చ భయాఖ్యాత్ర్భక్తిం భయానిచ, భక్త్యా వృత్తిం సమాఖ్యాతుం భవతో౽న్తికమాగతః. ప్రాగేవోక్తంతు దోషో౽య మాచార్యై ర్నృపసేవనమ్ । అగతేః కుగతిర్హ్యేషా యారాజ్ఞా సహజీవితా'

ములను వానివలన నీకుఁగలుగు భయములను జక్కఁగా గుఱు తెఱిఁగి, నీయందలి భక్తింజేసి వానినంతయుఁ జెప్పుటకై నీయొద్దకు వచ్చితిని.ధర్మోపదేశకు లయిన యాచార్యులు రాజునుగొలుచుట దోషమని మును లే చెప్పియున్నారు. రాజునుగొలిచి బ్రతుకుట, వేఱుగతిలేని మనుష్యునికిఁగూడ మిక్కిలి కుచ్చితమయిన బ్రతుకగును. రాజులను జేరియున్న మనుష్యునిఁ, ఘోరసర్పములతోఁ జేరినవానినిగా నే పెద్దలు చెప్పెదరు. రాజులకు మిత్త్రులును బెక్కండ్రు; శత్త్రువులును బెక్కండ్రు; కావున వారలందఱివలననుండి రాజు నుపజీవించువారికి భయము కలుగునని జెప్పెదరు. అట్లె రాజువలన నుండియు నొక ముహూర్తకాలమున వీనికి భయము కలుగును. రాజునెడ నెప్పుడును నొక్కతీరునఁ బరాకు లేకయుండుట శక్యము గాదుసుమీ. సంపదను గోరు మనుష్యుఁడు రాజువలన నేవిధమునను బరాకు పడఁగూడదు. పరాకువలన మనుష్యునిబుద్ధి చెడుచున్నది. బుద్ధి చెడినవానికిఁ బ్రాణము నుండదు.మంచి చదువరి యగువాఁడు ప్రాణమునకును ధనమునకును బ్రభుండును నీశుండు నగు రాజును, మండుచున్న యగ్నిని గుపితమైన సర్పమును డగ్గఱునట్లు,దారసింపవలయును. తాను మెలఁగవలసిన విధమును జక్కఁగాఁ గఱచికొని యొకఁడు రాజుసమీపమున,మండుచున్న యగ్ని సమీపమునందుఁ బోలెఁ, గూర్చుండ వలయును. రాజు ప్రాణమునకును ధనమునకును బ్రభుఁడును నీశ్వరుఁడును నగును. కాన యతఁడు క్రూరవిషముగల

---

అని దా. మూ. 'జ్ఞాత్వాన ఘూనఘూంశ్చాపి భృత్యైత స్తే భయానిచ,భక్త్యా... మాగమమ్,ప్రాగేవోక్తస్తు దోషోయమాచార్యైర్నృపసేవినామ్,అగతీకోగతిర్హ్యేషా పాపా రాజోపసేవినామ్' అని జౌ. మూలము.



415. క్షేమదర్శితో కాలకవృక్షీయుఁ డనుఋషి తనకాకిని మంత్రులు చంపిరని చెప్పుట.

సర్వముఁ బోనివాఁడగుటంబట్టి యతనిని, బ్రతిక్షణమును, దన్ను లేదని తలఁచుకొనుచుఁ, దాను నశింపఁగ లట్లె యెన్నుకొనుచు, మిక్కిలి జాగ్రత్తతోఁబరిచరింపవలయును వాఁడురాజు మోలఁ జెడుమాట లాడుటకును, దాఁటుమాఱుగఁ గూర్చుండుటకును, దగని చేష్టలు చేయుటకును, దగని రీతుల దగ్గఱుటకును, దగని పోకలు పోవుటకును, దగని యభినయములును నంగ వికృతులును నెఱపుటకును, నెపుడును జంకు గలిగియుండవలయును. రాజును బ్రసన్నునిఁ గావించినచో నతఁడు దేవతవలె సకలార్థములును గలిగించును. అతఁడు క్రుద్ధుఁడయ్యెనా యగ్నివలె సమూలముగా దహించి వైచు' నని యముఁడు చెప్పెడు. అట్లె లోకవ్యవహారము జరుగుచున్నది. (ఈవిధుల చోప్పున) నీకు నభివృద్ధి గలిగించు దానినే యిపుడు చేయుదును. మాబోఁటి యమాత్యులు నీబోఁటిమిత్రములకు నాపదయందు బుద్ధిని సహాయము చేయుదురు. ఈకాకి నాయది, నీకార్యమును జేసినందులకై చంపఁబడినది. ఇందులకై నిన్ను నిందించుట నాకుఁదగదు. కాని, యీపక్షిని చంపినవారికి నీయందుఁ బ్రేమ లేదు. నీకు హితులెవరో యెవ రహితులో దెలిసికొనుము. ఇతరులకు నీబుద్ధిని లోపఱుపక యన్నిటిని నీయంతన నీవే చేయుము. నీయింట నున్నవారందఱును ముచ్చులు చుమీ. వారు నీప్రజలవెంపును గోరువారు గారు. కాన వారి విరోధమునకు నేను గుఱియైతిని. వారు నీకంతరంగు లయినవారితోఁ గుట్రపన్ని నిన్ను నాశము సేయుటవలన నీపిదప రాజ్యమును దా మాశపడుచున్నారు. అయినను వారి పన్నుగడ లసందర్భములవలన సిద్ధించినవిగావు. వారివలన భయపడి నేను మఱియొక్క పట్టు

నకుఁ బోయెదను. నాకు విషయవాంఛ యేమియు లేకున్నను, నీమనుష్యులు దురాత్ములుగాన యీబాణమును నాకాకిని గూర్చి యేసి దానిని యమపురికిఁ బంపిరి. నేను దీనిని దపంబున మిక్కిలియుఁ బెంపారు దివ్యదృష్టిచేఁ గనుఁగొంటిని. నీ రాజ్య మిది పెక్కులు నక్రములు, చేఁపలు, మొసళ్లు, తిమింగలములును గుంపులుగాఁ గలిగి యున్న యొక మహానదిని బోలినది. దీనిని నే నీకాకిచే నుత్తరించితిని. నీరాజ్యమును - గూలిన మ్రాఁకులును బండఱాలును ముండ్లును గలిగి, సింహవ్యాఘ్రములు నెరసి, చొచ్చుటకును నుండుటకును నశక్య మయినహిమవంతపు మహాగుహాయుంబోని నీరాజ్యమును - నీకాకితోడ్పాటున నే కడచితిని. పండితులు చీఁకటి గ్రమ్మియుండుటచేఁ బోరాని ప్రదేశమునకు దీపముతోడునఁ జొరను, దాఁటరాని నదిని నోడలచేత దాఁటను వచ్చునుగాని, చొరరానిరాజు నీతిపథమునందుఁ జొచ్చుటకును గడచుటకును నేయుపాయమును దెలియరా దందురు. నీరాజ్యము చీఁకటిగ్రమ్మిచొరరాకున్న యొకయరణ్యమువలె నున్నది. దీనికి నొడయుండ వగునీకు నిందు విశ్వసించుట యలవిగాకున్నది. ఇఁక నాకు విశ్వసించుటను జెప్ప నేల? ఇందుమంచియు సెబ్బరయు సమముగా నే యున్నది. కాఁబట్టి యిందు వసించుట సేమముగాదు. మంచికార్యము చేయువాఁ డిందు వధము నే పొందుచున్నాఁడు. దుష్కార్యము చేయువాని కేజంకును లేదు. న్యాయముచొప్పున దుష్కార్యము చేయువానికే వధము కలుగవలయునుగాని, సత్కార్యపరుని కెంతమాత్రముగాదు. కాఁబట్టి యిచ్చటఁ జిరకాల ముండుట యుక్తముగాదు. తెలిసినవాఁడు దీనిని శీఘ్రమున దిగవిడువ వలయును. రాజా! సీత యనెడి నదియొకటి

గలదు. దానియందుఁ బడవలు మునుఁగును. నీయీరాజ్య మా నదికి సాటియైనది. సర్వమును నాశము సేయునట్టి వలవంటిది. *నీవు తేనె గోరువా రుఱికిపడు చఱియవు; విషముగలసిన యన్న మవు. నీస్వభావ మిపు డసజ్జనుల భావముంబోలెఁ దోఁచుచున్నది; కాని సజ్జనులభావముంబోలెఁ గాదు. నీవు క్రూరవిషములగు సర్పములు చుట్టియున్న కూపమువలె నున్నావు. నీవు, చొరరాని రేవుగలదియు పెద్ద గట్టు గలదియు, వెదుళ్లయు ప్రేములయుఁ బొదరులు బలసినదియునై తియ్యనినీరు గలయేటివలె నున్నావు. కుక్కలును గ్రద్దలును నక్కలును జుట్టి యున్న రాజహంస మవు. ఒక పెద్దమ్రాఁకును నూఁతగొని పెచ్చు పెరిఁగిన పెనుతీఁగలగుబు రామ్రాఁకును గ్రమ్ముకొని దానికిఁ బొడవుగా వ్యాపించినదై పిదపఁ దన్నుముట్టిన పెద్దయెరగలిచిచ్చుచేత నామ్రాఁకును సయితము దహించునట్లు,నిన్నాశ్రయించిన యమాత్యులు నున్నారు. రాజా! వారలను బరికించి చూడుము. చక్కఁబెట్టుము. నీవలన నధికారము నొందినవారలును నీవు పరిపాలించుచున్నవారలు నగు మనుష్యులే నిన్నవమానించి నీప్రియునిఁ జంపఁగోరుచున్నారు. నేను రాజ వయిననీదుశీలమును నిన్ననుసరించి బ్రతుకువారి స్వభావమును దెలియఁగోరుచు, వీరుని యిల్లాలి యింటియం దున్న విటకానివలెను, పామున్న యింటియందు వసించువానివలెను, మిక్కిలి జంకుగలిగి యెంతయు

---

* 'మధు ప్రపాతో హి భవాన్ భోజనం విషసంయుతమ్' అని మూలము. మధు ప్రపాతమనఁగా తేనె పెఱయున్న కొండచఱియకు నుఱికిపడుట. తేనె యున్నను అందులకై యాచఱియకు నుఱుకుట యపాయకరమైనట్లు నీవు నపాయకరుఁడ వనుట.

నెచ్చరికతోడ నన్ను రక్షించుకొనుచు నిందు వచ్చితిని. రాజేంద్రా! నేను 'రాజు జితేంద్రియుఁ డగునా ? అతని భృత్యు లడఁగి మడఁగి యున్నారా ? ప్రజలు రాజును ప్రేమింతురా ? రాజును బ్రజలను బ్రేమించునా?' యని తెలియఁగోరినవాఁడ నై యిం దులకు నీకడకు వచ్చితిని. ఆఁకలి గలవానికి నన్నమువలె నీవు నాకుఁ బ్రియుండ వయితివి. అయినను నేను నీయమాత్యు లను దప్పిలేనివాఁడు నీటినింబోలె నెంతయు నొల్లను. నీకు మంచి సేయఁగోరితిని గాన నాయందు వారు దోషము కట్టిరి. వారికి నా యందుఁగలవిరోధమున కింతకంటె వేఱుకారణము లేదనుటకు సందేహము లేదు. నాకు వారియం దెంతమాత్రము ద్వేషము లేదు. వారియందలి దోషములను దెలుపుట వారికి ద్రోహము చేసినట్లయినది. మూఁపునఁ గొట్టుపడిన సర్పము వలనంబోలె మం చిమనస్సు లేనిపగవానివలన భయము గలిగియుండ వలెను' అనెను.

రాజు 'బ్రాహ్మణోత్తమా ! నీకుఁ గలిగినయీకాఱియకుఁ దగిన పరిహారమెంతయుఁ జేసెదను. మఱియు మిక్కిలి సత్క రించెదను. ఇట్లు పూజితుఁడవై మరల నాయింట వసించియుండు ము. నిన్నెవ్వరొల్లరో వారు నాయింట నుండరు. నీవు చెప్పినమను ష్యులకు నిఁక నేమి చేయవలయునో నీవె తెలిసి చేయవలయును. నారాజ్యమందు దండము చక్కఁగా జరుపఁబడునట్లును, కార్య ములు చక్కఁగాఁ గావింపఁబడునట్లును, నీవు కనుఁగొనుచు నేను శ్రేయమును బొందునట్లు వినియోగించుచుండుము' అనెను.

ముని 'నీ వీకాకిని జంపిన దోషమును గనుఁగొనకుండి యమాత్యులం దొక్కొక్కరిని (నధికారమందు) దుర్బలునిఁగాఁ

జేయుము. పిదప వారికిఁ దగిన కారణముల నిరూపించి యొక్కొ క్కనిఁగా వారిని జంపుము. పెక్కండ్రొక దోషమునే చేసిన యెడల వారందఱు నొక్కటిగాఁగూడి * ముండ్లనుగూడ మెత్త గిలఁజేయుదురు. ఇఁక మముబోఁటి మెత్తనివారలను జేయుట చెప్ప నేల? ధనమందు జగమంతయుఁ గట్టువడియున్నది. కాన, దానిని ధనముచేత నే బంధింపవలయును. ధనము నాశ్రయించుట వలన నే మనుష్యులకు గౌరవము పుట్టుచున్నది. కాఁబట్టి ధనమును వారలనుండి తీసివైవుము. ఒక్కొక్క మనుష్యునియొక దోష మునకుఁగాను వానికి విరోధియైన మనుష్యుని వానికడకుఁ బంపుము. వాఁడామనుష్యునియందుఁ బెక్కులు దోషములు వెలువఱిచి వానిధనమును దీసికొని వైచును. కొందఱకుఁ దిన్నని మాటలాడియుఁ, గొందఱకుఁ బరస్పరము భేదము పుట్టించియు, వైరము కలిగింపుము. పిదప దండింపుము. రాజా! బుద్ధిమంతుఁడగు రాజు తనలోపలితలంపును గప్పిపుచ్చి, బిల్వకాయను గొనియె బిల్వకాయను గొట్టునట్లు, అశుద్ధుండగు మంత్రిని నశుద్ధుండగుమనుష్యునిఁ గొనియే నాశము చేయఁదగు ను. కాఁబట్టి రాజా! మనమంత్రాలోచనములు (వారు సందేహించి) వెలిపుత్తురేమోయని భయపడి యిట్లు జాగ్రత్తతో మెలఁగ వలయునని యింతయు నీకుఁ జెప్పుచున్నాను. మేమో బ్రాహ్మ ణులము; కాన దయాళురము; ఎవ్వరిని దండింప నొల్లనివార మనుట ప్రసిద్ధము. మేము మాకుంబోలెనే నీకునుఁ దక్కినవా

* 'కంటకానపి మృద్నీయుః' అని మూలము. ముండ్లవలె బాధకులయిన వారినిగూడఁ బడఁగొట్టుదురు. ఇఁక మముబోఁటి సాధువులను గూల్చుట చెప్ప నేల యనిభావము.

రికిని శుభమును గోరుదుము. రాజా! నన్నుగుఱించి చెప్పుచున్నాను. నేను నీకుఁ జెలికాఁడను. నాపేరు కాలికవృక్షీయుఁ డందురు. మీతండ్రిపరిపాలనమునం దీరాజ్యమునకుఁ బెక్కు విపత్తులు కలుగఁగా నేను దక్కినకార్యము లన్నియు దిగవిడిచి యావిపత్తులను దొలఁగించుటకై యపుడు తపము సలిపితిని. నీవు మరలఁ దగినవారలను మిత్రులని నమ్మి భ్రమింప కుండుటకై, నీయందలి స్నేహమువలన నీకుఁ జెప్పుచున్నాను. రాజా! నీవు రాజ్యమును నలవ్రాకగాఁ బడసితివి. దానిని సంబంధించిన సుఖములను దుఃఖములను రెంటిని నాలోచింపుము. నీ రాజ్యములను మంత్రులయందుఁ బెట్టి నీవేల పరాకు పడవలయును?' అనెను. పిదప* రాజు క్షత్రియకులమం దొకనిని మంత్రిగా నేర్పఱచుకొని యాబ్రాహ్మణోత్తమునిఁ గాలకవృక్షీయునిఁ బురోహితునిఁ గాఁ గయికొనెను. ఈ మార్పులయిన పిదపఁ గోసలరాజును భూమినంతయు నేకచ్ఛత్రముగాఁ బాలించి మిక్కిలి యశస్సును బొందునట్లుచేసి కాలకవృక్షీయముని యుత్తమములగు యాగములు పెక్కులు యజించెను. కోసలరాజు నతని హితవచనములను విని భూమిని జయించి యతఁడు నియమించునట్లు తాను నడచుకొనుచుండె' నని చెప్పెను' ఇది యెనుబదిరెండవయధ్యాయము.



* తతో రాజకులే మంత్రీ సంజజ్ఞే భూయసాపునః, పురోహితకులేచైవ సంప్రాప్తే బ్రాహ్మణర్షభః॥ అని ఔ.మూలము. తతో రాజకులే నాన్దీ సంజజ్ఞే' అని (దా.మూలము) ఆబ్రాహ్మణోత్తమునిఁబురోహితునిఁ గావింపఁగా రాజకులమువారి యందు మిక్కిలిస్తుతులు చెలంగెనని యర్థము.

## రాజధర్మపర్వము.

### భీష్ముఁడు ధర్మరాజునకు మంత్రి మొదలయిన వారి లక్షణములను జెప్పుట.

ధర్మరాజు 'పితామహా! వ్యవహారనిర్ణయసభ్యులును, యుద్ధాదులందును సహాయులును, హితులును, సేనాపతులు మొదలయిన బలంగమువారును, మంత్రులును నెట్టివారుగా నుండవలయును' అని యడిగెను.

భీష్ముఁడు 'నీవ్యవహారనిర్ణయసభ్యు లయినవారు లజ్జతోఁగూడిన బెట్టును, నింద్రియ నిగ్రహమును, సత్యమును, నిష్కాపట్యమును, యుక్తమయినది లెస్సగాఁ జెప్ప నిట్టతనమును, గలిగి యుండవలయును, నీకుఁ గెడతోడు నీడలై మిక్కిలి శూరులును బ్రహ్మణ్యులును, మిక్కిలి చదువరులును, నీయెడ నెంతయు సంతుష్టులును, గార్యములందు మంచి యుత్సాహము గలవారును నగు మనుష్యులను సకలములయిన నీ యాపదలందును సహాయులుగాఁ బడయఁ గోరవలయును. మంచి కులమునఁబుట్టి పూజితుండగు మనుష్యుఁడెప్పుడును దనశక్తినిదాఁపఁడు. వాఁడు నీ దుఃఖమునఁగాని, సుఖమునఁగాని, రోగమునఁగాని, మరణమునఁగాని, నిన్నెప్పుడును దిగవిడువఁడు. అట్టి వానిని సుహృదునిఁగావించుకొన వలయును. నీ బలంగమువారు మంచికులమునఁబుట్టినవారుగను, నీదేశమందుఁ గలిగినవారుగను, ప్రాజ్ఞులుగను, రూపవంతులుగను, మిక్కిలి చదువరులుగను, సమర్థులుగను, ప్రేమ గలవారుగను నుండవలయును. నాయనా! చెడుకులమునఁబుట్టినవారును, లుబ్ధులును, క్రూరులును, సిగ్గుమాలిన వారును నగు మనుష్యులును, దిన్నచేయి తడియాఱకుండునంతవఱకు ని

న్ననుసరింతురు. రాజు మంచికులమునఁబుట్టినవారును, మంచి స్వభావముగలవారును, ఇంగితము నెఱింగినవారును, అక్రూరులును, దేశకాలములను వానికిఁ దగిన విధులను దెలిసినవారును, ఒడయని కార్యమందు హితమునే కోరుచుండువారును, నగు మనుష్యులను నెప్పుడును నన్ని విషయములందును మంత్రులుగా నియమింపవలయును. ధనములచేతను, సమ్మానములచేతను, వస్త్రాభరణాదుల నిచ్చుటచేతను, ఇంపయిన పలువగలభోగములచేతను, నీ వెవరిని నీకుఁ బ్రయోజనకరులుగాఁ దలంతువో వారలను బ్రీతులు గావించి నీతోఁబాటిసఖులనుగాఁ జేయవలయును. ప్రవర్తనము తప్పనివారును, మంచి నడవడిగలవారును, మిక్కిలి చదువరులును, వ్రతపరులును, గొప్పమనస్సు గలవారును, సత్యవాదులును నగు మనుష్యులు నీ యక్కఱలయందే కనుగలిగి యెప్పుడును నిన్ను దిగనాడకుందురు. పూజ్యులు కానివారును, నియమములను బాటింపనివారును, మందబుద్ధులును, గట్టుపాటులనుండి జాఱినవారును నగు మనుష్యులను మర్యాదలను నతిక్రమింపకుండునట్లు నీవు పదిలముగా నిర్బంధించి చూచుకొను చుండవలయును. రెండు పక్షములందొకటిని నేరుకొనవలసి వచ్చినపుడు, పెక్కండ్రుగల పక్షమును విడిచి యొక్కఁడుగల పక్షమును వరింపరాదు. అయిన నాయొక్కఁడు పెక్కుగుణవిశేషములంబట్టి పెక్కండ్రకంటె నెక్కుడుగా నుండెనేని యా యొక్కనికై పెక్కండ్రను దిగవిడువ వచ్చును. ఎక్కుడయిన వానిలక్షణములు పరాక్రమము, కీర్తి, ప్రధానము లయిన కార్యములందలి యాసక్తి, కట్టుపాటులందుఁ దప్పక నిలుచుటయు నగును. సమర్థులను బూజించునట్టి వాఁడును, అర్హతలేని వారి

తోడ మచ్చరింపని వాఁడును, గామమువలనను భయము వలనను గ్రోధమువలనను లోభమువలనను ధర్మమును విడువనివాఁడును, అహంకారములేని వాఁడును, సత్యవాదియు, మన్నించు స్వభావము గలవాఁడును, జితాత్ముఁడును, మాన సంపన్నుఁడును, అన్ని సందర్భములందును జక్కఁగాఁ బరీక్షింపఁబడినవాఁడును నగు పురుషుని నీవు మంత్రసహాయునిఁగా నేర్పఱచుకొనవలయును. గొప్పకులమునఁ బుట్టుటయును, కులమునకుఁ దగిన గౌరవము గలిమియు, ఓరుపును, సమర్థతయును, ఆత్మశుద్ధియును, శూరతయు, నెనరును, సత్యమును, నుత్కృష్టుఁడగు వాని లక్షణములు. ఇట్లు తెలివిగలిగి నడచుకొనుచుండు పురుషునకు శత్రువులును వైర కలంకమును విడిచి ప్రసన్నులయి మిత్రులగుచున్నారు. ఆత్మనిగ్రహమును మంచి ప్రజ్ఞయుఁగలిగి యైశ్వర్యము నభిలషించు రాజిటమీఁదఁ దన దేశమందు మంచికులమునఁ బుట్టినవారును, ఆప్తులును దురాచారులచే వశీకరింపరానివారును, వ్యభిచారము లేనివారును నయి తన్ను సంబంధించియుండు మనుష్యులచేత మంత్రుల గుణాగుణములను బరీక్షింపవలయును. ఐశ్వర్యమును నభ్యుదయమును గోరుపురుషుఁడు, మంచికులమునఁ బుట్టినవారును, మంచి చదువరులును, వంశ పరంపరఁగాఁ గొలుచుచు వచ్చువారును, అహంకారము లేనివారును నగుపురుషులను మంత్రులుగాఁ జేసికొనవలయును. వీరలకు వినయముతోడి బుద్ధియు, ప్రసన్నస్వభావమును, తేజమును, ధైర్యమును, క్షమయు, శుచియు, ననురక్తియు, నిలుకడయుఁ, గార్యములందు దిట్టతనమును నుండవలయును. రాజా! రాజు గార్య భరమును వహింపఁదగినవారును, ప్రౌఢవయస్కులును, మంచి

గుణములందుఁ బరీక్షింపఁబడినవారును, గపటము లేనివారును, ధనమును వృద్ధిఁబొందించువారును, మితిమీఱక మాటాడువారును, వీరులును, వివేకశీలురును, కులీనులును, ధైర్యశాలులును, నింగితజ్ఞులును, నక్రూరులును, దేశకాలవిధులను దెలిసినవారును, భర్తకార్యమునందు హితమునుగోరువారును, నగు మంత్రులనేవురను, నెప్పుడును నన్నికార్యములందును నేర్పఱుప వలయును. తేజోహీనుఁడును, మిత్రులచే దిగవిడువఁబడినవాఁడును, బట్టుదలతోఁ బనిచేయఁజాలఁడు. ఒకవేళ వానిని నియమించినచో నన్నికార్యములను గొనసాగింపక తప్పక సందేహమునే కలిగించుచుండును. ఒకమంత్రి శుభం బగుగొప్పవంశమునఁ బుట్టినవాఁడయ్యును, ధర్మార్థకామములను బాటించువాఁడయ్యును, జదు వల్పముగాఁగలవాఁడగునేని, కార్యపద్ధతి నాలోచించుటకుఁ జాలనివాఁడగును. ఇట్లే, తక్కువకులమునఁ బుట్టినవాఁడు, తా నెంతచదువు చదివియుండినను, కొనిపోవువాఁడు లేని గ్రుడ్డివానివలె, నేర్పును నూహాయు వలసిన కార్యములందుఁ దెలియక పొరఁబడుచుండును. ఒక్కయుద్దేశమందును నిలుకడ లేనివాఁ డెంతబుద్ధియుఁ జదువును గలిగియుండినను, ఉపాయములను దెలిసియుండినను, కార్యములఁ గొనసాగించుచుఁ జాలకాలముండఁజాలఁడు. దుర్మతియుఁ, జదువులేనివాఁడునగు మనుష్యుఁడు కార్యమునకు దిట్టతనముగాఁ బూనవచ్చునుగాని దానివలన ఫలవిశేషము లేమిగలుగునో తెలిసికొనఁజాలఁడు. తనయం దనురక్తిలేని మంత్రియందు రా జెప్పుడును నమ్మికయుంచుట యొప్పదు. కాఁబట్టి యనురక్తుఁడు గాని మంత్రికిఁ దనయాలోచనములను వెలిపుచ్చరాదు. అట్టికపటుఁడు తక్కిన మంత్రులతోఁ

గుట్రగూడి తన యేలికను,అగ్ని గాలితోడ్పాటునఁ గలిగిన సందులమూలమునఁ జొచ్చి మ్రాఁకును దహించునట్లు, నాశము సేసివైచును. రాజెప్పుడేని యొకనాఁడు క్రుద్ధుఁడై యొకభృత్యుని స్థానమునుండి తొలఁగించియు, నాగ్రహమునఁ బరుసులాడియు, మరలఁ బ్రసన్నుఁడయి వానిని స్థానమున నుంపఁగలుగును. అనురక్తిగల భృత్యుఁడే యాయావానికెల్ల నోర్వఁజాలునుగాని, మఱియొక్కఁ డెంతమాత్రము నైఁపఁడు. మంత్రులకుఁగూడఁ గొన్నిసమయములందు రాజులయెడఁ బిడుగునుఅుమువలె బిట్టుగాఁ గోపము కలుగుటగలదు. ఎవఁడు తనయెడ యునికిఁ బ్రియము చేయుతలంపున బట్టికోపములను నడఁచుకొనునో, మఱియొడయుని సుఖదుఃఖములను దనకును సమానముగాఁ గలిగియుండునో, యట్టిమనుష్యుని రాజు సమస్తకార్యములందాలోచన మడుగవలయును. కపటము గలవాఁడు రాజునందనురక్తి కలిగియుండినను దక్కినగుణములచే నిండియున్నను, రాజనీతియందు మిక్కిలి తెలివిగలవాఁడయి యున్నను,రాజుమంత్రాలోచనమును వినుట కర్హుఁడుగాఁడు. పగవారితోడఁగూడికొని రాజు ప్రజల సుఖదుఃఖములను మిక్కిలి పాటింపకుండునట్టివాఁడు పగవాఁడని తెలియవలయును. వాఁడును, రాజు మంత్రము వినఁదగినవాఁడుగాఁడు. తెలివిలేనివాఁడును, అపరిశుద్ధుఁడును, గర్వము గలవాఁడును, శత్రువుల సేవించువాఁడును,తన్నుఁదాను బొగడికొనువాఁడును, గోపియు, లుబ్ధుఁడును, సుహృదుఁడుగానివాఁడును నగుపురుషుఁడు గూడ రాజు మంత్రాలోచనము వినఁదగఁడు. క్రొత్తగా వచ్చినవాఁడొకఁడు వాఁడెంతయనురక్తిగలవాఁడయినను మిక్కిలి చదువరిగా నుండినను రాజు వానిని

సత్కరింపవచ్చును; మఱి వలయునది యీవచ్చును; కాని, యాలోచనము వానికిఁ జెప్పఁదగదు. రాజొకనితండ్రిని దాను మును పన్యాయమున నూరు వెడలఁ దఱిమినను, బిదప నతనిని సత్కరించి యెప్పటిపదవియందు నెలకొలిపినను, నతనికొడుకునకుఁ దానెంతమాత్రమాలోచనము వినిపింపఁదగదు. రాజు తనకు సుహృదుఁడయినవాని స్వల్పంపుఁ దప్పునకు వానిధనమంతయుఁ దీసికొని రిక్తగావించెనేని వానికిఁ దక్కనగుణము లన్ని యుండినను, రాజు తనమంత్రాలోచనము వినిపింపఁదగదు. మంచి ప్రజ్ఞయు మేధయుఁ గలిగి పండితుఁడై, తనదేశమందుఁ బుట్టినవాఁడై, శుచియు, సమస్తకార్యములందుఁ జక్కటిగలవాఁడునైనపురుషుఁడు రాజు మంత్రాలోచనము వినుటకుఁదగును. ఆత్మజ్ఞానమును లౌకికవిజ్ఞానమును మిక్కిలియుఁ గలిగి, తనప్రకృతియు, శత్రువుప్రకృతియు, స్వామి మంత్రిమొదలయినవారల ప్రకృతులను నెఱింగినవాఁడై రాజునకు నాత్మసముఁడయిన స్నేహితుఁడగుపురుషుఁడు, గాజు మంత్రాలోచనము వినఁదగును. సత్యవాదియు, శీలసంపన్నుఁడును, రహస్యములను వెలిపుచ్చని లోఁతుగలవాఁడును, సిగ్గరియు, మెత్తనివాఁడును, తండ్రి తాతలతరములనుండి రాజు కొలువుగలవాఁడును నగు మనుష్యుఁడు మంత్రాలోచనమున కర్హుఁడగును. రాజువలన సంతుష్టిగలవాఁడును, సత్పురుషుల మనసుకెక్కినవాఁడును, సమర్థుఁడును, బాపములందు ద్వేషముగలవాఁడును, మంత్రాలోచనము తెలిసినవాఁడును, గాలము నెఱింగినవాఁడును, శూరుండును నగుపురుషుఁడు మంత్రాలోచనము విన నర్హుండగును. దండమునూఁది పరిపాలించునట్టిరాజు, ఈసమస్తలోకమును దిన్నని చల్లనిమాటలచే వశముచేసికొనుటకు శక్తుఁడగు

వానితో మంత్రాలోచనము చేయవలయును. పురజనులును, దేశజనులును ధర్మప్రవర్తనమునుబట్టి యెవ్వనియందు విశ్వాసము గలిగియుందురో, ఎవ్వఁడు యుద్ధముచేయఁగలఁడో, మఱి రాజనీతియందుఁ బండితుఁడో, యట్టివాఁడును మంత్రాలోచనము వినుట కర్హుఁడగును. కాఁబట్టి యిట్టిగుణములన్నియుఁ గల వారును, మిక్కిలియుఁ బూజితులును, రాజు మంత్రి మొదలయిన ప్రకృతుల నెఱింగినవారును, గొప్పకార్యములకు నుపక్రమించువారును, నగుమంత్రులు ముప్వురకుఁ దక్కువ లేకుండ వలయును. వారు తమప్రకృతులందును శత్రుప్రకృతులందును గల రంధ్రములను బాటించుచుండవలయును. మంత్రులయాలోచనము రాజు రాజ్యమునకు మూలము. దానివలననే యారాజ్యము వృద్ధినొందవలయును. మంత్రి రాజునందలి ఛిద్రములను దెలియనీకుండునట్లు చేయవలయును. పరునియందు ఛిద్రములు కనిపెట్టి వానిపై నెత్తవలయును. తాఁబేలు తనయంగములను లోనికి ముడిఁచి కాచుకొనునట్లు, మంత్రులును దమమంత్రములనుగాచుకొనవలయును. అట్లె తమఛిద్రములను గప్పిపుచ్చుకొనవలయును. రాజ్యమునందు మంత్రములను గప్పిపెట్టునట్టి మంత్రులే బుద్ధిమంతు లనఁబడుదురు. మంత్రమే రాజునకుఁ గవచము; మంత్రమే రాజ్యమందుఁ దక్కినజనుల కంగములు. రాజ్యమునకు మూలము వేగులవాండ్రు, దానికి సత్తువయంతయు మంత్రమందురు. ఏలికలును మంత్రులును, మదమును గ్రోధమును నడంచి, మానమును నసూయయును విడిచి, యొకరినొకరు సహాయముకొఱకు ననువర్తింతురేని, వారు భయులు సుఖమొందుదురు. రాజు తానైదువిధములగు (అనఁగా మనస్సుచేతను వా

క్కు చేతను శరీరము చేతను వీనియందలి రెంటిచేతను, మూటి చేతను జేయంబడు కపటము లనెడు) నుపధలు లేకుండునట్టి మంత్రులతోడ నెప్పుడును మంత్రాలోచనము చేయవలయును. రాజా! ముప్వురుమంత్రుల మూఁడువిధము లయినయభిప్రాయ ములను దెలిసికొని వానిని దన మనస్సునం దుంచి వారల యభి ప్రాయమును దన యభిప్రాయమును మీఁదఁ జక్కఁగా నాలో చించుకొనుటకుఁ దన గురువుకడకుఁ బోవలయును. ఆగురువు ధర్మార్థకామముల స్వరూపములను జక్కఁగా నెఱింగిన బ్రాహ్మణుఁడుగా నుండవలయును. ఇట్లు మీఁదటిమాలోచనమునకై యతనికడకుఁ బోయి మనస్సు సమాహితము చేసికొని యతని యభిప్రాయ మడుగవలయును. అతనితోఁగూడి యాలోచించిన పిదప నొకనిర్ణయము కలుగఁగా రాజు విలంబము చేయక తోడనే దానిని గావింపవలయును. మంత్రతత్త్వముల నిశ్చయములను జక్కఁగా నెఱింగినట్టివారు, రా జెప్పుడు నీ చొప్పుననే మంత్రాలోచనము చేయవలయునని చెప్పెదరు. ఇట్లు మంత్రములను గుదురుపఱుచుకొని దాని ననుష్ఠానమునకు నెప్పుడును దేవలయును. అట్లు చేసిననే యవి ప్రజలను వశీకరించుటకు సమర్థము లగును. రాజు మంత్రమాలోచించుచోటఁ బొట్టివారును, గుజ్జులుగాని బక్కవారును, గుంటివారును, గ్రుడ్డివారును, జడులును, స్త్రీలును, నపుంసకులును నుండరాదు. అందు, ముందుగాని వెనుకఁగాని క్రిందుగఁగాని మీఁదుగఁగాని యడ్డముగఁగాని యేదియు మెలఁగరాదు. ఎవరును లేని యింటి మేడపయి నెక్కియో, దర్భయు తెల్లును లేక నలుప్రక్కలఁ దెల్లగాఁ గనఁబడు బయలుగా నుండుప్రదేశమునందుండియో, మా

టయందుఁ దప్పిదములు లేక ధ్యంగముల దోషములును జేష్ట లును గావింపక, కాలము మీఱిపోకుండునట్లు, కార్యమును జక్కఁగా నాలోచింపవలయును. ఇది యెనుబదిమూఁడవ యధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

### భీష్ముఁడు ప్రియవచనములాడుటనుగుఱించి యింద్ర బృహస్పతి సంవాదమును ధర్మరాజునకుఁ జెప్పుట.

భీష్ముఁడు 'ధర్మరాజా! ఈ విషయమై బృహస్పతికిని నింద్రునకుఁ జరిగిన సంవాదమనెడి యీ పురాతన మయినయితిహాసము నుదాహరించెదరు. ఇంద్రుఁడు 'ఓ బ్రాహ్మణోత్తమా! పురుషుఁ డేయొక్క విషయమును జక్కఁగా నాచరించునేని సమస్త ప్రాణులకును బ్రమాణమయి మిక్కిలి కీర్తిని బొందును' అని యడిగెను.

బృహస్పతి 'ఇంద్రా! ఇం పయినమెత్తనిపలుకుబడియే యీయొక్క విషయము. దాని నొక్కటి నాచరించినచో సమస్తప్రాణులకును బ్రమాణమై (సమ్మతుఁడై) మిక్కిలి యశస్సును బొందును. ఇంద్రా! సమస్తలోకులకు సుఖము నొసంగునది యిది యొక్కటియే. దీనిని సర్వభూతములయందును నాచరించువాఁ డెప్పుడును వానికెల్లఁ బ్రియుఁడై యుండును. ఈలోకమందు నొక్కపలుకయినను మాటాడక బొమలు ముడివడ్డమొగముతో నుండునట్టివాఁడు సమస్తప్రాణులకును ద్వేషింపఁదగినవాఁడగును. తిన్నని మెత్తనిపలుకుబడిలేమియే వానినట్లు చేసి

నది. ఎవఁడు తక్కినవారి నెవ్వరిని జూచినను తానేవారిని ముం
దుగా మాటాడి, యట్లు మాటాడునప్పుడు చిఱునవ్వు మును
ముట్టఁ దొలఁకుచుండునో, వానికిఁ బుచ్చుకొనువారందఱును బ్రస
న్నులగుదురు. దానముసైతము చల్లని మెల్లని పలుకుబడితో
నియ్యఁబడదేని తీసికొనువానినెవ్వనిని కూరలేని యన్నమువలె
సంతోషపెట్టనేరదు. ఇంద్రా! ఎవరిధనమునేనియు నెత్తికొనుచు
న్నను, దియ్యనిపలుకులాడునేని, యట్టిపలుకుబడి యాధనమును
గోలుపోయినవారిని సయితము దనవశముచేసికొనును. దండ
మును విధింపఁగోరుచున్నప్పుడును రాజు, తిన్నని చల్లని మాటలే
ప్రయోగింపవలయును. సాంత్వము ఫలము గలిగింపక తప్పదు.
మఱి యది యెవ్వరిహృదయమును నొప్పింపదు. సాంత్వము మృ
దువుగను మధురముగను జక్కఁగను బచరించుచుండినచో
దానికి సరియైనది యొకప్పుడును గలుగదు' అనెను. ఇది విని
యింద్రుఁడు తనపురోహితుఁడు చెప్పినట్లు సర్వమును జేయుచు
వచ్చెను. ధర్మరాజా! నీవు నీసాంత్వమును జక్కఁగా నాచరిం
పుము' అనెను. ఇది యెనుబదినాలుగవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

### భీష్ముఁడు ధర్మరాజునకు నమాత్యలక్షణములు మొదలయినవి చెప్పుట.

ధర్మరాజు 'రాజేంద్రా! రాజు ప్రజల నేపద్ధతిని బరిపాలిం
చుచు వచ్చినయెడల విశేషించి ధర్మమును శాశ్వతమయినకీర్తిని
విశేషించి స్వర్గమును బడయును?' అని యడిగెను.

భీష్ముఁడు 'పరిశుద్ధమయిన వ్యవహారముతోఁ బ్రజలను బరిపాలించుటయందు దక్షుఁడగు రాజు నియోగింపఁదగు మంత్రు లెట్టివారు? అను ప్రశ్నకు నిది ప్రత్యుత్తరము. రాజు పరిశుద్ధుఁడై ధర్మమునుబడసి కీర్తిని స్వర్గలోకములను బడయును' అనెను. ధర్మరాజు 'రాజెవ్వరితోడ నెవ్విధమున వ్యవహరింపవలయును? ఇది యడుగుచున్నాను. నీవు మహాప్రాజ్ఞుండవుగాన దీనిని గలరూపున నాకుఁ జెప్పఁదగును. నీవు పూర్వము పురుషునకు వలయునని చెప్పినగుణములన్నియు నొక్కపురుషునియందు నుండనేరవని నాకుఁ దోఁచుచున్నదే ' యనెను.

భీష్ముఁడు 'నీవు మహాప్రాజ్ఞుండవు బుద్ధిమంతుఁడవును గదే! నీవు చెప్పినట్లెయగును. ఈ శుభగుణములన్నియుఁ గూడియున్న పురుషుఁ డరిది. వేయుమాటలేల. ఇట్లన్నిగుణములు నొక్కటఁ దానగూడియున్నశీల మెంతపాటుపడి వెదకినను దొరకుట దుర్లభము. అయినను మంత్రులనెట్టివారిని గావింపవలయునో చెప్పెదను. వేదముల నధిగమించినవారును, సమగ్రులును, బరిశుద్ధులు నయినట్టి స్నాతక (బ్రహ్మచర్యము సమాప్తిగావించిన) బ్రాహ్మణులు నలువురును, బలవంతులును నాయుధపాణులునయిన క్షత్రియులు పదునెనమండ్రును, ధనసంపన్నులయిన వైశ్యు లిరువదియొకండ్రును, వినయముగలవారును నింతకుమునుపుచేసిన కార్యములందుఁ బరిశుద్ధులై యున్నవారును నగు శూద్రులు మువ్వురును *(వినుకోరిక, వినుట, తెలియుట, ధరించుట, ఊహించుట, బుద్ధిచేత నివర్తించుట, విజ్ఞానము, తత్త్వజ్ఞానము ననెడి) యెనిమిది గుణములతోడఁగూడినవాఁడును, బురాణముల నధిగమిం

* అష్టగణములు—శుశ్రూష, శ్రవణము, గ్రహణము, ధారణము, ఊహనము, అపోహనము, విజ్ఞానము, తత్త్వజ్ఞానమని యెనిమిది.

చినవాఁడును నగు సూతుం డొక్కండును నీకు మంత్రులుగా నుండవలయును. వీరియం దొక్కొక్కనికి నేఁబదియేండ్ల వయసు నుండవలయును. వారు పెద్దతికమందుఁ గన్నుగలిగి, యసూయ లేక, శ్రుతి స్మృతుల నధిగమించి, వినయమును నిష్పక్షపాతమును గలిగి యుండవలయు. ఒక కార్యమునుగూర్చి వేఱువేఱువిధ ములు మంచివని వివాదములు చేయుచున్నవారిని, సమాధాన పెట్ట దిట్టలై యుండవలయును. లుబ్ధులుగాకయు మిక్కిలి ఘోరములయిన సప్తవ్యసనములందుఁ దగులకయు నుండవల యును. రా జాయెనమండ్రు మంత్రులనడుమ ముఖ్యుఁడై మంత్రమాలోచింపవలయును. అంత రాజు తనదేశపువారికిఁ దెలియుకొఁఅకు దన మంత్రనిశ్చయములను బ్రకటింపవల యును. నీ వెప్పుడు నిట్లు వ్యవహరించుచు నీప్రజలను జూచు కొను చుండవలయును. నీయెడ నిల్లడగా దాఁచిన ధన మును గైవసము చేసికొనరాదు. ఇద్దఱును నేను నేను సొం తకాఁప నని తగవులాడునట్టి యొకవస్తువును నీది గావించు కొనరాదు. ఇట్టి నడవడి ధర్మపరిపాలనమును జెఱిపివైచును. ధర్మ పరిపాలనమునకు హానికలుగఁగా నధర్మమును నిన్నుఁ బీడిం చును. నీరాజ్యమును బీడించును. నీప్రజలకు, డేగనుజూడఁగా బక్షులకుంబోలె, భయము పుట్టించును. అంత, నీరాజ్యమును, సముద్రమున విఱిగినయోడవలెఁ బొడవడఁగును. రాజు తనప్రజల నధర్మముతో బరిపాలించునేని యతని మనస్సున భయ మావేశించును. స్వర్గమును నతనికి మూయఁబడును. రా జ్యమునకు ధర్మమే మూలము. అట్టి ధర్మాసనమునఁ గూర్చుండి యధర్మమునఁ బాలించు రాజు మంత్రిగాని, రాజుపుత్త్రుఁడుగాని,

యర్హ్యె నియోగములం దధికృతులయ్యుఁ దమసొంత ప్రయోజన ములను మున్నిడికొని యక్కార్యములు చక్కఁగా నాచరిం పని యధికారులుగాని, రాజు వెంట నందఱు నధోగతి నొందు దురు. బలవంతులయిన వారిచేఁ బీడితులయిన దుర్బలులు దీన ముగాఁ బెక్కులు పలవించునపు డట్టి దిక్కుమాలిన మనుజుల కెప్పుడును రాజే దిక్కు. రెండు పక్షములవారికి వివాదము కలిగి నపుడు, సాక్షుల బలిమినిబట్టి తీర్పుచేయుట మంచిది. ఒక పక్షమువానికి సాక్షులులేక దిక్కుమాలి యున్నెడ, వాని విష యమునందు రాజు విశేషించి పరిశీలనము పుచ్చుకొనవలయును. రాజు పాపములు చేసినవారిని వారి యపరాధమునకుఁ దగురీతి ని దండింపవలయును. ధనవంతులగు వారిని దండుగులు మొద లయినవానిచేత ధనమునకుఁ బాపవలయును. పేదవారిని జెఱఁ బెట్టవలయును. మిక్కిలి చెడునడవడి గలవారిని దెబ్బలు కొట్టింప వలయును. శిష్టులగు వారిని మంచిమాటలచేతను దానముచేతను బరిపాలింప వలయును. రాజును వధింపఁదలఁచినట్టి మనుష్యునిఁ జిత్రవధము గావింపవలయును. ఇండ్లకు నిప్పు పెట్టినవానికిని దొంగ కును వర్ణసంకరము చేయువానికిని నఱ్ఱె చేయవలయును. రాజు చక్కఁగా దండమును జరుపుచు సత్పథమునఁ బ్రయత్నపరుఁడై యుండునేని యతనికి శాశ్వతము లయినధర్మములు కలుగును; అధర్మమే కలుగదు. రా జెవ్వఁడు తెలివిమాలి విచ్చలవిడి దండ మును గావించునో వాఁ డిహామం దపకీర్తినొంది మృతుఁడయి నరకము నొందును. ఒకనియపరాధమునకుఁగాను మఱొక్క నికి దండము విధింపరాదు. దండశాస్త్రమును జక్కఁగా నను సరించియె యొకనిని జెఱఁబెట్టుటగాని విడిచి పుచ్చుటఁగాని

వలయును. రాజు దూత నెట్టియాపదయం దయినను నొకప్పుడును జంపరాదు. దూతను జంపినరాజు మంత్రులతోఁగూడ నరకము నొందును. క్షత్రధర్మ పరుండయిన రాజు, తన్నుఁ జెప్పుమన్న విషయమును గలరూపున నొకదూత చెప్పినందులకు వానిని జంపినచో నతనిపితరులు భ్రూణహత్యచేసిన దోషము నొందుదురు. మంచికులమునఁ బుట్టుట, శీలము చక్కఁగాఁ గలిగియుండుట, మాటకారితనము, నేరుపు, ఇంపుగా మాటాడుట, తనకుఁ జెప్పినట్టు సరిగాఁ జెప్పుట, జ్ఞాపకశక్తి యనెడియీయేడు గుణములు దూత కుండవలయును. ఈరాజు నంగరక్షకుఁడును, ద్వారపాలకుఁడును, బట్టణ ద్వారరక్షకుఁడును నిట్టి గుణములే కలిగియుండ వలయును. రాజుమంత్రి ధర్మశాస్త్రార్థముల స్వరూపములను దెలిసినవాఁడును, సంధివిగ్రహములందు నిపుణుఁడును, మతిమంతుఁడును, ధృతిమంతుఁడును, సిగ్గరియు, మంత్రరహస్యములను గప్పి కాచువాఁడును, కులీనుఁడును, మనస్సు దిటగలవాఁడునయి, పరిశుద్ధమగు నడివడిగలిగి యుండవలయును. ఇట్టి గుణములుగలవాఁ డయినచో నతఁడు ప్రశంసనీయుఁ డగును. సేనాపతియు నిట్టిగుణములతోడనే కూడియుండ వలయును. మఱియు వివిధములయిన యుద్ధవ్యూహములయు యంత్రములయు నాయుధములయు స్వరూపములను దెలిసిన పరాక్రమశాలియై యుండవలయును. మఱియు నతఁడు వాన చలి యెండ గాలి తాఁకులకు నోర్చువాఁడై పరులయందలి రంధ్రములందుఁ గన్ను గలిగివానిని దెలిసియుండవలయును. రాజు తనశత్రువులను నేమి యపాయము లేదని నమ్మింప నేర్చియుండవలయును. తానుమాత్ర మెవ్వరిని నమ్మరాదు. అతనికిఁ దనకన్న కుమారుని యందుసయితము

నమ్మిక యుంచుట యొప్పుగాదు. అనఘా ! నీ కిపుడు శాస్త్రార్థములను గలరూపున వివరించితిని. రాజులకు నమ్మకుండుట రాజనీతి యందుఁ బరమ మయినరహస్యముగాఁ జెప్పంబడు చున్నది' అనెను. ఇది యెనుబదియేనవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

### భీష్ముఁడు ధర్మరాజునకుఁ బురలక్షణాదులను జెప్పుట.

ధర్మరాజు 'రాజు వసించునట్టిపట్టణ మెటువంటిదిగా నుండవలయును. ఇంతవఱకుఁ జేయఁబడి యున్న పట్టణము నే యతఁడేర్పఱచు కొనవచ్చునా ? లేక క్రొత్తదిగా నొకటి చేయించుకొని వసింపవలయునా?' అని యడిగెను.

భీష్ముఁడు 'రాజు తనపుత్రులతోడను జ్ఞాతులతోడను బంధువులతోడను నెందు వసింపవలయునో యాపట్టణ మున్నయునికిని దానిగుప్తిని విమర్శించి తెలిసికొనుట యెంతయు న్యాయము. కాఁబట్టి నే నీవిషయమున, నందును విశేషించి, దుర్గకర్మమును గుఱించి చెప్పెదను. వానిని విని యట్లే చేయుటయే కాక ప్రయత్నంబున నడపుచును రావలయును. ఆఱువిధములయిన దుర్గములను నేర్పఱచుకొన్న పిదపఁ బట్టణముల నేర్పఱుపవలయును. అందు సర్వవిధములయిన సంపదలును ముఖ్యములయిన వస్తువులును సవ్వారిగా నుండవలయును. ఆ యాఱువిధములయిన దుర్గములును, మరుదుర్గములు, భూదుర్గములు, పర్వతదుర్గములు, మనుష్యదుర్గములు, మట్టిదుర్గములు, వనదుర్గములు నగును. రాజు తనకు వశ్యులయిన

మంత్రులతోడను సైన్యములతోడను వసింపవలసిన పట్టనము నకు దుర్గము బలమయినదిగా నుండవలయును. అందు వలయు ధాన్యములును నాయుధములు నుండవలయును. దానికి దృఢ మయినకోటయు నగడ్తయు నుండుటయె కాక, రథగజ తురగ ములందు నెరసిఁ జరసి యుండవలయును. అందు విద్వాంసులును శిల్పులు నుండవలయును. వలయు సంభారములన్నియు లెస్సఁగా సమకట్టింపఁబడ యుండవలయును. అందలిజనులు ధార్మికులై, మంచిసమర్థులై యుత్తములై యుండవలయును. మిక్కిలి తేజ ముదాలఁకుచున్న మనుష్యులును మృగములునుగలిగి, చదుక ములచేతను సంగడీపీథులచేతను విలసిల్లుచుఁ, బరిశుద్ధములయి జనవ్యవహారములు వెలయ, మిక్కిలి నిమ్మళముగలిగి, దేనివల నను భయము లేనిదై యుండవలయును. అది మిక్కిలి కాంతిం బ్రకాశించుచు సంగీతాదిధ్వనులు బోరుకొనుచు మిక్కిలి యొప్పిదములయిన యిండ్లుగలిగి నెలుంగవలయును. మఱియు నది శూరులచేతను బ్రాజ్ఞులచేతను నిండి వేదఘోషములకుఁ బ్రతిశబ్దించుచుండవలయును. సభలుగూడుటయు జాతరులును గలిగి సదా దేవతాపూజల రాజిలు చుండవలయును. ఇట్టి పురమునందు రాజు వశ్యులయిన మంత్రి మొదలయినవారితోఁ దాను బ్రవేశించి యుండవలయును. అందుఁ దాను వసించి బొక్కసము నించుచును, సేనలను బెంచుచును, మిత్రులను బెక్కండ్రనుగూర్చుచును, న్యాయసభలను నేర్పఱచుచు నుండ వలయును. అతఁడు తనపట్టనములందును బల్లెపట్టులందును గల సకలదోషములను దొలంగింపవలయును. మఱియు భాండాగార ములను నాయుధాగారములను బ్రయత్నపడి వృద్ధిఁబొందింప

వలయును. సమస్తములయిన బియ్యము మొదలయిన ధాన్యముల రాసులను బెంచి యంత్రశాలలను గుదుర్పవలయును. మఱియుఁ గట్టియలు, లోహములు, ఉముకలు, బొగ్గులు, మాంసకులు, కొమ్ములు, ఎమ్ములు, వెదుళ్లు, మజ్జ, నూనె, క్రొవ్వు, తేనె, మందుదినుసులు, జనుము, సర్జరసము, ధాన్యము, ఆయుధములు, అమ్ములు, తోలు, నరములు, పేములు, ముంజగడ్డి, మొదవ, వాద్యములను జేర్పవలయును. మిక్కిలి జలములు కునికిపట్టులయిన బావులను దానికి దాపుననున్న తోట్లను, పాలుస్రవించు మాంసకులను రాజెప్పుడును రక్షింపవలయును. ఆచార్యులను, ఋత్విజులను, పురోహితులను, మేటి విలుకాండ్రను, శిల్పులను, జ్యోతిషులను, వైద్యులను, ప్రాజ్ఞులను, మేధావులను, నడఁకువ గలవారలను, సమర్థులను, శూరులను, బెక్కుశాస్త్రముల నధిగమించినవారిని, మంచికులమునఁ బుట్టినవారినిని, సత్త్వగుణసంపన్నులను, సకలకర్మములందుఁ బూనికగలయట్టివారలనును, రాజు ప్రయత్నంబునఁ సత్కరింపవలయును. రాజు ధార్మికులగువారిని బూజింపవలయు; అధార్మికుల నడంపవలయును. పాటుపడి సకలవర్ణముల వారిని దమతమ కర్మములందు నియమింపవలయును. పట్టనములందును బల్లెపట్టులందును లోపలను వెలుపలను గలవిషయములను వేగులవలనఁ జక్కఁగాఁ దెలిసికొని పిదపఁ గార్యమును జరుపవలయును. రాజు వేగులవారిని, మంత్రాలోచనములను, బొక్కసమును, దండమును విశేషించి తానే పరిశీలించుచుండవలయును. సమస్తమును వీనియందే నెలకొనియున్నది. పట్టనమందును బల్లెపట్లయందును గల యుదాసీనులును, మిత్రు

లును, శత్రువులును, జేయఁదలఁచియున్న దానినంతయుఁ జారులనెడి కన్నులచేఁ దెలిసికొనవలయును. పిదపఁ బాలుమాలిక లేక వారికిఁ జేయవలసిన కార్యము నంతయుఁ జేసి తీర్పవలయును. ఎప్పుడును భక్తులను బూజింపవలయును : పగవారిని నిగ్రహింపవలయును. ఎప్పుడును యాగములు యజించుచుండవలయును; ఎవ్వరిని బీడింపక దానము చేయుచుండవలయును. ప్రజలను బరిపాలింపవలయును. ధర్మమునకు విరుద్ధమయిన కార్యమును జేయరాదు. బీదలకును, దిక్కుమాలినవారికిని, వృద్ధులకును, వితంతువులకును, యోగక్షేమములను జీవనమును నెప్పుడును గావించుచుండవలయును. రాజెప్పుడు నాశ్రమస్థు లగు మునులను నాదరించియుఁ, బూజించియు, బహుమానించియు, వస్త్రములను బాత్రములను భోజనములను దగుకాలములందుఁ బంపుచుండవయును రాజు (తన దేశమందలి) తాపసులకు జతనంబునఁ దనయున్న యునికియు దాను బూనుకార్యము లన్నియును, దనరాజ్యస్థితియు, నివేదించుచు వారి సన్నిధియందు మిక్కిలి యడఁకువతో వర్తింపవలయును. వారు వ్రతములందు వాసికెక్కిన వారుగాన, రా జెప్పుడేని యొక సమయమునందు వారి రక్షణము గోరవలసివచ్చునేని, వారు నిచ్చలు రక్ష గావింతురు. రాజు, మంచికులమునఁ బుట్టినవాఁడును, పెక్కుశాస్త్రము లధిగమించినవాఁడును, సమస్తములయిన ధనములను బరిత్యజించినవాఁడును నగు నట్టి తాపసునిఁజూచెనేని వారికి శయనాసన భోజనము లొసంగి పూజింపవలయును. రా జెట్టి యాపదయందును నాతపస్వులందే నమ్మిక యుంపవలయును. దొంగలు సయితము తపస్వులయందు నమ్మిక గలిగియుందురు. వారియొద్ద

నిధులను నుంపవచ్చును; * మరలఁ దీసికొనవచ్చును. † మాటి మాటికి వారికడకుఁబోవుటయు, నతిమాత్రము వారినిబూజించు టయుఁదగదు. రాజు తనరాజ్యమందు వసించువారిలో నొకతాపసిని జెలిమికై యేర్పఱచుకొనవలయును. పరరాష్ట్రమందలివారిలో నొకరినిని నట్లే యేర్పఱచుకొనవలయును. అడవులయందలి వారిలోను నొకనిని, సామంతరాజుల నగరములలోనివారి యందొకరినిని నట్లే చెలిమిచేసికొనవలయును. రాజు తనరాజ్యమం దుండుతాపసులకుంబోలెఁ బరరాష్ట్రములందును నరణ్యములందును నుండు నాతాపసులకును నాదరమును బహుమానమును నడపుచు వలయువానినెల్ల నిప్పించుచుండవలయును. ఆతాపసులు సంశితవ్రతులుగాన, రాజున కెద్దియేని యాపదకలిగి రక్షణము గావలసివచ్చినపు డతఁడు గోరెనేని తప్పక యట్టి రక్షణొసంగుదురు. రాజు తాను వసింపవలసినట్టి నగరమునకు వలయులక్షణములను నీకు సంగ్రహముగా నిప్పుడు చెప్పితిని' అనెను. ఇది యెనుబదియాఱవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

{ భీష్ముఁడు ధర్మరాజునకు రాజ్యమును గుప్తిచేయు ప్రకారము మొదలయినవి చెప్పుట. }

ధర్మరాజు 'భరతసింహమా ! రాజ్యము నెట్లొడఁగూర్పవల

* 'ప్రజ్ఞాః పర్యాదదీతచ' అని జో. మూలము. వారివలనఁ బ్రజ్ఞను గ్రహింపవచ్చునని యర్థము.

† తాపసులకడకు మాటిమాటికిఁబోరాదనుట వారియొద్ద రాజు ధనము మొదలయినవి యున్నవని దొంగలు వారిని బాధింపకుండుటకని తెలియునది.

యునో దాని నెట్లు పదిలముగా రక్షింపవలయునో జక్కఁగాఁ దెలిసికొన నువ్విళులూరుచున్నాను. వానిని నాకుఁ జెప్పుము' అని యడిగెను.

భీష్ముఁడు 'రాష్ట్రముఁను రక్షించువిధమును దాని నేర్పఱచు కొనురీతిని నంతటిని జెప్పెదను; ఎచ్చరికతోడ వినుము. ఒక్కొక్క గ్రామమునకు నొక్కయధిపతి నేర్పరుపవలయును; అట్లే పది గ్రామములకు (అనఁగాఁ బది గ్రామాధిపతులకుఁ బయిని) నొక్కపతి యుండవలయును. అట్లే యిరువది గ్రామములకును (అనఁగా ఇరువది గ్రామపతులకుఁ బయిని) నొక యీశునిని. ముప్పది గ్రామములకు నొకనిని, (నతనిపయిని) నూఱు గ్రామములకు నొకరినిని, (నతనిపైని) వేయి గ్రామములకు నొకరినిని నీశునిఁగా నియమింపవలయును. గ్రామాధిపతి గ్రామమందలి వారి లక్షణములను నందలి దోషములను బాటించుచుండవలయును. అట్లు పాటించినవిషయములను దశగ్రామాధిపతికి దెలుపవలయును. * ఆదశగ్రామాధిపతి వింశతిగ్రామాధిపతికిని, వింశతిగ్రామాధిపతి యావిషయములనెల్ల ముప్పదిగ్రామములపతికిని, నతఁడు నూఱుగ్రామముల పతికిని దెలుపవలయును. (గ్రామాధిపతి గ్రామమందుఁ బయిరగు భోజ్యవస్తువులకును మఱి యితరములగు గ్రామసంబంధివస్తువులకును నొడ

* 'వింశతి త్రింశతీశంచ సహస్రస్య చకారయేత్' అని. దా మూ. ద్విగుణాయాశ్శత సై్యవం సహస్రస్యచ కారయేత్' అని జా. మూలము. దానికి (అనఁగాపదికి) రెండింతల (అనఁగా నిరువది) గ్రామములకు నొకపతియు, నూఱుగ్రామములకు నొకపతియు నట్లే వేయింటికి నొకపతియుఁ నియమింపవలయును.

యుఁడుగా నుండవలయును.) గ్రామాధిపతి తనగ్రాసమునకై యాగ్రామమందుఁ బయిరగు భోజ్యవస్తువులను దనకుఁ దగుకొలఁది ననుభవింపవలయును. ఒక్కొక్క గ్రామాధిపతియుఁ దనవంతుకొలఁదిని దనగ్రామ వస్తువులను బది గ్రామముల యధిపతికి గ్రాసభరణముగా నొసంగవలయును. పదిగ్రామముల యధిపతియు నట్లె తనవంతుకొలఁది నొసంగి యిరువదిగ్రామముల పతికి భరణముగావింపవలయును. నూఱుగ్రామములకుఁ బతియైనవాఁడు రాజువలన నన్నిసత్కారములను బడసి తనభరణమునకై జనులునిండినదియు సంపదల సొంపువెంపారునదియు నగు నొకపెద్ద గ్రామము ననుభవింపఁదగును. నూఱుగ్రామముల పతి కట్లియ్యఁబడిన యాగ్రామము వేయిగ్రామములపతికి లోనై యుండవలయును. ఆవేయిగ్రామముల పతియు మేలయిన యొకశాఖానగరమును(చిన్న పేటను) దనభరణమునకు నుంచుకొనవలయును. అతఁడు రాజ్యాధికారితోఁబాటిగా దానివలనఁ గలుగు ధాన్యమును బంగారమును దక్కినవస్తువులను ననుభవింపవచ్చును. అతఁడు దానిని సంబంధించిన యుద్ధకార్యములను, మఱియు గ్రామముల కార్యముల నన్నియును గావింపవలయును. ధర్మజ్ఞుఁ డయినయొకమంత్రి ప్రాలుమాలికలేక యాయధికారుల కార్యములను నన్నిటిని నరయుచుండవలయును. ఒక్కొక్క నగరమందును నందలి సమస్తవిషయములను నరయుటకు నొక్కయధికారి యుండవలయును. అతఁడు నక్షత్రములందు ఘోరరూపమయిన యొక గ్రహమువలె నాయధికారులందఱకును నెక్కుడయిన స్థానమందుండి తనక్రిందనున్న యాయధికారులందఱను జుట్టి చూచుకొనుచు రావలయును. అట్టివాఁడు తన

క్రిందనున్న వారల నడవళ్లను దూతలమూలమున నరయుచుండ వలయును. రక్షణాధికారమునం దుండువారు వంచకులుగను, బరులసొమ్మును బలిమిని బుచ్చుకొనువారుగను, బాపమం దాశ గలవారుగను, జంప నిచ్చగించువారుగను నుందురు. ఆ గొప్ప యధికారి ప్రజల నిట్టివారలవలన నుండి రక్షింపవలయును. రాజు, విక్రయమును, గ్రయమును, బాటలస్థితియు, దిండిని, వ్యయమును, దక్కిన యోగక్షేమములను జక్కఁగాఁ గనుఁ గొని వర్తకులకుఁ బన్నులను విధింపవలయును. శిల్పు లుత్ప త్తిచేయు వస్తువులను వానికయిన వచ్చుబడులను వ్యయములను శిల్పముల తెఱంగును బలుమాఱు పరిశీలించి యాశిల్పులకు వారిశిల్పములమీఁదఁ బన్నువిధింపవలయును. రాజు మిక్కిలిగొప్ప పన్నులు పుచ్చుకొనవచ్చును గాని, ప్రజలను గీడ్పఱచునట్టి పన్నులను విధింపరాదు. ఎంత ఫలితమగునో,యందుల కెంత పాటు పడవలయునో, చక్కఁగాఁ దెలిసికొనియే యేపన్నును విధింప వలయును. ఒక్కఁడు తగిన (ఫల) కారణములేక యొక ఫలిత మునకుఁ గాని యందుల కయినపాటునకుఁగాని పూనఁడు. ఒకఁ డొకసరకును బాటుపడిచేయఁగా, వాఁడును రాజును దాని ఫలమునకుఁ బాలుపడునట్లుగా రా జాలోచించి పన్ను వేయవల యును. రాజు పేరాసచేతఁ దనకు మూలమయిన దానిని (రా జ్యమును, బరులకు మూలమయిన దానిని (కర్తాదులను), నాశము చేయకుండవలయును. రాజు, లోభమువలని కార్యముల నెల్లఁ నడంచుకొని తన దర్శనమును మఱఁగించుకొని యుండవలయును. రాజు మిక్కుటముగాఁ బన్ను దీయువాఁ డని పేరుగన్నచోఁ బ్రజ లట్టివానిని ద్వేషింతురు. జనులు ద్వేషించినట్టివానికి

క్షేమమేమి ? మాటుగలిగి యుండువానిని సంపద పొందును. రాజు బుద్ధికొలవడక దూడవలె రాజ్యమును బిదుకవలయును. దూడ చక్కఁగా పోషింపఁబడినదైనచో సత్తువగలిగి కాఁటి యును సైఁచును. మిక్కిలిగాఁ బిదుకఁబడిన యావుదూడ పనిచేయఁజాలదు. రాజ్యమును నెక్కువగాఁ బిండినయెడలఁ బెద్దకార్యమును గలిగింపఁజాలదు. ఏరాజు తానే పరిపాలించుకొనుచు రాజ్యము ననుగ్రహమునఁ జూచునో వాఁడం దుప్పతిల్లినదాని ననుభవించుచు మిక్కిలియు గొప్పఫలమును బొందును. తనరాజ్యమును బరిపాలించుచును, దనప్రజలకును పన్నులు మొదలగువానియందు ననుగ్రహము చూపుచును, సులభముగా నందుఁ గలుగువానివలననే తనభర ణము చేసికొనుచును, నుండునట్టి రాజు మిక్కిలియు గొప్పఫల మును బొందనేర్చును. అట్టున్నయెడ రాజు తనయాపదలకు వలయునంత ధనరాసులను సంపాదింప నేర్చును జుమీ. అతని రాష్ట్రమంతయు నతనికి బొక్కసమగుచున్నది. అతని బొక్కస మతనిపడుక టిల్లగుచున్నది. పురజనులును పల్లెపట్ల జనులును బీదలుగానుండిరేని, వారు తన్నుఁ దమంతట నాశ్రయించినను, నొకరిమూలమున నాశ్రయించినను, దనశక్తికొలఁది వారియెడఁ గనికరము చూపవలయును. * రాజ్యము బాహ్యములందున్న

---

* 'బాహ్యం జనం భేదయిత్వా భోక్తవ్యో మధ్యమస్సుఖమ్' అనిమూలము. వెలుపలిపట్ల నడవులనుండు దొంగజనులను మీరు చెలరేఁగుడని భేదము కల్పించి నడుమనున్న గ్రామజనులవలన నవ్వారిగా ధనము ననుభవింపవలయునని య ర్థాంతరము. ఇచట రాజులకు విపత్తులయందు ధనరాసులు కావలసివచ్చెనేని వెలిపట్లనున్న దొంగలను జెలరేఁగునట్లు పురికొలుపఁగా నడుమనున్న గ్రామజను

దొంగలనందఱను దండించి రాజు నడుమ నున్న గ్రామజను లను రక్షించి వారికి సుఖముకలిగింపవలయును. ఇట్లు చేయుట వలన జనులు, రాజుతోఁబాటిగా సుఖమును దుఃఖమునుగలవా రగుదురుగాన యతనియెడ నెంతమాత్రమును గోపమునొందరు. రాజు ముందుగనే ధనము సేకరింపవలయు నని *తలపోసి యంతఁ దనరాజ్యమందు ముఖ్యము లయినపట్టులకుఁబోయి 'ఇదిగో! ఆ పద కలిగియున్నది. పరులదండువలన మిక్కిలియు భయము పుట్టియున్నది. అయినను నీయపాయము తొలఁగిపోవలయునని యే చెప్పవచ్చును. ఏలనఁగా మనశత్రువు, పూచిన వెదురు వలెఁ ద్వరలో నాశము నొందును. నాశత్రువు లనేకులు చెలరేఁగి పెక్కండ్రు దొంగలతోఁ గూడికొని నారాజ్యమును బీడింప నుంకించుచున్నారు గాని, యట్లు సేయుట వారినాశమున కే యగును జుఁడీ. ఇట్లాపద ఘోరమైయుండఁగా భయము దారు ణముగాఁ గలుగఁగా మిమ్మును నలుగడలఁ గాచుటకై మీవలన ధనములను బ్రార్థించుచున్నాను. ఈభయము తొలఁగినతోడనే మీధనములనంతయు మరల మీకు నిప్పించుచున్నాను. నేను గాక శత్రువులు బలవంతముగా నిచటనుండి ధనములను గొంపో

లకువారివలన భయముగలుగఁగలదు. రా 'జాదొంగలనుండి మిమ్ము రక్షించు టకు ధనము లిం'డని యవ్వారిగా ధనములను వారివలన గ్రహింపవలయును. వారును రాజుతమసుఖదుఃఖములను గుర్తించి యట్లు చేయుచున్నాఁడని తలం చుటచేఁ దమవలన నవ్వారిగా ధనములు గొన్నందులకు రాజువలన నెంతమాత్ర మును గోపము నొందరని యాశయము.

* 'అనుభావ' అనిమూలము 'అనుభావ్య' అనుపాఠమున 'చెప్పి' యని యర్థము.

వృథు రేని మరల నెంతమాత్ర మీయరు. ధన మొక టేగాదు; వారి వలన స్త్రీలును దక్కినవన్నియు నాశమునొందవలసి వచ్చును' అని భయమును జూపవలయును. రాజు సమయము నెఱింగి తగిన యుపాయమును జేసినపిదపఁ బ్రజలతో 'శరీరము కొఱకును బుత్రులకొఱకును భార్యలకొఱకును ధనము గూర్పంబడుచున్నది. మీయభివృద్ధి కెంతయు నానందించుచున్నాను. నేను నాపుత్రుల యభ్యుదయమునకుఁ బోలె మీ పెంపుసొంపునకు నానందించు చున్నాను. రాజ్యమునకును మీకును గష్టము లేకుండునట్లు శక్తికిఁ దగినట్లు పుచ్చుకొనెదను. *ఆపదలందేక దా మీరందఱు నొక్క టిగాఁగూడి యీపనిని భరింపవలయును. ఆపద లేవేని వచ్చినపుడు, మీరు ధనమం దంతగాఁ బ్రియముంపరాదు' అని యింపు గను జల్లగను ఋజువముగను జెప్పి తన చేఁద్రాళ్లఁబోని యధి కారులనుబంపి ప్రజలవలన ధనమును సంతరింపవలయును. రాజు వైశ్యులకు † దండయాత్రనును భృత్యులను భరించుట మొద లగువానివలని వ్యయములను, బరులు దండెత్తివత్తురను భయ మును, వారికి యోగక్షేమములు కలిగింపవలసిన యావశ్యకత ను, జూపి వారివలననుండి పన్నులు దీయింపవలయును. రాజు వైశ్యుల నుపేక్షించిచో వారు తనరాజ్యమునువిడిచి యడ వులకుఁ బోయి తనకు నశించినట్టివారే యగుదురు. కాఁబట్టి రాజు వారలయెడ విశేషించి మెత్తఁదనముతో నడచుకొనవలయును.

---

* 'ఆపత్స్వేవ నిబోద్ధవ్యం భవద్భి స్సంగతైరిహ' అని దా. మూ. 'ఆపత్స్వేవచ నోద్ధవ్యం భవద్భి ర్పుంగవై రివ' అని జౌ. మూలము. వృషభములవలె భరింపవలయునని, యర్థము.

† 'ప్రచారమ్' అని దా. మూ. 'ప్రాకారమ్' అని జౌ. మూలము.

రాజు మాటిమాటికి వైశ్యులను మెత్తనిమాటల లాలించుచుచు, రక్షించుచును, వారికిఁ గుశలముగా నుండునట్లు తోఁపించు కార్యములు చేయుచును, వారికిఁ గలవానిని సుఖముగా ననుభవింపఁ జేయుచును, వారికిఁ బ్రియములయినవియె యెప్పుడు నాచరించు చునునుండవలయును. వైశ్యులు ఫలము పయింబయి నొడఁగూర్చు వలంతులగునట్లుగా రాజు వారియెడ మెలఁగవలయును. వైశ్యులు రాజ్యమును బలమును వృద్ధిఁబొందించుటయే కాక దానివర్తకమును సేద్యమును బెంతురు. కాఁబట్టి తెలివిగల రాజు వారికెంత యుం బ్రయత్నపడి సంతోషము గలిగించు చుండవలయును. రాజు దయగలిగి పరాకువడక మృదువుగాఁ బన్నులను దీయ వలయును. వైశ్యులకు * క్షేమము గావించుట మెచ్చుటను సులభమే కదా. వారియెడల నట్లు నడచుకొనుటకు సాటియైన ధనము రాజ్యమునకు మఱొకటి గలుగదు' అనెను. ఇది యెను బదియేడవయధ్యాయము.



రాజధర్మపర్వము.

{భీష్ముఁడు ధర్మరాజునకుఁ బ్రజలవలనఁ బన్నుదీయు విధము మొదలయినవి చెప్పుట.}

ధర్మరాజు 'మహామతీ ? రాజు తనకెంతధన ముండినను మఱియు బొక్కసము గావలసివచ్చినచో † నెట్లు నడచుకొనవల యునో నాకుఁజెప్పుము' అని యడిగెను.

---

* 'క్షేమచరణమ్' అనిమూలము.

† 'కథంప్రవర్తేతతథా' అని శౌ. మూలము 'కథంప్రవర్తేత కరః' అని దా. మూలము. పన్నునెట్లు వేయవలయునో యని యర్థము.

భీష్ముఁడు ' ధర్మార్థి యగురాజు ప్రజలహితము దానస్వర్గదై దేశమునకును గాలమునకును దగునట్లును దనబుద్ధికొలఁదిని దనచేత నయినంతవఱకును వారలకుఁ గట్టుపాట్లు చేసికొనవలయును. రాజు తనరాష్ట్రమందుఁ బ్రజలకును దనకును శ్రేయము గలుగునట్లుగా సమస్తములయిన ధర్మములను జరుపవలయును. రాజు,తుమ్మెదలు చెట్లనుండి తేనియను దీయునట్లు,రాజ్యమునుండి * పన్ను దీయవలయును. గొల్లవాఁడు దూడయందుఁగన్ను వీడక యె పాలుపిండును. మఱి యావుపాలిండ్లను దూఁటుపోడువఁడు. అట్లె రాజును నడచుకొనవలయును. జలగ నెత్తురును బీల్చునట్లు రాజు రాజ్యమును మిక్కిలిమృదువుగా నే పీల్పవలయును. ఆఁడుపులి తనకూనలను వాఁడిపండ్లఁ గఱచినను నొవ్వగలిగింపక యే కొంపోవునట్లు, రాజును బీడింపక యే పుచ్చుకొనవలయును. ఎలుక మిక్కిలివాఁడియైన కోఱపండ్లు గలిగియుండినను నిదురించుచున్న వారికాలను వారికిఁ దెలియకుండునట్లు మెలపుగాఁ గొఱుకునట్లు రాజును మిక్కిలి మృదువయిన యుపాయమున రాజ్యమునుండి పుచ్చుకొనవలయును. వర్ధిలుచున్న యొకనినుండి కొంచెము కొంచెముగా పన్ను నెచ్చునట్లు నిప్పించుకొనవలయును. అటమీఁద, నెచ్చుగను నంతకుఁబిదప మఱింత హెచ్చుగను,నిట్లు క్రమముగాఁ దగినంతకొలఁదికి బన్నును హెచ్చింపవలయును. ఒకఁడు చిన్న యెద్దునకు బరువును రాను రాను హెచ్చించుచు మోయఁబనుపఱుచు

---

* 'మధుదోహం దుహే ద్రాష్ట్రం భ్రమరా ఇవపాదపమ్' అని దా. మూ. మధుదోహందుహే ద్రాష్ట్రమ్ భ్రమరాన్న ప్రపాతయేత్ ' అని. దా. మూ. 'రాజు తేనెను దీయునట్లు రాజ్యమును బిదుకవలయును. తుమ్మెదలను బడఁగూల్పరాదు' అని యర్థము.

నట్లు, తన ప్రజలభారములను గ్రమంబున హెచ్చించుచు రావలయును. అతఁడు మిక్కిలి మెలపుతోను మెత్తఁబాటుతోను బ్రవర్తించుచుఁ గడపటఁ ద్రాళ్లను వారికిఁ దగిలింపవలయును. ఒకతూరి వారికిఁ*గట్టుఁద్రాళ్లువైచినచో మీఁద నడంపరానివారు గాకుందురు. వారల నడఁగిమడఁగి యుండునట్లు చేయుటకుఁ దగిన ప్రయత్నము లాచరించి వారి ననుభవింపవలయును. వట్టి ప్రార్థనలచే వారి నడఁగియుండునట్లు చేయుటచాలదు. అందఱు మనుష్యుల యెడల సమముగా నడచుకొనుట శక్యముగాదు. ప్రజలయందు ముఖ్యులయినవారిని బుజ్జవముచేఁ గయివసము చేసికొని తక్కినవారి నడంకువకుఁ దెచ్చుకొనవలయును. భారమును వహించు సామాన్య ప్రజలయందు (వారిముఖ్యులమూలమున) భేదముపుట్టించి రాజుతానే వారిని సమాధానపెట్టుటకు ముందఱికివచ్చి దానిచే వారివలనఁ దీయఁగలిగిన దానిని హాయిగా ననుభవింపవలయును. రాజు పన్నులను, దగని కాలములందును, దాని భరింపఁదగనివారియందును వైవరాదు. క్రమక్రమముగాను, బుజ్జవముతోను, దగినకాలమునను, దగిన విధమునను వానిని విధింపవలయును. నేనుజెప్పుచున్న యీయుపాయములు రాజనీతి కనురూపము లయినవి కాని, మాయలతోఁ గూడినరీతులు గావు. గుఱ్ఱములను నుపాయముమాలి యడంపఁ జూచువాఁడు దానిని గినియించును. కల్లంగళ్లు, బోగముస్త్రీలు, కుంటెనకత్తెలు, నట్టువులు, జూదములును, జూదపుగొట్టము

* పనుపడని యెద్దులకు బరువు కొంచెము కొంచెముగా నెక్కించుచు మెలపుతోడఁ బాటుపడి వానికిఁ గడపటఁ గట్టుఁద్రాళ్లు తగిలించునట్లు ప్రజలయెడ నడచుకొనవలయునని భావము.

లుంచుకొనియుండువారు, మఱియు నిట్టివారును రాజ్యమునకు హానికరులు గావున, వీరి నందఱ నడంచి పుచ్చవలయును. వీరు రాజ్యములోపల వసించుచుఁ బ్రజలయందు మేలయిన తెగలవారిని గొట్టి బాధింతురు. ఒకరి కొక యాపదయు లేనపుడు, మఱొకరి నేదియు యాచింపరాదు. మనువే తొల్లి సమస్తజనులకును నిట్టిదేర్పాటు చేసెను. మనుష్యు లెల్లవారును యాచించుచును దిరిపమెత్తుచును బనిపాటులుచేయక బ్రతుకఁగోరిరేని యీ లోకములన్నియు రూపుమాయును. ఇందులకు సందేహము లేదు. రాజొక్కఁడే నియమించుటకును వారించుటకును శక్తుఁడు. ప్రజలను బాపమునుండి వారింపనిరాజు, రాజరక్షణము లేనందునఁ బ్రజలాచరించు పాపమునందు నాలవపాలును బొందుచున్నాఁడు. ఇట్లని శ్రుతులు ప్రతిపాదించెడిని. రాజు ప్రజలధర్మములందుఁబోలె వారిపాపములందును బాలుగలిగియుండును గాన పాపములాచరించు ప్రజలను నట్లుచేయనీక వారింపవలయును. అట్లు వారిని వారింప నుపేక్షించినచో రాజు తనంతటఁ బాపియగును. వారి పుణ్యములందుం బోలె వారి పాపములందును నాలవపాలునొందును. నేను జెప్పెడియీ దోషములను నడంచిపుచ్చవలయును. ఇవి సంపదను నాశము సేయునట్టివి. కామమునందు మిక్కిలి తగులు గలపురుషుఁ డకార్యమేది సేయకుండును ? కామమునకు లోపడినవాఁడు మద్య మాంసములను, బరులవస్తువులను, బరులదారములను ధనములను నపహరించును ; అట్లితరులకుఁజెడుపద్ధతి నేర్పఱచుచు యాచించి బ్రతుకునట్టి వారెవరుగారో, వారాపత్సమయమందు యాచింపవచ్చును. వారలకుదయతోను ధర్మముతోను దానముచేయవలయునే కాని భయముతోఁ

గాదు. నీరాజ్యమందు యాచకులును దొంగలును నుండరాదు. వీరు ప్రాణులనుబట్టి పీడించువారేకాని వారికిఁ బెంపొందించు వారుగారు. ఎవరు భూతములందు దయసూపుదురో, ప్రజలను వృద్ధినొందింతురో, యట్టివారే నీరాజ్యమం దుండవలయును; కాని, భూతములను మిక్కిలి బాధించువారువలదు. ప్రజలవలనఁ గొలఁదికి మించి పన్నుదీయు నధికారులను దండింపవలయును. కొలఁదిచొప్పునఁ బన్నుదీయు నధికారులను వేఱ నియమింపవలయును. కృషి, గోరక్షణము, వర్తకము మఱియు నిటువంటి వయిన తక్కినపనులును బెక్కండ్రు పురుషులనుగొని వేఱువేఱ వారివారికిఁ గలకర్మములచొప్పున జరుపవలయును. కృషి, గోరక్ష, వర్తకమును జరుపుచుండు మనుష్యుఁడు (దొంగలు క్రూరులు మొదలగు వారివలన) క్షేమము లేకుండునేని దానివలన రాజు మిక్కిలియు నిందనొందును. రాజు ధనికులగువారిని, పాన ములు వస్త్రములు భోజనములు మొదలయినవానిచేఁ బూజిం చుటయేకాక వారితో 'మీరు నన్నుఁగూడి ప్రజలను బెంపొం దింపుఁ' డని చెప్పవలయును. ధనవంతులు రాజ్యమునకు గొప్ప యంగము సుమీ. సకలమనుష్యులకు ధనవంతుఁడు కన్నుకు; ఇందులకు సందేహములేదు. ప్రాజ్ఞుండును, శూరుం డును, ధనవంతుఁడును, ధార్మికుఁడును, దపస్వియు, సత్యవాదియు, బుద్ధిమంతుఁడును, స్వామిగనుండువాఁడును, రాజ్యరక్షణమునందు సహాయకారి యగును. కాఁబట్టి రాజా! సమస్తప్రాణులందును బ్రీతిగలిగియుండుము. సత్యమును, నిష్కాపట్యమును, గోపము లేమియుఁ, గ్రూరత్వము లేమియును బాటింపుము. ఇట్లు సత్య మును నార్జవమును గలిగి, మిత్రులతోను బొక్కసముతోను

సైన్యముతోనుగూడి దండమును జెల్లింపుము. బొక్కసమును బెంపుము. మిత్రులను బడయుము. రాజ్యమును నెలకొల్పుము' అనెను. ఇది యెనుబదియెనిమిదవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

### భీష్ముఁడు ధర్మరాజునకు రాజనీతిని జెప్పుట.

రాజా! నీరాజ్యమందు భుజింపఁదగిన పండ్లుగల వృక్షములను నఱకరాదు. మూలములును ఫలములును బ్రాహ్మణుల సొమ్మగుట ధర్మమని జ్ఞానవంతులు చెప్పెదరు. బ్రాహ్మణులకుఁబోఁగా నెక్కువ గామిగిలినదానిని దక్కినజను లనుభవింపవలయును. బ్రాహ్మణులకు నడ్డుపడి మఱియొకఁ డేవస్తువు నేని నేవిధమునఁగాని హరింపఁగూడదు. జీవనము లేనికొఱఁతవలన నొక బ్రాహ్మణుఁడు వేఱొకచోట బ్రతుకు వెదకికొనుటకై రాజ్యమును దిగవిడువఁగోరు నేని, రాజతనికిని నతనిభార్యకును బ్రతుకు నేర్పఱుపవలయును. అప్పటికి నాబ్రాహ్మణుఁడు పోక మరలఁడేని బ్రాహ్మణసంఘము కడకుఁబోయి '* ఇపుడు లోకులు తమ్ము మర్యాదయందు మెలఁపుటకెవనిని బ్రమాణముగాఁ గొందురు? ఈ బ్రాహ్మణుఁడు రాజ్యమును విడిచిపోవుచున్నాఁడే' యని చెప్పవలయును. అప్పటికి నాబ్రాహ్మణుఁడు విడిచిపోవుతలంపును విడువక మఱియే

* బ్రాహ్మణులు తక్కినవారిని లోకమర్యాదలందు మెలపుటకుఁ బ్రమాణభూతులు. కాన యొకబ్రాహ్మణుఁడు రాజ్యమును విడుచునేని జనులు తామొకస్నేహితునిని గురువును నియామకునిఁబోఁగొట్టుకొన్నవారగుదురు. కావున నే రాజాబ్రాహ్మణునిఁగూర్చి యిట్లుచెప్పుట తెలియునది-ప్రతాపచంద్రరాయలు.

డేని చెప్పునేని, రాజతనితో '*కడచినదానిని మఱచిపోవలయు' నని చెప్పవలయును. కౌంతేయా ! ఇది శాశ్వత మయినరాజ నీతిధర్మము. రాజు మఱియు నతనితో 'బ్రాహ్మణోత్తమా ! బ్రాహ్మణునికి జీవనమునకు వలయునంతయే యీఁదగునని జనులు చెప్పెదరు. అయిననే నీమాటను పాటింపను. అతఁడు రాజు (తనకు బ్రతుకుగల్పింపకున్న) తగనినడవడికి నట్లాచరింపఁ (తనరాజ్యము విడిచిపోవఁ) గోరునేని (యతని కట్టిబ్రతుకుఁదెరువు కల్పించుట యేకాక యతఁడు కోరెనేని) వలయుభోగములనుగలిగించి నిలువఁ బ్రార్థింపవలయు' ననఁదగును. జనులకుఁ గృషియు గోరక్షణమును,వర్తకము నీలోకమున జీవనమగును. వేదవిద్య పరలోకమునకు సాధనమగును. అది జనులను బెంపునొందించునది. అది క్రిందపడునపు డెవరుదాని ప్రచారమున విరోధులగుదురో వారు

* రాజా బ్రాహ్మణుని నీవిధమునఁ బోనీక నిలుపవలయును. అందులకు నతఁడు సమాధానపడక రాజామునుపటియనాదరము నెత్తిచూపునేని రాజుదానిని మఱచుటకు క్షమాపణము వేఁడి,యతనికి జీవన మేర్పఱుపవలయునని ప్రతాపచంద్రరాయలు-- 'అసంశయం నివర్తేత నచేద్వక్ష్యత్యతః పరమ్ । పూర్వం పరోక్షం వక్తవ్యమ్' అని. ఔ. మూ. 'వక్ష్యతి' అనుటకు 'త్యక్ష్యతి' అని పాఠము. 'అప్పుడు సందేహములేక మఱలును. అట్లుగాక జీవనమునకంటె నెక్కుడుగా భోగమే వలయునని పట్టణమును విడువఁజూచునేని 'బ్రాహ్మణా! మొదటిదయినయీభోగవాంఛను మఱవవలయునని చెప్పవలయును. కౌంతేయా! ఇదిశాశ్వతమయినధర్మమని జనులుచెప్పెదరు. అయినను నేనుదీనిని నమ్ముటలేదు. బ్రాహ్మణుఁడు భోగములు వేఁడినను నవియు నొసంగి యతని నుపచరింప వలయును' అని మఱియొక యర్థము. 'ఆహు రేతజ్జనా బ్రహ్మన్నచైత చ్ఛ్రద్దధామ్యహమ్। నిమన్త్ర్యశ్చ భవే ద్భోగై రవృత్త్యాచ తదా చరేత్' అని మూలము. 'బ్రహ్మన్' అనుటకు 'రాజన్' అని పఠించి యీయర్థము కల్పించుట తెలియునది.

ప్రుచ్చు (అనఁగా జనసంఘమునకు శత్రువు) లగుదురు. అట్టివారిని వధించుకొఱకే బ్రహ్మదేవుఁడు క్షత్రియుల నీలోకమందు సృజించెను. కాఁబట్టి రాజా ! పగవారిని గెలువుము. ప్రజలను బాలింపుము. యాగములను యజింపుము. కురునందనా ! శూరుండవై యుద్ధమునఁ బోరాడుము. రక్షింపవలసినవారిని రక్షించునట్టి రాజే, రాజులందు త్తముఁడగురాజు. ఎవ్వరు వారిని రక్షింపరో యట్టిరాజు లుండియుఁ బనలేదు. తన ప్రజలకెల్ల మేలు గలుగుటకై రా జెప్పుడును * యుద్ధము చేయవలయును. దానినిబట్టియే మనుష్యుఁడు మనుష్యులనే యేలవలయును. సొంతవారివలననుండి పరులను, పరులనుండి సొంతవారలను, పరులవలననుండి పరులను, సొంతవారలనుండి సొంతవారలను, నెల్లవారిని నెప్పుడును గాచుచుఁ బరిపాలించుచుండుము. తొలుత రాజు తన్నెల్లవారివలన నుండియు రక్షించుకొనుచు భూమిని రక్షింపవలయును. విద్వాంసు లగు జను లన్నిటికిని మూలము తాను (అనఁగా రాజు) అని చెప్పుదురు. రాజు తనలో 'ఛిద్రము లేమియున్నవి? నాకేవ్యసనము లందుఁ దగులుగలదు? నాదుర్బలత్వమునకు మూలమేమి? దోషములకుఁ గారణమెద్ది?' యని యెప్పుడును జింతించుచుండవలయును. రాజు ముందటిదిన

---

* సదైవరాజ్ఞా యోద్ధవ్యం సర్వలోకా ద్వ్యధిష్ఠిత । తస్మాద్దేతోర్హి భుఞ్జీత మనుష్యానేవ మానవః । అని. దా. మూలము. 'యోద్ధవ్యమ్' అనుటకు 'బోద్ధవ్యమ్' అనియు 'భుఞ్జీత'కు 'యుఞ్జీత' యనియు. ఔ. మూలము. అప్పుడు 'తన ప్రజలకెల్ల మేలునకై రా జందఱచేష్టలును దలంపులును దెలిసికొనవలయును. అందులకై యతఁడు వేగులవారిని దక్కిన రహస్యభూతులగు మనుష్యులను నియోగింపవలయును' అని యర్థము. ఇదియె సరసముగానున్నది.

మున జరపినదానిని జనులు కొనియాడుచున్నారా లేదా యని తెలియుటకు సమర్థము గలవేగులవారిని రహస్యము గాఁ దనభూమియందుఁ గ్రుమ్మరునట్లు నియమింపవలయును. మఱియు నతఁడు తననడవడిని సాధారణముగాఁ బ్రజలు కొని యాడుటయుఁ గొనియాడమియును, బల్లెపట్లవారి కది రుచించు టయు రుచింపకుండుటయు, రాజ్యమునందుఁ దనకు మంచికీర్తి కలుగుటయు లేకుంటయు నరయుచుండవలయును. యుధిష్ఠిరా! ధర్మజ్ఞులును ధైర్యవంతులు నయినవారిలోపల యుద్ధమందెవరు వెన్నిచ్చి పాఱరో, రాజ్యమందెవరు పసిఁపరో, యెవరు నిన్ను గొలిచి బ్రతుకుచున్నారో, నీ కమాత్యులెవరో, మఱి తటస్థులుగ నుండువా రెవరో, నిన్నెవరు సర్వవిధములఁ బ్రశంసింతురో, లేక నిందింతురో, వారి కందఱకును గౌరవములు నీవు గావింపవల యును. ఏమనుష్యుఁడుఁగాని యందఱకును నొక్క తీరున నిష్టుఁడు గానుండుట శక్యముగాదు. సమస్తజనులకును మిత్రు లును శత్రులును మధ్యస్థులును గలరు' అనెను.

ధర్మరాజు 'సమాన భుజబలమును సమానము లగు గుణ ములును గలజనులయం దొక్కఁ డెట్లధికుఁడగుచున్నాఁడు? ఎట్లు మనుష్యులను నేలుచున్నాఁడు?' అని యడిగెను. అందు లకు భీష్ముఁడు 'జంగమములు స్థావరములను దినును (ఏలును). కోఱలుగలవి కోఱలులేనివానిని దినును (ఏలును). క్రూరవిషము లగు సర్పములును గుపితములై యల్పసత్త్వములగు సర్పములను దినును. (ఈతీరుననే మనుష్యులయందును బలీయుఁ డగురాజు తక్కినవారి నడంచి మించును.' రాజు తనప్రజలవలనను బరాకు పడకుండవలయును. పరాకుపడెనా గ్రద్దలవలె వారు పయిఁబడు

దురు. రాజా ! నీరాజ్యమందు వర్తకులు సరకులు కొంచె
ముగాఁ దీయువారును విస్తారముగఁ దీయువారును బరువయిన
పన్నులకు నలఁగి కలఁగి యడవులకుఁబోయి వసించియుండరు
గదా ? నీరాజ్యమందు సేద్యగాండ్రును బీడితులై దానిని దిగ
విడువకున్నారుగదా ? రాజుభారమును వహించువారే తక్కిన
వారిని సయితముభరించువారు సుమీ. ఆలస్యము ధర్మమునం
దొకపాతికభాగమును నపహరించును. మఱియొకపాతిక
భాగము పాపండునిఁ బొందియున్నది. మఱియొకపాతిక రాజును
బొందియున్నది. ఇంకొకపాతిక కృషి నాశ్రయించియున్నది.
రాజును బొంది యున్నయొకపాదమును దక్కిన మూఁడుపాద
ములుగూడి నాఁటినాటికిఁ దినుచున్నవి. కాఁబట్టి రాజా! ఇన్ని
పాట్లునుబడి నీపాతికభాగమును రక్షించుకొనుము. దేవతలును,
పితృగణములును, మనుష్యులును, ఉరగులును, రక్షస్సులును,
పక్షులును,పశువులును, నిందు నీ వొసంగుదానివలననే జీవించు
చున్నవి. ఇవియే రాజ్యమును పాలింపవలసిన సాధనములును
రాజులను రక్షింపవలసిన విధములును. వీనినే మఱలఁ జెప్పె
దను' అనెను. ఇది యెనుబదితొమ్మిదవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

(భీష్ముఁడు ధర్మరాజునకు * ఉచథ్యమాంధాతృ సంవాదమును జెప్పుట.)

భీష్ముఁడు - ఆంగిరసవంశ్యుఁడును బ్రహ్మవిత్తముఁడును నయి

---

* దాక్షిణాత్యకోశములందు 'ఉచథ్యుఁ' డనియును, ఔత్తరాహకోశము

యుచథ్యుఁడు మున్ను యువనాశ్వునికొడు కయిన మాంధాతకుఁ బ్రీతిగడలుకొన క్షత్త్రధర్మముల నుపన్యసించెను. బ్రహ్మవిదులందు మిన్నయగునతఁ డారాజునకు నుపదేశించినవిధముననే దానినంతయు నీకుఁజెప్పెదను.

ఉచథ్యుఁడు, 'మాంధాతా! రాజు ధర్మమునకై యున్నాఁడు గాని తనయిచ్ఛలను జేయుటకై కాదు. లోకమును రక్షించు వాఁడు రాజని యెఱుంగుము. రాజు, ధర్మము నాచరించు నేని దేవత్వమునకు నర్హుఁడగును. అతఁ డధర్మము గావించు నేని నరకమునకే పోవును. సకలభూతములు నాధర్మమునందు నెలకొనియున్నవి. ఆధర్మము రాజునందు నెలకొని యున్నది. దానిని జక్కఁగాఁ బాలింపఁగోరురాజే సంపదను బొందును. *మాంధాతా! రాజుచేయు నపరాధమునుబట్టి 'సంపదగలవాఁడు పాపాత్ముఁ'డను మాటకలుగుచున్నది. దేవతలును నిందనుబొందెదరు. ధర్మము లేదనియుఁ జెప్పంబడును. అధర్మమందుఁ బ్రవర్తించువారికిని నర్థములు సిద్ధించుట చూపట్టును. లోకమంతయు నదియే మంగళమని దాని ననువర్తించుచున్నది. పాప మెప్పుడు వారింపఁబడదో యప్పుడు ధర్మవృత్తము వెకల్పఁబడుచున్నది. అధర్మమును బెచ్చు పెరుఁగుచున్నది. రేయుంబవలు భయ మనుచుందురు. నాయనా! పాపమును వారింపనియెడ ధర్మము

లందు 'ఉతథ్యుఁ'డనియును బాఠములున్నవి. ఇట దాక్షిణాత్యకోశానుసారముగా 'ఉచథ్యుఁ' డనియే గైకొనఁబడినది.

* 'రాజాపరాధాన్మాంధాతర్లక్ష్మీవాన్ పాప ఉచ్యతే' అని దా. మూ. 'రాజా పరమధర్మాత్మా లక్ష్మీవాన్ ధర్మ ఉచ్యతే' అని ఔ. మూలము. రాజు పరమధర్మాత్ముఁడును సంపన్నుఁడు నయినచో నతఁడే ధర్మము స్వరూపమనఁబడునని యర్థము.

చెప్పిన 'ఇది నాది; ఇది నాది గాదు' అని సాధువుల యేర్పాటు కలుగదు. పాపము బలీయముగా నున్నపుడు మనుష్యులకు భార్యయుఁ బశువులును బాలమును గృహమును గలుగనేరవు. పాపమును వారింపనియెడ దేవతలు పూజల నెఱుంగలేరు; పితరులు శ్రాద్ధములఁ దెలియఁజాలరు. అతిథులు పూజల నందఁగలుగదు. పాపము వారింపనపుడు బ్రాహ్మణులు వ్రతము లూఁది వేదముల నధిగమింపరు; యాగములు గావింపరు. మహారాజా! పాపమును వారింపనపుడు మనుష్యుల మనసులు వధ్యులయిన ప్రాణులమనంబులుం బోలెఁ గలగుండుపడుచుండును. కాఁబట్టి మును లుభయలోకములను నుద్దేశించి 'వీఁడందఱు ప్రాణులయందును గొప్పవాఁడై ధర్మస్వరూపుఁడై యుండుఁగాక' యని రాజును గారవించిరి. ఎవనియందు ధర్మము వెలుంగునో వానిని రాజుగాఁ జెప్పుదురు. ఎవనియందు ధర్మము నశించుచున్నదో వానిని దేవతలు వృషలునిఁగాఁ జెప్పుదురు. మహనీయమగు ధర్మమునకు 'వృష' మనియుఁ బేరుగలదు. దానికి 'లయ'ము (నాశము) కావించువాఁడు వృషలుఁ డనఁబడును. కాఁబట్టి ధర్మమునకు లోపముగలిగింపరాదు. ధర్మము వర్ధిల్లఁగా సకలప్రాణులును నెప్పుడును వర్ధిలుచుండును. అది నశింపఁగా నన్నియు నశించుచున్నవి. కాఁబట్టి ధర్మము నెప్పుడును బెంచుచుండవలయును. ధనములను బెంచుటవలననో లేక (లోకములను) ధరించుటవలననో ధర్మమని చెప్పఁబడుట నిశ్చయము. రాజా! అధర్మము మనుష్యులకు * (నరకము) నెల్లను నంతము నొందించునదిగాఁ

* 'మానవానాం మనుష్యేన్ద్ర స సీమా న్తకరః స్మృతః' అనిమూలము. అది మనుష్యుల దుష్టకృత్యములనెల్ల సాఁగనీయనిది. (ప్రతాప).

జెప్పఁబడుచున్నది. (అనఁగా ధర్మముగల వఱకు స్వర్గము. లేని చో నరకమని చెప్పఁబడుచున్నది.) బ్రహ్మ ప్రాణుల పెంపునకుఁ గాను ధర్మమును సృజించెను. కాన ప్రజల ననుగ్రహించు నిమిత్తమై ధర్మమును మిక్కిలియు వృద్ధినొందింపవలయును. రాజశార్దూలా ! కాఁబట్టియే ధర్మము మిక్కిలి శ్రేష్ఠమయి నదిగాఁ జెప్పఁబడుచున్నది. ఎవఁడు మంచికార్యముల నాచరించుచుఁ బ్రజలను బరిపాలించునో వాఁడే రాజు. కామక్రోధముల నెంతమాత్రమును బాలింపక ధర్మమునే పరిపాలింపవలయును. రాజులకు ధర్మమే శ్రేయస్కరము లయినవానిలో నెల్ల మిన్నయైనది. ధర్మమునకుఁ బుట్టుచోటు బ్రాహ్మణుఁడు; కాఁబట్టి, వారల నెప్పుడును బూజించుచుండవలయును. మాంధాతా! బ్రాహ్మణులు కోరినకోర్కులను నసూయలేక చేయవలయును. వారలు కోరినది చేయకపోవుటవలన రాజులకు భయ ముప్పతిలుచున్నది; మఱియు మిత్రులును వృద్ధినొందక పోవుటయే కాక శత్రువులు నగుదురు. విరోచనుని పుత్త్రుఁ డయిన బలి బాల్యము మొదలుగా నెప్పుడును బ్రాహ్మణులయం దసూయగలిగియుండెను. పిదప నతనియందుఁ గల (ప్రతాప)లక్ష్మి యెంతయుఁ గుపితయై యతనినుండి తొలఁగిపోయినది. అట్లు తొలఁగి యది యింద్రునికడకుఁ బోయినది. అంత నాబలి యింద్రునియందున్న లక్ష్మిని జూచి మిక్కిలియు మనంబున ననుతాపపడెను. అసూయకును నభిమానమునకును ఫల మిదియే. కాఁబట్టి ప్రతాపసంపన్న యగులక్ష్మి నిన్ను దిగవిడువకుండునట్లు తెలియుము. అహంకారము లక్ష్మికి నధర్మమువలనఁ గలిగిన పుత్త్రుఁడని శ్రుతి ప్రతిపాదించుచున్నది. రాజా ! ఆయహంకారము

వలనఁ బెక్కండ్రు దేవతలు నసురులును నాశము నొందింపఁ బడిరి. అట్లే పెక్కండ్రు రాజర్షులును నాశమునొంది రని యెఱుంగుము. అయ్యహంకారమును జయించినవాఁడు రాజగును. దానిచే జయింపఁబడినవాఁడు దాసుఁ డగును. మాంధాతా! చిరకాలము తిరముగా నుండఁ గోరుదువేని యహంకారముతోఁ గూడిన యధర్మము ననుసరించి పోకుండునట్లు మెలంగుము. మదముగలవాఁడును బరాకుగలవాఁడును దెలివి లేని పసివాఁడును బిచ్చివాఁడును విశేషించి నిందితుఁడైనవాఁడును దురాచారము గలవాఁడును శత్రులను సేవించువాఁడును, నిగ్రహింపఁబడినయమాత్యుఁడును,విశేషించి స్త్రీలును,బర్వతమును,విషమమయినదుర్గము, నేనుఁగును, గుఱ్ఱమును, సర్పమున నెడి వీనితోడ నెప్పుడును జేరిక లేకుండవలయును. రాత్రులయందుఁ ద్రిమ్మరఁగూడదు మిక్కిలి పేరాసయు నభిమానమును డంభమునుఁగ్రోధమును దిగవిడువవలయును. తెలియని స్త్రీలతోడను, పెడిపడఁతులతోడను,అంకుటాండ్రతోడను,బరులయిల్లాండ్రతోడను, బెండ్లాడని కన్యలతోడను సంభోగముగూడదు. రా,జెప్పుడుపాపమును వారింపక పాపులుమాలిక గలిగియుండునో యపుడు వర్ణముల సంకరము గలుగును. దాని వలనఁ బాపులగు రాక్షసులును, నపుంసకులును, నంగహీనులును, మూఁగలును, మూఢులును, మఱియుఁ దక్కినవారును బుట్టుదురు. కాఁబట్టి రాజు విశేషించి ప్రజలహితమందు వర్తింప వలయును. రాజు పరాకు గలిగి యుండెనా ప్రబలదోషము కలుగును. ప్రజలకు వర్ణసంకరము కలిగించునట్టి యధర్మములు మిక్కిలి పెరుఁగును. చలిలేని కాలమందుఁ జలి కలుగును. చలి వలసిన సమయమందుఁ జలికలుగదు. అనావృష్టియు, అతివృ

ష్టియు, నొప్పులును, బ్రజలను బీడించును. ఇట్టి కాలములందు (ధూమకేతువు మొదలయిన) నక్షత్రములును గూరగ్రహము లును దోఁచును. రాజు నాశమునకుఁ గారణములయిన యుత్పా తములు పెక్కులిందుఁ గనుపట్టును. ఏ రాజు తన్నును రక్షించు కొనక ప్రజలను రక్షింపక పోవునో యతని ప్రజలు నాశమునొం దుదురు. పిదప నతఁడును నాశమునొందును. ఒకనిధనమును నిరువురును, నిరువురధనమును దక్కిన పెక్కండ్రును గొట్టి దోఁ చుకొందురు. కొమిరెపడఁతులను జెఱుపుదురు. అది రాజు దోషమువలనఁ గలిగినదని చెప్పుదురు. రాజు, ధర్మమును దిగ విడిచి పరాకునఁ బ్రవర్తించినపుడు మనుష్యులయందు 'ఇది నాది' యని వస్తువుల సొంత మడుగంటుచున్నది' ఇది తొంబది యవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

### ఉచథ్య మాంధాతృ సంవాదము.

'పర్జన్యుఁడు కాలమందువర్షించునేనియు రాజు ధర్మము నాచ రించునేనియు, మిక్కిలి సంపత్తి పెంపుగలిగి, ప్రజలను సుఖం బునందు నోలాడఁబోషించుచుండును.వస్త్రములందున్నముఱికిని, దాని చాయను బోఁగొట్టకయే తీయనేరని చాఁకలివాఁడు చాఁ కలివాఁడేకాఁడు. బ్రాహ్మణశ్రేష్ఠులయందును క్షత్రియులందును వైశ్యులందును నాలుగవవారగు శూద్రులందును నెవఁడొకఁడు తనతనధర్మములను దిగవిడిచి తాఱుమాఱుగ నానాకర్మము లందు వర్తించుచుండునో వాఁడు నాచాఁకలివంటి వాఁడేఁ

యగును. శూద్రునకు నూడిగమును వైశ్యునకుఁ గృషియు, క్షత్రియునకు దండనీతియు, బ్రాహ్మణులకు బ్రహ్మచర్యమును, తపమును మంత్రములును సత్యమును ధర్మమగును. ఏక్షత్రియుఁడు, పాత్రములకు శుద్ధిచేయునట్లు, వారల శీలమందుఁ గలదోషములను బోఁగొట్ట నేర్చునో, యట్టిరాజు జనులకుఁ బతియుఁ దండ్రియు నగును. కృత, త్రేత, ద్వాపర, కలి యనెడి యివియన్నియు రాజు నడవడులే. రాజే యుగమని చెప్పఁబడుచున్నాఁడు. రాజు ప్రమాదము నొందునపుడు నాలుగువర్ణములును, నట్లే వేదములును, నాలుగాశ్రమములును నన్నియును విశేషించి మోహమునొందును. రాజు పరాకు పడియున్న యెడల మూఁడగ్నులును మూఁడువేదములును దక్షిణలతోఁడి యాగములును నన్నియుఁ దెలియఁబడకపోవును. రాజు ప్రాణులకుఁగర్త. రాజే ప్రాణులకు నాశకుఁడు. ధర్మాత్ముఁడగువాఁడు కర్తయు, నధర్మాత్ముఁడు నాశకుఁడు నగుదురు. రాజు ప్రమాదముగలవాఁడగు నేని రాజు భార్యలును బుత్త్రులును బంధువులును సుహృదులును నందఱునుగూడి శోకము నొందుదురు. రాజధర్మవర్తనముగలిగియుండెనేని, యేనుఁగులును, గుఱ్ఱములును, బశువులును, లొట్టియలును గంచరగాడిదలును, గాడిదలును, దక్కిన సకలప్రాణులును దుఃఖమునొందును. మాంధాతా! బలము దుర్బలులను రక్షించుటకై బ్రహ్మదేవునిచే సృజింపఁబడినదని చెప్పఁబడుచున్నది. బలములేనిదే మిక్కిలియుఁ

---

* ఏవమే తద్ద్విజేంద్రాణాం క్షత్రియాణాం విశాంతథా, శూద్రశ్చతుర్థో వర్ణానాం నానాకర్మస్వవస్థితః' అని మూలము. ఆమూఁడువర్ణములందు నెవఁడు తన ధర్మములనువిడిచి నానాకర్మములు చేయునో వాఁడు శూద్రుఁడగును. (ప్రతాప)

పెద్ద. అందులకై యన్నియు నెలకొనియున్నవి. రాజా! రా, జ: ధర్మమునందు వర్తించునేని, యేప్రాణిని బోషించువాఁడును నాపోషకుని కులమం దుదయించినవారును నందఱును శోకము నొందుదురు. బలములేనివాఁడు, ముని, సర్పము, ననెడివీని కను దృష్టిని సహించుట మిగులఁగటువు. బలము లేనివానిపొంతకుఁ బోకుము. బలము లేనివారి నెప్పుడుగాని యవమానింపరాదని తలంపుము. దుర్బలులకన్నులు నిన్ను బంధుసహితముగా దహింపకుండుఁ గాత. దుర్బలులచే దగ్ధుఁడయిన వాని కుల మందు నొకటియు మొలవదు. వారు వేగుతోడఁ గాల్చివైతురు. దుర్బలులదగ్గఱకుఁ బోకుమా. బలమునకంటె బలములేమి మిక్కిలియుఁ బెద్దది. అది యధికబలముగల బలము. దుర్బలులచేఁ గాల్పఁబడిన బలమునం దించుకయు మిగులదు. అవమానింపఁబడిన వాఁడును, కొట్టఁబడినవాఁడును,కస్తిపెట్టఁబడిన వాఁడును, గాచువానిని బొందక పోయినయెడ నాదేశమందలిరాజును దైవకృత మయినదండము చంపును. నాయనా! బలమందున్న నీవు బలములేని జనులవలనఁ గప్పము దీయఁ గోరకుము. అగ్ని దాపటివానిని గాల్చునట్లు, దుర్బలులకన్నులు నిన్నుఁ గాల్పకుండుఁగాక. లేని యపరాధము మోపఁబడినవా రేడువఁగాఁ గ్రిందఁబడు వారి కన్నీటిబొట్లు, లేని యపరాధమును వారియందు మోపినట్టివారిపుత్రులను బశువులను జంపును. తనయం దది ఫలింపక పోయినచోఁ దనపుత్రులయందును, లేనిచో, పౌత్రుల యందును, వారల పుత్రులయందును నది ఫలించును. చేసిన పాపకర్మము పశువుంబోలెఁ దోడనే ఫలముచూపదు. ఒకదేశ మందు దుర్బలుఁ డయినవాఁడు కొట్టుపడి కాచు దిక్కునొందక

పోవునేని, యాదేశమందు దైవకృతమును గ్రూరమునయిన పెనుదండము సంభవించును. దేశమందుఁ గలవారు యుక్తిగల వారై బ్రాహ్మణులవలె సన్న్యాసివేషములతో మాటిమాటికి భిక్ష యెత్తునపుడు వారు రాజును జంపువారగుదురు. రాజుదేశమందు రాజును సంబంధించిన పెక్కండ్రు పురుషు లెప్పుడు నీతిమాలి నడచుకొందురో యప్పుడది రాజునకుఁ గొప్పపాపమగును. రాజు నధికారులు జనులు దీనులయి బతిమాలుకొనుచున్నను వాటింపక కామమువలనఁగాని, ధనమునకు లోనయి కాని, యుక్తితోడ ధనములను దీయుదురేని యది రాజునకుఁ బెద్దకీడగును. గొప్పమ్రాను, మొదటఁబుట్టి యంతటఁ బెద్దదిగాఁ బెరుఁగుచున్నది. దానిని బెక్కులు ప్రాణులువచ్చి యాశ్రయించుచున్నవి. అయినను దానిని నఱికి కాల్చివైచినపుడు దాని నాశ్రయించియున్నవానికి నునికిపట్టు లేకపోవుచున్నవి. ఒక రాజ్యమందలి ప్రజలు ముఖ్యము లయినధర్మముల నాచరించుచు దేశ సంస్కారములనో రాజు గుణములనో గొనియాడుచు నుందురేని యారాజు వృద్ధినొందును. పాపమును దొలఁగును. ఇట్లు గాక యందలి ప్రజలు ధర్మమును దెలియక యధర్మము నాచరింతురేని పుణ్యము వేగ తొలఁగిపోవును; పాపమును వచ్చును. పాపు లెందు బాహాటముగాఁ (దప్పులకును దగిన దండనము లేక) గ్రుమ్మఱుదురో యాదేశములందలి రాజులనును బరిపాలకులనును గలి పొందును. ఏదేశమందు రాజు తనశక్తిచే జనులనడఁచి పాలింపఁడో యాదేశము వృద్ధినొందదు. ఏరాజు తగురీతిని నమాత్యులను సమ్మానించి మంత్రాలోచనమందును యుద్ధమందును నుపయోగించునో యతనిరాజ్యము వృద్ధినొందును. అతఁడును,

భూమి నంతయును జిరకాల మనుభవించును. మంచికార్యములను, మంచివచనములను గనుఁగొని యెంతయు గారవించునట్టిరా జుత్తమమయిన ధర్మమునొందును. పంచికుడుచుటయు, పరుల నవమానింప కుండుటయు, గర్వించియున్న బలవంతునిఁ గొట్టుటయు, రాజునకు ధర్మ మని చెప్పఁబడుచున్నవి. వాక్కుచేతను శరీరముచేతను మనస్సుచేతను నన్నిఁటిని రక్షించుటయు, నిందులకు విరోధియగు నేని పుత్త్రుఁనయినను సహింపకుండుటయు, రాజునకు ధర్మమని చెప్పఁబడును. రా జెప్పుడు బలములేని మనుష్యులకు దానమొసంగి భుజించునో యపుడు వారు బలవంతులగుదురు. అదిరాజునకు ధర్మమని చెప్పఁబడును. రాజ్యములను రక్షించుటయు, దొంగలఁ దఱుమఁ గొట్టుటయు, యుద్ధమందు జయించుటయు, రాజధర్మ మని చెప్పఁబడును. కార్యములచేతను మాటలచేతను బ్రియుఁడుగా నుండి నను బాప మాచరించు నట్టివానిని నోర్వకుండుట రాజునకు ధర్మమని చెప్పఁబడును. కన్న పుత్త్రులవలె వర్తకులను రక్షించుటయు, మర్యాదను భేదింపకుండుటయు రాజునకు ధర్మమని చెప్పఁబడును. కామద్వేషములను గయికొనక, శ్రద్ధగలిగి, యాప్తదక్షిణలతోడ యాగములు చేయుట రాజునకు ధర్మమని చెప్పఁబడును. పేదవారలయు దిక్కుమాలినవారలయు వృద్ధులయుఁ గన్నీటిని దుడుచుటయు, మనుష్యులకు సంతసముగలిగించుటయు రాజునకు ధర్మమని చెప్పఁబడును. మిత్త్రులను వృద్ధినొందించుటయు, నల్లె శత్త్రువులను డిందుపడ నీడ్చుటయు, సాధువులను లెస్సఁగాఁ బూజించుటయును రాజధర్మమని చెప్పఁబడును. సత్యమును రక్షించుటయుఁ, బ్రేమతోడ భూమి

దానములు సేయుటయు, నతిథులను బూజించుటయు, భృత్యుల నాదరించుటయు రాజుధర్మమని చెప్పఁబడును. నిగ్రహానుగ్రహములు రెండును నెవనియందు నెలకొని యుండునో యారాజిహమందును బరమందును ఫలమునొందును. మాంధాతా! రాజు యముఁడే యగును. అతఁడు ధార్మికులకెల్లఁ బరమేశ్వరుఁడు.* ప్రాణులనడంచువాఁడు యమునివలె నగును; అడంపనివాఁడగ్నికి సాటియగును. ఋత్విజునిని, పురోహితునిని, ఆచార్యునిని, నవమానింపక, సత్కరించి రాఁబట్టుకొనుట రాజునకు ధర్మమగును. యముఁడు సకలములయిన ప్రాణులను, భేదము లేక యడంచుచున్నాఁడు. అట్లె రాజును నడంపవలయును. రాజు సర్వవిధముల నింద్రునితోడఁ బోల్పఁబడుచున్నాఁడు. ఎవఁడు దేనిని ధర్మముగాఁ దలఁచుచుఁ గనుఁగొనుచున్నాఁడో యది ధర్మము. నీవు పరాకువడక యోర్పును, బుద్ధియును, ధైర్యమును † దెలివియుఁ గలుచుకొనుము. సమస్తజనుల బలమును దుర్బలమును గలరూపునఁ దెలియఁగోరుము. మంచిసెబ్బరలను వివేచింప నేర్చుకొనుము. సమస్తప్రాణులయెడఁ గలుపుఁగోలుతనముగలిగి, దానములుచేయుచుఁ దియ్యనిపలుకు లాడవలయును. పురజనులను దేశజనులను కన్నబిడ్డలవలెఁ రక్షింపవలయును. సమర్థుఁడుగాని రాజు ప్రజలను నొకప్పుడును రక్షింప

---

* 'సంయచ్ఛన్ యమవత్పార్థ న సంయచ్ఛంస్తు పావకః' అని మూలము. ఇంద్రియముల నడంచుటవలన గొప్ప పెంపునొందును. అడంపమివలనఁ బాపమునొందును. ఇందులకు 'సంయచ్ఛన్ భవతి (వృద్ధిం ప్రాప్నోతి) ప్రాణాన సంయచ్ఛంస్తు పాతకః' అని శో. మూలమును దదర్థమును దెలియునది.

† 'మతిమ్' అని దా. మూ. 'రతిమ్' అని శో. మూలము.

శక్తుఁడు గానేరఁడు. రాజ్యమనెడి భారము మోయుట మిక్కిలియు నెక్కువయైనది. ప్రాజ్ఞుండును శూరుఁడును దండశాస్త్రవిదుండు నగు రాజొక్కఁడే దానిని రక్షింపఁజాలును. చుఱుకుఁదనమును బుద్ధియును లేక దండశాస్త్రము నెఱుంగకయు నుండునట్టిరాజు రాజ్యభారమును వహింప నెంతమాత్రము దగఁడు. మంచి చక్కఁదనము గలిగి, గొప్పకులమునఁ బుట్టినవారును, సమర్థులును, దనయందు భక్తిగలవారును, మిక్కిలి చదువరులును నగు మంత్రులతోఁగూడి, మనుష్యుల మనసులను, నాశ్రమములం దున్న తాపసులగు వారి తలంపులను గార్యములను సయితము స్వబుద్ధిచేఁ బరిశీలించు చుండవలయును. ఇట్లు నడచుకొనుటవలన సమస్తవర్ణములవారి ధర్మములను దెలియఁ శక్తుఁడ వగుదువు. నీవు స్వదేశమందుండినను బరదేశమందుండినను, నీధర్మములను నాచరించుట కిది తోడ్పడును. ధర్మార్థకామములు మూఁటియందును ధర్మమే యుత్కృష్టమైనది. ఈలోకమందును బరలోకమందును ధర్మాత్ముఁడే సుఖంబున వర్ధిలుచున్నాఁడు మనుష్యులను నీవు చక్కఁగాఁ బూజించితివేని వారా పూజనమునుబట్టి నీకొఱకై తమభార్యలను బుత్రులనును దిగవిడుతురు. సజ్జనులను జేరఁబెట్టుకొనుట, జనుల మంచిగా నాదరించుట, దానము, తియ్యనిపలుకులు, ప్రమాదము లేకుండుట, శౌచము, ననెడి యివి రాజున కెంతయు సంపద గలిగించును. మాంధాతా! ఈగుణములవలన నెప్పుడును బరాకుపడకుము. రాజేమఱుపాటు లేక తనఛిద్రములను బరుల ఛిద్రములను బాటించుచుండవలయును. తనఛిద్రమును బరులకుఁ దెలియనీయరాదు. పరులయందు ఛిద్రమునుజూచి పైఁబడవలయును. ఈవిధమున నే

యింద్రుడును, యముడును, వరుణుడును వర్తించిరి. రాజర్షులెల్లవారును నడచుకొన్న విధము ననుష్ఠింపుము. పురుషసత్తమా! దివ్యంబగు మార్గమును శీఘ్రముగఁ గయికొనుము. ధర్మమందు వర్తించినరాజును నిహామందును బరమందును దేవతలును ఋషులును గంధర్వులును నెంతయుఁ దేజంబు దొలంకునట్లు కీర్తింతురు' అనెను.

ఉచథ్యుఁ డిట్లు చెప్పఁగా మాంధాత శంక లేక యట్లు చేయుచువచ్చెను. తానొక్కండును భూమిని బడసెను రాజా! మాంధాతవలె నీవు నట్లే చక్కఁగా ధర్మము నాచరించి భూమిని బరిపాలింపుము. స్వర్గమునందు స్థానము నొందుదువు' అనెను. ఇది తొంబదియొకఁడవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

### వామదేవ సుమనస్సంవాదము.

ధర్మరాజు 'పితామహా! రాజధర్మమునందే ప్రవర్తింపఁ గోరు వాఁ డెట్లు నడచుకొనవలయును? నిన్నడిగెదను. నాకది చెప్పుము' అనెను.

భీష్ముఁడు 'ఈ విషయమందును సమస్తార్థముల స్వరూపమును గనుఁగొన్న బుద్ధిమంతుఁ డగు వామదేవుఁడు పాడిన పురాతనమయినయీ యితిహాసము నుదాహరించెదరు. వసుమనుండను రాజుండెను. అతఁడు కోసలదేశమునకు రాజు; బలవంతుఁడును బరిశుద్ధుఁడును, అతఁడు తపస్సంపన్నుం డగు వామదేవమహర్షి ని జూచి 'మహాత్మా! నేనెట్టి నడవడిగలిగియుండినచో

స్వధర్మమునుండి జాఱకుండునో ధర్మార్థయుక్తంబులగు వచనం బుల నాకు నుపదేశింపుము ' అని యడిగెను. అందుల కాతపస్వి వామదేవుఁడు బంగరుచాయఁ దుఱంగలించుచు నహుషకుమారుండయిన యయాతివలె సుఖాసీనుం డయి యున్నయారాజుతో నిట్లనియె.

వామదేవుఁడు:— 'ధర్మమునే యనువర్తించు చుండుము. ధర్మమునకంటె నెక్కుడయినది మఱొక్కటి లేదు. రాజులు, ధర్మమునందుఁ దప్పక నెలకొన్నట్టివారే యీభూమిని జయించుచున్నారు. ఏరాజు ధనసిద్ధికంటెను ధర్మమునే యెక్కుడుగాఁ దలఁచి దానిని వృద్ధినొందించుటయందు బుద్ధినుంచునో యతఁడు ధర్మముచేఁ బ్రకాశించుచున్నాఁడు. ఏరాజు ధర్మమును బాటింపక బలాత్కారముతో మాత్రము ప్రవర్తించునో వానివలన నుండి ధర్మమును నర్థమును రెండును వేగ తొలఁగిపోవును. దుష్టుఁడును శాపాత్ముఁడు నగుమంత్రి చెప్పినచొప్పున వర్తించురాజు ధర్మమును నాశముసేయును గాన, యట్టివాఁడు లోకులకు నపరిహారముగా వధ్యుఁడగును; వాఁడు శీఘ్రముగానే నాశము నొందును. రాజకార్యములను జక్కఁగా ననుష్ఠింపలేనివాఁడును, విచ్చలవిడి వర్తించువాఁడును, దన్నుఁ దాను బొగడికొను వాఁడును నగు రాజు సమస్తభూమిని బడసినను శీఘ్రముగానే నశించును. శుభమును బడయఁగోరువాఁడై, యసూయలేక, జితేంద్రియుఁడై మతిమంతుఁడగురాజు నదీ ప్రవాహములవలన సముద్రముఁ బోలె వృద్ధినొందును. రాజా ! ధర్మమునందుఁ గాని, కామమందుఁగాని, అర్థమందుఁగాని, బుద్ధియందుఁగాని,

* మిత్రులందుఁగాని పూర్తినొందినట్లు తలంపరాదు. లనగాఁ వీని యన్నిటియందే లోకయాత్ర నెలకొనియున్నది. ఈ యుపదేశములను వినుటవలన రాజు, యశమును గీర్తిని సంపదను బ్రజలను బడయుచున్నాఁడు. ధర్మమునందుఁ బూనికగలిగి, ధర్మమును నర్థమునుబడయుటకై జింతించుచు, నొక్కొక కార్యమును జక్కఁగా వానిఫలాదుల నాలోచించిన పిదపఁ జేయ నారంభించునట్టిరాజు మిక్కిలియు సంపదను బొందును. ఈవి లేనివాఁడును, జెలిమి లేనివాఁడును, బ్రజలను దండనీతిచొప్పున మెలపనివాఁడును, సాహసప్రకృతియు నగు రాజు శీఘ్రముగా నశించును. బుద్ధిలేనివాఁడు తాను జేసినపాపమును బుద్ధిచేతఁ గనుఁగొనఁజాలఁడు. అట్టివాఁ డపకీర్తినొంది మరలనరకముఁ బొందును. † రాజయ్యెవారిని దగురీతిని సమ్మానించుచు, దానము లొసంగుచుఁ, దయ్యానిమాటలపస నెఱింగి పలుకుచు నుండునేని యతనికిఁ గలుగువ్యసనములను బ్రజలు తమకుఁ గలిగినవానింబోలె బోకార్ప నుంకించుచుందురు. ఎవనికి ధర్మములను దెలుపునట్టి గురుండు గలుగఁడో, యెవఁడు తక్కినవారినడుగఁడో, యెవఁడుధనములను గసుగందక యె హాయిగాసంపాదింప నెంచునో, వాఁడు చిరకాలము సుఖమునొందఁడు. ధర్మములందు గురువును ముఖ్యునిఁగాఁగొని నడచువాఁడును, తనంతటఁ జక్కఁ గార్యములు

---

* 'మిత్రతః' అని. ఔ. మూలము. 'మంత్రతః' అని దాక్షిణాత్య మూలము తెలియునది.

† 'అథ మానయితుర్దాతుః (దాతుః) శ్లక్ష్ణస్య రసవేదినః। వ్యసనం స్వామివోత్పన్నం విజిఘాంసంతి మానవాః' అని. ఔ. మూలము. 'తతోనయాచితుర్దాతుః శుక్లస్యరసవేదినః—వశవర్తినః' అని. దా. మూలములందలి పాఠము

చూచుకొనువాఁడును, లాభములను ధర్మమే ప్రధానముగా నుంచుకొని (అనఁగా నెంతమాత్రము ధర్మమును దప్పక) పొందువాఁడును, చిరకాలము సుఖ మనుభవించుచుండును.' ఇది తొంబది రెండవయధ్యాయము.



## రాజధర్మపర్వము

### వామదేవ సుమనస్సంవాదము.

వామదేవుఁడు 'బలవంతుఁడగురాజు దుర్బలుఁ డగు వానియం దధర్మముగా నడచుకొనునపుడు, వానివంశపువారును, నట్టి నడవడినే యనుసరింతురు. తక్కినవారును నట్లె పాపమును బ్రవర్తింపఁ జేయుచున్న యారాజు ననువర్తింతురు. అవినీతుఁ డయిన యట్టిమనుష్యుని ననువర్తించుట రాజ్యమునకు శీఘ్రముగా నాశముగలిగించును. రాజు తనయుచితధర్మముల ననుష్ఠించుచుండునేని యతనినడవడిని సామాన్యముగా మనుష్యులందఱు నిదర్శకముగాఁగొని యనువర్తింతురు. రాజు ధర్మములనుండి జాఱి వర్తించినచో నతని సొంతజనులుగూడ దానిని సైఁపరు. శాస్త్రవిధులను బాటింపక సాహసప్రకృతిగలిగి మిట్టిపడి యుంచుక బాధకలిగించినను శీఘ్రముగనే నాశము నొందును. ఏక్షత్రియుఁడు జయించినట్టియు నపజితులయినట్టియు సద్వర్తనము గలట్టియు క్షత్రియు లాచరించుచు వచ్చిననడవడి ననువర్తింపఁడో వాఁడు క్షత్రధర్మమునుండి తొలఁగినవాఁ డగును. ముందుఁ దనకు మంచి చేసియున్న యొకశత్రురాజును యుద్ధమునఁబట్టుకొని, రాజట్టివానిని ద్వేషమునే యూని సమ్మానింపని

యొడల నతఁడు క్షత్రధర్మమునుండి తొలఁగును. రాజు తనశక్తి నెఱుపవలయును; మిక్కిలి సుఖముగా నుబుసుపుచ్చ వలయును; ఆపదలంగుం దుద్ధరింపవలయును. అట్టివాఁడు సమస్త జనులకును బ్రియుండగును. ఐశ్వర్యమునుండియు భ్రంశమునొందఁడు. నీవొక నికి నప్రియ మాచరించితివేని మరల సమయము వచ్చినపుడు వానికిఁ బ్రియమాచరింపవలయును. ఎవఁడు ప్రీతిలేని వానికిఁ బ్రియముగావించునో వాఁడు వానికిఁ ద్వరితముగాఁ బ్రియుఁడగు ను. అబద్ధ మాడరాదు. వేఁడకయే ప్రియము గావింపవలయును. కామమువలనను గ్రోధమువలనను ద్వేషమువలనను ధర్మమును దిగవిడువరాదు. తెలివిగలవాఁడు వంచనలేక వర్తింపవలయును. సత్యము, దమము, ధర్మము, శీలమును, బ్రజలకు హితమయిన క్షత్రధర్మములు. కాన వీనిని విడువరాదు. ప్రశ్నము లడుగునపుడు బదులు చెప్పుటకు లజ్జపడరాదు. అవమానకరములయిన మాట లాడఁగూడదు. తొందరపాటును నసూయయు లేకుండవల యును. అట్లుండినచోఁ బరుఁడు తనకు వశగతుఁడగును. ప్రియుని యం దతిమాత్రము హర్షము నొందరాదు. అప్రియునియందుఁ దుందుడుకు పడరాదు. ప్రజలహితమును దలపోసి వారలకై ధనములు వెచ్చింపవలసిన సంకటములు కలిగినపుడు తపింప రాదు. ఏరాజు మంచిగుణములచేత నెప్పుడును బ్రియము గావించుచుండునో, యతఁడు చేయుకార్యములన్నియు సిద్ధి నొందును. అతనిని సంపదయు వీడదు. అధిపతికిఁ బ్రతికూలము లయిన వాని నెంతయువదలి యతనికిఁ బ్రియములయిన వానినే కావించుచు నతనిభక్తి గలిగియుండునట్టి పురుషుని రా జెంతయు నాదరింపవలయును. ఇది సజ్జనులనడవడి. ఇంద్రియములను విచ్చల

విడిని విడువక గెలిచి, తన్నెంతయు ననుసరించుచు శుచియై శక్తుఁడై యనురక్తుఁడునై యుండుమనుజుని రాజు గొప్పకార్యములందు నియోగింపవలయును. శ్రేయస్సునకు లక్షణమయిన పరాక్రమ మెవనియందుఁ గనుపట్టునో ఎవఁడు కీర్తిముఖ్యముగాఁ గలవాఁడో, ప్రతిజ్ఞ నెవఁడు తప్పఁడో, సమర్థుల నెవఁడుపూజించుచు వారిని మచ్చరికింపకుండునో యట్టివానిని,ఇట్టిగుణములు గలిగి రాజును రంజించుచు భర్తకార్యములందుఁ బరాకుపడక వర్తించుచుండు నట్టిపురుషుని, ధనకార్యములందు నియోగింపవలయును. మూఢుఁడును, నింద్రియలోలుఁడును, లుబ్ధుఁడును, అధాజ్యం బగు నడవడిగలవాఁడును, గూఢవిప్రియుఁడును. బరీక్షయందుఁ దేఱనివాఁడును, హింసాశీలుఁడును,దుర్బుద్ధియుఁ,జదువురానివాఁడును,బెద్దఱికము లేనివాఁడును, ద్రాగుబోతును, జూదమునందును స్త్రీలయందును వేఁటయందును నాసక్తుఁడయినవాఁడును నగు మనుష్యుని గొప్పకార్యమందు నియోగించినచో రాజుసంపదలు బాయును. తన్ను మొదల రక్షించుకొనుచుఁ, బిదప రక్షింపఁదగినవారిని రక్షించునట్టిరాజునకుఁగల ప్రజ లధిక మును వృద్ధినొందుదురు.దానిచే నతనికి సుఖము మిక్కిలియుఁ గలుగును. రాజు తనకు సుహృదు లయినవారికిని బరులకును దెలియనివా రగు చారులచేత నితరులగు రాజుల పోకలనెల్లను బరికించుచుండవలయును. దానివలన రాజునకుఁ జెఱుపేదియుఁ గలుగకుండును. బలవంతుఁడగువానికి నపకారముచేసి వైచి దవ్వుల నున్నానని యూరడిలి యుండరాదు. వార లేమఱిపాటున నున్నపుడు డేగలు వైపడునట్లు పడుదురు. రాజు మిక్కిలి గట్టిగా వేరూని, తనబలముకొలఁది తెలిసి, బుద్ధి పొరఁబడక

తనకంటె బలహీనులగువారిని దలపడవలయును; కాని, బలీయునిఁ దలపడరాదు. ధర్మపరాయణుండగు రాజు పరాక్రమమున భూమినిబడసి ప్రజలను ధర్మంబునఁ బాలించి యుద్ధంబున మరణము గావించుకొనవలయును. ఈ జగమందలి యొక్కొక్కటియుఁ దుదిని మరణమునకుఁ బాలయినది. ఇందేదియుఁ గీడునొందనిది లేదు; సత్యముగాదు. కాఁబట్టి ధర్మమందుఁ దప్పక వర్తించునట్టి రాజు ప్రజలను ధర్మంబునఁ బాలింపవలయును. రక్షించుటకుఁ బట్టులయిన కోటలును, యుద్ధమును, ధర్మమును బాలించుటయు, రాజకార్య విచారమును, సమయంబునఁ బ్రజలకు సుఖముగూర్చుటయు ననెడి యీయైదింటిచేతను భూమి వృద్ధినొందును. ఎవఁడీ యైదింటిని రక్షించునో వాఁడే రాజు. రాజీయైదింటియందు నెప్పుడు నెడతెగక వర్తించి చూచుకొనుచుండునేని యీభూమిని నెప్పుడు ననుభవించును. వీని నెప్పుడును నొక్కఁడే చూచుకొనుట యశక్యముగాదు. వీనియందాప్తులగువారిని బ్రతిష్ఠించి, రాజు చిరకాలము భూమిని బాలింపవచ్చును. దాతయుఁ, బంచికుడుచు నట్టివాఁడును, మృదుస్వభావముగలవాఁడును, బరిశుద్ధుండును, దనమనుష్యులను దిగవిడువనివాఁడును నగుపురుషునిఁ బ్రజలు రాజుగాఁ జేసికొందురు. తన యభిప్రాయములను విడిచి మేలునకై యితరు లుపదేశించు తెలివి విషయములనువిని దాని నట్లు కైకొనునట్టిరాజునకు లోకమంతయు నడఁగి వర్తించును. ఎవఁడు తనకుహితమును గోరునట్టి పురుషుఁడు చెప్పుమాటలును, అవి తనకుఁ బ్రతికూలముగా నుండుటవలన నెంతమాత్రము సైఁపడో, మఱి తనకుఁ బ్రతికూలములయినవాని నెప్పుడును మనసునఁ బాటింపకవినునో, గొప్పవార లాచరించు

నదియు, నాపన్నులును స్వస్థులును నవలంబించునట్టిదియు నగు వర్తనమును నెప్పుడును సేవింపఁడో, వాఁడు క్షత్రధర్మమునుండి తొలఁగినవాఁడగును. (నిగ్రహింపఁబడిన యమాత్యుని వలనను, విశేషించి స్త్రీలవలనను, పర్వతమువలనను, విషమంబయిన దుర్గమువలనను, ఏనుఁగువలనను, గుఱ్ఱమువలనను, సర్పమువలనను, నెప్పుడు నెచ్చరిక గలిగి తన్నురక్షించుకొనవలయును.) ఎవఁడు ముఖ్యులయిన మంత్రులను విడిచి, హీనులయిన వారిని బ్రియులను గావించుకొనునో, యతఁడు వ్యసనములను బొంది * మంచిమార్గమునకు రానేరఁడు. శుభగుణములుగల జ్ఞాతులందు ద్వేషముచేఁ జూపోపనివాఁడై, మనసుదిట లేక, కోపము దృఢముగాఁ గలిగియుండువాఁడు మృత్యువుసమీపమున వసించుచున్నాఁడు. ఎవఁడు మిక్కిలి గుణవంతు లగువారిని దనహృదయమునకు నెంతయుఁ బ్రియులయినవా రయినను, బ్రేమ గడలుకొనఁదనకు వశగతులను గావించుకొనునో యతఁడు చిరకాలము యశము గలిగియుండును. అకాలమం దేపన్నులనుదీయరాదు. అప్రియమేదేని కలిగినను మనస్సునఁ దుందుడుకు పడరాదు. ప్రియముగలిగినను మితిమీఱియుబ్బరాదు. మంచికర్మములందెప్పుడును బూనికి గలిగి యుండవలయును. రాజులలో నాకెవ రనురక్తులు? ఎవరు నన్నుభయమునుబట్టి యాశ్రయించినట్టివారు? ఎవరు మధ్యస్థుల దోషముగలవారు? అని నీవు నిత్యము నాలోచించుచుండవలయును. నీవు బలవంతుఁడవుగా నున్నానని తలఁచి బలహీనుని యం దొకప్పుడును నమ్మిక యుంపరాదు. ఈబలహీను లేమఱి

---

* 'సాధుమార్గం నవిన్దతి' అని దా. మూ. 'సిద్ధిమార్గం' అని జో. మూలము. తలపూనిన కార్యముల సిద్ధి నెన్నఁడును బడయ నేరఁడని యర్థము.

యుండునపుడు డేగలవలె పైఁబడుదురు. సమస్తగుణసంపన్నుఁడును బ్రియవాదియు నగు నధిపతికిని బాపాత్ముఁడు ద్రోహము సేయఁజూచును ; కాఁబట్టి యట్టిమనుష్యుల నెంతమాత్రము నమ్మరాదు.* నహుషునిపుత్త్రుఁడగు యయాతి రాజనీతి రహస్యములను జెప్పినపుడు 'మనుష్యుల విషయమై యెంతయు నెచ్చరికతోఁ బాటుపడువాఁడు, ఇంద్రసహితు లయినశత్త్రువుల నయినను జంపఁగలఁడు' అనెను. ఇది తొంబదిమూఁడవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

### వామదేవ వసుమన స్సంవాదము.

వామదేవుఁడు 'రాజు యుద్ధములేకయె జయమును గలిగించుకొనవలయును. యుద్ధముచేతఁ గలిగిన జయమును దక్కువయినదిగాఁ జెప్పెదరు. రాజు వేరుగట్టిగా నూనకుండునపుడు, తాను బొందకున్నవానిని (అనఁగాఁ గ్రొత్తవానిని) బొందుటకుఁ గోరరాదు. మూలము దుర్బలముగా నున్నరాజునకు నేదేని పొందినను నది పైపైని కొనసాఁగి యుండ నేరదుసుమీ. ఎవ్వని దేశము మంచి సమృద్ధిగలిగి, సంపత్తియుఁగలిగి, ప్రియులును సంతుష్టులు నయినజనులును గలిగి, పెక్కండ్రు పెంపుగల మంత్త్రులతోఁ గూడి యుండునో యట్టిరాజే దృఢమయిన మూలముగలవాఁడు (వేరుగట్టిగా నూనినవాఁడు) అగును. † ఎవనియోధులు మిక్కిలి

---

* 'ఏతద్రాజోపనిషదం యయాతిః స్మాహ నాహుషః, మనుష్యవిషయే యుక్తో హన్తి శత్రూన్ సవాసవాన్' అని దా. మూలము. 'మనుష్యవిషయే యుక్తాం రాజక్షేమకరీం సదా' అని కొన్నిప్రతులు.

† 'యస్యయోధా స్సుసంతుష్టాః స్సాంత్వితా స్సుపూజితాః, అల్పేనాపి స

సంతుష్టులై యెంతయు ననురక్తిగలిగి మిక్కిలియుఁ బూజితులు నై యుందురో యట్టి రాజల్పపుదండముచేత నయినను భూమిని జయించును. * [ఎచ్చట దండము బలీయముగా నుండునో యచట సామమే ప్రయోగింపవలయును. భేదముచేయుట ముఖ్యమయిన యుద్దేశముగాఁ గలచో సామము(మంచిమాట) లాడుచుఁ గోరినది యిచ్చుట యెంతయుఁ గొనియాడఁబడును. రాజెప్పుడు సామదాన భేదములు మూఁడును విఫలములగుట చూచునో యపుడు తెలిపి తెలిసికొని ముందు వెనుకఁ జూడక దండమును బ్రయోగింపవలయును. ఒకశత్రువు మిక్కిలి బలీయులయిన శత్రులచేతఁ గ్రిందపఱుపఁ బడినపుడు వాని నుపేక్షింపవలయును. బలవంతులగువారికిఁ జంపఁదగినట్టి స్థితి(యం దెదిరియుండుట)యే బలము. రాజెప్పుడు దుర్బలుఁడుగా నుండునో యపుడు † నాలుగింటికిని విరుద్ధము గాకుండున ట్లుపేక్ష గావింపవలయును. ఉపేక్ష యైదవయుపాయము. అది యన్నింటను మిక్కిలి బలవంతమయినది. కోసలపతీ! నీవు తత్త్వజ్ఞుండవు కాన భార్గవుండు పాడిన శ్లోకముల తత్త్వము నెఱింగి కలరూపున వానిని జేయవలయును. అవి యేవనఁగా 'ఏదేని యొకచోట రాక్ష

---

దండేన మహీం జయతి పార్థివః' అని దా. మూ. 'యస్యయోధాః సుసంతుష్టాః సాంత్వితాః సూపధాస్థితాః' అని ఔ. మూలము. ఎవనియోధులు, మిక్కిలి సంతుష్టులై, బుజ్జగింపఁబడి శత్రువులను వంచింపనేర్తురో యట్టివారనియర్థము.

[*] కుండలీకరణములోని పాఠము. దాక్షిణాత్యకోశములందే చూపట్టుచున్నదిగాని తక్కిన ప్రతులయందుఁ గానిపింపదు.

† సామము, దానము, భేదము, దండము, అని నాలు గుపాయములు. ఇచట 'ఉపేక్ష' యైదవయుపాయముగాఁ జెప్పఁబడినది.

నుఁడు పిశాచముచేతఁ గొట్టఁబడునేని యా జోలికిఁ బోకుండ వలయును. * బలహీనులకుఁ బలుకకుండుటయే (మిన్నకుండు టయే) బలము. (బలవంతులకు మాటపడకుండుట బలము.)' అనుటయే. రాజా ! బలము లేనివాఁడు శత్రువును శత్రువులను గొనియే పెకల్పవలయును. కాలియందలి ముల్లును జేతియందలి ముల్లు చేతనే యెత్తవలయును, గూఢవిప్రియులగు మంత్రుల యందును, మ్లేచ్ఛులయందును నుపాయముల లోపల నీయుపా యమేఁ తగునని చెప్పఁబడుచున్నది. జాతిచేత నినుమును నిను ముచేత జాతినిని నాశముచేయవలయును. బిల్వకాయలను వేఱు బిల్వకాయలచేతను, మ్లేచ్ఛులను నితర మ్లేచ్ఛులచేతను నాశము చేయింపవలయును. మిక్కిలియు గర్వించియున్న దాసులకును నిదియే చేయవలయును. చండాల జాతులవారిని మ్లేచ్ఛజాతుల వారిని దండనముచేతనే వారింపవలయును. మఱుఁగున వంచించు నట్టివారికి దుష్టులను గొని ముందు చెప్పినదానిని చేయవల యును. ధర్మార్థకామ మోక్షముల నెడు చతుర్వర్గమునకు విరోధు లగు కడపటిజాతివారిని, శఠు లగుమంత్రులను, దుష్టబ్రాహ్మణులు మొదలగువారిని నుపాయము లయిదింటిచేతను సాధింపవలయు ను. ఏపీడయునొందక తనయందనురక్తులై రాష్ట్రమునకువలయు పనులను జేయుచు వినయపరులై యుండు పురజనులనును దేశజను లనును, రాష్ట్రమునకు విరోధులై వినయము లేకుండు పౌరదేశ జనులనును,జండాలురను మ్లేచ్ఛులను బౌవండులను స్వధర్మము

* 'వాచ్యతాంబలినాంబలమ్' అని దా. కోశమునందున్నది.ఇది యసంగత మగను అప్రకృతముగను నున్నది గాన 'అవాచ్యతా౽బలినాంబలమ్' అని యా 'అవాచ్యతా బలినాంబలమ్' అనియో పాఠములు గ్రాహ్యములు.

లాచరింపనివారిని బలవంతులను నాశ్రమములను గాయకులను నర్తకులను నట్లు ప్రయత్నమున సాధింపవలయును.] ఎవని పురజనులును దేశజనులును భూతదయాళువులై ధనధాన్య సంపన్నులై యుందురో యట్టిరాజు దృఢం బగుమూలము గలవాఁడు. రాజు తన ప్రతాపము శత్రువునకుఁగల ప్రతాపముకంటె నధికమయినదని యెప్పుడుతలఁచునో యపుడు మంచిబుద్ధినెరపి పరుని భూమిని ధనములను గయికొన నుంకింపవలయును. భోగములు పయిపయిని వర్ధిల్లు చున్నవాఁడును, భూతములందు దయగలవాఁడును,సోమరితనము లేక పనులయురవడిగలవాఁడును, తన్నుఁ దాను బదిలముగారక్షించుకొని యుండువాఁడు నగురాజుదేశము వృద్ధి నొందుచుండును. తనయెడలఁ జక్కటితో వర్తించుచున్న తన జనులయెడఁ గపటముగా వర్తించునట్టి రాజు గొడ్డలిచేత నడవి నఱకునట్లు తన్ను నఱకికొనుచున్నాఁడు. రాజు తనశత్రువులను గొట్టుటకు నుంకింపఁ డేని పగవారతనికిఁ దఱుఁగరు. ఏరాజు తనక్రోధమును జంపనెఱుంగునో యతనిని ద్వేషించువారు గలుగరు. రాజు ప్రాజ్ఞుఁడగు నేని యార్యజనులు ద్వేషించునట్టి కార్యమును జేయఁడు; మఱి తనకేది మంగళకరమైన కార్యముగాఁ దలంచుచున్నాఁడో యందుఁ దన్నుఁ బురికొలుపవలయును. ఏరాజు తనకార్యము లన్నియును ముగించి సుఖముల ననుభవింపఁగోరునో యట్టివానిని బరు లవమానింపరు; తానును బరితాపము నొందఁడు. ఏరాజు మనుష్యులయెడ నిట్టినడవడి గలిగియుండునో యతఁ డుభయలోకములను జయించి జయము నందు నెలకొనుచున్నాఁడు'' అనెను.

వామదేవుఁ డిట్లు చెప్పఁగా వసుమనసుఁ డ
యుఁ జేయుచువచ్చెను. నీవు నట్లుచేయఁగా
లనును జయింతువు. ఇందులకు సందేహము లేదు' అని
ఇది తొంబదినాలుగవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

### భీష్ముఁడు ధర్మరాజునకు యుద్ధధర్మమును జెప్పుట.

ధర్మరాజు 'ఒకక్షత్రియుఁడు మఱియొక క్షత్రియుని యుద్ధమునందు జయింపఁగోరునేని, యట్లు జయించువిషయమున నతఁడు చేయవలసిన ధర్మమేమి ? అడిగెదను. నాకుఁ జెప్పుము' అనెను.

భీష్ముఁడు 'రాజు సహాయము గలవాఁడైనను లేనివాఁడైనను దాను జయింపఁగోరినరాజు రాష్ట్రమునకు వచ్చి 'నేను మీకు రాజను. మిమ్మెప్పుడును రక్షించుచుందును. ధర్మంబున నాకుఁ గప్పము గట్టుఁడు ? లేదా యుద్ధమున నన్నుఁ దలపడుఁడు' అని చెప్పవలయును. వారతనిని దమకు రాజుగా నంగీకరించిరేని యుద్ధమక్కఱలేదు. వారు క్షత్రియులు కానివారై మఱివిరోధమును జూపుదురేని యపుడు వారు తమకు విహితము కాని (క్షత్ర)కర్మములందు వర్తించుచుండుటంబట్టి సమస్తములయిన యుపాయములచేతను వారి నడంచివుచ్చవలయును. పయినెత్తి వచ్చిన యాక్షత్రియుఁడు యాయుధమెత్తికొని (యుద్ధసన్నద్ధుఁడయి) యుండఁడేనియు, తన్నుఁ దాను రక్షించుకొనఁజాలఁడేనియు, శత్రువును మిక్కిలిగాఁ దలంచునేనియు, దక్కువవంశముల వారతనిపయి నాయుధముల నెత్తికొందురు' అనెను.

తామహా! క్షత్రియుండయిన రాజు మఱియొక డుఁ దలపడిపోవునేని తానెట్లు మించి పోరాడవల దాని నాకుఁ జెప్పుము' అనియడిగెను. అందులకు భీష్ముఁడు 'సన్నాహము లేనివాఁడును గవచము లేనివాఁడును నగు నొక క్షత్రియుని యుద్ధమునఁ దలపడరాదు. తా నొక్కఁడును నొంటి వానిని దలపడి 'నీవు బాణము విడువుము. నేనును విడిచెదను' అని తెలుపవలయును. వాఁడు సన్నాహముతోఁ గూడవచ్చునేని పిదపఁ దానును సన్నాహముతోడ నుండవలయును. వాఁడు సేనలతోఁ గూడ వచ్చునేని తానును సేనలఁగూడి వానిని బిలువవలయును. వాఁడు గపటముగా యుద్ధము సేయునేని, దానును గపటముగా నెదిరించి పోరవలయును. అట్లుగాక ధర్మంబున యుద్ధము సేయునేని, ధర్మంబుననే వారింపవలయును. రథికుని గుఱ్ఱము నెక్కి తలపడరాదు. రథికునితో రథమెక్కియే యెడరవలయును. ఆపత్సమయమందుఁ గొట్టరాదు. భయపడినవానిని జయింపఁబడిన వానిని గొట్టరాదు. విషముపూసిన బాణములను, కర్ణిబాణములను వేయరాదు. ఇవియ సత్పురుషుల కాయుధములు. యథావిధిగానే యుద్ధము చేయవలయును. కొట్టఁ దివిరినవానిని గోపింపరాదు. యుద్ధముల నొక్కనికి నేనుఁగుండఁగా మఱియొక్కనికి నేనుఁగు లేకుండునేని, కాల్బంటేనుఁగునెక్కినవానితోడ యుద్ధము సేయరాదు. ఏనుఁగుచేత నేనుఁగుతోడఁ దలపడవలయును. ఒకసమయమునఁ జక్కఁగా నలవడిన గుఱ్ఱముతోను యుద్ధము చేయవచ్చును. దివ్యాస్త్రబలముగలవాఁడు. తా నిష్టపడినట్లు, గజముమీఁదను, భూమియందును, సమస్థలమందును, దేరియందును. గుఱ్ఱము నెక్కియు, నెప్పుడును యుద్ధము చేయ

వచ్చును. రాజా! రామునకును రావణునకును జరిగిన యుద్ధమందు, వానరులును మహాభాగుండగు లక్ష్మణుడును నట్లె విభీషణుడును బదాతులుగా నుండిరి. రావణుని యంతకాలమందు, దురాచారుడును బాపకారియు నగువానిని రాముడింద్రునిరథము నారోహించి చంపెను. దివ్యాస్త్రబలసంపన్నులగు వారియందు నివియన్నియు విధింపబడుచున్నవి. ఇది దేవాసురు లందఱియందును బూర్వులు గాంచిరి. బలము లేనివానిని, బుత్రులు లేనివానిని, ఆయుధము విఱిగినవానిని, ఆపదనొందినవానిని, అల్లెత్రాడు తెగినవానిని, వాహనము పోయినవానిని, నెట్లును జంపరాదు. రాజాపదగలవానిని దనదేశమునకు బంపి చికిత్సచేయవలయును. లేనిచో వాని నిల్లుచేరునట్లు చేయవలయును. గాయము లాఱినపిదప వానిని విడిపింపవలయును. ఇది సనాతనమయిన ధర్మము; కాబట్టి ధర్మముచొప్పున యుద్ధము చేయవలయునని స్వాయంభువమనువు చెప్పెను. సాధువుల ధర్మము సాధువులందు నెలకొనియుండును. దానిని బొంది నశింపకుండునట్లు చేయవలయును. ధర్మమునందు నిష్ఠగలక్షత్రియుడైన డధర్మంబున జయమునొందునో వాడు పాపాత్ముడు. వాని బ్రతుకవమానింపదగినది. అట్టివాడు తన్ను దనచేతనే చంపుకొనుచున్నాడు. మంచివారిని జెడుమార్గముల గెలుచుట దుష్టులవృత్తి. ధర్మంబున గలుగుమరణము మేలయినది. పాపకర్మమువలన గలుగు జయము మేలయినది గానేరదు. రాజా! అధర్మమును జేసినయెడల నది పశువుంబోలె దోడనే ఫలమొసంగదు. అది తన్నుజేసినవానిని వేళ్లతోను గొమ్మలతోను దహించి ముంచును. పాపి యగువాడు పాపకర్మములచేత ధన

మును బడసి యెంతయు సంతసించును. వాఁ డాపాపముచేత నే పయిపయిని వృద్ధినొందుచు దానియందు మిక్కిలి తగులు గలిగియుండును. మఱియు ధర్మ మనునదియే లేదని తలంచుచుఁ బరిశుద్ధు లగువారి నపహసించుచుండును. ధర్మమందు నమ్మిక యెంతమాత్రము లేక, తుదకు వినాశమునొందును.* వానిని దేవతలు వరుణపాశములఁ గట్టి యవమానింతురు. వాఁడు గాలి నింపిన వెనుతిత్తియుంబోలెఁ దన చేసినకార్యముచేత నే వృద్ధినొందుచున్నాఁడు. అంత నదియొడ్డున నుండుమ్రాఁకుంబోలె వేరుతోఁగూడఁ బెకలి చెడుచున్నాఁడు. అంత ఱాతిమీఁదఁ గొట్టువడి పగిలినకుండవలె వాఁడు చెడుటను జూచి జనులు వానిని నిందింతురు. కాఁబట్టి ధర్మంబున జయమును బొక్కసమును రాజు పొందఁ గోరవలయును. ఇది తొంబదియేనవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

(భీష్ముఁడు జయలక్షణములను మఱియుఁ గొన్ని రాజధర్మములను జెప్పుట.)

భీష్ముఁడు 'రాజధర్మంబున భూమిని జయించుటకు, దానివలనఁ దాను భూమికంతయుఁ బతియగునేనియుఁ, గోరరాదు. అధర్మమున జయమును బొందిన యేరాజు ముదిమునఁ బొదలును? అధర్మంబునఁ గలిగినజయము సతముగా నుండదు;

* 'సబద్ధోవారుణైః పాశైరమర్త్యైరవమన్యతే' అని దా.మూ. అమర్త్యైః ఇవ మన్యతే. (జో. మూలము.) వరుణపాశములఁ గట్టువడియుఁ దన్ను దేవతగాఁ దలఁచు ననుట.

మఱి స్వర్గమునకుఁ గారణమును గానేరదు. అది రాజునును భూమిని గీడ్పఱుచును. కవచము చినిఁగినవానిని, 'నీవాఁడ' నని పలుకుచున్నవానిని, అంజలిచేసినవానిని, ఆయుధము విడిచినవానిని బట్టికొని హింసింపరాదు. రాజు, తనసైన్యముచేత నోడినవానితో మరలఁ దాను యుద్ధముసేయరాదు; కాని వానినొకసంవత్సరము 'నీకు దాసుఁడ' నని చెప్పించుచు నడంపవలయును. అట్లు *మీఁద వాఁడు మరలఁ బుట్టుక నొందినవాఁడగును. † పగవానియింట నొకకన్యను బరాక్రమంబున రాజు దెచ్చెనేని యూపడఁతిని సంవత్సరమునకు లోనుగా నెవరిని బెండ్లాడెద వని యడుగరాదు. సంవత్సరమునకుఁ బిదప నీ వెవరిని బెండ్లాడెదవు? 'నన్నా? మఱొక్కనినా?' యని యడిగి దాని యిష్టముచొప్పునఁ జేయవలయును. ఇట్లు బలవంతముగాఁ దెచ్చిన తక్కినధనముల (దాసులు మొదలగువారి) పట్లను నడచుకొనవలయును. (అనఁగా వారొల్లనియెడ మరల శత్రువునకే యొప్పింపవలయును.) ‡దొంగలు మొదలగు వధ్యులగువారిధనమును దీసి యుంచుకొనరాదు. దానిని వ్యయముచేసి పుచ్చవలయును. బ్రాహ్మణులు సాపరాధులగుదురేని వారిని క్షమింప

* వాఁడట్లు చెప్పినను జెప్పకపోయినను దాసత్వము నొందినవాఁడే యగును. కాన మఱియొక పుట్టుక పుట్టినట్లేయగును. ఒక సంవత్సరమునకుఁ బిదప వానిని విడిచిపుచ్చవలయునని నీలకంఠులు.

† 'నార్వాక్సంవత్సరాత్కన్యా ప్రష్టవ్యా విక్రమాహృతా' అని మూలము. 'నచసంవత్సరంకన్యాః స్ప్రష్టవ్యాః సహసాహృతాః' అని పాఠాంతరము. బలిమిని దెచ్చినకన్యలను సంవత్సరమువఱకు ముట్టరాదని యర్థము.

‡ 'నతు వధ్యే ధనం తిష్ఠేత్పిబేయు ర్బ్రాహ్మణాః పయః, యుఞ్జీరన్నప్య

వలయును. వారు తమపశువులపాలను ద్రాగనీయవచ్చును. ఎద్దులను నుపయోగించుకొన నీయవచ్చును. క్షత్రియునితోడ క్షత్రియుడే యుద్ధముచేయఁదగునని ధర్మము విధింపఁబడియున్నది. క్షత్రియుఁడు గానివాఁడు క్షత్రియుని గుఱించి యేవిధముననాయుధమును వైవరాదు. రెండుసేనలును యుద్ధముసేయుటకుఁ దారసించి నిలిచియున్నపు డుభయపక్షములకును క్షేమమును గోరి బ్రాహ్మణుఁడు నడుమఁజొచ్చునేని యపుడు యుద్ధముచేయరాదు. అట్లా బ్రాహ్మణుని నతిక్రమించినవాఁడు (అనఁగా నతనిని జంపినవాఁడును గాయపఱిచినవాఁడును) శాశ్వతం బగుమర్యాదను భేదించినవాఁ డగును. క్షత్రియుఁడు మర్యాదనుమీఱి నడచునేని వాఁ డధముఁడగును. ఇంతేకాక ధర్మమునకు లోపముగలిగించి మర్యాదను జోకార్చునట్టి క్షత్రియుఁడు క్షత్రియజాతిలో గణింపఁ దగినవాఁడుగాఁడు. మఱి సంఘమునందును గయికొనఁదగినవాఁడు గాఁడు. జయింపఁగోరునట్టిరా జట్టినడవడి ననువర్తింపరాదు. ధర్మముచేతఁ బడయు జయమునకంటె మఱి పెద్దలాభము వేఱేమి గలదు ? లోపఱుచుకొన్నయొక రాజ్యమందుఁ గోపమునఁ జెంగలించునట్టివారలను జాగుసేయక మంచిమాటలచేతను వలయుభోగముల నొసంగుటచేతను గలంకదేర్చి శీఘ్రముగా వశపఱచుకొనవలయును. ఇది రాజులకుఁ

---

వధుహాః క్షన్తవ్యంవా పునర్భవేత్' అని మూలము. 'శత్రువునుండి తెచ్చిన గోవులను బ్రాహ్మణులకిచ్చి వారు దానిపాలను ద్రాగునట్లు చేయవలయును. అట్లు తెచ్చినయెడ్లను దున్నుట మొదలగుపనుల కుపయోగించుకొనవచ్చును. లేదా శత్రువునకే మరల నిచ్చివుచ్చవచ్చును' అని ప్రతాపచంద్రరాయలు. ఈ శ్లోకపాదముల యర్థము మిక్కిలి క్లిష్టముగానున్నది.

బరమమయిన నీతి. ఇట్లు గాక వారలకు వలయుభోగముల నొసంగక యడంచి యేలినచో వారు రాజ్యమును దిగవిడిచి, తమ్ము గెలిచినవాని శత్రువులను గొలుచుచు, వానికి వ్యసనములు గుంపులుగా వచ్చుట యెదురుచూచుచుందురు. అట్టి రాజువలనం దుష్టినొందనివా రతని వ్యసనముల కువ్విళ్లూరుచు నతని కాపద వచ్చినపుడు సర్వవిధముల నతని శత్రువుల పక్షము చేపట్టుదురు. *శత్రువును మోసముపన్ని వంచింపరాదు; ఏవిధమునను (శూలు నట్లు) మిక్కుటముగాం గొట్టరాదు. ఏలనంగా నట్లుబిట్టుగాంగొట్టిన యెడల నతం డొకవేళం బ్రాణములను దిగవిడిచినను విడుచును. †అల్పపరాధము సేయంబడినవానికిం గొంతధనమిచ్చినను సంతుష్టి నొందకపోవును. అట్టివాండు కందులేనిబ్రతుకే గొప్పగాభావించును; కాని నిందితమయిన (అనంగా రాజుచే నవమానమొందిన) బ్రతుకును నట్లు భావింపండు. ఏరాజుదేశము పెంపుసొంపారుచు, ధనవంతమై, రాజునందుం బ్రీతిగల జనులుగలిగి, భృత్యులును మంత్రులు సంతుష్టులై యుండవెలయునో, యట్టి రాజు గట్టిగా వేరూనినవాం డగును. ఏరాజు ఋత్విజులును బురోహితులును నాచార్యులును మఱియుం బూజ్యులును

---

* ఇచ్చట—'మోసముపన్ని యుద్ధముచేయరాదు. ఒకవేళ చేసినను శత్రువు జచ్చునట్లు గొట్టరాదు. ధర్మయుద్ధమునం జంపవచ్చును గాని యధర్మమునం జంపుట పాప'మని భావము.

† 'అల్పేనాపిచసంయుక్త స్తుష్యతేనాపరాధితః, శుద్ధం జీవితమేవాపి తాదృశో బహుమన్యతే' అని దా.మూల. 'అల్పేనా...తుష్యత్యేవ నరాధిపః...' అని ఔ. మూలము. ఇందర్థము క్లిష్టము. మఱి పూర్వోత్తరసంబద్ధమును గాకున్నది గాన యీపాఠము త్యాజ్యము.

మిక్కిలి చదువరులునయినతక్కినవారును బూజితులైయుందురో యట్టిరాజు లోకజ్ఞుం డనఁబడును. ఇట్టినడవడిచేతనే యింద్రుఁడు లోకాధిపత్యమును బడసెను. * ఇట్టి నడవడి చేతనే భూమియందలివారును నింద్రపదవి నొందఁగోరుదురు. ప్రతర్దనుఁ డనురాజు తనశత్రులను మహాయుద్ధమున జయించి, వారిధనమును ధాన్యములతోడను, ఔషధులతోడను గయికొనెనుగాని నాభూమినిమాత్రము గయికొనఁడయ్యెను. †రాజగు దివోదాసుఁడు నష్టశత్రువులను గెలిచినపిదప వారి యగ్నిహోత్రశేషములను, అందులకయిన హవిస్సులను, వారియాహారములను దీసికొనెను; కావుననే యతఁడు తనజయమువలన ఫలము నొందక వంచితుఁడయ్యెను. రాజగు నాభాగుఁడు (శత్రువులను గెలిచినపిదప) తాను గొన్నరాజ్యములందలి శ్రోత్రియుల సొమ్ములను దాపసులధనములను దప్పఁ దక్కిన రాజ్యములను, వానిరాజులతోఁగూడ దక్షిణలుగా నొసంగివచ్చెను. ధర్మరాజా! ధర్మజ్ఞులయిన తొల్లింటిరాజుల ‡నడవడి యెంతయు గొప్పదిగానున్నది. అదియెల్ల నాకు మిక్కిలి యిష్టముగానున్నది.

---

* 'అనేన చేంద్రవిషయం విజిగీషన్తి పార్థివాః' అని ఔ. మూలము. 'అన్యేపి చైవ విజయం విజిగీషన్తిపార్థివాః' అని దా. మూ. తక్కినరాజులును జయమును బడయఁగోరెదరని యర్థము

† ప్రతర్దనుఁడును గొనదగినదానిని గొనుటచేఁ బాపమొందఁడయ్యెననియు, దివోదాసుఁడు గొనరానివానినిగూడఁ గొనుటచే విజయమువలని ఫలము నొందక పోయెననియు భావము.

‡ 'వృత్తాని' అని ఔ. మూలము. 'విత్తాని' అని పెక్కుప్రతులపాఠము. ఇదియంత యుపపన్నముగాదు.

తనకై శ్వర్యమును గోరునట్టిరాజు జయమును సమస్తములయిన విద్యలవెంపుచేతఁ బడయఁగోరవలయునుగాని మాయపన్నికాని డంభమునెరపికాని పడయఁగోరరాదు'' అనెను.
ఇది తొంబదియాఱవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

{భీష్ముఁడు క్షత్రియులు యుద్ధమునుసేయుట ధర్మమగునని నిరూపించుట.}

ధర్మరాజు 'భరతసత్తమా ! క్షత్రియధర్మముకంటె మిక్కిలి పాపమయిన ధర్మము మఱియొక్కటి లేదు. రాజు దండెత్తిపోయినపుడును యుద్ధమునుసేయునపుడును, బెక్కండ్రజనులను జంపుచున్నాఁడు. రాజేకర్మముచేసినచో నట్టిదోషమువీడి మంచిలోకములను జయించును? నే నిది తెలియనువ్విళ్లూరుచున్నాఁడను గాన నాకుఁ జెప్పుము' అనెను.

భీష్ముఁడు—'పాపులను నిగ్రహించుటచేతను, సాధువుల నాదరించుటచేతను, యజ్ఞములచేతను, దానములచేతను, రాజులుదోషములు వీడి నిర్మలులగుదురు. రాజులు జయమునుగోరునపుడందులకై పెక్కులు ప్రాణులను బీడించుచున్నారనుట నిజమే; కాని వారే జయమును బడిసినపిదప మరలఁ బ్రజలను వృద్ధిఁబొందించుచున్నారు. దానము, యాగము, తపము ననెడి వీనిఫలములచేతఁ బాపములను దొలఁగఁబుత్తురు. * ప్రాణులను రక్షించుట

* 'అనుగ్రహేణభూతానామ్' అని దా. మూలము. 'అనుగ్రహాయభూతానామ్' అని శా. మూ. 'ప్రాణులను రక్షించుకొఱకై వీరలకుఁ బుణ్యము పెరుఁగుచున్నది' అని యర్థము.

చేత నీరలకుఁ బుణ్యమెంతయు వర్ధిలుచున్నది. పొలమును జక్కఁబెట్టువాఁడు పయిరుతోఁ జేరిన పులుగడ్డిని నాశము సేయుచున్నాఁడుగాని దానివలన ధాన్యపుఁబయిరు నశింపదు. అట్లె యాయుధములను వైచువారు వధింపఁదగువారిని బెక్కండ్రను జంపెదరు. కాని మరలఁ దక్కినవారిని వృద్ధినొందించుటయె దానికిఁ బరిహారమగుచున్నది. ఎవఁడు ప్రాణుల ననర్థమునుండియు, వధమునుండియుఁ, గష్టముల నుండియు రక్షించునో, వాఁడట్లు దొంగలవలన నుండి కాచి ప్రాణముల నొసఁగుటవలన ధనమును సుఖమును నొసంగు *బ్రహ్మ యగుచున్నాఁడు. ఆరాజు, అభయదానమే దక్షిణలుగా యాగముల నెల్ల యజించి యిహమునందు శుభములనెల్ల ననుభవించి పిదప నింద్రునితోడి సాలోక్యము నొందుచున్నాఁడు. †బ్రాహ్మణుల ప్రయోజనముకొఱకై యుద్ధము చేయవలసిరాఁగా నందులకై రాజు తాను వెలువడి తన దేహమునే యూపముగా (యజ్ఞస్తంభముగా) నాఁటి భయము లేక బాణములుగొని శత్రువుల పయిఁ గురియించునేని, యట్లుచేయుయుద్ధ మపారమయిన దక్షిణలతోఁ గూడినయజ్ఞమగుచున్నది. దేవతలు నంతకన్న నెక్కుడయినట్టి వస్తువును భూమియందొక్కటినేని చూడఁ జాలరు. యుద్ధమందు, వానితోలి నెన్ని యాయుధములు భేదించునో యన్ని యక్షయలోకములను, సకలకామములను బిదుకు

* 'విరాట్' అనిమూలము. ఆహారము నొసంగువాఁడని ప్రతాపచంద్ర రాయలు.

† 'బ్రాహ్మణార్థే సముత్పన్నే యోఽభినిష్పత్య యుధ్యతి' అని దా. మూ. యోఽరిభిః స్పృత్యయుధ్యతి' అని (గౌ.మూ.)

నట్టివానిని, వాఁడు పొందును. యుద్ధమునందు వాని దేహమునుండి తొరఁగురక్తముతోఁగూడనే వాని పాపములన్నియుఁ దొలఁగుచున్నవి. ప్రాణములు పోవుకాలమున దుఃఖములను సహించుటకంటెఁ బెద్దతపము లేదని ధర్మవిదులు తెలుపుచున్నారు. ధర్మబుద్ధిగల పురుషులు, యుద్ధమందు భయపడినవారు, పర్జన్యునివలననుండి జలమును గోరునట్లు, శూరునివలననుండి రక్షణమునుగోరి పిలుంద నుందురు. * శూరులగువారలట్లు భయము లేకుండునట్లు క్షేమముగా రక్షించి యాపురుషులను యుద్ధమందు ముందు నిలువనీయక తామే నిలుతు రేని వారికెంతయుఁ బుణ్యమగును. ఆపిఱికివాండ్రు శూరుఁడు చేసిన కార్యమును గౌరవించి వాని నెప్పుడును బూజింతు రేని యుక్తమును న్యాయమును గావించిన

* 'యదిశూరస్తథా క్షేమే ప్రతిరక్షేద్యథా భయే। ప్రతిరూపం జనం కుర్యాన్నచతద్వర్తతే తథా॥ యది తే కృతమాజ్ఞాయ సమస్కుర్యుస్స దైవతమ్। యుక్తం న్యాయ్యం చ కుర్యుస్తే, నచ తద్వర్తతే తథా' అని మూలము. ఈపాఠము నీలకంఠాది వ్యాఖ్యాతలు గ్రహించినది. ఇందు రెండవశ్లోకమున 'నచతద్వర్తతేతథా' అనుటకు 'అట్లు చేయరేని వారాభయమునుండి విడివడఁజాలరు.' అని ప్రతాపచంద్రరాయలు. రెండవశ్లోకమునకు 'యుక్తం న్యాయ్యం చ కుర్యుః' అనుచో 'యుద్ధం న్యాయ్యం చ కుర్యుః' అని పాఠముగొని 'ఆపిఱికివారాశూరుఁడు చేసినది యెంతయు గౌరవించి యతని నెప్పుడును బూజించుచు న్యాయముచొప్పున యుద్ధము చేసిరేనియు నది వానికట్లు పుణ్యము గాదు' అని యర్థము మఱియొకరు వ్రాసియున్నారు. ఈ యర్థములు 'నచతద్వర్తతేతథా' అను రెండుపట్టులయందును క్లిష్టముగానే యున్నది. దాక్షిణాత్యకోశములందు 'యదిశూరం తథా క్షేమే ప్రతీక్షేరన్యథా భయే। ప్రతిరూపం జనాః కుర్యుర్నచ తద్వర్తతే తథా...' అని యున్నది. ఆపిఱికిజనులు శూరుని భయకాలమందుంబోలె క్షేమకాలమందును నెదురుచూచి గారవింతురేని

వారగుదురు. అట్లుచేయనిచో వారి కట్లు పుణ్యముగలుగదు. మనుష్యులందఱును బయికి సమానులుగాఁ జూపట్టుదురుగాని లోపల మిక్కిలియుఁ దారతమ్యముగలదు. యుద్ధమునందు సేన లొండొంటిని దలపడి బిట్టుచప్పుడు చెలరేఁగునప్పుడు కొందఱు వీరులు సేనల మార్కొనిపోదురు. శూరుఁడు, సేనలు దార్కొని పోరాడుచుండఁగా స్వర్గమార్గమును బాటించి తా ననుమార్కొనును. పిఱికిపంద, విషమ మగు నా సమయమునఁ దనతోడి వారిని దిగవిడిచి పరుగువాఁడును, అట్టి యధర్మ్యపురుషులు నీవంశమునఁ బుట్టకుందురుగాక. సహాయులను యుద్ధమున దిగవిడిచి యంగములు గాయపడక కుశలముగా నింటికిఁ బరుగిడిపోవునట్టివారికి నింద్రుఁడు మొదలగు దేవత లశుభములు గావింతురు. ఎవ్వఁడు తనసహాయులను దిగవిడిచి తనప్రాణములను రక్షించుకొనుటకుఁ జూచునో యట్టివానిని గడ్డలతోఁగాని తాలతోఁగాని కొట్టిచంప వలయును; లేక గడ్డిచాపలను జుట్టి కాల్చివేయ వలయును. క్షత్రియులం దట్టివా రెవ రేనియుండినచో వారిని బశువులవలెఁ బట్టి చంపవలయును (అనఁగా నాయుధము మొదలచేతఁ జిత్రవధముగాఁ జంపవలయును) క్షత్రియుఁ డగువానికిఁ బడుకమీఁదఁ

---

వారు తగిన ప్రతి చేసినవారగుదురు. కాని యట్లు జరుగుటలేదు. వారు శూరులు చేసిన దానిని గనుఁగొని యందుల కెప్పుడును నతనిని బూజింతురేఁ, వారును నట్లు భయమువీడి న్యాయముచొప్పున యుద్ధము చేయుదురేని, అది న్యాయ్యమగును. కాని యట్లు జరుగుటలేదు' అని యర్థము చేసినచో మఱింత యుపపన్నముగాఁ దోఁచెడిని. ఇది పూర్వమందు భీతులు శూరుని శరణుఁజొచ్చుటకును వెనుక పురుషుల తారతమ్యమును జెప్పుటకును నడుమనుండుట సంబద్ధముగా నున్నది.

బరుండి, కఫము గ్రక్కుచు, మూత్రము విడుచుచు, దీనముగాఁ బలవించుచును, మరణమునొందుట యెంతయు నధర్మము. క్షత్రియుఁడు గాయములు పడని దేహముతో మరణమునొందు నేని యాకర్మమును బురాణవిదులగువారు గొనియాడరు. నాయనా! క్షత్రియులకు నింటియందు మరణమెంతమాత్రము తగినదిగాదు. వారు శూరులు. శూరత్వము లేని కార్యము వారికెంతయు నీచమును నధర్మము నగును. రోగమునందు నొకఁడు 'అయ్యో! ఇదేమి సంకటమువచ్చినది! ఏమిదుఃఖమిది! నే నెంతోపాపిని' యని యంగలార్చుట వినఁబడుచున్నది రోగి, ముఖమంతయు కలఁగినలఁగి, చెడ్డకంపు గొట్టుచు. పుత్రులు దన్నుఁజూచి శోకించునట్లు చేయు చున్నాఁడు. అట్టివాఁ డారోగ్యముగలవారి స్థితికి నువ్విళ్లూరుచు బాధపడఁజాలక మాటికి మరణము గోరుచున్నాఁడు. వీరుఁడును గర్వితుఁడును గొప్పమనస్సుగలవాఁడును నగుపురుషుఁ డిట్టిమరణమున కెంతమాత్ర మర్హుఁడు గాఁడు. క్షత్రియుఁ డగువాఁడు తన సుహృదులచేఁ బరివేష్టితుండై యుద్ధములందుఁ బగఱ నుఱుమాడి సుహృదులెంతయుఁ బూజించుచుండ, మిక్కిలి వాఁడియగు శస్త్రములచేత గంట్లువడి మృత్యువు నొందుట యెంతయుఁదగును. శూరుండు మనస్సు తెంపును రోషమును బయికొనఁగా మైమఱచి బెట్టిదముగా యుద్ధము చేయునుగాన యపుడు శత్రువులు తనయవయవములను గంట్లు పఱుచుచున్నను దెలియఁడు. అతఁడు యుద్ధమందు మరణముఁ బొంది మిక్కిలి ప్రశస్తమైనదియు లోకులచేతఁ బూజితమైనదియు నగు స్వధర్మమును నవ్వారిగాఁబడసి యింద్రునితోడి సాలోక్యమునొందును. శూరుఁడెంతమాత్రమును బగవానికి వెన్నుఁ

జూపక సమస్తములయినయుపాయములచేతను యుద్ధాగ్రమందు నిలిచి ప్రాణములువిడిచి యింద్రునితోడి సాలోక్యమునొందును. శత్రువులు చుట్టుముట్టికొనియుండఁగా శూరుఁ డెచ్చటెచ్చటనేని గొట్టువడి దైన్యము చూపక మరణము నొందునేని యక్షయములగు లోకమును బొందును' అనెను. ఇది తొంబదియేడవ యధ్యాయము.



## రాజధర్మపర్వము.

(ఇంద్రుఁడు సుదేవచరిత్రమును యుద్ధయజ్ఞమందలి ఋత్విగాదియంగములను యుద్ధమృతులకుఁ గలుగులోకములను నంబరీషునకుఁ జెప్పుట.)

ధర్మరాజు 'పితామహా! వెనుదీయక యుద్ధము చేయుచు శూరులు మరణము నొందిరేని వారికేలోకములు గలుగును? నాకుఁ జెప్పుము' అని యడిగెను.

భీష్ముఁడు 'ఈవిషయమందు నంబరీషునకును నింద్రునికిని సంవాదమనెడి పురాతనమయిన యీయితిహాసము నుదాహరించెదరు. నాభాగునిపుత్త్రుఁ డయినయంబరీషుఁడు మిక్కిలి దుర్లభంబయిన స్వర్గమునకుఁ బోయి యాదేవలోకమందుఁ దన సేనాపతి యింద్రునితోను మంత్రులతోనుగూడి దేజము వెల్లను మిక్కిలియు రాజిల్లుచుండఁగాఁ జూచెను. ఆసేనాపతి దివ్యంబగు రూపంబున మేటివిమానమందు వసించి మఱియుఁ బయిపయి స్థానములకుఁ బోవుచుండెను. ఇట్లు పయిపయి స్థానములకుఁ బోవుచున్న సుదేవుం డనెడిసేనాపతి పెంపుసొంపును జూచి గొప్పమతి యగునంబరీషుఁ డాశ్చర్యపడి యింద్రునిఁ జూచి

'వాసవా! సముద్రము పొలిమేరగాఁ గలభూతలమునంతయు యథావిధిని బరిపాలించితిని. ధర్మమునుగోరి చతుర్వర్ణములయందును శాస్త్రోక్తప్రకారమునఁ బ్రవర్తించితిని, కడిఁది బ్రహ్మచర్యమునను గోప్యయాచారమునను గురుశుశ్రూషను ధర్మంబునను వేదముల నధిగమించి రాజశాస్త్రమును బూర్ణముగఁగఱచితిని. అతిథుల నన్నపానములచేతను, బితరులను శ్రాద్ధముల చేతను, ఋషులను వేదాధ్యయనదీక్షలచేతను, దేవతలను నుత్తమంబయిన యజ్ఞములచేతను. దృప్తినొందించితిని. క్షత్రధర్మమును యథాశాస్త్రముగను విధ్యుక్తముగను నాచరించితిని. సేన నాకంటఁబడినా వెనుదీయక మూర్కొని యుద్ధమున దానినిజయింతును. నే నిట్టివాఁడను. దేవేంద్రా! ఈసుదేవుఁడు తొల్లి నాకుసేనాపతిగా నుండెను. మఱియు మేటియోధ; మిక్కిలిశాంతాత్ముఁడుగను నుండెను ఆయినను నితఁడు నన్నేకారణమున నతిశయించెను? ఇతఁడు సూర్యునింబోలె వెలుఁగుచున్న విమానమెక్కి దేవలోకమున ముదంబునఁ బొదలుచున్నాఁడు. ఇతఁడు మేటి యజ్ఞములను యజించినవాఁడునుగాఁడు. బ్రాహ్మణులను విధ్యుక్తముగాఁ దృప్తినొందించినవాఁడును గాఁడు. అట్టి వీఁడు సకల దేవతలకును నెంతయు దుర్లభమయిన యిటువంటి యైశ్వర్యమునుబడసి యిట్టి నన్నట్లతిశయింపఁ గలిగెను?' అనియడిగెను.

ఇంద్రుఁడు *('రాజా! వీఁడుచేసిన కార్యము నీకుఁ బ్రత్యక్షమయినదే! మున్నునీవు ధర్మంబున భూమిని జక్కఁగాఁ బాలించుచుండుటవలన, నీక హితముగావించు శత్రువులందఱును జయిం

* ఈకుండలీకరణములోని పాఠము దాక్షిణాత్యప్రతులందే కానిపించుచున్నది.

పఁబడిరి. నీవొకప్పుడు యజ్ఞము సేయుచుంటివి. అట్టిశుభకాల మున శతశృంగుఁ డను రాక్షసుని పుత్రులు సంయముఁడు, వియ ముఁడు సుయముఁ డనుముగ్గురురాక్షసులను, యుద్ధమం దెంతయుఁ బోతరించి జయింప నలవిగాక యుండినట్టివారిని, జయించితివి. నీవు దేవతలకు హితము సేయఁగోరి యశ్వ మేధ మనెడిమహాయాగమును జేయుచుండఁగా నీకు విఘ్న ము సేయఁగోరి యాముగ్గురు రాక్షసులును నూఱుకోట్ల పరివారముగల మహారాక్షససైన్యమును గొని వచ్చిరి. అంత నీప్రజలందఱును జెఱఁబెట్టంబడిరి. నీ ప్రజలందఱును సైనికులం దఱును విహ్వలు లయిరి. రాజా! అక్కాలమందు సుదే వుఁడు నీకు సేనాపతిగా నుండెను. వానిని నీవు మంత్రుల మాటవిని సమస్తకార్యములనుండియుఁ దొలంగించి యుంటివి. అప్పుడు నీ వామంత్రుల కపటవచనములు విని జయింపనలవిగాని రాక్షసులను జంపుటకై యాసుదేవునితో 'రాక్షససైన్యమును గెలువక నీవు మరలిరాఁగూడదు; చెఱఁబెట్టఁబడిన వారిని విడిపిం పకయు మరలఁగూడదు' అని చెప్పి సకలసైన్యములం గూర్చి పంపితివి. రాజా! సుదేవుఁ డా మాటవిని పయనమై ప్రజలు చెఱఁబెట్టఁబడిన చోటికిఁబోయెను. ఆసేనాపతి ఘోరమయిన రాక్షసమహాసైన్యమునుజూచి 'ఈసైన్యమును దేవాసురు లిం ద్రునితోఁ గూడివచ్చినను గెలువఁజాలరు. దివ్యాస్త్రబల మెంతయుఁగల యంబరీషునివంటివాఁడు నీసేనయందలి పదునా అవపాలినిగూడఁ గూల్పఁజాలఁడు. ఇఁక నాఁబోఁటివాఁడు గూ ల్చుట చెప్పనేల?' అని మిక్కిలియుఁ జింత నొందెను. అంత వాఁడు నీవు కపటులగు మంత్రులందఱితోడను నమాత్యుల

తోడను గూడియున్న యెడకు సైన్యమునంతయు మరల్చి పంపెను. అంత వాఁడు జగత్పతియు వృషభధ్వజుండును శ్మశాన నిలయుండు నగుమహాదేవుని శివుని శరణుఁజొచ్చి స్తోత్రముచేసెను. అట్లు స్తుతించి యంత నాయుధముగొని తన తల నఱుక నుంకించెను. ఆదేవదేవుండు కరుణించి యాయుధముతోఁ గూడినవాని కుడిచేతిని బట్టుకొని వానినిజూచి 'పుత్రా! నీవేల యీ సాహసము చేయఁదలఁచితివి? నాకుఁ జెప్పు' మని యడుగఁగా నాసుదేవుఁడు తలనేల సోఁక మ్రొక్కి యమ్మహాదేవునితో 'దేవేశా! నా కీరాక్షససైన్యమును యుద్ధమున జయింప శక్యముగాకున్నది. కాఁబట్టి ప్రాణముల విడువనున్నాను. జగత్పతీ! మహాదేవా! ఆర్తుండగునాకు దిక్కగుము. మహాదేవా! అంబరీష మహారాజు మంత్రిసహితుఁడై యాక్రోశంబున నాతో గెలువక కాని రాఁగూడదు' అని చెప్పెననెను. అట్లు మొగమువాంచి నేల పయింబడి యున్న మహాత్ముని సుదేవునిఁజూచి యాదేవుఁడు, ప్రాణిహితముగోరి గణములతోను విగ్రహము(యుద్ధము)తోను గూడినదియు, రథగజ తురగములచేతఁ బరివృత మయినదియు దివ్యాస్త్రములచే నలంకృతమైనదియు నగుధను ర్వేదమును బిలిచి, మఱియుఁ ద్రిపురములను గెలుచుటకు సాధనమును మహాభాగ్యవంతము నయినరథమును, పినాక మనెడి వింటినిని, గత్తిని, నసురులనెల్ల వారిని జంపినదియు భయంకరము నయిన యాంపాశుపతమహాస్త్రమును నొసంగి, 'సుదేవా! నీ వీరథంబు నం దుండఁగా దేవతలకును నసురులకును నిన్ను గెలువఁ దరముగాదు. నీవు మాయచేత మోహితుఁడవై భూమియందు దడుగిడుటతగదు. నీవు రథమునందుండి దేవాసురుల నందఱను

గెలువఁగలవు. వేయిసూర్యుల కాంతిచేఁ దుఱఁగలించుచున్నది యీరథము. ఇట్టిరథమును రాక్షసులకును బిశాచులకును దేఱి చూచుటకే శక్యముగాదు; ఇఁక నీతోడ యుద్ధముసేయ నెట్లు శక్యమగును ?' అనెను. ఆసుదేవుఁడు రాక్షసుల నెల్లవారిని జయించి చెఱయం దున్నవారినెల్ల విడిపించి యారాక్షసులనం దఱ నుఱుమాడినపిదప విమునితోడఁ దలపడి బాహుయుద్ధమున హతుఁడయ్యెను. విమనుఁడును గూల్పఁబడెను. నాయనా! ఆసుదేవునకు బరాక్రమించుటవలన యుద్ధమనెడి మిక్కిలి గొప్పయజ్ఞము గలిగెను. మఱి యుద్ధముసేయు నొక్కొక్కనికి నిట్లె గలుగుచున్నది. కవచముదొడిగి సేనాముఖమునకుఁ బోయి యుద్ధముసేయునట్టి యొక్కొకయోధుఁడును నాయజ్ఞమందు దీక్షితుఁ డగుచున్నాఁడు. అట్టివాఁడు యుద్ధయజ్ఞమున కధికారము గలవాఁడగుననుట నిశ్చయము' అనెను.

అంబరీషుఁడు 'ఆయజ్ఞమందు హవిస్సులెవ్వి? ఆజ్యమెద్ది? దక్షిణయేది? ఎవ్వరు ఋత్విజులుగాఁ జెప్పఁబడుదురు? శతక్రతూ! ఇవి నాకుఁజెప్పుము' అని యడిగెను. అందులకింద్రుఁడు 'ఆయజ్ఞమందు నేనుఁగులు ఋత్విజులు; గుఱ్ఱము లధ్వర్యులు; పగవారి మాంసములు హవిస్సులు; నెత్తు రాజ్యమని చెప్పఁబడును. నక్కలు, గ్రద్దలును, గాకులు నను పక్షు లా యాగమందు సదస్యులు. ఇవి శేషించిన యాజ్యమును గుడుతురు; యాగమందలి హవిస్సును భుజింతురు. ఆయాగము చేయువానికిఁ దళతళమెఱయుచు వాఁడులై పదనుగావింపఁబడిన ప్రాసములు, తోమరములు, ఖడ్గములు శక్తులు, గొడ్డండ్రును స్రుక్కులగును. వింటినుండి వేగముగా నిగిడినవై వాఁడినై పరులదేహ

ములను భేదించునదై చక్కనై, చక్కఁగా దీటఁబడియుఁ దోడయంబడియు, నున్నబాణము పెద్దస్రువ మగును. పులితోలిగవిసెన గలదియు, ఏనుఁగు దంతపుఁ బరుఁజు గలదియునై, యేనుఁగు తొండములను నఱకునట్టి కత్తి యాయుద్ధమందు * స్ఫయ మగును. మొనలంట నుక్కుచేతఁ జేయంబడి పవియు వాఁడులునై తళతళ మెఱయుచుఁ, దీడంబడిన ప్రాసము, శక్తి, ఋష్టి, గొడ్డలి యనువీనివలనిదెబ్బ యిచ్ఛృధన మగును. యుద్ధమునందలి కోట్లవలన భూమియందు దొరుఁగు రక్తము, సర్వకామముల నొసంగునట్టిదియు సమృద్ధ మయినదియుఁగా హోతలు గావించుపూర్ణాహుతి యగును. యుద్ధపుమొనయందు 'నఱకు' 'చీల్చు' అని వినఁబడుశబ్దము యమునిరాకకుఁ గారణముగా సామగులుచేయు సామగానమగును. పగుల సేనాముఖ మాయాగమునకు † హవిర్ధానమగును. ఏనుఁగుల సమూహమును గుఱ్ఱముల సమూహమును, గవచధారుల సమూహమును నాయాగమందు ‡ శ్యేనచిత మనెడియగ్ని యగును. ఇందు వేయిమంది పడినతోడనే లేఁగునట్టి మొండెము, ఎనిమిది యంచులుగలిగి సచంద్రయూపస్తంభముగా నాయాగమున కగును. అంకుశములతోఁ బురికొల్పఁబడిన యేనుఁగుల ఘీంకారములు, § ఇడాహ్వానము లగును. రాజా ! నారిచప్పుడుతోఁగూడిన చేతిచప్పట్లు, వషట్కారమగును. ఆయుద్ధమందలి దుందుభివాద్యము

---

* స్ఫయమనఁగా యాగవేదికపయిని గీఁతలుగీచునట్టి ప్రామాణికఖడ్గ.

† హవిర్ధానమనఁగా హవిస్సు పెట్టుచోటు.

‡ యాగమందు నగ్నినుంచుటకు డేగ యాకారముగాఁ గట్టఁబడు మేడ.

§ ఒకవిధమయిన హవిస్సును వేల్చునపుడు దేవతలను బిలుచుట.

మూఁడుసామములయుద్గాత యగును. బ్రాహ్మణుల ధనమును బగవా రపహరించునపుడు యుద్ధమందుఁ బ్రియమయిన దేహమును విడిచి దానిని యూపముగానాఁటి చేయునట్టి యాయాగమక్షయం బగుదక్షిణ గలదియగును, ఏశూరుఁడు భయంబునఁ దిరుగువడక యొడయనికొఱకు సేనాముఖమున నిలిచి వెలువడునో వానికి నాలోకములవంటి లోకములు సిద్ధించుచున్నవి. ఎవని యుద్ధవేదిక పులితోలి యొఱలుగల కత్తులచేతను బరిఘములకుఁ బాటియైన చేతులచేతను బఱవంబడియున్నదో వానికి నాలోకమువంటి లోకము సిద్ధించును. రాజా! సేనామధ్యమందుఁ జొచ్చి సంకటమునం దుండునపు డెవఁడు వేఱొకసహాయమున పేక్షింపకుండునో వానికి నాలోకమువంటి లోకములు సిద్ధించును. యుద్ధముసేయునపుడు రక్తమహానదిని బుట్టింపవలయును. అది నెత్తురు వెల్లువలును భేరు లనెడుకప్పలును దాఁబేళ్లును గలది; వీరులయెముకలనెడు మొరపఱాలచేఁ బోవరానిది. మాంసరక్తములనెడి రొంపితోఁగూడి వాలుపలక లనెడు తెప్పలును, వెండ్రుక లనెడు ప్రాఁచితీఁగలును బచ్చికయుఁ గలది. ఘోరమై తునిసిపడిన గుఱ్ఱములయు నేనుఁగులయు రథములయుఁ బ్రోవు లనెడువంతెనలు గలిగి పతాకలును ధ్వజములు ననెడు ప్రేఁపబొదరులను, జచ్చిన యేనుఁగులశరీరము లనెడు పెనుమొసళ్లను యష్టులును ఖడ్గములు ననెడు పెనుచేఁపలును, గ్రద్దలును గంకపక్షులగుంపు లనెడి తేలుచున్న తెప్పలును గలిగియుండును. అది నెత్తు రనెడునీళ్లతో నిండి పరలోకమునకుఁ గొంపోవునదగును. దానిని రాక్షసు లనుసరింతురు. అది పిఱికివారలకు జంకు గలిగించునట్టిది. అది గడిదేఱిన వారలకును దాఁటుట

కెంతయుం గష్టము, ఇట్టినది యేయోధుని యుద్ధమునందుఁ గలుగుచున్నదో యది వాని * కవభృథమగును. అనఁగా నట్టినదిని గలిగించునేని యుద్ధయజ్ఞమును బూర్తి గావించుటకుఁ జేయునవభృథ మది వానికగును. ఎవని యుద్ధయజ్ఞపు వేదిశత్రువుల శిరసులచేతను గజతురగములు కుత్తుకలచేతను బలివం బడుచున్నదో వానికి నాలోకమువంటి లోకములు సిద్ధించును. ఎవనికి శత్రువుల సేనాముఖము † పత్నీశాలగాను, తనసేన హావిర్ధానము గాను, తనకు దక్షిణమందుండు యోధులు సదస్యులుగాను, నుత్తరమం దుండుయోధుల ‡ నాగ్నీధ్రులుగాను గావించునో, మఱి శత్రుసేవలను దనయిల్లాలివలెఁ జూచునో, వాఁ డుత్తమలోకములను బొందునని ప్రాజ్ఞులు చెప్పుదురు. § రెండుప్రక్కల యుద్ధమునకై పన్నియున్న రెండు సైన్యములకును నడుమనున్నబయ లట్టి యాజకునకు వేదియగును. పన్నిన వ్యూహములు మూఁడగ్నులగును. ఆవ్యూహములచే నతఁడెప్పుడు నావేదియందు యజ్ఞము చేయును. ఏయోధుఁడు భయపడి మరలఁబడి పరులచేత హతుఁ

---

* యాగపూర్తికై చేయు కడపటి స్నానజలమగును.

† యాగము చేయువాని పత్నియుండుచోటు.

‡ అగ్నీధ్రు లనఁగా నొకఋత్విజుఁ డుండునట్టిస్థలము.

§ యస్యతూభయతో వ్యూహే భవత్యాకాశ మగ్రతః, సాస్య వేది స్తదా యాజ్ఞైర్నిత్యం వ్యూహా స్త్రియోగ్నయః' అని. దా. మూలము. నిత్యం వేదా స్త్రయోగ్నయః' అని నీలకంఠాదులపాఠము. వేదము లనుటకంటె వ్యూహములనుట ప్రాకరణికము. ఇట ఎవ్వని రెండు ప్రక్కలను (అనఁగాఁ దనప్రక్కనున్నదియు తనయెదుటనున్న పగవారిదియునగు)పన్నియున్న సేనలలో నెదుటఁ బన్నియుండునది(అనఁగా శత్రుసేన)పట్టబయలగునో(అనఁగా నిర్మూలము గావింపఁబడునో)

డగునో వాఁడు నిలుకడదప్పి నరకము నొందుననుటకు సందియము లేదు. ఎవని (యుద్ధ)వేది రక్తప్రవాహముచేతఁ జక్కఁగాఁ దడుపఁబడినదై వెండ్రుకలచేతను మాంసముచేతను నెమ్ములచేతను నెరసినదగునో వాఁ డుత్తమగతి నొందును. ఎవఁడు సేనాధిపతిని జంపి వానివాహనముపయి నెక్కునో వాఁడు విష్ణుపరాక్రమమునకు సాటయైనపరాక్రమముగలవాఁడును, బృహస్పతిం బోలినవాఁడును బ్రభువునగును. ఎవఁడు రాజునో, యతనిపుత్రునో, యతనిచేతఁ బూజితుఁడగు మనుజునో, ప్రాణములతోడఁ బట్టునో, వానికి నాలోకములవంటి లోకములుసిద్ధించును. యుద్ధమందు హతుఁడయిన శూరునిగుఱించి యెంతమాత్రమును శోకింపరాదు. హతుఁడయినశూరుఁడు శోకించుటకర్హుఁడుగాక స్వర్గలోకమునందుఁ బూజితుఁడగును. యుద్ధమందు హతుఁ డయినవానికి, నన్నదానము నుదకదానమును, స్నానమును, ఆశౌచమును పెద్దలుగావింపఁగోరరు. వానికగులోకములను జెప్పెదనుపినుము. యుద్ధమందు హతుఁడయినశూరుని గుఱించి 'నాకు భర్తగావలయు' నని పెక్కువేల యచ్చరమిన్నలు వేగంబునఁ బాఱుతెంతురు. యుద్ధమందు వెన్నిచ్చి పాఱనివానికిఁ దపస్సును బుణ్యమును సనాతన మయినధర్మమును నాలుగాశ్రమములును సిద్ధించుచున్నవి. ముసలివానిని, బాలునిని, స్త్రీనిని, బూరి

---

యపుడాతని (యుద్ధయజ్ఞపు)వేది యజ్ఞములచే నిండినదగును.(అనఁగా నెదుట నేనను నిష్టాలనుఁ జేసి నప్పటిబంధములు గావించు నేని యతఁడు యుద్ధయజ్ఞము చేసి తీర్చినవాఁడగుననుట). ఈపాఠమున 'తదాయజ్ఞే' అనుటకు 'తతోయజ్ఞై' రని గ్రహించునది. ఈపాఠ మేసమంజసము. అట్టివాని కన్నిలోకములును సమీపమందున్నవి యగును. అంచలి వ్యూహములే యతనికి మూఁడగ్నులని యర్థము.

గఱచినవానిని, 'నీవాఁడ' నన్నవానిని గొట్టరాదు. పిఱిఁది ప్రక్క నుండి కొట్టనుఁదగదు. నేను వృత్రాసురునిని, బలునిని, పాకా సురునిని, మహాకాయునిని, విరోచనుని, వారింపరాని నముచిని, పెక్కుమాయలుగల శంబరునిని, విప్రచిత్తిని, ప్రహ్లాదుని, దనుపుత్రుల నందఱను యుద్ధంబునఁ జంపి పిదప దేవతలకు రాజ నయితిని' అనెను.

ఇట్లింద్రుఁడు చెప్పినదివిని యతనిని బూజించి యంబరీషుఁడు తనయోధులు పొందునట్టిసిద్ధిని దెలిసికొనెను. ఇది తొంబది యెనిమిదవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

(భీష్ముఁడు, జనకుఁడు తన సేనల నుత్సాహపఱచి యుద్ధమునకుఁ బంపుటను, వ్యూహములుపన్నుట మొదలగువానిని జెప్పుట.)

భీష్ముఁడు-'ఈవిషయమై ప్రతర్దనుఁడును జనకుఁడును జేసిన యుద్ధమును గుఱించి పురాతనమయిన యీ యితిహాసము నుదాహరించుచున్నారు. ధర్మరాజా ! మిథిలాపతి యగుజనకుఁడు యుద్ధ (మనెడి యజ్ఞ) మునకు యజ్ఞోపవీతమును దాల్చినవాఁడై తనభటులను నుత్సహింపఁజేసెను అది చెప్పెదను వినుము. ఆజనకుఁడు మహాత్ముఁడు, సకలతత్త్వములను దెలిసినవాఁడు; కాన, యతఁడు తనయోధులకు యోగబలమున స్వర్గమును నరకమును జూపి 'ఇవిగోఁజూడుఁడు: భయములేని వారికి మిక్కిలియుఁ బ్రకాశించుచున్న యీలోకములు గలుగును. ఇందు గంధర్వసుందరీమణులు గ్రందుకొని యున్నారు. ఇవి

యక్షయములు; సమ స్తకామితములను బిదుకునవి. ఇవిగోఁ జూడుఁడు. భయపడి పరుగిడువారికి, నరకము లని చూపట్టు చున్నవి. అందు,వారు శాశ్వతమయిన యపకీ ర్తితోడఁ గల కాలముఁ * గ స్తి గుడుచుచుండవలయును. ప్రాణములు దిగ విడుచుటకు నిశ్చయించి పగవారిని గెలువుఁడు. అపకీ ర్తికర మయిన నరకమునకుఁ బాలుగాకుఁడు. యుద్ధమునందు దేహ మును ద్యజించుటయే శూరులకు న త్తమమయిన స్వర్గద్వా రము' అనెను. ఆరా జిట్లు చెప్పఁగా మిధిలాపురపు యోధులు రాజున కుబ్బుగలుగునట్లుగా యుద్ధమునఁ బగవారిని జయించిరి. కాఁబట్టి ప్రాణములు విడువఁ దెగించియే యుద్ధాగ్రమం దెప్పు డును నిలువవలయు. ఏనుఁగులనడుమ రధికులను నిలుప వలయును. రధికులపిఱుఁద గుఱ్ఱపురౌతుల నిలుపవలయును. వీరికిఁ బిఱుఁదఁ గవచధారు లగుకాలుబంట్ల నిలుపవలయును. ఈరీతిని వ్యూహమును బన్నురా జెప్పుడును బగవారిని జయిం చును. కాఁబట్టి, యుధిష్ఠిరా ! ఈవిధముననే యొడ్డు పన్న వలయును. స్వర్గమందు సుఖమును గోరువారు, మిక్కిలి రోషము గడలుకొనఁగా లెస్సగా యుద్ధము సేయుదురు. అట్లు యుద్ధముసేసి మకరములు సముద్రమునుం బోలెఁ బర సైన్యములను గలగుండుపఱుతురు. వా రొండొరులకు దిట గలిగించుకొని తెంపుదూలియున్నట్టివారికి నుబ్బుకలిగింపవల యును. అట్లు గెలిచినవాఁడు గెలిచినభూమిని బాధలు పొరయ కుండ రక్షింపవలయును. తనభటులు, భంగమునొంది పాఱినశత్రు

---

* 'పతితవ్య మన న్తరమ్' అని. ఔ. మూలము. 'యతితవ్య మన న్తరమ్' అని దాక్షిణాత్యకోశములందు పాఠము చూపట్టుచున్నది.

వులను మిక్కిలి వెంటనంటి వారింపకుండునట్లు చేయవలయును. శత్రువులు పాఱిపోయియు బ్రదుకుఁదెరువు గానమిచే నాశలుడిగి మరలఁ బయిని బడుదురేని వారలయురవడిని సహించుట యెంతయుఁ గడిఁది. కాఁబట్టి వారలను మీఁదుమిక్కిలి తన సైనికులు వెంటాడకుండునట్లు చేయవలయును. కనుక శూరులయినవారు భయమునఁ బరుగిడువారినెంతమాత్రమును గొట్టరు చుమీ. కాఁబట్టి పాఱిపోవువారిని మిక్కిలి వెంటనంటి పోనీయరాదు. చరములగు వానికి నచరములును, కోఱలుగల వానికిఁ గోఱలు లేనివియుఁ, * చేతులు గలవానికిఁ జేతులు లేనివియు, శూరులకుఁ బిఱికివారును, నాహారమగుదురు. పిఱికివారు తమ్ము గెలిచినవారివలెనే వీఁపును, గడుపును, జేతులును, గాళ్లునుగలిగియుండియు, † బాణములను బిఱిఁదికినుంచి పోవుదురు. కాబట్టి భయార్తులగువారు మరలి దండముపెట్టి యంజలిసేసి శూరుల మోల్ల నిలుచుందురు. ఈలోకము, తండ్రిచేతులయందు బిడ్డఁడుంబోలె శూరులచేతులయందు వ్రేలుచున్నది. కాఁబట్టి సమస్త లోకములందును శూరుఁడు సమ్మానమునొంద నర్హుఁడు. శౌర్యమునకంటె నెక్కుడయినదేదియు మూఁడులోకములందును గలుగదు. శూరుఁడు సమస్తమును బాలించుచున్నాఁడు. సర్వమును శూరునియందు నెలకొనియున్నది" అనెను. ఇది తొంబదితొమ్మిదవయధ్యాయము.

---

* 'అపాణయః పాణిమతామ్' అని మూలము. 'అపఃపిపాసతామన్నం' అని జొ. మూలము. దప్పిగొన్నవానికి నీళ్లు నన్నమని తాత్పర్యము.

† 'పశ్చాచ్ఛరం భీరవోఽనువ్రజన్తి' అని దా. మూలము. 'పరాభవం భీరవో వైవ్రజన్తి' అని జొ. మూలము.

## రాజధర్మపర్వము.

### భీష్ముఁడు ధర్మరాజునకు యుద్ధము చేయు విధము మొదలగు వానిని జెప్పుట.

ధర్మరాజు 'భరతసత్తమా! జయమును గోరువారు ధర్మమును గొంచెము పీడించియేనియు నెట్లు (రాజువలని భయము చూపి) యుద్ధమునకు సేనను నడపించుకొని పోదురు? ఇది నాకుఁ జెప్పుము.' అని యడిగెను.

భీష్ముఁడు-'కొందఱు ధర్మము సత్యముచేతఁ గుదురుగలిగియున్నది చెప్పెదరు. కొంద ఉపపత్తిచేత ననియుఁ జెప్పెదరు. కొందఱు మంచినడవడిచేత నందురు. కొంద ఉపాయములచేత నని చెప్పెదరు. నేను దోడనే యర్థసిద్ధిని గలిగింపఁ జాలినయుపాయములను ధర్మములను జెప్పెదను వినుము. దొంగలు మర్యాదలనెల్ల నుల్లంఘించి ధర్మాదులకు నాశకు లగుచున్నారు. వారలను వారించుటకును వేదోక్తము లయినయుపాయములను జెప్పెదను. కార్యములు లెస్సగా సిద్ధించుకొఱకు వానిని దెలిసికొనుము. ప్రజ్ఞ ఋజువగునది, వంకరయైనది యని రెండు విధములు. ఆరెంటిని రాజు తెలిసికొనవలయును. రాజు వక్రమును దెలిసికొనియున్నను దాని (నితరులను బాధించుటకై) ప్రయోగింప

---

* 'సత్యే ఏహిస్థితా ధర్మఉపపత్త్యా తథాపరే' అని జో. మూలము. 'సత్యే ఏహిస్థితా ధర్మఉపపత్త్యా తథాపరే' అని దా. మూలము. 'యథార్థంబగు క్షత్రధర్మము చొప్పునఁ గొందఱు ధర్మంబునందున్నారు. మఱికొందఱు మరణము గలదని నిశ్చయమున, ధర్మమం దున్నారు, అని యర్థము.

రాదు. అతనిని నపాయములు పైకొననేని వానిని బాధించుట
కై దానిని గయికొనవచ్చును. శత్రువులు రాజునకు (వారివారిదగు
మంత్రులు సైనికులు మొదలగువారియందు) భేదము గలిగించి
* యపచారము చేయుదురు. రాజు వంచనను జక్కఁగా నేర్చి
యుండి దానితోడ్పాటున నాశత్రువులకుఁ బ్రతికారము చేయ
వచ్చును. భారతా! ఏనుఁగుల కవచములును, నావులయు నెద్దు
లయుఁ గొండచిలువలయు తోళ్లును, అలుఁగులును, ముండ్లును,
నినుపమేకులును, మేలయినకవచములును, పదును జేసినయాయు
ధములును, జక్కఁగాఁదోడయంబడిన యినుపకవచములును నుం
డవలయును. పతాకలును ధ్వజములును పలురంగులు వేయంబడి
యుండవలయును. ఋష్టులును దోమరములును గత్తులును గొడ్డం
డ్లును, వాఁడులుగా నుండవలయును. పలకలచేతను దోళ్లచే
తను గావింపఁబడిన పలువగల కేడెములును మిక్కుటముగా
నేర్పఱుచుకొనవలయును. ఆయుధములను జక్కఁగా నాయిత
పఱిచినవిగాను బంట్లు తెగింపుగలవారుగాను నుండవలయును.
చైత్రమాసమందుఁగాని మార్గశీర్షమాసమందుఁగాని, దండువెడ
లుట యుత్తమము; అప్పుడు భూమియందుఁ బయిరులు లెస్సఁ
గాఁబండియుండును. జలమును సమృద్ధముగాఁ గలిగియుండును.
కాలమును మిక్కిలి చలువయు వేఁడియుఁ గాకయుండును. కాఁ
బట్టి యీకాలమందుఁగాని లేక పరులకు సంకటమయిన కాలమం
దుఁగాని ప్రయత్నము చేయవలయును పరులను బీడించువిషయ
మున సేనల కీయుపాయము లుత్తమములగును. జలమును

* 'భేదేనాపచరన్తి' అని ఝా. మూలము. 'భేదేనోపచరన్తి' అని దా.మూ

బుల్లును గలదై, సమమై, అడవియందున్న సమర్థులగు వేగుల వాండ్రు చక్కఁగాఁ బనుపడి తెలిసియుండునట్టిదారి పోవుటకుఁ దగినదిగా వన్నెకెక్కి యున్నది. మృగసమూహములవలె నడవులంబోవుట శక్యముగాదు. కాఁబట్టి జయమునుగోరునట్టి వారు, సేనలకడ నాయడవినుష్యులనే చేర్చియుంతురు. శక్తి మంతులును సత్కుల ప్రసూతులు నగుజనులు ముందుపోవల యును, జలముగలదియు దాపునఁ బచ్చికబయలు గలదియు నగుదారి విడిపట్టుగానుండుటకు నుత్తమమయినది. అట్లుండిన చోఁబరుల దూతలను వారింపనలవియగును. యుద్ధమందు సమర్థు లయిన జనులు, పలువిధములయిన గుణములు మిక్కిలిగా నుం డుటచే నడవిదాపున నున్నబయలును నుత్తమమయినదని తలఁ చుచున్నారు. సేనలకు మిక్కిలి దూరముగానిచోట బొక్కస ముండవలయును. బొక్కసముదాపునఁ గాలుబంట్లు దిగు నట్లును మఱేఁగియుండునట్లును జేయవలయును. ఇది యాపత్కా లమందుఁ బగవారిని జంపుటకు ముఖ్యకారణమగును. సప్తర్షి నక్షత్రములను మున్నిడికొని కొండలంబోలినవారై యుద్ధముచే యవలయును. ఈవిధిచొప్పున, జయింప నసాధ్యులయిన పగవా రినిని జయింపఁగోరవచ్చును. వాయువును సూర్యుండును జంద్రుం డునుగల పక్షమందు జయముగలుగును. యుధిష్ఠిరా! ఈరెండు పక్షములును గూడికగలదేని, వీరియందు మునుము న్నుండు వారు మిక్కిలి శ్రేష్ఠులు. యుద్ధమందు సమర్థులయిన జనులు, రొంపిలేనిదియు జనులులేనిదియుఁ బ్రాకారము మొదలయిన గట్లునులేనిదియు మట్టిగడ్డలులేనిదియు నగుభూమిని, గుఱ్ఱము లకుఁ దగినదని కొనియాడుదురు. మిట్ట పల్లములు లేనిదియును

రొంపి లేనిదియును, బొఱియలు లేనిదియు నగుభూమి తేరులకు నుత్తమమగును. చిన్న చెట్లు గలదియు మిక్కిలియుఁ బులు గలదియు జలముతోఁగూడినదియు నగుభూమి యేనుఁగుల నెక్కి యుద్ధము సేయువారికి నెంతయు మేలయినది. పెక్కు దుర్గములుగలదియుఁ బెనుపొదరులుగలదియు వెదుళ్ల చేతను బ్రేప పొదరులచేతను మఱుఁగుపడినదియు నగుభూమియుఁ బర్వతము లును నడవిపట్టులును గాలుబంట్లకుఁ దగినవగును. కాలుబంట్లు బహుళముగాఁ గలిగిన సేన మిక్కిలిదృఢముగానుండును. వానలేని మంచిదినములందు రథములును నశ్వములును గలసేన మిక్కిలి యొప్పును. వానకాలమందు కాలుబంట్లును నేనుఁగులును మిక్కిలి గలసేన యెంతయునొప్పును. ఈగుణములనును దేశకాల ములను జక్కఁగాఁ దెలిసికొని, సేనను యుద్ధమునకుఁ బంపవల యును. ఇట్లు చక్కఁగా నెఱిఁగి మంచి తిథినక్షత్రములందు, నా శీర్వాదములును బడసి, సేనను జక్కఁగా నడపించుకొని పోవు వాఁడే యెప్పుడును జయమునొందును. ఎదురపోవువారిని దప్పి గలవారినిని శ్రమపడినవారినిని తటస్థుఁడుగా నుండువానిని * యుద్ధము నిలిచియున్నపుడును, పరుగెత్తి పోవుచున్నపుడును, దారిని సన్నాహము లేక పోవుచున్నపుడును, త్రాగునపుడును, గుడుచుచున్నపుడును, గొట్టరాదు. పిచ్చివానిని, బుద్ధికలఁగి యున్న వానిని, మిక్కుటముగా గాయపడియున్నవానిని, గాయములచే సత్తువ మిక్కిలియు సురిఁగినవానిని, నమ్మికతో నిలుచున్నవానిని, ఒక కార్యము నారంభించి ముగింపలేకున్నవానిని, సురంగములు

---

* 'మోక్షే ప్రయాణే చలనే పానభోజనకాలయోః' అని మూలము. 'మోక్ష మార్గమునను్నపుడు' అని ప్రతాపచంద్రరాయలు.

మొదలైనవి శేషశిల్పములందు నిపుణుఁడయినవానిని, దుఃఖమొందినవానిని, బండములు పచ్చిక మొదలగువానిని దెచ్చుటకై శిబిరమునుండి వెలుపలఁబోవువానిని, శిబిరములునిర్మించువానిని, దానివెంటఁబోవువానిని, పరంపరగా రాజుద్వారమునుహత్తుకొనియుండువానిని, మంత్రిద్వారమందుండువానిని, సేనయందలి ముఖ్యులకుఁ బరిచర్య సేయువానిని అట్టివారికి నధిపతు లయినవారినిని గొట్టరాదు. నీసేనయం దెవరు పరులసేనను భేదింతురో, తమసేనను భేదించినయెడల మరల నొకటిగాఁ గుదురుపఱుతురో, యట్టివారికి నీతోఁబాటిగా భోజనమును బానమును జరుపుటయేకాక వారి వేతనములను రెండింతలు గావింపవలయును. మఱియు నట్టివారిజాతియును గోత్రమును దెలిసికొని వారుచేసిన యుత్తమం బయినకార్యమును గనుఁగొని, తనకు సమానముగా శరీరమును రక్షించుటకై వారికి వేతనము రెండింతలు మూఁడింతలు నాలుగింతలును గావింపవలయును. అట్టివారియందుఁ బదిమందికి నధిపతియైనవారిని నూఱుగురకు నధిపతులుగా నియమింపవలయును. పిదప వారియందు సోమరితనములేనివాఁడును శూరుండు నగువానిని వేయిమందికి నధిపతిగా నియమింపవలయును. ముఖ్యులుగానుండువారి నొక్కటిగాఁ గూర్చి 'మనము జయమునొందుటకై యొకరినొకరు విడువరాదని * శపథముచేయుదము. ఎవ్వరు పిఱికివారో వారిచ్చటనే నివర్తింపవచ్చును. దొమ్మిగా యుద్ధముజరుగుచుండఁగా శూర

* 'సంశపామహే' యని మూలము. 'సంశయామహే' అని పాఠాంతరమెంతయు అసంగతమును అప్రాకరణికమునుగాన పరిత్యజింపఁబడినదని తెలియునది.

ముగా నడచుకొనుటకు నుపేక్షించి తమముఖ్యులను నితరులచేఁ జచ్చునట్లు చేయువారును నిచ్చటనే నిలిచిపోవచ్చును. తానును యుద్ధమునుండి విడిపోక తనపక్షమువారిని నెదిరికిఁ జంప వీ లియ్యక యుండునట్టివారు వత్తురుగాక. తమ్మును దమపక్షపువారినిని రక్షించుకొందురేని యట్టివారు యుద్ధమునఁ దప్పక శత్రువును జంపుదురు. యుద్ధమునఁ బలాయనమగుటవలన ధననాశమును, వధమును, నిందయు, నపకీర్తియుఁగలుగును. ప్రాణసంశయము కలిగినపుడు పరుగెత్తువాఁడును, పెదవులును పండ్లును మూలిన వాఁడును (సిగ్గుపీడినవాఁడును), ఆయుధము దిగవిడిచినవాఁడును, సహాయులను విడిచి పరుగెత్తినవాఁడును, శత్రువులచేఁ జెఱఁ బడినవాఁడును, మనసునకుఁ గట్టువై వినుటకు దుఃఖకరమయిన మాటలను వినవలసివచ్చును. ఇట్టివెప్పుడును మనశత్రుపక్షమువారికిఁ గలుగుఁగాక. ఎవరు యుద్ధమునకుఁ బెడమొగము పెట్టుదురో వారు మనుష్యులందు నధములగుదురు. వారుమనుష్యుల మొత్తమును బెంచుటకుమాత్రమే యైనవారుగాని యిహమునందును బరమునందును వారుండియు ఫలము లేదు. పరుగెత్తుచున్నవారిని జయశీలురయిన శత్రుపక్షపువారు మనంబుల సంతోషము గడలుకొన * వందిజనుల స్తోత్రములు చెలంగ వెంబడించి పోదురు. †శత్రువులోకనిని యుద్ధమందుఁ దారసిల్లి వానియశమును బోకా

* 'వందినాం మండలేనచ' అనిమూలము. 'వందనైర్మండలేనచ' అనియు 'మంగళైర్వంగనేనచ' అనియు 'మంగళైశ్చందనేనచ' అనియుఁ బాఠాంతరములు.

† 'యస్య స్మసంగ్రామగతా యశో హైఘ్నన్తిశత్రవః। తదసహ్యతరం దుఃఖమహంమన్యే వధాదపి' అని గౌ. మూలము. యస్యస్మవ్యసనేరాజన్నను మోదన్తి

ర్తురేని యది వధమునకంటె మిక్కిలియుసహింపరాని దుఃఖమని నేను దలఁచుచున్నాను. * జయమే ధర్మమునకును, సమస్తసుఖములకును మూలమని తెలియుఁడు. † పిఱికివాండ్రు దేనిని మిక్కుటమయిన (నలఁకువ)గా నెంతురో దానిని శూరుఁడు సొంపునఁ బొందును. మనము స్వర్గమును బడయఁగోరి ప్రాణములను సరకుసేయక యుద్ధముసేయుదము; జయించినను వధింపఁబడినను మనము సద్గతిఁబొందుదము' అందురు. ఇట్లు వీరులగువారు శపథముచేసికొని ప్రాణములనెంతమాత్రము లక్ష్యపెట్టక భయమించుకయులేక శత్రుసేనాసమూహమును జొత్తురు. ముందటవాలును బలకయుం గలమనుష్యులదళము నుంపవలయును. పిఱుందఁ దేరులును బండ్లును నుండవలయును. ఈరెంటికినడుమఁ దక్కిన రక్ష్యంబగుసేనయుఁ, బరులను మార్కొని వారించుకొఱకు పదాతులను, నిట్లు నడుమనుంచి మఱుఁగుపఱుపవలయును. ఆసైన్యమందు మిక్కిలి యాఱితేఱిన దిట్టలగువారు

---

శత్రవఃౕతదసహ్యతరందుఃఖం మన్యన్తేమరణాదపి' అని దా.మూలము. శత్రువులొకనిదుఃఖమునకు సంతోషింతురేని యది మరణమునకంటె వానికి దుస్సహమని తలంతురని యర్థము. ఇది సంగతముగాదు.

* 'జయం' అని ఔ. మూలము. 'శ్రియమ్' అని దా.మూలము. ఇది యుపపన్నముగాదు గాన పరిత్యాజ్యము. ప్రతాపచంద్రరాయలును జయమనియె గ్రహించియున్నారు.

† 'యాభీరూణాం పరాగ్లానిశ్శూరస్తా మధిగచ్ఛతి' యుద్ధపుఁగష్టమును పిఱికివారు గొప్పదిగాఁ దలఁతురుగాని శూరులు దానిని సొంపుగాఁగొని తృణీకరింతురని భావము.'పరాఖ్యాతిః'అని దా. మూలము. పిఱికివాండ్రు పెనుకీర్తిని శూరులు గొందురని యర్థము. పిఱికివాండ్రకు ఖ్యాతిగాని పెనుఖ్యాతిగాని యెక్కడిది ?

ముందునిలిచి పోరాడవలయును. వారు తమపిఱుంద నున్నసైని కులను గాపాడుదురు. మంచిబలిమియు ధైర్యమును గలవారుగా నభిమతు లగునట్టివారిని సేనముందఱ నుంపవలయును. తక్కిన జనులు వారిని మున్నిడికొని పిఱుందనుండవలయును. భయపడు వారికిఁ బ్రయత్నపడి యుత్సాహము కలిగింపవలయును. వారిని, సైన్యపుమొత్తమెక్కుడుగా శత్రువులకుఁ జూపుకొఱకుమాత్ర మేని సేనకు సమీపమం దుండునట్లు చేయవలయును. సైని కులు కొందఱే యుండిరేని వారిని దగ్గఱగాఁగూర్చి యుద్ధము చేయింపవలయును. ఒకవేళ సేనాపతి యిష్టపడెనేని, దగ్గఱగాఁ గూర్చినకూర్పును విరివిగానుండునట్లు విస్తరింపఁజేయవచ్చును. ఒక కొందఱుసైనికులు పెక్కండ్రతోఁ బోరాడవలసి వచ్చి నప్పుడు సూచీముఖ మనెడియొడ్డు పన్నవలయును. స్వల్పసైన్యము పెద్దసేనతోఁ బోరాడునపుడు, మొదటిదానిసేనాపతి తమవారు సమానముగాఁ బోరుచున్నను, తక్కువపడుచున్నను, నిజమయి నను, అబద్ధమయినను, చేతులనుబట్టుకొని 'శత్రువులు విఱిగిరి, విఱిగిరి' యని బిగ్గఱఁగాపెట్టవలయును. వారియందు మి క్కిలి బలవంతులగువారు 'మనమిత్రబలము వచ్చివేసినది. కొ ట్టుఁడు భయమువల' దని భయంకరములగు చప్పుళ్లుసేయుచు నెదుర్కొని మైపడవలయును. తక్కినవారికి ముందుండువారు సింహనాదములను గిలకిలమను ధ్వనులనుగావించుచు, క్రకచము లను, కొమ్ములను, భేరులను, మృదంగములను, బణవములను, మునుపడఁ జెలంగునట్లు చేయవలయును' అనెను. ఇది నూఱవ యధ్యాయము.



## రాజధర్మపర్వము.

{భీష్ముఁడు ధర్మరాజునకు యోధులలక్షణములను జెప్పుట.}

ధర్మరాజు 'భారతా! యోధులు యుద్ధమునకుఁ జాలియుండుటకు నెట్టిశీలముగలవారుగా నుండవలయును? వారిపూన్కి యెట్టిది గావలయును? వారి రూపములును, సన్నాహములును, శస్త్రములు నెట్లుండవలయును?' అని యడిగెను.

భీష్ముఁడు 'ఈవిషయమున యోధులకు వారివారి యాచారములచొప్పున శస్త్రములును వాహనములును విధింపఁబడుచున్నవి.*ఆచారమునుబట్టియేకదా యీలోకమందుఁ బురుషుఁడా యాకర్మములందుఁ బ్రవర్తించుచున్నాఁడు. గాంధారదేశపువారును, సింధుదేశీయులును సౌవీరదేశపువారును భయము లేక మిక్కిలియు బలవంతులై తమ నఖములచేతను, ప్రాసములచేతను యుద్ధముచేయుదురు. వారిబల మంతటను దుదముట్టియుండును. ఉశీనరదేశపువారు బలవంతులై సమస్తాయుధములందును నిపుణులైయుందురు. తూర్పుదేశపువారు గజయుద్ధములందుఁ గుశలులై కపటయుద్ధముచేయువారగుదురు. అట్లె యవనులును గాంభోజులును మథురచుట్టునుండువారును గుఱ్ఱపుయుద్ధమందు సమర్థులుగానుందురు. దక్షిణదేశపువారు వాలును బలకయునుగొని యుద్ధముచేయుదురు. మిక్కిలి సత్వమును, మిక్కిలి బలమును గలశూరు లన్నియెడలను బుట్టుదురనుట

---

*'ఆచారాద్ధిహిపురుష స్తథాకర్మసుప ర్తతే' అని (దా. మూలము). 'ఆచరేత్ వీరపురుష స్తథా కర్మసుప ర్తతే' అని జౌ.పాఠము. నీలకంఠపాఠము నిదియే. వీరపురుషు లిట్టిసాధనములుగొని యుద్ధకర్మములందుప ర్తింతురని యర్థము.

ప్రసిద్ధము. అవంతిదేశపువారు మహాశూరులుగా నుందురు. మాళవదేశపువారు చతురంగములందును మహాశూరులు. వీరలయం దొక్కఁడొంటిమెయినుండినను,యుద్ధమందు వేయిమందిని మార్కొనఁగలఁడు. దేశములను బహుతరముగా గుర్తించితిని. ఇఁక శూరులలక్షణములను జెప్పెదవినుము. సింహమును బులియుంబోని కంఠధ్వనియుఁ గన్నుఁగవయుఁగలవారును,సింహమువలెను బులివలెను నడచువారును, పావురాలవలెను బాములవలెను గన్నులుగలవారందఱును, శూరులును పగవారినిగలంచి నలంపఁజాలునట్టివారునై యుందురు. జింకల యెలుంగువంటి యెలుంగుగలవారును, పులివలెను *ఆఁబోతువలెను గన్నుఁగలవారును, శత్రువులను గలంచి నలంచునట్టివారై మిక్కిలి చుఱుకుఁదనము గలిగియుందురు. చిఱుగంటలవంటి యెలుంగుగలవారు † పరాకుగలవారును మందులును గోపస్వభావులు నగుదురు. మేఘధ్వనివంటి యెలుఁగుగలవారును గ్రూరములయిన ముఖములుగలవారును ‡ లొట్టియవంటి మొగముగలవారును వంకరయగు కొనముక్కును నాలుకయుఁగలవారును, మిక్కిలియు దూరము చనఁజాలువారును,దూరమునుండియే గుఱిపెట్టి యేయ నేర్చినవారునగుదురు. పిల్లివలె గూనుగలవారును కదలిక

* 'ఋషభాక్షా స్తరస్వినః' అని మూలము. 'ఋషభాక్షా స్తథాపరే' అని దా. మూలము.

† 'ప్రమాదినశ్చ మందాశ్చ' అని ఔ. మూ. 'ప్రమాథినశ్చ మందాశ్చ' అని దా. మూలము.

‡ 'కేచిత్కరభసన్నిభాః' అని ఔ. మూ. 'కేచిచ్చ కలనిస్వనాః' అని దా. మూలము.

లేని కన్నులుగలవారును, కొంచెపాటి వెండ్రుకలును మిక్కిలి పలుచని తోలుగలవారును, వేగముగలవారుగను జంచలచిత్తులుగను దగ్గఱవసింపరాని వారుగను నుందురు. *ఉడుమువలెఁ గన్నులు మొగిడియుండ, మెత్తనిస్వభావమును, గుఱ్ఱమువంటివేగమును గంఠధ్వనియును గలవారు సకలశత్రువులను గడతేర్ప శక్తులగుదురు. చక్కని మేనికట్టును, జక్కనియవయవములును, నిక్కగల ఱొమ్మును గలవారును, పగవారి వాద్యధ్వనులు విన్నంతనే సైఁపక కుపితు లగువారును, కలహములం దుబ్బి చెలరేఁగువారును, గంభీరములగు కన్నుఁగవ గలవారును, వెలికుఱికిన మిడిగ్రుడ్లుగలవారును, పింగళవర్ణములగు కన్నులుగలవారును, బొమముడిపడి యుండు ముఖములుగలవారును, ముంగిసవంటి కన్నులు గలవారును, వీరందఱును శూరులై యుద్ధమందు దేహములను విడుచుటకు వెనుదీయకుందురు. వంకరలగు కన్నులుగలవారును వెడలుపయిన నుదురుగలవారును, కండలేని చెక్కిలిపట్లు (హనువులు) గలవారును, † వంకరలగు చేతులును వ్రేళ్లును దొడలునుగలవారును, బక్కపలుచని దేహముగలవారును, నరములం దటఁ దెలియుచున్నవారును, యుద్ధము తటస్థించినపుడు భయము మాలి వేగచొచ్చువత్తురు. వారేనుంగులవలె మత్తిల్లి, దార

---

* 'గోధానిమీలితాః' అని మూలము. 'గౌరానిమీలితా' అని దా. మూలము. బంగరుచాయయు మొగిచినకన్నులును గలవారు మృదుస్వభావముగలిగి యుందురని యర్థము.

† 'వక్రబాహ్వంగుళీ సక్తాః' అని దా. మూ. 'వజ్రబాహ్వంగుళీ చక్రాః' అని ఔ. మూలము. వజ్రములవంటి బాహువులును వ్రేళ్లయందుఁ జక్రములవంటి గీఁతలును గలవారని యర్థము.

సింపరాకుందురు. ఎఱ్ఱవాఱి ప్రిదిలిన వెండ్రుకలచివరలు గలవారును, బలిసిన ప్రక్కలును నుబ్బు లయిన చెక్కిలి పట్టులును ముఖములును గలవారును, నిక్కుగల మూఁపులుగలవారును, బలితంపుఁగుత్తుక గలవారును, భయంకరులును, బలుపుగల పిక్కమాంసముగలవారును, కృష్ణుని వాసుదేవ మనుగుఱ్ఱము వలెను వినతగన్నపక్షియగు గరుడునివలెను బయికిఁజెంగలించువారును, గుండ్రనితలలును వెడలుపయిన మొగములును గలవారును, పిల్లివంటి ముఖముగలవారును, గఠోరమగు ధ్వనిగలవారును, గోపముగలవారును, యుద్ధమందు బిట్టుగానార్చుచు నుంకించువారును, ధర్మముల నెఱుంగనివారును, గర్వితులగువారును, బెట్టిదముగాఁ గనుపట్టువారును, నీరందఱు *నుదగ్రులై తమదేహములను నెంతమాత్రము లక్ష్యపెట్టకయు యుద్ధమునుండి వెనుదీయకయు నుందురు. అట్టిసైనికులను యుద్ధము మొనయం దుంపవలయును. వారెప్పుడును దమశత్రువుల నుఱుమాడుటయేకాక తామును శత్రువులచేఁ జంపఁబడుటకు వెనుదీయ కుందురు. వారు ధార్మికులై వేఱువిధము లయిననడవళ్లు గలిగి తిన్నని మొత్తనిమాట లపజయమునకు లక్షణములని తలంతురు. వారిని మృదువుగా మెలపనిచో రాజువలనను మిక్కిలి కుపితులగుదురు' అనెను. ఇది నూటయొకండవయధ్యాయము



* 'ఉదగ్రాః' మూలము 'అంత్యజాః' అనిజో.మూ. చివరపట్టులందు వసించువారని యర్థము.

## రాజధర్మపర్వము.

### (భీష్ముఁడు ధర్మరాజునకు సేనకుఁగల జయచిహ్నము లును రాజనీతినిని జెప్పుట.)

ధర్మరాజు 'భరతసత్తమా! ఒకసేన జయమునొందఁ బోవుటకుఁ బ్రశస్తములగు లక్షణములేవి? వానినిగూడ నెఱుంగఁ గోరెదను' అని యడిగెను. భీష్ముఁడు 'జయింపఁబోవు సైన్యమునకు నేప్రసిద్ధలక్షణములు గలుగునో వాని నన్నింటిని జెప్పెదను. దేవతలు కోపమునొందినపుడు, మనుష్యులు కాలముచేతఁ బ్రేరితులగునపుడును, విద్వాంసులు జ్ఞానచక్షువులచేతఁ నన్నియుఁ గనుఁగొని ప్రాయశ్చిత్త విధులును,జపహోమములను, మంత్ర జపములను గావించి యహితములకు శాంతిగావింతురు. ఏసేనయందు యోధులును వాహనములును మనస్సు తెంపుసొంపు గలిగి యుండునో,దానికిఁదప్పక జయముకలుగును. అట్టిదానికి ననుకూలముగానే వాయువులు వచ్చును. ఇంద్రధనువు లాకాశమునం దోఁచును. మేఘములు లెమనీడల వారి పయిఁ బొలయించును. సూర్యకిరణములు వారిపయిఁ బ్రసరించును. నక్కలును, గ్రద్దలును వారికి ననుకూలములగు బలములుగలిగి యుండును. ఇవియన్నియు నాసేనకుఁ బొసఁగినపుడు దానికి నుత్తమమయిన సిద్ధి (జయము)గలుగును. అగ్ని ప్రసన్నమయిన కాంతితోడ, కిరణములు పొడవుగాఁ బర్వుచుఁ, బ్రదక్షిణముగాఁ జుట్టివచ్చు జ్వాలలుగలిగి, పొగలేనిదై వెలుంగుచుండును. ఆహుతుల వాసనలెంతయు మంచివిగాను నింపుగాను నుండును. ఇది జయముగలుగుటకు లక్షణముగాఁ జెప్పెదరు.

అట్టియెడ శంఖములును భేరులును గంభీరముగాను బిట్టుగాను శబ్దించును. యుద్ధముసేయ నున్నవారును నడ్డుచెప్పక తమ కముగలవారై యుందురు. ఇదియు జయము కలుగుటకు సూచనముగాఁ జెప్పుదురు. యుద్ధమునకు బయలు దేఱిన వారికిని బోవనున్న వారికిని బిఱుఁదను నెడమప్రక్కను జింకలు మొదలగు మృగములు పోయినచో నది శుభంబగును. యుద్ధమునఁ జంప నుంకించు చున్నవారికుడి ప్రక్కఁ బోయినను సిద్ధిగలుగు నందురు. కాని యట్టివారిముందఱఁ బోయెనేని విఘ్నకారులగును. హంసలును, గొంచపిట్టలును, బెగ్గురులును, పాలపిట్టలును, మంగళకరములగు శబ్దములను గూసినను, యోధులు మనస్సు తెంపును నుబ్బునుగలిగి యుండినను, నిది రాఁగలజయమునకు సూచకమందురు. ఎవరి సైన్యము, శస్త్రములచేతను, యంత్రములచేతను, గవచములయు ధ్వజములయు గాంతులచేతను, అందున్న పడుచువీరుల ముఖకాంతులచేతను, దళతళమని మెఱయుచున్నదై దేఱిచూడరాను దరముగాకుండునో యట్టివారు శత్రువులను గ్రిందుపఱుతురు. ఒకరియోధులు పోరాటముచేసి యుపకరింపఁ దలంపుగలిగియు గర్వము లేకయుఁ బరస్పరము చెలికారము పాటించియు, శౌర్యము నవలంబించియు నుందురేని యది వారికిఁ గలుగనున్న జయమునకు లక్షణమని చెప్పుదురు. మనస్సున కింపయినశబ్దములును సుఖములయిన స్పర్శములును గంధములును గలుగునేని, యోధులను ధైర్యమావేశించెనేనియు, నదిరాఁగలజయమునకు ముందుగుఱుతగును. కాకి యుద్ధమునకుఁ బయలుదేఱినవానికి నెడమప్రక్కను యుద్ధమునకుఁబోవనున్న వానికిఁ గుడిప్రక్కను నున్నచో శుభంబగును. వెనుక

ప్రక్కనుండినచో కార్యమును * జెఱుపుచున్నది. ముందఱి ప్రక్కనున్నచో విఘ్నము గావించుచున్నది. యుధిష్ఠిరా! చతురంగములతోఁగూడిన పెనుసైన్యమును గూర్చికొన్న పిదపఁ గూడ, నీవు తొలుత సామముతోనే ప్రవర్తింపుము. అది పసలేకపోయెనా పిదప యుద్ధమునకుఁ బ్రయత్నింపుము. యుద్ధము వలనఁ గలుగునట్టి జయ మధమమేయగును. యుద్ధమునందలి జయము యాదృచ్ఛికముగనో దైవముచేతనో గలుగునని విచారింపవలయును. ఒక పెద్దసైన్యము విఱిగి సైనికులు పరువెత్తునపుడు దానిని వారించుట యెంతయును గష్టము. అది మహావేగము గలనదీప్రవాహమువలెను, బెదరిపాఱు పెనుమృగసమూహమువలెను నుండును. కొందఱు పాఱుదురు. వారు పాఱిరనియే, మఱివేఱు కారణములేకయే తక్కినవారును నెంత తెలిసినవారుగా నుండినను విఱిగిపాఱుదురు. ఒక పెద్దసైన్యము మిక్కిలి యుదారులయిన యోధులు గలిగి యుండినను, † రురువు లనెడిజింకకదుపునకు సాటియే యగును. ఒండొరుల నెంతయు నూఁది, యుబ్బుగలిగి, ప్రాణములను సరకుగొనక, దృఢనిశ్చయులైనట్టిశూరులు లోకప్పు డేఁబదిమందిమాత్రమే యుండినను, తమకంటె మిక్కిలియెక్కుడు మొత్తము గల పర

---

* 'సంఘాతయత్యర్థమ్' అని మూలము. 'సంనాధయత్యర్థమ్' అని దా. మూలము. వెనుకప్రక్క కాకిరూఁతి కార్యమునుసాధింపఁ జేయుచున్నదని యర్థము. ముందఱిప్రక్క నున్నదిచెఱుపుటచే వెనుకప్రక్క సాధింపఁజేయుట యే సమంజసము.

† ఒకజింక పరువెత్తినచో నది పరుగెత్తినదెసనే తక్కినవియు మఱికారణమును లేక పరువెత్తును. కాన యది యిటఁ బెద్దసేనలకును నను సంధించునది.

సైన్యమును నుఱుమాడి వై చెదరు. ఏఁబదిమందియే కాదు; ఒకప్పుడు, దృఢనిశ్చయులై కులీనులును బూజితులును నగు శూరులు, ఐదుగురోయార్గురో యేడుగురో యైనను నొండొరులను గుత్తముగాఁ గూడికొని తమకంటె నెక్కువ మొత్తముగల శత్రువులను జయింతురు. ఏవిధముననయినను వారింప శక్యమైనంతవఱకును యుద్ధమున మార్కొనుట తలపెట్టరాదు. మొట్టమొదట సామమును దానమును భేదమును బ్రయోగింప వలయును. వీనికిఁ బిదపనే యుద్ధమునకుఁ బూనవలయునందురు. ఒకసేన వచ్చుటఁజూచినంతమాత్రనే, పిఱికివాండ్రను, మండుచున్న పిడుగునుజూచి 'అయ్యో! ఇది యెవరిని బడఁగూల్చునో' యని కూవెట్టునట్లు, భయముపట్టి బాధించుచున్నది. యుద్ధమొకటి రేఁగుచున్నదని తెలియఁగానే యందులకుఁ జేరఁబోవు యోధుల యవయవములును,* జయించుచున్నవాని యవయవములును మిక్కుటముగాఁ జెమర్చుచున్నవి. (యుద్ధముజరుగుచున్న) దేశమంతయు నందలిస్థావరజంగమములతోఁగూడ, మిక్కిలి వ్యథనొందుచున్నది. దేహులమజ్జ లాయుధముల వేఁడిమిచేఁ గ్రాఁగి నొప్పునఁ గుందుచున్నది. కాఁబట్టి, రాజు, మాటిమాటికి వారలకు సాంత్వవచనములను గటువయినచేఁతలతోఁగలిపి చెప్పుచుండవలయును. (సాంత్వము లోఁదార్చుటకును గటుత్వము వెన్నిచ్చి పాఱకుండుటకును జెప్పఁదగును.) జనులు శత్రువులచేతఁ బీడింపఁబడుచున్నపుడు వారెల్లప్పుడును సంధికి రాఁజూచుచుందురు. శత్రువులకు నంతరంగు లయిన(మిత్రులగు) వారి

---

* 'విజయస్య' అనిమూలము. 'విషయస్య' అని దా.మూలము. దేశమందలి వారియవయవములని యర్థము.

యందు భేదముపుట్టించుటకుఁ జారులను బుచ్చవలయును. అట్లు భేదము పుట్టించి యాశత్రురాజునకు నవ్వలఁ బలీయుఁ డయి యుండు రాజుతో సంధిచేసికొనుట యెంతయు మంచిది. దండెత్తురా జీవిధమునఁ దనశత్రువునకు శత్రువయిన వానితోడఁ గూడికొనుటచే నాశత్రువు నిరుప్రక్కల ముట్టడించి బాధించు నట్లు మఱియొకవిధమున వానిని బాధించుట శక్యముగాదు. ఓరుపు సాధుజనులను బొందును; కాని యెప్పుడు నసాధు జనులను బొందదు. ధర్మరాజా! క్షమకును క్షమలేమికిని (క్రూరత్వమునకును) గల ప్రయోజనములను వినుము. రాజు జయము నొందినపిదప క్షమచూపునేని యతనికీర్తి మిక్కిలియు వర్ధిల్లును; అట్లు క్షమించు గుణముగలవాఁడు మహాపరాధము చేసినప్పటి కిని, వానిశత్రువులు నతనియందు నమ్మక ముంతురు. ఒకశత్రు వును బీడించి యోర్చి పిదప వానియెడ క్షమఁజూపవలయును. ఏలన వంకరచుగు నొక మ్రానికి నగ్ని వేఁడిమిని మొదటఁజూపి దాని వంకను నిడివిగాఁ జాఁగించినచో నది మరలఁ దన యెప్పటి వంక కేవచ్చునని*శంబరుఁడు చెప్పుచున్నాఁడు. అయినను దీని నా చార్యులుకొనియాడరు;ఇదిమంచిదర్శనముగాదు.ఎవనినిగానికన్న బిడ్డలవలె నడంపవలయును. కానవారు 'తండ్రి తనపుత్రునింబోలె రాజు, శత్రువును గోపములేకయు నాశముసేయకయు నడంపవల యు'నందురు.యుధిష్ఠిరా! రాజుగ్రుండగునేని ప్రాణులెల్ల నతనిని ద్వేషించును. మఱియుతఁడు మృదువయ్యేనేని యందఱునతని నవమానింతురు. కాఁబట్టి యుగ్రత్వమును మెత్తనయు రెండును

* 'శంబరః' అని మూలము 'శాంబరాః' అని దా॰మూలము. మాయావిదులు చెప్పుచున్నారని యర్థము.

గలిగియుండవలయును. ప్రహరించుటకు మునుపును, ప్రహరించుచు చున్నపుడును, బ్రియముగాఁ బలుకవలయును. ప్రహరించిన పిదప నందులకు దుఃఖించుచును నేడ్చుచు నున్నట్లు తోఁపించి వారియెడఁ గనికరము చూపవలయును. రాజొకసైన్యమును గూర్చి హతశేషులయిన వారితో 'నాసైనికు లిందఱను జంపిరని నాకు సంతోషము లేదు! అయ్యో! వీరిని నేను మాటిమాటికి వలదని యెంత చెప్పినను నాయాజ్ఞలను వినరయిరే! అక్కటా! వీరందఱు బ్రతుకుదురా యని యువ్విళ్లూరుచున్నాను! వారి కిట్టివధ యెంతమాత్రము తగదు. వారందఱును సత్పురుషులు. యుద్ధములం దెంతమాత్రము పలాయితులుగారు. ఇట్టివా రెంతయు నరుదు. ఈ వీరునియుద్ధమునఁ జంపినవాఁడు, నాకెంతయు నప్రియముచేసినాఁడు' యని యిట్టిమాటలు నోటఁబలుకుచు రాజు దన శత్రువులను జంపినవీరులను రహస్యమున వారికిఁ దగునట్లు పూజ గావింపవలయును. శత్రువులవలన గాయములు పడిన తనవారి నొప్పులను మానింపఁజేయుటకై రాజు వారలను మఱింతఁ గూర్చుకొనుటకును, వారి చేతులను బట్టుకొని ప్రేమమీఱ నేడువను వలయును. రాజిట్లు సకల సందర్భములందు సామమును మున్నిడుకొనియే ప్రవర్తింపవలయును. భయరహితుఁడును ధర్మజ్ఞుండు నగురాజు సమస్త ప్రాణులకును బ్రియుండగును. సకలప్రాణులు నతనియం దెంతయు నమ్మిక గలిగియుందురు. అట్లు వారినమ్మికను బడసి యమ్మైకాలములందుఁ దగిన పూన్కితోఁగూడి భూమి ననుభవించుటకు సమర్థుఁడగుచున్నాఁడు. కాఁబట్టి మాయనువిడిచి సమస్త భూతములకును దనయందు నమ్మికను గలిగించికొనవలయును. అతఁడు

భూమిని ననుభవింపఁ గోరునేని తన ప్రజలనందఱను రక్షింపవల యును' అనెను. ఇది నూటరెండవయధ్యాయము.

## రాజధర్మపర్వము.

{ భీష్ముఁడు శత్రుజయమునుబట్టి యింద్రునకును బృహస్పతికిని జరిగినసంవాదము యుధిష్ఠిరునకుఁ జెప్పుట. }

ధర్మరాజు 'పితామహా! మృదు వయినపగవానియెడను, ఉగ్రుఁ డయినపగవానియందును, మిక్కిలియు సహాయసంపత్తి గల పగవానియందును, రాజెట్లు వర్తింపవలయునో నాకుఁ జెప్పుము' అని యడిగెను.

భీష్ముఁడు 'ధర్మరాజా! ఈవిషయమందును బృహస్పతికిని నింద్రునకును జరిగిన సంవాదమనెడి పురాతనమయిన యీయితిహాసము నుదాహరించెదరు. దేవేంద్రుఁడు బృహస్పతి చెంతకుఁ బోయి మ్రొక్కి యంజలిగీలించి యతనితో 'బ్రాహ్మణోత్తమా! నేను బగవారియెడ నెట్లు ప్రాలుమాలక నడచుకొనవలయును? వారిని నాశము సేయక యేయుపాయములచేత నెట్లడంపవల యును? రెండుసేనలును దలపడినపుడు, జయము సాధారణము గాన రెండుపక్షములయం దెవరికేని గలుగవచ్చును; కనుక నం దొకపక్షమే గెలుచునని నిశ్చయింపరాదు. నేనేమి చేసినయెడల, నెట్లు ప్రవర్తించినయెడలఁ, బ్రకాశించుచున్న నాయీలక్ష్మి, పగ వారిని గ్రాఁచునట్టిది, నన్నుదిగనాడకుండును?' అని యడిగెను. అంత ధర్మార్థకామములందు నిపుణుఁడును రాజధర్మవిధానముల దెలిసినవాఁడును మహాబుద్ధిమంతుఁడు నగు బృహస్పతి యింద్రు

నితో'ఎప్పుడుగాని విరోధులను గలహముచేత నడంపఁగోరరాదు. కోపమును నోర్పు లేమియు బాలురు (అవివేకులు) సేవించునట్టివి. శత్రునివధమును గోరువాఁడు శత్రువును నెచ్చరికగలిగి యుండునట్లు చేయరాదు. కోపమును,భయమును, సంతోషమును,తన లోపలనే యడంచుకొని పైకి విశ్వాసముగలవానివలె నుండియు లోపల విశ్వాసము లేకయే శత్రువు ననువర్తించుచు నుండవలయును. ఎప్పుడును బ్రియమునే పలుకవలయును. అప్రియము నించుకంతయుఁ జేయరాదు. పసలేని వైరములనుండి విరమింపవలయును. కొండెములను వర్జింపవలయును. ఇంద్రా ! పక్షులను జేత్రాదు వైచి పట్టువాఁడు దాను బట్టఁగోరిన పక్షుల యెలుంగుల వంటి యెలుంగులను గూయుచు నాపిట్టలను వశపఱచుకొనునట్లు, రాజును జతనంబున శత్రువులను దనవశము చేసికొనవలయును ; తనకిష్ట ముండెనా చంపవలయును. పురందరా ! రాజు శత్రువులను గ్రిందుపఱిచిన పిదప నెచ్చరికమాని సుఖముగ నిదురింపరాదు.దుష్టాత్ముఁడగు శత్రువు, కుప్పయందలి యగ్గియూరకయేయుండి మరలఁ దలయెత్తునట్లు, తాను మేలుకొనియే యుండి తలసూపును. జయమెవ్వరికిఁ గలుగునో తెలియరాకుండునపుడు, యుద్ధముచేయుట దగదు. మహాత్ములును మంత్రాలోచనము తెలిసినవారు నగు మంత్రులతోడంగూడి చక్కఁగా నాలోచించికొని శత్రువును నమ్మించి తనవశము గావించుకొని పిదప * వాని నడంచి పుచ్చవలయును. † ఒకశత్రువు నుపేక్షిం

* విశ్వాసస్యై వోపసన్నమ్యః' అని దా.మూ. 'ఉపసన్నార్థా' అని ఔ. మూ. శత్రువును వశము చేసికొని కోరినప్రయోజనము పొందవలయుననియర్థము.

† ఉపేక్ష్యమాణో విజ్ఞాతో హృదయేనాపరాజితః । అథాస్యప్రహరేత్కా

చి యలక్ష్యపెట్టినచో వాఁడు మనసునం దెంతమాత్రములోను గాక యుపాయముల నెఱిఁగి, యట్లు తన్ను పేక్షించినవాఁడు తనకృత్యమునుండి తప్పిదాఁటిన సమయముచూచి పైకొనికొట్టును. * తనకాప్తు లయినపురుషులనుగొని వాఁ డా జయించినరాజు సేనను భేదమూలమునఁ జెఱిపివైచును. † రాజు తనశత్రువు మొదటిని నడుమును దుదిని (అనఁగా నతనినిగుఱించిన సకల విషయములను) దెలిసినవారిని రహస్యముగాఁ బిలిచి విచారింపవలయును. ఆశత్రువుబలములను యథార్థముగాఁగలరూపు దెలిసికొనుచు వానిని, భేదము చేతనునించుక దానముల చేతను జెఱిపిపుచ్చవలయును. అల్లె విషము మొదలయిన యౌషధములను వారికిఁ జేర్పవలయును. రాజెన్నఁడుగాని పగవారితోడికూడిక నొల్లరాదు. రాజు

---

లే వి ధేర్వ్యచలితో యథా అని దా. మూ. 'అవజ్ఞాతః' అనియు, 'కించిద్వ్యచలితే పదే' అనియు ఔ. పాఠములు. పైని జయింపఁబడినరాజు కర్తగాఁ జెప్పంబడెను. జయించినరాజును కర్తగాఁ గొన్నచో 'అట్లడంచిన శత్రువు హృదయములోన లోఁగక యుండుటను దెలిసికొని యూరక యుండి వాఁడు క్రమమునుండి పొరఁబడిన సమయము చూచి కొట్టవలయును' అని యర్థము చేయవచ్చును. శత్రుజయోపాయఘట్టము గాన యిదియే సమంజసముగా నున్నది.

* 'దండంచ దూషయేదస్య పురుషైరాప్తకారిభిః, అని. మూలము. దీనికి జయింపఁగోరురాజు పరముగా 'ఆశత్రువుయొక్క సేనను ఆప్తులగు పురుషులచే భేదముగల్పించి చెఱుపవలయును' ఇదియే ప్రాకరణికమైన యర్థము.

† 'ఆదిమధ్యావసానజ్ఞః ప్రచ్ఛన్నంచ విచారయేత్' అని దా. మూలము ఆదిమధ్యానసానజ్ఞః ప్రచ్ఛన్నంచ విదారయేత్' అని ఔ మూలము. రాజా! శత్రువు మొదలు నడుమ తుదలను దెలిసి రహస్యముగా వానియందు విరోధము గలిగి యుండవలయునని ప్రతాపచంద్రరాయలు.

చాలఁగాల మెదురుచూచుచుండి తుదకు వారి నడంచియే తీఱ వలయును. శచీపతీ!* కాలము నెదురుచూచుచు నెచ్చరికతోడ వారిని నారాధించు చుండవలయును. వారికి నమ్మికగలుగునట్లు ప్రియములు పలుకుచుండవలయును. తోడనే పగవారిని జంప రాదు.† జయము నిశ్చయముగాఁ గలుగుటను గనుఁగొని పిదప వారిపైఁ బడవలయు. అట్లు సేయనిచో మరల నదిహృదయమునకు శల్యము గలిగించును; మరలఁ గ్రొత్తగంట్లు గావించును. సమయము రాఁగాఁ దోడనే కొట్టవలయును. దేవేంద్రా! అట్టికాలము మరలఁ బగవారిని జంపఁదలఁచినపుడు రాదు. పగవారిని జంపఁ దివురు పురుషుఁ డిట్లు వారియెడల నడచుకొనవలయును. కాలము త న్నెదురుచూచుచున్న పురుషుని నొకసారి కడచిపోయెనేని, వాఁడు కార్యము చేయఁగోరినపు డది మరలి వచ్చుట యరుదు. రాజు సాధువుల సమ్మతిని గయికొని, శత్రువుబలిమి పర్వకుండు

* 'కాలకాంక్షీ చ యుక్తస్సన్నుపాసీత శచీపతే। తథా ప్రియం చ వక్తవ్యం యథా విస్రంభమాప్నుయాత్' అని దా. మూలము. 'కాలకాంక్షీహి క్షపయేద్యథా విస్రంభ మాప్నుయుః' అని పైరెంటికి నొకపాదమే జౌ. మూలమునఁ గానఁబడుచున్నది.

† 'న సద్యోఽరీ న్వినిహన్యాచ్చ ద్రష్టవ్యో విజయో ధ్రువః। యశ్శల్యం ఘటయతి నవం చకురుతే వ్రణమ్' అని దా. మూలము. 'నసంఘార్ వినిహన్యాచ్చ ...। నశల్యం వా ఘటయతి నవాచాకురుతే వ్రణమ్' అని జౌ. మూలము. రాజు శత్రుసేనలందు పెనుమొత్తములను జంపరాదు. అయినను తనకు యుద్ధము దిర మగునంతవఱకును జూచుకొనవచ్చును. శత్రువునకు మనస్సున శల్యముగా నుండునట్టి చెడుగు సేయరాదు. మఱిమాటల చేతను మనసు పుండుచేయరాదు. (అని ప్రతాపచంద్రరాయలు).

నట్లుమాత్ర మడంపవలయును. * అకాలమందు తనకృత్యము లను సాధించుకొనఁ జూడరాదు. కాలము సమీపించి యున్న పుడు శత్రువును బీడింపరాదు. కామమును గోపమును నహంకా రమును దిగవిడిచి రాజెచ్చరికగలిగి యెపుడును మాటికి శత్రువు నందలి ఛిద్రములను వెదకుచుండవలయును. మృదువుగానుం డుటయు, బెట్టిదముగా దండించుటయు, అలసత్వమును, ఏమఱి పాటును, శత్రువులు లెస్సగాఁ బన్ను వంచనలును, మూఢుఁడగు రాజును నాశము సేయును. ఏరాజీనాలుగును దొలఁగఁబుచ్చి శత్రువుల వంచకపుఁబన్నుగడలకుఁ బ్రతిచేసివారించునో యతఁ డేసందేహమును లేక శత్రువులను గొట్ట శక్తుఁడగును. ఒకరహస్య కార్యమునకు నొక్కమంత్రియె చేయ శక్తుఁడగునేని దానినిఁ గుఱించి యాయొక్కనితోనే యాలోచింపవలయును. పెక్కం ద్రు మంత్రులతో నాలోచించినయెడల వారు దాని నొండొరుల పయి మోపఁ జూచుటయేకాక రహస్యముగు దానిని వెలువడు నట్లును గావింతురు. ఒకరితోడ నాలోచించుట యుక్తముగా కుండిననే రాజు తక్కినవారితోడను గూడి యాలోచింపవల యును శత్రువులు గానరాకుండినపుడు బ్రహ్మదండమును (బురో హితాదుల మూలమున నభిచారాదులను లేక దేవకృత దండ

---

* 'ఓజశ్చ వినయే దేవ సంగృహ్ణా న్సాధు సమ్మతమ్। అకాలేసాధయేత్కృత్యం నచప్రాప్తే ప్రపీడయేత్' అని ఔ. మూలము. 'ఔజస్యం జనయే దేవ... కా లేన సాధయేత్కృత్య మప్రాప్తో నహిపీడయేత్' అని (దా. మూ.) సాధువు లకు సమ్మతమగుకీలిని బలమును గలిగించుకొనవలయును. కాలమందుఁ గార్య మును సాధించుకొనవలయును. కాలమును బొందక శత్రువును బీడింపరాదు. అని యర్థము. ఇది క్రిందటి యర్థమంత ప్రాకరణికముగాదు.

మును) వారు కనఁబడినపుడు చతురంగములతోఁ గూడిన సేనను బ్రయోగింపవలయును. అట్లె మొదట భేదమును సామమును బ్రయోగింపవలయును. ఆయాయుపాయమునకుఁ దగిన యా యాకాలము వచ్చినపుడు రా జాయాయుపాయమును బ్రయోగింపవలయును. శత్రువు బలవంతుఁడుగా నుండెనేని సమయము వచ్చినపుడు రాజు వారికినమస్కరింపను వలయును. మఱియుఁ దా నెంతయు దేమఱకుండి పగవాఁ డేమఱియుండునపుడు వాని వధింపఁ జూడవలయును. మ్రొక్కుటచేతను, దానముచేతను, దియ్యని పలుకులతోడను మాటలాడుచుఁ బగవానిని ననుసరించి యుండవలయును. ఒకప్పుడును వానికి సందేహము గలుగునట్లు చేయరాదు. శంకకుఁ బట్టయినవాని నెల్లను, శంకాస్పదులయినవారి నందఱను నెప్పుడును వర్జింపవలయును. రాజు తాను గ్రిందు పఱిచిన శత్రువులను నమ్మియుండరాదు. క్రిందు పఱుపఁబడినవారు కీడుసేయుటకు జాగరూకులై యే యుందురు. (శత్రువులకుఁ దన మెడలసందేహము గలుగకుండునట్లు వారినాశ్రయింపవలనుగాదు. దీనికంటెదుష్కరమయినకార్యము వేఱొకటియు లేదుసుమీ*నడవడియొకరీతిగాక నానావిధములనుండువారి యైశ్వర్యమువలెనే స్వభావమొకరీతిగాక నానావిధములనుండు వారి నడవడియుఁ దిరముగానుండదని చెప్పఁబడుచున్నది.† రాజు మిత్రుఁ డమిత్రుఁడని విచారింపక యుపాయము నూఁది ప్రయత్నింపవలయును. రాజు మృదువుగా నుండినచోఁ బ్రజలవమానింతురు.

* తథా వివిధశీలానా మపిసంభవ ఉచ్యతే' అని దా. మూలము. 'వివిధ నాశానామపి' అని పాఠాంతరము.

† ప్రయతేద్యోగమాస్థాయ మిత్రామిత్రా నధారయన్' అని దా. మూ

వేంద్రముగా నుండినచోఁ బ్రజలు వడంకుదురు. నీవు కేవలము క్రూరుఁడవుగాఁగాని కేవలము మృదువుగాఁగాని యుండకుము. వేంద్రముగను మృదువుగను నుండుము.అంతటను జలములునిండినదై యురవడిగాఁ బాఱుచున్న ప్రవాహముచే గట్టు దెగిపోవున నుభయమెప్పుడు నుండునట్లే,పరాకుగలిగిపొరఁబడుచుండుటచేత రాజ్యమునకు నాశముగలుగునని భయముండును.ఒక్కసమయమందే పెక్కండ్రు శత్రువులను ముట్టడింపకుము. పురందరా! వీరలం దొక్కొక్కని, సామముచేతను దానముచేతను భేదముచేతను దండముచేతను జక్కఁగా నలంచి కలంపవలయును. మిగిలినవారియెడ (కొందఱగుటంజేసి) తనసామర్థ్యము చొప్పున నడచుకొనవచ్చును. బుద్ధిమంతుఁడగు రాజు తాను శక్తుఁడై యుండినను శత్రువుల నందఱను నొక్కపెట్ట నడంపఁ జూడరాదు. రాజు రథగజతురగపదాతులు గలదియు, యంత్రములతోఁ గూడినదియు, నిట్లాఱంగములు గలదియుఁ, దనయందు రక్తిగలదియు నగుపెద్దసేన గలిగియుండునపుడును, దన్ను శత్రువుతోఁ జక్కఁగాఁ బోల్చిచూడఁగా ననేకవిధములఁ దానెక్కుడుగా నుండునట్లు తలఁచునపుడును, దానుముందు వెనుక విచారించి బాహిరముగాఁ బైపడి కొట్టవలయును. శత్రుఁడు బలవంతుఁడుగా నుండెనేని సామము దగదు. రహస్యమగు దండోపాయమే యొప్పును. శత్రువులయెడ మృదువుగా నుండుటయుఁ బలుమాఱు దండెత్తిపోవుటయుఁ దగదు. పలనఁగా దాని వలనఁ గలుగు పంటలనాశమును, విషము మొదలగువానిని

---

లము. 'యతతేయోగ మాస్థాయ మిత్రామిత్రం విచారయేత్' (శా. మూ. రాజు లుపాయమునూఁది మిత్రుని నమిత్రుని విచారించి తెలిసికొనవలయు.

బావులు మున్నగు వానియందుఁ గలుపుటయు, మాటిమాటికి సమాత్యుఁడు మొదలయిన ప్రకృతులను గుఱించిన విచారణయు, లేకుండును; రా జట్టి సమయములందుఁ బలువిధములయిన మాయలను, శత్రువులకు భేదము పుట్టించుటకై పలుతంత్రములను, పెక్కువిధములయిన కపటవధములను, జేయింపవలయును. తన చేతలవలనఁ గీర్తి గొఱవడకుండునట్లు చేయవలయును. ఆప్తులగుమనుష్యులను గొని పట్టనములందును దేశములందును శత్రువులపోకలు తెలియు చుండవలయును. బలవృత్ర సంహారకా! రాజు శత్రువుల వెంటనంటి, వారిపురములందుఁ జొచ్చి యందలి భోగ్యవస్తువుల నన్నింటిని గయికొనుచుఁ బట్టనములందును విధ్యుక్తముగా నీతివిధుల నేర్పఱచుచున్నారు. మఱియు వారికి గూఢముగా దానములుచేసి, వారి భోగములనెల్ల బాహిరముగాఁ బెఱికికొని వారిని బిట్టుగాఁ గారింపక, వారందఱును దుష్టులనియు వారిదోషములచేతనే యిట్లనుభవించెద రనియుఁ బ్రకటించి వారివలనఁ గొన్నపట్టనములందును రాజ్యములందును దమయధికారుల నియమింతురు. అట్టిసమయముననే వారు తమపట్టనములందు, శాస్త్రవిదులును జక్కఁగా నలంకృతులును శాస్త్రవిధానమందుఁ బ్రసిద్ధులును విద్యలయందు లెస్సఁగా గడిదేఱినవారును, భాష్యములును జెప్పుటయందు బండితులు నగు నితరపురుషులచేత, శత్రువులను జంపునట్టి కృత్యనారాధింపవలయును' అనెను.

ఇంద్రుఁడు, 'బ్రాహ్మణోత్తమా! దుష్టుని లక్షణము లేవియగును? దుష్టుని నెట్లు తెలియనగునో యడిగెదను జెప్పుము' అనెను. అందులకు బృహస్పతి 'దుష్టుఁడు, మఱుఁగున నొకరిపయిని దోష

ములను జెప్పును. మంచిగుణములకు నసూయపడును. తనముం గలఁ బరులగుణములు పొగడఁబడినపుడు పెడమొగము పెట్టికొని యున్నకుండును. * కారణము లేకయే మాటలాడకుండుటంబట్టి యుఁ దెలిసికొనవచ్చును. నిట్టూర్పు విడుచుటయు, పెదవికొఱుకుటయు, తల పంకించుటయు నుండును. అట్టివాఁడు మాటిమాటికిఁగలసి(తప్పులు పెట్టుటకై లేనిపోని విషయము లెత్తి)యసంబద్ధముగాఁ బలుకుచుండును. అట్టివాఁడు తా నొకరికిఁ బ్రతిన చేసిన దాని నతినిర్బృష్టి తనపయిఁ బొలయుకుండునపుడు, చేసితీర్పఁడు. ఆ మనుష్యునిచూపు పయిఁబడేనా, యాదుష్టుఁడు ప్రతిజ్ఞ చేసినవిషయమున బ్రస్తావమునకును దేకుండును; వాఁడు తానొంటిగనే కుడుచునుగాని యితరులపొత్తునఁ దినఁడు; ఆయన్నమునుజూచి 'నేఁటి కిది తగినరీతిగా లే'దని తప్పులు వెదకును. కూర్చుండునపుడును, బరుండునపుడును, బోవునపుడును, వాని భావములు విశేషించి చూపట్టుచుండును. ఆర్తి కలిగినపు డార్తిపడుటయు, సంతోషముగలిగినపుడు సంతోషించుటయు, మిత్రునిలక్షణము. దీనికి విరుద్ధమయిన దేదయో యదియే శత్రులక్షణమని తెలియవలయును. దేవాధిప ! వీనిని నేఁ జెప్పినట్లు మనస్సునఁ దెలియుము. దుష్టులను దెలుపునట్టి లక్షణముల నిట్లు నీకుఁ జెప్పితిని. శాస్త్రములందలి తత్త్వములను విని యట్లే నడచుకొనుము' అనెను.

భీష్ముఁడు 'బృహస్పతి చెప్పినదివిని, శత్రువులనుఱుమాడుటయందాసక్తుఁడయిన యింద్రుఁడు తప్పక యట్లె యాచరించెను. జయ

---

* 'ఊరక మాటాడకున్న మాత్రమున దుష్టత్వమునకు లక్షణముగాదు' అని ప్రతాపచంద్రరాయలు; కాని, దీనికుపపత్తి మూలమందుఁ గానరాదు.

మునకై పూని, యాపగవారిని జంపు బలియుఁడు, అందులకుఁ గాలముఱాఁగా, ఉపదిష్టము లయినవాని చొప్పుననే నడచుకొని తన శత్రువులను వశగతులఁ గావించుకొనెను' అని చెప్పెను. ఇది నూటమూఁడవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

(రాజ్యాదులను బోఁగొట్టుకొన్నవాఁడును ధర్మాత్ముఁడునగు రాజు వృత్తిమొదలగు వానిని గుఱించి కౌసల్యకాలకవృక్షీయ సంవాదమును జెప్పుట.)

ధర్మరాజు 'ధార్మికుఁడయినరాజు, అమాత్యులచేత మిక్కిలియు బాధితుఁడై బొక్కసమును సైన్యమును దనకు లోనుగాకయు, ధనమును లేకయు నుండునేని, సుఖమును బడయుటకు తఁ డెట్లు నడచుకొనవలయును' అని యడిగెను.

అందులకు భీష్ముఁడు—'ఈవిషయమై క్షేమదర్శినిగుఱించి యీ యితిహాసము చెప్పఁబడుచున్నది. అది నీకుఁ జెప్పెదను. తెలిసికొనుము. మున్నొకకాలమున క్షేమదర్శి యనునొకరాజకుమారుఁడు బలముగుందినవాఁడై కాలకవృక్షీయుఁ డను ముని యొద్దకు వచ్చెనని మాకు వినికి గలదు. అతఁ డామునికి నమస్కరించి 'మహాత్మా! మిక్కిలియు బెట్టిదమయిన యాపదయందుఁ దగులుపడితిని. నేను ధనమునకెంతయుఁ దగుదును. మాటిమాటికి నెన్నిపాట్లుపడినను రాజ్యము నాకు లభించినదిగాదు. ఇట్టి నను బోఁటివానికి మరణమును, దొంగతనమును, పరులనాశ్రయించుటయు, మఱియుఁ దక్కినక్షుద్రము లయినయాచారములును

దక్క వేఱేమిచేయవచ్చును? దానిని నాకుఁ జెప్పుము. మనసు తెవులుచేతను దేహవ్యాధులచేతను బాధపడుచున్న మనుష్యు నకుఁ, బెక్కు చదువులుచదివి ప్రజ్ఞయం దాఱితేఱియున్న నిను బోఁటివాఁడే శరణమగును. మనుష్యుఁడు విషయభోగములందు విరక్తినొంది ప్రీతిని శోకమును దిగవిడిచి జ్ఞానమనెడి ధనమును బొంది సుఖముగా వర్ధిలుచున్నాఁడు. ఎవరికి సుఖము ధనము నాశ్రయించియుండునో (అనఁగా ఎవరు ధనమువలననే సుఖమును బడయువారగుదురో) వారినిగుఱించి దుఃఖించుచున్నాను. నాకో పెక్కులు ధనములు స్వప్నములందుఁ బొందినవియుంబోలె నాశమునొందినవి. గొప్పధనరాసుల నొకరు దిగవిడిచిరేని, ఓహో! వారెంతో దుష్కర మయినకార్యమును జేసినట్లే సుమీ! మేమో లేకదూలునట్టి యీధనములనుగూడ దిగవిడు చుటకుఁ జాలకున్నారము. బ్రాహ్మణోత్తమా! ఇట్టియవస్థను బొంది దీనుండై సంపదను దిగనాడి దుఃఖించుచున్ననాకు నిందు వేఱేమిసుఖముగలదు? దాని నుపదేశింపవలయును' అని యడి గెను.

బుద్ధిమంతుఁడగు నారాజకుమారుఁ డట్లడుగఁగా మహాతే జుం డాకాలకవృక్షీయుఁ డతనితో 'నీకు మునుపే యిది తెలిసి యున్నది. కాఁబట్టి 'నేను' 'నాది' యనెడి యిదియంతయును నిత్యనుగా దనెడియీబుద్ధి యుండవలయును. ఎద్దానిని గల దని తలంతువో యదియంతయు నిజమునకు లేదని యెఱుంగు ము. ఇట్టి యెఱుకగలవాఁ డెట్టికష్ట మయినయాపదఁ బొందినను దుఃఖమునొందఁడు. జరిగినదియు జరుగనున్నదియు నెద్దియు లేద నుట నిజము. నీ విట్లు తెలియవలసినదానిని దెలియుదువేని వ్యస

నములనుండి విడివడుదువు. * మునుపటివారు గడించినవియు, వారికిఁ బిమ్మటివారు గడించినవియు నన్నియు నశించినవి గాని యిపుడు న్నవిగావు. ఇది తెలిసినచో నెవఁడు తుందుడుకుపడును. ఈలోక, ముండియు లేనట్టిదగును. లేకుండియు నున్నది యగును. శోకించుటవలన సాధించున దేదియు లేదు. † కాఁబట్టి యేవిధము నను శోకింపరాదు. రాజా! ఇపుడు నీతండ్రియెక్కడ ? నీతాత యేఁడీ! నీవు వారి నిపుడు చూడవు. వారును నిన్నిపుడు చూడరు. శరీరమిట్లు సతముగాదని దీనిచే నీకుఁ దెలియుచుండఁగా నీవు వారినిగుఱించి యేలదుఃఖపడెదవు ? బుద్ధిచేత నాలోచింపుము. నిలుకడగా నుండున దొకటియు లేదు రాజా! నేనును నీవును నీసుహృదులును శత్రువులును నవశ్యము లేకుండనే పోవుదుము. అన్నియు లేకపోవును. ఇప్పుడిరువది యేండ్లును ముప్పది యేండ్లును గల మనుష్యులందఱును నూఱేండ్లకులోపలనే చావఁగలరు. పురుషుఁడు తన పెనుధనములను విడువ నిచ్ఛగింపకపోయినను బోవుగాక. 'ఇదినాది కాదు' అని ‡ తలఁచి యందువలనఁ దనకు

---

* 'యచ్చపూర్వం సమాహారే యచ్చపూర్వంపరేపరే। సర్వం తన్నాస్తితే చైవ' అనిగౌ. మూలము. 'యేచపూర్వసమారమ్భా యేచ పూర్వతరేపరే। సర్వం నాస్తీతితే చైవ' అని దాక్షిణాత్యమూలము. మునుపటివారి పూనికలును వారి కంటె మునుపటివారివియు, బిమ్మటివారివియు, మఱి నీయవియు లే వనియే తెలియవలయును. ఇది తెలిసినపిదప నెవఁడు దుఃఖపడును' అని యర్థము. ఇది యే సమంజసముగానున్నది.

† శోకంకుర్యాత్కథంచన' అని మూలము. 'శోచేత స కథంనరః' అని దా. మూలము. అది తెలిసినమనుష్యుఁడు శోకించుటయెట్లు ? అనియర్థము.

‡ అనఁగా ఆవిత్తము తనకొఱకుఁగాక తనసుహృదులు మొదలగువారి

మంచి గావించుకొనవలయును. తనకు రాఁగల వస్తువును 'నాది కా'దని తెలియవలయును. కడచిపోయినదానిని 'నాదికా' దని తెలియవలయును. దైవము బలీయమని తలంపవలయును. ఇట్లు తలంచువారే పండితులు. ఇట్లు తలంచుటయే సత్పురుషుల వృత్తియందురు. పెక్కండ్రు బుద్ధియందును పౌరుషమందును సంపన్నులగువారు గలరు. అందుఁగొందఱు నీకు సమానులుగను, గొందఱు నీకంటె నధికులుగను నున్నారు. వారు ధనహీనులై యుండినను రాజ్యమేలక పోయినను బ్రతికియేయున్నారు. వారు నీవలె శోకించుచుండ లేదు. కాఁబట్టి నీవును శోకింపకుము. నీవుబుద్ధియందును పౌరుషమందును వారికంటె నెక్కుడఁగానా? లేదా సమానుఁడేని కావా ?' యనెను.

రాజు 'బ్రాహ్మణోత్తమా ! ఆరాజ్యమంతయు నేప్రయత్నమును లేక యలవోకగా లభించినదని తలంచుచున్నాను. బలీయమయిన కాలము దానినంతయు నపహరించికొని పోయినది. తపోధనా ! ఆరాజ్యమంతయుఁ బ్రవాహముచేతంబోలెఁ గాలముచేతఁ గొట్టుకొనిపోవుటకు, నే నిపుడు దొరకినదానితోఁ గడుపు పోషించుకొనుచుండుట ఫలముగాఁ జూపట్టుచున్నది' అనెను.

అందులకు ముని 'కోసలాధిపతీ ! (జీవయాత్రయందు) యథార్థమైన దిది యని నిశ్చయించుకొని రానున్నదానిని గుఱించియుఁ గడచిపోయినదానిని గుఱించియు శోకింపకుండవలయును. సమస్త విషయములందును నట్లె యుండుము. పడయఁగూడినవాని నే కోరుచుఁ, బడయరానివాని నొకప్పుడునుగోరక, యిప్పటికిఁ గలిగి

కొఱకి య్యఁబడినదని తలంపవలయును. దానిచే నతనికి దానమునం దభిరుచి కలిగి శ్రేయస్సు సిద్ధించునని యాశయము.

యుండువాని ననుభవించుచుఁ, గలుగకున్నవానికి శోకింపకుండు ము. కౌసల్యా! అట్లుండువేసి, తనుదాన దొరకిన మంచివస్తువుల తోనే సంతోషపడుచుండఁగలవు. నీకు సంపదపోయినను, దానికి శోకింపక శుద్ధమయినస్వభావము గలిగియుండును. చెడ్డబుద్ధిగల వాఁడు తాను మొదట ననుభవించినభోగ్యములు నశింపఁగా భోగములు పోయినందులకుఁగాను ధాత నెప్పుడును నిందించు చుండును. దొరికినవానితోఁ దుష్టినొందఁడు. అట్టివాఁడు తక్కిన వారెంత యనర్హులుగా నుండినను, వారిని శ్రీమంతులని తలఁచు చున్నాఁడు. ఈకారణమునుబట్టి యీర్ష్యయు, నహంకారమును గలిగి తమ్ముఁ దామే పురుషశ్రేయులుగాఁ దలఁచుకొనునట్టి వారు మఱింతదుఃఖము ననుభవించుచున్నారు. రాజా! ప్రాజ్ఞుం డవు. నీ కట్టిమచ్చరము లేదుగదే! నీకు సంపద లేకపోయినను నితరులసంపదకు సైఁచియుండుము. మచ్చరము మాన నేర్చిన నిపుణులగువారు పరులయందున్న సంపదనుగూడ ననుభవింపఁ జాలుచున్నారు. ఇతరులను ద్వేషించువానియందు సంపదయుం డియునుదొలఁగిపోవును. ధర్మచారులును*త్యాగధర్మములను దెలి సినవారునగు ప్రాజ్ఞులు సంపదను బుత్త్రులను బౌత్త్రులను దమం తటఁద్యజింతురు.(స్వాయంభువకులమునం దుదయించినపుణ్యుఁడు భరతుఁడు, నానారత్నములు నెరసినపెనురాజ్యమును విడిచెనని వినికి. అట్లె తక్కినరాజులును, మహాభ్యుదయసంపన్న మయిన రాజ్యమును విడిచియున్నారు. అట్లారాజులందఱును రాజ్యము

* 'త్యాగధర్మవిదః' అని దా. మూలము. 'యోగధర్మవిదః' అని జౌ. మూలము. యోగము పుత్త్రపౌత్త్రాదివిరక్తికి సాధకమయినను నిచట త్యా గము ప్రస్తుతముగాన 'త్యాగధర్మవిదః' అనుపాఠమే సరసము.

లను విడిచి యరణ్యములకుంబోయి యందలి ఫలములును భుజించుచుఁ దపంబుపారంబునొంది దుఃఖమునంతముం బొందిరి.) అట్లె మఱియుఁ గొంద ఱంచలివస్తువులు వెక్కులు, ఉడుగక పనిచేయుచు సాధింపవలసినదిగా నుండుటంబట్టియు నెంతయు నస్థిరములుగా నుండుటనుజూచియు, నవి మిక్కిలియు దుర్లభము లని తలఁచి వానిని ద్యజించుచున్నారు. నీవు మిక్కిలి ప్రాజ్ఞుఁడవు. ఇట్లుండియుఁ గోరఁదగినవియుఁ బరాధీనములయినవియు నస్థిరములునగు ధనములను గోరుచు నేలదీనముగాఁ బరితపించుచున్నావు? * నేనుజెప్పినబుద్ధిని జక్కఁగా నెఱిఁగి నీయంతట నే వీనిని బరిత్యజింపుము. అనర్థము లర్థరూపములుగను, అర్థము లనర్థరూపములుగను దోఁచుచున్నవి. కొందఱు ధనమును గడింపఁబోగా ధననాశము గలుగుచున్నవి.† మఱికొంద ఱాసుఖము ననిత్యముగాఁదలఁచి సంపదను బడయఁగోరుదురు. వేఱుకొంద ఱుసంపదయందుఁ గ్రీడించుచు నంతకంటె నెక్కుడు లేదని తలఁతురు. ‡ అందులకై వాఁడు పాటుపడుచుండఁగా దానివలన వాని

* 'తాం బుద్ధి మనువిజ్ఞాయ త్వమేవై తాంపరిత్యజ' అని దా.మూలము. 'తాం బుద్ధి ముపజిజ్ఞాసు స్త్వమేనై తాం పరిత్యజ' అని జొ.మూలము.'నీవు(ధనములన్నియుఁ బోయినను సుఖమును బడయునట్టి) బుద్ధిని తెలియఁగోరెదవు. వీనినెల్ల (కామవిషయములనెల్ల) దిగవిడువుము.అదియే యాబుద్ధి'యని (ప్రతాపచంద్రరాయలు)

† 'అనిత్యం తత్సుఖం మత్వా శ్రియమన్యేన లిప్సతే' అని మూలము. 'అనంత్యం తత్సుఖం మత్వా శ్రియమన్యః పరీప్సతి' అని జొ.మూలము. మఱికొంద ఱాసంపద యనంతసుఖమునకు మూలమని తలఁచి దానిని బడయఁగోరుదురని యర్థము.

‡ 'తథా తస్యేహమానస్య సమారంభో వినశ్యతి' అని జొ. మూలము. 'సంరంభోఽపివినశ్యతి' అని దా.మూలము.

తక్కిన ప్రాణికలంతయు నశించుచున్నవి. కౌసల్యా! ఒకఁడు తానెంతో కష్టపడి కోరినచొప్పునఁ బడసినధనమును బోఁగొట్టు కొనునేని యపుడు వాఁడు తనపాటంతయు భంగము నొందినందులకు ధనమువలనియాస లన్నియు దిగవిడుచును. ధర్మాత్ములును గులీనులునగు కొందఱు ధర్మమును బడయుటకే ప్రయత్నింతురు. వీరు పరలోకసుఖమునే కోరుచు నిహలోకపు సుఖములన్నిటను విరక్తులగుదురు. మఱికొందఱు మనుష్యులు, ధనమువలని పేరాసఁ బట్టి ప్రాణములను దిగవిడుతురు. వీరు ధనములేనిచో జీవితము వలన నెంతమాత్రమును బనలేదని తలంతురు. అక్కటా! వీరి దీనతచూడుము! వీరిబుద్ధి లేమిని జూడుము! జీవితము నిలుకడ లేనిదిగానుండఁగా, నిది తెలియక ధనమువలని తృష్ణకుఁ బాలగు చున్నారు. కూర్పుటకు నాశము కడపలగా నుండఁగా, జీవితమునకు మరణము తుదిగానుండఁగా, కూడికకు నెడఁబాటు ముగింపుగా నుండఁగా, వీనియందు మన సెవఁడుంచును? రాజా! పురుషుఁడు ధనమునో, లేక ధనము పురుషునో, తప్పక విడుచుట నిజము. అది తెలిసినవాఁ డెవఁడు కొందలపడును?. ఇంకను గొందఱకు ధనములును సుహృదులును నశింతురు. రాజా! బుద్ధిం గాని చూడుము; మనుష్యులకు గలుగునాపదలు వారినడవడికిఁ దగున ట్లుండుటను జూడుము. కాఁబట్టి (యాపదలకు బరిహారముగా) నింద్రియములను మనస్సును వాక్కునునడంచిపుచ్చుము. ఇవి బలహీనములై యహితములగునేని వీని దొసఁగులునుండి యెవ్వఁడును దన్ను వారించుకొనలేఁడు. *కడచిపోయినవానిని దెలి

* 'ప్రాప్తిస్వప్తేషు భావేషు వ్యపకృష్టేష్వసంభవే। ప్రజ్ఞానతృప్తో విక్రాన్తస్త్వద్విధో నానుశోచతి' అని మూలము. ఇంవర్థము క్లిష్టముగా నున్నది.

యుటకును, రాఁగలవానిని గనుఁగొనుటకును శక్యముగానందునఁ బ్రజ్ఞానముచేతనే తృప్తినొందియుండు నినుబోఁటిపరాక్రమశాలి కూడికకును నెడఁబాటునకును దుఃఖమునొందఁడు. అట్లువృదుప్రకృతిగలిగి దాంతుఁడై మంచినిలుకడగలిగి, బ్రహ్మచర్యమాచరించుచుండు నినుబోఁటివాఁడుచాపలము లేక దొరకినమట్టునకుస్వల్పమునే కోరుచుండును గాన ముదమునొందఁడు. దుష్టపురుషులకుచితమైనదియు, దుఃఖయుక్తమయినదియు, మిక్కిలిపాపాత్మకమును, ఘోరవృత్తిగలదియు వంచకులసంబంధించినదియు నగు కాపాలికవృత్తి (పునుకలో బిచ్చమెత్తుబ్రతుకు) నీకెంతమాత్రముతగదు. వాక్కును మనస్సును నడంచి సమస్తభూతములందును దయగలిగి మహారణ్యమందు నొంటిమెయి ఫలమూలములను దినుచునేని సుఖంబుండును. బండికాఁడులంబోని దంతములుగల యేనుఁగులంతోఁగూడ నడవియందు సుఖంబుండుటయు, స్వల్పముచేతను సంతోషించుటయుఁ, బండితునకు సర్వమయినది. ఒక పెద్ద మడుఁగు మిక్కిలియుఁ గలగుండునొందెనేని, తానే తనంతటఁ దేటపడును; అట్లె మంచిప్రజ్ఞ నొందినవాఁడు కలఁతనొందెనేని తనంతటనే ప్రసన్నతనొందుచున్నాఁడు. రాజా! నినుబోఁటి స్థితిని బొందినవాఁ డీవిధమునను సుఖముగానుండవచ్చునని నాకుఁ

'ప్రతికృష్టేషు భాగ్యేషు హ్యపకృష్టేషు సంభవే। ప్రజ్ఞా ..' అనియుఁ బాఠము గలదు. భాగ్యములు వచ్చినపుడును దొలఁగిపోయినపుడును బ్రజ్ఞానతృప్తుఁడును బరాక్రమశాలియునగు నినుబోఁటివాఁడు దుఃఖమునొందఁడని యర్థము. మఱి యొక్కరు పూర్వపాఠమునకు 'తొలఁగియున్న వస్తువులను జూచుట యెవ్వరికిని శక్యముగాదని తెలిసియుండఁ బ్రజ్ఞానతృప్తుఁడు ..' అని యర్థము చేసియున్నారు.

దోఁచుచున్నది. నీకు సంపద మరల దొరకరాకుండఁగా, మంత్రులు మొదలయినవారును లేకుండఁగా, నిట్టిదారియే యుర్వ్యాము. కాని దైవమునే నమ్మి మేలు పడయఁ గోరెదవా? ఇది నూటనాలుగవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

(క్షేమదర్శికిని గాలకవృక్షీయునకునుశత్రువులను గెలుచు కపటోపాయములను గుఱించిన సంవాదము.)

ముని—'క్షత్రియా! లేక నీయందుఁ బౌరుషమే దేని గలదని నీకుఁ దోఁచెనేని నీరాజ్యమును మరలఁబడయుటకుఁ దగునీతిని జెప్పెదను. నీ వానీతి ననుష్ఠించుటకు శక్తిగలిగి యందులకు వలయు కార్యములను జేయుదువేని నీసంపదను నింకను బడయవచ్చును. నీకు నేనును గలరూపునఁ జెప్పెనదంతయు వినుము. నీవు నేను జెప్పినకార్యమును జేయుదువేని మిక్కిలి గొప్ప యర్థములనో, రాజ్యమునో, లేక రాజ్యమంత్రమునో మిక్కిలి సంపత్తినో పడయఁగలవు' అనెను.

రాజు 'మహాత్మా! నీతి నుపదేశింపుము. పౌరుషము గలిగి యున్నాను. ఉపదేశింపుము. ఇప్పుడు నీతోడిసమాగమము నాకు ఫలకారిగా నుండుఁగాక' యనెను.

ముని—'నీవు మానమును, డంభమును, కోపమును, హర్షమును, భయమును విడిచి, నీశత్రువులకు మొ్రక్కి చేతులు మోడ్చి కొలువుము. ఉత్తమమును బరిశుద్ధము నగుకార్యముల నెప్పుడును గావించుమిథిలాపతి యగుజనకునిఁ గొలువుము.

అతఁడు*సత్యమెంతయును దప్పక నీకు ధనము నొసంగ నర్హుఁడు. అప్పుడు నీవు విదేహరాజునకుఁ గుడిభుజమవై యందఱకు విశ్వాస పాత్రమగుదువు. అందువలన నీకు నుత్సాహవంతులును వ్యసన దూరులును బరిశుద్ధులునగు సహాయులు పెక్కండ్రుగలుగుదురు. ఒకఁ డాత్మనిగ్రహముగలిగి యింద్రియములను గెలిచి తనకు శాస్త్రవిహితములయిన వానియందు వర్తించుచుండునేని,వాఁడు తన్నుఁ బయికినుద్ధరించుకొనుటయే కాక తక్కినవారినిఁ దనకుఁ బ్రసన్నులను గావించుకొనును. అంత ధృతిమంతుఁడును శ్రీ మంతుఁడు నగు నాజనకునిచేత సత్కృతుండవై యతనికిఁ గుడి భుజమవై సమస్తజనులనమ్మికను బడయుదువు. అంత నీవు పెక్కండ్ర సుహృదులబలిమిని బడసి మంచిమంత్రులతో లెస్స గా నాలోచించి, యాప్తులనుగొని శత్రువులందు భేదముపుట్టించి బిల్వముచేత బిల్వమును గొట్టునట్లు వారినందఱను గూల్పుము. లేదా, నీశత్రువునకు శత్రువగువానితోడ సంధిచేసి నీశత్రువు బల మును నాశము సేయుము. శత్రువునకు మిక్కిలి లభింపరాని సొగ సయిన వస్తువులయందును,సుందరులయిన స్త్రీలయందును, వెల పొడుగయిన వస్త్రములు శయనములు ఆసనములు వాహన ములు మొదలగువానియందును, గృహములయందును, నానా విధములయిన పక్షులయందును, మృగజాతులయందును, రసము లందును,గంధములందును,ఫలములందును,†మిక్కిలి తగులుగలి

* 'సత్యసంగరః' అని ఔ. మూలము. 'సత్యవిక్రమః' అని దాక్షిణాత్య మూలము.

† ఈవస్తువులందెల్లఁ దగులు గలుగుటవలన శత్రువు బొక్కసమంతయు నిందులకై వ్యయముకాఁగా వాఁడు తనంతటఁ దానే నశించునని యాశయము. ప్రతాపచంద్రరాయలు.

గించి, దానివలనఁదనంతటఁ దానేనశించునట్లు చేయుము. ఇట్లా శత్రువునువారింపవలసినను, లేక యుపేక్షింపఁదగియుండినను, మంచినీతి చొప్పున నడవఁగోరువాఁడు దేనినిగాని యాశత్రువొకప్పుడును దెలిసికొనునట్లు చేయరాదు.*నీమిత్రులకు సమ్మతమగు మార్గమున శత్రువుపట్టణమందును, దేశమందును, మిత్రునివలె వసించియుండుము. మఱియుఁ బసమాలినకుక్కలయు, జింకలయుఁ, గాకులయునడవళ్లనను కరించుచుఁ బయికి మిత్రధర్మమును నటించుచు నుండుము. మఱియు వారిని మిక్కిలియు గొప్పవియుఁ జేయుటకసాధ్యము లయినవియు, మహానదివలెఁ గడవ నలవిగానివియు నగు ప్రారంభములందుఁ జొనుపుము. బలవంతులతోడ విరోధము పెట్టించుము. మిక్కిలి రమణీయములయిన యుద్యానములు శయనములు, ఆసనములు మొదలగువానింబోని † యింపారు భోగముల మూలమున వారిబొక్కసమును రిత్తగావింపుము. వీనికొఱకు ‡ యజ్ఞములను దానములను బొగడుము. దానివలన

---

* 'వసస్వ పురమామిత్రం విషయే మిత్రసమ్మతః। భజస్వ శ్వేతకాకీయైర్మిత్రధర్మమనర్థకైః' అని దా. మూలము. 'రమస్వపరమామిత్రే విషయే ప్రాజ్ఞసమ్మతః।...' అని ఔ. మూలము. ప్రాజ్ఞులకు సమ్మతిమగుచొప్పున వర్తించుచు శత్రువు దేశమందు మిక్కిలియు రమించుచుండుము.' అని యర్థము. శ్వేతకాకీయమనఁగా శ్వా (కుక్క) + ఏత (జింక) కాక (కాకి)ములను సంబంధించిన ధర్మములు- కుక్కవలె జాగరూకతయు, జింకవలె బెదరును, కాకివలె పరేంగితములను దెలియుటయుఁ గలిగియుండుటయని తెలియునది.

† ప్రీతిభోగముఖేనైవ (దా. మూ.) ప్రతిభోగసుఖేనైన (ఔ. మూ.)

‡ యజ్ఞదానే ప్రశంసాస్మై బ్రాహ్మణా ననువర్తయ (దా. మూలము.) ప్రశాధ్యస్మై బ్రాహ్మణా ననువర్ణ్యతాం (ఔ. మూ.)

బ్రాహ్మణులను సంతోషపెట్టుము. వారు (దక్షిణాదులను నీచేతు లారఁదీసికొని) నీకుఁ (దపములచేతను లేక క్రియలచేతను) మంచి గావించుచు నీశత్రువును దోఁడేళ్లుంబోలె మ్రింగుదురు. పుణ్య శీలుండగువాఁడు తప్పక పరమగతిని బొందును. పుణ్యకార్య ములవలన దేవలోకమందు మిక్కిలి పుణ్యము లగుశాశ్వత పదములను బొందును. ఒకఁడు ధర్మకార్యములయందును నధర్మ కార్యములందును బ్రేరితుఁడగుటంజేసి వానిబొక్కసము క్షీణిం పఁగా వాఁడు శత్రువులకు వశగతుఁ డగుచున్నాఁడు. కోశము స్వర్గమందలి సుఖఫలమునకును భూమియందలి జయమునకును మూలము. కోశములవలననే శత్రువు లట్టిసుఖమనుభవింతురు. కాఁబట్టి దానిని సర్వవిధముల రిత్తగావింపుము. నీశత్రువు మ్రోలఁ బౌరుషమును గొనియాడకుము. దైవమునే యెక్కు డుగా వర్ణింపుము. దైవమునే మిక్కిలి యూఁదియుండు వాఁడు తప్పక శీఘ్రముగానే నశించును. నీశత్రువుచేత * విశ్వ జిత్తనెడి యాగమును జేయించి వానిని సర్వస్వమునకుఁ బాయు నట్లు చేయుము. పిదప † వాఁడు మహాజనులను బీడించుచు ధన మొడఁగూడనివాఁడై పోవును. ‡ త్యాగధర్మము నెఱింగిన

* విశ్వజిత్తనెడి యాగమున సర్వస్వదానము విహితముగాన యట్లు చే యింపుమనుట తెలియునది.

† 'తతో గచ్ఛత్యసిద్ధార్థః పీడయానో మహాజనమ్. (దా. మూలము.) తతో గచ్ఛతి సిద్ధార్థః పీడ్యమానం మహాజనమ్' అని. ఔ. మూలము. అంత నీకోర్కి యీడేఱును. పిదప బొక్కసము నించుటకై మహాజనులుపీడితులగుటను శత్రు వునకుఁ దెలుపవచ్చును- అని ప్రతాపచంద్రరాయులు.

‡ 'త్యాగధర్మవిదం' అని. దా. మూలము. 'యోగధర్మవిదం' అని ఔ. మూలము. మహాజనులు పీడితులయిరని ప్రజలందు నిస్పృహకలిగించి పిదప

పుణ్యాత్ముని నొకనిని వీనికి వర్ణించి చెప్పుము. ఒకవేళ నీశత్రువు త్యాగమేని చేయఁగోరును; క్షేమముగా నుండుటకై యడవులకేని పోవును. నీవు పిదప సమస్తశత్రువులను నాశము సేయునట్టిదియు పెక్కుమూలికలచేత సిద్ధము గావింపఁబడినదియునగు నౌషధములను, కృత్రిమములగు నుప్పులను, బ్రయోగించి శత్రువునకుఁ గలగజములను నశ్వములను మనుష్యులను నాశము సేయింపుము. రాజపుత్రా! ఇట్లు చక్కఁగా నాలోచించి యిట్టివియు మఱియు నితరము లయినవియునగు కపటోపాయములఁ బెక్కింటిని బ్రయోగించుట దిట్టయగువానికి శక్యముకాని దిట్టగానివానికి శక్యముగాదు' అని చెప్పెను. ఇది నూటయేనవ యధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

(కాలకవృక్షీయునియానతిని క్షేమదర్శి మునల రాజ్య ప్రాప్తి మొదలగువానిని బడయుట.)

రాజు 'బ్రాహ్మణోత్తమా! కపటముచేతను డంభముచేతను జీవించుటకు నేనొల్లను. ధనములు మిక్కిలియు నధికములయినను గూడ నధర్మముతోఁ గూడియుండెనేని నా కిష్టముగావు. మహాత్మా! మొదటనే నేను వీనిని వలదంటిని. దేనియందుఁ బాపము

---

త్యాగవిదునితోడి కూటమి గలిగించుటవలన రాజ్యమును త్యజించునట్లు చేయఁ గలుగుననియుఁ బిదప రాజ్యము నీకు సిద్ధించుననియు భావము. యోగధర్మమును వాలయును రాజ్యవిరక్తికి సాధకమే. పెక్కుచోట్ల 'త్యాగ'మనుటకు యోగమని పాఠముండుట చూపట్టుచున్నది.

నెడి శంకకలుగదో, యేది యన్నివిధముల హితమగునో, దేనిచేత నెంతమాత్ర మితరులకు బాధగలుగదో, యట్టి ధర్మముచే నే నీ లోకమున బ్రతుకఁ గోరుచున్నాను. నీవుచెప్పినరీతిని జేయుటకు నేను శక్తుఁడను గాను. ఇది నాకు యుక్తముగాదు' అనెను.

ముని 'క్షత్రియా!ఇట్లు మాటాడుటంబట్టినీవు నీతిగలవాఁడవని తెలియుచున్నది.నీవు స్వభావముచేతను బుద్ధిచేతను నీతిమంతుఁడుగ నున్నావు. నీయెఱుక యద్భుతముగానున్నది. నీకును నా విదేహరాజునకు నుభయులకును సహాయముచేయుటకుఁ బ్రయత్నించెదను. లేదా మీ యిరువురకును శాశ్వతమయి యెడఁబాయకుండునట్టి కూడికనయినను గలిగించెదను. సత్కులప్రసూతుఁడును నక్రూరుండును మిక్కిలి చదువరియు రాజ్యము నడపుటయందు సమర్థుండు నగునినుబోఁటివాని నెవఁడమాత్యునిఁగాఁ జేసికొనఁడు? క్షత్రియా! నీవు రాజ్యమునుండి వెడలఁగొట్టంబడియు,మిక్కుటమయినవ్యసనముపాలయ్యు,నక్రూరంబగు నడవడిని బ్రతుకఁగోరెదవు; కాన యిట్లు చెప్పుచున్నాను. సత్యసంధుఁ డగు విదేహరాజు నాగృహమునకు శీఘ్రమున వచ్చును. అతఁడు నే నేమి యానతిత్తునో దానిని దప్పక చేయును' అనెను.

భీష్ముఁడు.—అంత ముని వైదేహునిఁ బిలిచి 'రాజా! ఇతఁడు రాజకులమునఁబుట్టినవాఁడు. ఇతని యంతరంగము నాకుఁ దెలియును.ఇతనియాత్మయద్దమువలెను, శరత్కాలపుఁజందమామవలెను శుద్ధముగా నుండును.ఇతనియందు దోషము గానరాదు. నే నన్నివిధములచేతను నితనిని బరీక్షించితిని. నీ కితనితోడఁ జెలిమియే యుండుఁగాక, నాయందుంబోలె నితనియందును నమ్మిక గలిగి

యుండుము. అమాత్యుఁడు లేక రాజ్యము నేల శక్యముగాదు. అమాత్యుఁడు శుద్ధుఁడుగను బుద్ధిసంపన్నుఁడుగను నుండవలయును. ఆ రెండుగుణములచేత నే రెండులోకములును సిద్ధించును. రాజా! రాజ్యము నేలుటకు నీ రెండుగుణములు గావలసియుండుటను జూడుము. ధర్మాత్ము లగు వారికి లోకమునం దెచ్చటఁగాని యిటువంటిమార్గము వేఱొకటిలేదు. ఈరాజపుత్రుఁడు మహాత్ముఁడుగను సాధువులమార్గము నొందినవాఁడుగను నున్నాఁడు. *ఇతఁడు ధర్మమును మున్నిడికొన్నవాఁడుగాన యిట్టివానిని గయికొనుటయెంతయు లెస్సపని. ఇతనిని, లెస్సగా గారవించుచు వత్తువేని, నీశత్రువుల పెనుసమూహములను గలఁచిపుచ్చును. ఇతఁడు నీతో యుద్ధమునకుఁ దలపడెనా యది క్షత్రియుఁ డగువానికి స్వధర్మమే యగును. ఇతఁడు తనతండ్రితాతల చొప్పున నిన్ను యుద్ధమున జయింపఁగోరు నేని నీవును బగవారిని గెలుచుటయనెడి క్షత్రియ వ్రతము ననుష్ఠించువాఁడవు గనుక, నీకును నితనితోడ యుద్ధము సేయఁదగును. అయినను నీవు యుద్ధము చేయుటకై యే నాని యోగమున, నీహితమును గోరి యితనిని నీవశమునం దుంచుకొనుము. అయుక్తమగు లోభమును దిగవిడిచి ధర్మమునందుఁ గన్నుంపుము. కామమువలనఁగాని ద్రోహమువలనఁగాని నీవు స్వధర్మమును విడుచుటతగదు. ఎప్పుడును జయమేకలుగదు.

---

* సుసంగృహీత స్త్వే వై ష త్వయా ధర్మ పురోగమః । సంసేవ్యమా నాశ్శత్రూం స్తే గృహ్ణీయాన్మహతో గణాన్. అని. మూలము. అసంగృహీత ... గృహ్ణీయాన్మహతో గణాన్. అని. (దా. మూలము.) ఇతని నీవు గయికొనకపోయితివేని నీశత్రుసమూహములను జేపట్టునని యర్థము తెలియునది. (ప్రతాపచంద్రరాయలు.)

ఎప్పుడు నపజయమే కలుగుటయు లేదు. కాఁబట్టి శత్రువును దన్నేలుకొనునట్లును జేయవలయును. శత్రువును దా నేలుకొనను వలయును. జయపరాజయములు రెండును దనయందుఁ గలుగుటను జూడవచ్చును. పగవానిని నిశ్శేషముగాఁ జంపఁజూచు వారికి నట్లు దామే నిశ్శేషముగాఁ జేయఁబడునట్టి భయము కలుగవచ్చును' అనెను. ముని యిట్లు చెప్పఁగా జనకుఁడు పూజార్హుఁ డయినయాబ్రాహ్మణోత్తమునిఁ బూజించి సత్కరించి యతనితో 'నీవు మహాప్రాజ్ఞుఁడవు. మిక్కిలి చదువరివి. నీవు శ్రేయస్సునుగోరి యేమిచెప్పెదవో యది మాయుభయులకును హితమగును. నీవేమియెట్లు చేయఁజెప్పితివో దానినంతయు నట్లు చేసెదను. ఇదియేనాకు శ్రేయము. ఈవిషయమై నాకు విచారింపవలసినది లేదు' అనెను. పిదప విదేహరాజు కోసలరాజును బిలిచి 'రాజసత్తమా! నేను రాజధర్మముచేతను బుద్ధిచేతను బలిమిచేతను భూమిని జయించితిని. నీవు నీగుణములచేత నన్ను జయించితివి. నీవు నిన్నుఁ గ్రిందుపఱచుకొనక (అనఁగా నాచేత జయింపఁబడునట్లు తలంచుకొనక) (నాయొద్దనుందువేని) జయమొందినవానివలె నుండుము. నేను నీబుద్ధిని గారవించుచున్నాను. నీపౌరుషమును గారవించుచున్నాను. నిన్ను నేను గెలిచితినని చెప్పుచు నిన్నవమానింపను. నీవు జయించినవానివలె నుండుము. రాజా! నీవు విధ్యుక్తముగా నాచేతఁ బూజితుండవై నాగృహమునుండి నీయింటికిఁబొమ్ము' అనెను. పిదప వారిరువురును

* 'తస్మాద్భోజయితవ్యశ్చ భోక్తవ్యశ్చ పరోజనః' అని జా. మూలము. 'తస్మాజ్జయశ్చభోక్తవ్యో భోక్తవ్యశ్చపరాజయః' అని. దా. మూ. జయమును ననుభవింపవలయును. అపజయమును ననుభవింప వలయును.

గాలకవృక్షీయమునిని బూజించియొండొరులయందు నమ్మికయుంచి తమతమ గృహములకుం బోయిరి. అంత విదేహరాజు కౌసల్యుని వేగ తనగృహమునకుఁ దోడ్కొనిపోయి పూజార్హుండగు నతనిని నర్ఘ్యపాద్యము లొసంగి మధుపర్కమునిచ్చి పూజించెను; మఱియు నతనికిఁ దనకుమారిక నిచ్చి నానావిధముల రత్నముల నొసఁగెను. ఇట్లు సంధియే రాజులకుఁ బరమధర్మము. ఏలన జయాపజయములు రెండును గలుగుట సమములే కాన సతములు గావు' అనెను. ఇది నూటయాఱవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

### భీష్ముఁడు గణవృద్ధి మొదలగువానిని జెప్పుట.

ధర్మరాజు 'పరంతపా! బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రుల ధర్మవృత్తులును వారలవిత్తములను, జీవనోపాయములను వాని ఫలములను జెప్పితివి; మఱియు రాజులనడవళ్లును, బొక్కసమును బెంచువిధములను వారిజయములను జెప్పితివి. అమాత్యుల గుణములను వృత్తులను బ్రజలను వృద్ధినొందించు విధములను, సంధివిగ్రహాదు లయిన యాఱుగుణముల లక్షణములను, సేనల నీతియు, దుష్టులను దెలిసికొను విధమును, దుష్టులు కానివారల లక్షణములును, సమానులయుఁ, దక్కువ వారలయు, నధికులగువారలయు యథార్థ లక్షణములను, మధ్యస్థులను సంతోషపెట్టుకొఱకు వృద్ధినొందఁ గోరువాఁడు వారియెడల నుండవలసిన యునికియు, క్షీణులగువారిని నాదరించువిధమును, వారి జీవనోపాయమును జెప్పితివి. నీవు వీనినంతయు, శ్రుత్యాదిగ్రంథములం

దున్న చొప్పున సులభమయిన విధుల రూపమున వివరించితివి. అట్లె జయింపఁగోరువానికిఁ దగునడవళ్లను జెప్పితివి. నీవు మతిమంతులందు మేలుబంతివిగదే. కాన, రాజును బరివేష్టించి యుండుశూరగణములయెడనడచుకొనవలసిన విధమును వినఁగోరుచున్నాను. ఆగణము లెట్లు వర్ధిలుదురో, యెట్లు రాజువలన భేదిల్లక సంసక్తులై యుందురో, వారెట్లు శత్రులను జయింపనేర్తురో, మఱి యెట్లు మిత్రులను బడయుదురో, తెలియఁగోరెదను. గణములనాశమునకు భేదమే మూలమని నాకుఁ గనుపట్టుచున్నది. మఱియుఁ బెక్కండ్రుగూడి యాలోచించిన రహస్యమును గప్పిపుచ్చుట యెంతయుఁ గష్టమని నాకుఁ దోఁచుచున్నది. ఇది నేను బూర్ణముగా వినఁగోరుచున్నాను. ఆశూరగణము లెట్లు రాజుతో భేదము నొందకుండునో చెప్పుము' అనెను. భీష్ముఁడు 'గణములకును రాజులకును నడుమ లోభమును జూపోపమియునుఁ గోపమును వైరమును బెంచునట్టివి. ఈ యిరుతెగలయం దొకరు (అనఁగా రాజు) * లోభమును జెందుచున్నాఁడు. పిదప మఱొకరు (గణమును) దోడనే సైఁపమిఁ (గోపమును) బొందుచున్నది. † ఇట్లా యిరుతెగలు నొకరినొకరు సైఁపక యొండొరులయెడఁ బ్రతికూలమయిన యభిప్రాయములు గలిగి, చారుల నియోగించియు,

---

* రాజు లోభముచే జనులపయి నెక్కుడుపన్నులను వేయఁగాఁ బ్రజలు రాజును నాశము సేయఁ జూతురని యాశయము.

† తతో వ్యామర్ష సంయుక్తా వన్యోన్యజనితాశయా । చారమంత్ర బలాదానైః సామదాన విభేదనైః । క్షయవ్యయ భయోపాయైః ప్రకర్షన్తీతరేతరమ్।' అని. దా. మూలము. 'తాక్షయవ్యయసంయుక్తా వన్యోన్యంచ వినాశినో । చార...... భేదనైః । క్షయవ్యయభయోపాయైః కర్షయన్తీతరేతరమ్' అని జౌ. మూలము. ఒకరినొకరు క్షీణింపఁజేయుటకును నాశము సేయుటకును

నుట్రలాలోచించియు, బలిమి మెఱసియు, నెక్కువ కప్పము మొద లయినవి పుచ్చుకొనియు, సామదాన భేదములను బ్రయోగించియు, క్షీణతను నాశమును భయమును గలిగించు నెక్కుపాయములచేత నొకరినొక రతిశయింప నడఁగుదురు. అందు గణములు మొత్త ముగాఁగూడి మాడియుండువారుగాన రాజు తమవలన నెక్కువ గాఁ బుచ్చుకొనునేని యతనినుండి మొత్తముగా వేఱుపడసాగు దురు. ఇట్లు రాజునుండి వేఱుపడి యందఱును మనసులు చెడి, భయమువలన, రాజు శత్రువునకు వశగతులగుదురు. గణములవారు నొకరినుండి యొకరు వేఱుపడి రేని నశింతురు; అట్లు వేఱుపడుట వలన (మొత్తముగా నుండుటవలని బలిమి తఱిఁగి) శత్రువులకు సులభముగా లోబడుదురు. కాఁబట్టి గణములవారు మొత్త ముగానుండియె యెందులకును బ్రయత్నము చేయవలయును. వారు మొత్తముగఁ గూడి మాడియుందురేని (యొరిమగలరేని) యందువలని బలిమిచేతను బౌరుషములచేతను వారు వలసిన యర్థములను బడయుదురు. వా రట్లు (లైకమత్యమున) మొత్తము గాఁ గలసిమెలసి వర్తింతురేని బయటివారును వారితోడఁ జెలిమి చేసికొందురు. ఇట్లు వీ రొకరినొకరు ప్రేమతోడఁ గూడి తోడు పడుచుందురేని మిక్కిలి జ్ఞానవంతులగు వారు వీరి నెంతయుఁ గొనియాడుదురు. అందఱు సుఖముగా వేఱువేఱు తలంపు లను వీడి యేకార్యమందు నైకమత్యముగలిగి యుందురేని యన్నివిధముల సుఖముగా వర్ధిల్లుదురు. ఉత్తము లయినగణ ములవారు శాస్త్రమునుచొప్పున మిక్కిలి ధర్మయుక్తము లయిన

---

బూని యొండొరులను దుదముట్టింతురు. చారులు మొదలయిన యుపాయ ములచే నొకరినొకరు కాపాడుదురని యర్థము.

వ్యవహారములను గలరూపునఁ గనుఁగొని నెలకొలుపుచు నందు వలన నెంతయు వృద్ధినొందుదురు. పుత్రులను దోఁబుట్టువులను నడఁకువ గలిగించి వారికిఁ జదువు మొదలయినవానిని గఱపి వినయ వంతు లగు పెద్దలను నెప్పుడును నాదరించుచును వృద్ధినొందు దురు. మఱియు వారు చారులను నియమించుట యందును, మంత్రములను విధించుటయందును, కోశములను నించుట యందును నెప్పుడు నెచ్చరిక గలిగి యన్నివిధములను వర్ధిల్లు దురు. మఱియు గణములవారు, ప్రాజ్ఞులను, మిక్కిలి యుత్సాహ వంతులను, నిలుకడయైన పౌరుషముగలవారును శూరులు నగు వారి, నెంతయు జాగ్రత్తతోడ నెప్పుడును గౌరవించుచు వృద్ధి నొందుదురు. ధనవంతులును శూరులునై, శస్త్రవిదులును శాస్త్రపారీణులునై యుండు గణములవారు, మూఢులగు జనులను మిక్కిలి కష్టములయిన యాపదలనుండి దాఁటింతురు. ధర్మరాజా! క్రోధమును, భేదమును, భయమును, దండమును, బాధించుటయు, నిగ్రహించుటయు, వధించుటయు (రాజు చేసిన యెడల) నవి గణ ములవారిని శత్రువునకు వశగతులంగావించును. కాఁబట్టి యాగణ ముల ముఖ్యులగువారిని ముఖ్యముగా సమ్మానింపవలయును. రాజా! లోకయాత్ర లెఱచుగా వారి యఱచేతియందున్నది. మంత్రాలోచనమును గణముఖ్యులతోడనే కావింపవలయును. చారులను వారి వశమందే యుంపవలయును. రాజు గణముల వారియందొక్కొక్కరితోను మంత్రాలోచనములు చేయరాదు. రాజు, గణముఖ్యులతోఁగూడి యాలోచించి గణమునకుహితమైన నదిగావింపవలయును. గణములవారు పరస్పరము వేఱుపడి యైక మత్యము లేక యు నాయకుఁడు లేకయు నుండిరేని వేఱువిధము

లయిన యుపాయములను జేయవలయును. గణములవా రొకరి కొకరు భిన్నులై తమతమ చెల్లుబడి కోలఁదిని వర్తింపఁజూతు రేని వారికిఁగల యుర్థము లడుగంటుటయేకాక యనర్థములును బుట్టుచున్నవి. వారియందుఁ బండితులగువా రొకరియం దొక కలహము పుట్టినా తోడనేదానిని నడఁచిపుచ్చవలయును. కుల మందుఁ బెద్దలగువా రపేక్షగలిగి యున్నయెడలఁ గులమునందుఁ గలహములుపుట్టి కులమునంతయు నాశముసేయును. మఱిగణ ములకుఁ బరస్పరభేదము పుట్టించును. లోపలఁ గలుగు భయ ములనుండి నిన్నుఁగాచుకొనుము. వెలుపలనుండి గలుగుభయము లంతగా సారమైనవిగావు. లోపలనే కలుగుభయము, రాజా ! యపుడే మూలములను ద్రుంచివైచును. జాతియందును గులము నందును సమానులయినవారు సహజములయిన క్రోధమోహ ములచేతను లోభముచేతను నున్నట్టుండి యొకరితో నొకరు మాటాడకుందురు. ఇది పరాభవమునకు లక్షణము. శత్రువులు గణముల నడఁగఁద్రొక్కుట తమపూన్కిచేతను, బుద్ధిచేతను, రూపముచేతను, ధనముచేతను గాదు; మఱి వారియందలి భేదముచేత నల్లుసేయుదురు. కాబట్టి గణములవారికి మొత్త ముగాఁగూడి మాడుటయే గొప్ప రక్షకమని చెప్పుదురు'. ఇది నూటయేడవ యధ్యాయము.



## రాజధర్మపర్వము.

### భీష్ముఁడు మాతృపితృగురువుల మహిమలను వర్ణించుట

ధర్మరాజు 'ధర్మమార్గము మిక్కిలియుఁ బెద్దది, అందలి శాఖలును బెక్కులు. ధర్మములలోపల మిక్కిలియు ననుష్ఠింపఁ

దగినది లోకమం దేదియని నీవు నిశ్చయించి యున్నావు. సమస్త ప్రాణులకును నేకార్యము చేయుట మిక్కిలి గొప్పదని నీ మతమో, మఱినాకు నిందును నందును మిక్కిలియు ధర్మము నొడఁగూర్చునో చెప్పుము' అని యడిగెను.

భీష్ముఁడు 'తల్లిని దండ్రిని గురువును బూజించుట మిక్కిలియు ముఖ్యమని నామతము. ఇందు దీనిని జేయువాఁడు మంచిలోకములను మహనీయమైన యశస్సును బొందుచున్నాఁడు. నాయనా! యుధిష్ఠిరా! వారిని జక్కఁగాఁ బూజించి వారేమిచేయ నానతిచ్చుదురో యది ధర్మముగాన ధర్మవిరుద్ధముగానే చేయవలయును. వారానతియ్యని ధర్మమును మఱెద్దానిని జేయరాదు. వారేదిచేయుమని యానతిత్తురో యదియే ధర్మమనుట నిశ్చయము. వారే మూఁడులోకములు; వారే మూఁడాశ్రమములు; వారే మూఁడువేదములు; వారే మూఁడగ్నులు. తండ్రి గార్హపత్యాగ్నియుఁ దల్లి దక్షిణాగ్నియు, గురు వాహవనీయాగ్నియుఁగాఁ జెప్పఁబడుచున్నారు. ఈమూఁడగ్నులును మిక్కిలి గొప్పవి. ఈమూఁడగ్నులయందునుఁ బ్రాలుమాలిక లేక యుందువేని మూఁడులోకములను సయితము జయింతువు. తండ్రిని బూజించుటవలన నీలోకమును, దల్లిని బూజించుటవలనఁ బరలోకమును, గురువును బూజించుటవలన బ్రహ్మలోకమును గట్టిగ జయింతువు. ఈముగ్గురయెడఁ జక్కఁగా నడపుము. ముల్లోకములందును గీర్తినొందుదువు. నీకు శుభంబుగలుగును. మహాఫలంబగు ధర్మంబును జేకుఱును. నీవు వారిని మీఱియుండకుము. వారు కుడువక నీవు భుజింపకుము; వారలు భుజించుదానికంటె మేలయిన దానిని భుజింపకుము; వార

లను దూషింపకుము. ఎప్పుడును వారికిఁ బరిచర్య చేయుచుండుము. అదియే యుత్తమమయిన పుణ్యము. నీవు కీర్తిని బుణ్యమును యశమును మంచిలోకములను బడయుదువు. ఎవఁ డాముగ్వురను నాదరించునో వాఁడన్నిలోకములను నాదరించినవాఁడగును. వారి నాదరింపనివాఁడు చేయు క్రియ లన్నియు నిష్ఫలములే యగును. ఆముగ్వురు గురువులను నెవ్వఁ డెప్పుడును బూజింపకయే యుండునో వానికీలోకమును బరలోకమును గీర్తియుఁ గలుగవు. వానికీర్తి యీలోకమందును బరలోకమందును వెలుఁగదు. మఱియుఁ బరలోకమందుఁ గలుగునవిగాఁ జెప్పంబడు తక్కినశుభమే దిగాని వానికిఁగలుగదు. యుధిష్ఠిరా! వారికొఱకై యొసంగినదంతయు నూఱుమడుంగులును వేయిమడుంగులును నెక్కుడయినవి. కాఁబట్టియే నాకు మూఁడులోకము లిప్పుడును జక్కఁగాఁ బ్రకాశించుచున్నవి. మంచియాచార్యుఁడు పదుగురు * శ్రోత్రియులకంటె నెక్కుడు. ఉపాధ్యాయుఁడు పదుగు రాచార్యులకంటె నధికుఁడు. తండ్రి పదుగురుపాధ్యాయులకంటె నధికుఁడు. తల్లియొక్కతియుఁ దండ్రికంటెఁ బదిమడుఁగు లెక్కుడు; భూమి యంతకంటెను గొప్పది. తల్లికి సాటియైనగురువు లేదు. భారతా! గురువు తలిదండ్రులకంటె మిక్కిలి యధికుఁడని నామతము. ఏలనఁగా, తల్లియుఁ దండ్రియు నిరువురును బుట్టుకకుమాత్రమే యుపయోగించెదరు. ఈ తల్లియుఁ దండ్రియు శరీరమును సృజించుచున్నారు. ఆచార్యునివలనఁ గలుగు పుట్టుకయో యజ

---

* శ్రోత్రియుఁడు=వేదాధ్యయనము చేసినవాఁడు. ఆచార్యుఁడు=వేదార్థము నుపదేశించువాఁడు. ఉపాధ్యాయుఁడు=వేదము నధ్యయనము చేయించు వాఁడు.

రామరమైనది. (ముదిమియు మరణమును లేనిది) తల్లియుఁ దండ్రియు నపకారముచేసినను వారిని వధింపరాదు. వారిని దండింపకున్నందులకు వానికి దోషముగలుగదు. వారినిదండము పొందకుండుట వానిని దోషిఁగావింపదు. తప్పుచేసినదండ్రులను సయితము గారవముతో నాదరించుధర్మమునకై పాటుపడువారిని దేవతలును ఋషులును ననుగ్రహింపఁదగినవారినిగాఁ దెలియుదురు. ఎవఁ డధ్యయనము చేయించుటయనెడి సత్యంబగు కర్మముచేత వేదమునుపదేశించి యక్షయంబగు పదమునొసంగి యనుగ్రహించునో యట్టివానిని దండ్రియనియుఁ దల్లియనియుఁ దెలియుము. అతఁడుచేసినదానియెడ నెనరుగలిగి యతనికి ద్రోహము చేయకుండవలయును. ఎవ రాచార్యునియొద్ద విద్యనుగఱచినపిదప నతనియెడ మనస్సుచేతను క్రియచేతను నడఁకువగలిగి యాదరము చూపకుందురో, యట్టివారు భ్రూణహత్యచేసినపాపము నొందుదురు. లోకమం దట్టివానికంటెఁ బాపముచేసినవారు గలుగరు. గురువులు వారినెంతయు ననుగ్రహించుచుందురు. వారును గురువు లనుగ్రహించువిధముననే తాము గురువుల నర్చింపవలయును. కాఁబట్టి, తొల్లింటి నుండివచ్చుచున్న ధర్మమును బడయఁగోరువాఁడు, తనగురువుల నెంతయు జతనంబునఁ బూజించియు నర్చించియు వారితోఁ బాటిగా నేదియుఁబంచి కుడువవలయును. ఎవనియెడఁ దండ్రి ప్రీతుఁడగునో వానియెడనే ప్రజాపతియుఁ బ్రీతినొందును. ఎవనియెడఁ దల్లి ప్రీతినొందునో వాఁడు భూమిని సయితము పూజించినవాఁడగును. ఎవఁ డుపాధ్యాయుని సంతోషపెట్టునో వాఁడు బ్రహ్మను సయితము పూజించిన వాఁడగును. ఈ కారణమునుబట్టి గురువు తల్లికంటెను దండ్రి

కంటెను నెక్కుడు పూజ్యుఁడగును. గురువులను బూజించుచుం డినయెడల ఋషులును, దేవతలును, బితరులును సంతోషింతురు. కాఁబట్టి గురువే యందఱికంటెఁ బూజ్యుఁడు. గురువు నేవిధమయిన నడతచేతఁగాని యవమానింపరాదు. తల్లిగాని తండ్రిగాని గురువునంతటి పూజ్యులు గారు. తల్లిని దండ్రిని గురువును నెంతమాత్ర మవమానింపరాదు. వారుచేయు కార్యమునందుఁ దప్పులుపట్టరాదు. దేవతలును ఋషులును గురువులను బూజింపవలయు ననియే తెలిపెదరు. ఎవ రుపాధ్యాయునికిని దండ్రికిని దల్లికిని మనస్సుచేతఁగాని, క్రియ చేతనుగాని ద్రోహముచేయుదురో వారు భ్రూణహత్యచేసిన పాపము నొందుదురు. లోకమునందు వారికంటెఁ బాపులు గలుగరు. తల్లిదండ్రుల కడుపుననే పుట్టి వారిచేతనే పెంపఁబడిన పుత్రుఁడు పెద్దవాఁడయినపిదప వానిపెంచినవారిని బదులునకుఁ బోషింపఁడేని భ్రూణహత్య చేసినపాపము నొందును. వానికంటెఁ బాపాత్ముఁడు లోకమునందు వేఱొకఁడు గలుగఁడు. మిత్రులకు ద్రోహము చేయువాఁడును, నెనరులేనివాఁడును, స్త్రీని జంపినవాఁడును, కొండెగాఁడు ననెడి యీనలువుర పాపములకును బ్రాయశ్చిత్తము లేదని వినుచున్నారము. ఈలోకమందు మనుష్యునకుఁ జేయవలసినదిగా నున్నదంతయు మనువు నుపదేశమందుఁ జూపట్టుచున్నది. ఇది శ్రేయమయినది. ఇంతకంటె నెక్కుడయినది లేదు. సమస్తము లయిన ధర్మముల సారము నొక్కటిగాఁ జేర్చి యిది చెప్పఁబడినది' అనెను. ఇది నూటయెనిమిదవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

**భీష్ముఁడు ధర్మరాజునకు సత్యాసత్యముల స్వరూపములను జెప్పుట.**

ధర్మరాజు 'ధర్మమునందే నెలకొనియుండఁ గోరువాఁ డెట్లు నడచుకొనవలెను? నేను గలరూపు దెలియఁగోరుచున్నానుగాన నాకుఁ జెప్పుము. సత్యము, అసత్య మనెడియీ రెండును లోకముల నావరించియున్నవి. ధర్మమునే తిరముగా నూఁదియున్నవాఁ డీరెంటిలో దేని నాచరింపవలయును? సత్యమనఁగా నేమి? అసత్యమేమి? సనాతనధర్మము నెద్ది? ఎట్టికాలమున సత్యము పలుకవలయును? ఎప్పు డసత్యమును బలుకవలయును'? అని యడిగెను. భీష్ముఁడు 'సత్యమును జెప్పుటయె మంచిది. సత్యమునకంటె నెక్కుడయినది లేదు. భారతా! లోకమునం దేది సాధారణముగా నందఱకును దెలియుట మిక్కిలి కష్టమో దానిని నీకుఁ జెప్పెదను. ఎచ్చట నసత్యము సత్యమువంటిదగునో యచ్చట నసత్యమునైనను బలుకవలయును. * సత్యాసత్యముల స్వరూపము లిట్టివై యుండఁగా వానియందుఁ గల రూపున సత్యమేది యగునని యెవఁడు నిశ్చయింపఁ జాలఁడో యటువంటి మూఁఢుఁడు చిక్కుపడును. సత్యమిది యసత్య మిదియని చక్కఁగా నిశ్చయించినపిదప ధర్మవిదుఁడగుచున్నాఁడు. అప్రాజ్ఞుఁడును, ప్రజ్ఞాహీనుఁడును, అతిక్రూరుఁడు నగు పురుషుఁడు

* 'తాదృశే బధ్యతే బాలో యత్ర సత్యమనిశ్చితమ్ అని' మూలము. కొన్నిట 'తాదృశః' అనియుఁ గొన్నిట 'ఏధ్యతే పాపః' అనియుఁ గొన్నిట 'సత్యమనుష్ఠితమ్' అనియుఁ బాఠాంతరములు.

సయితము గ్రుడ్డిమృగమును వధించుటవలన బలాకుఁడను బోయవానివలె మిక్కిలియు గొప్పపుణ్యమును బొందును. మూఢుఁడయినవాఁడు ధర్మమునందెంత కోరిక గలిగియుండినను ధర్మమిదియని తెలియక యధర్మము నాచరించుట † యేమాశ్చర్యము? గంగాతీరమందలి ‡గుడ్లగూబవలె (హత్యచేసినవాఁడును) మిక్కిలి గొప్పపుణ్యమును బడయుచున్నాఁడు. నీవడిగిన యీప్రశ్నము నట్టిదే(యనఁగా మిక్కిలియు గష్టమయినది.) ఏలనఁ ధర్మమనఁగా నిట్టిదని చెప్పుట యెంతయుఁ గష్టముగా నున్నది. ఈవిషయమునం దూహచేత నిర్ణయము చేయుటయు దుష్కరము. ఇందెట్లు నిశ్చయముచేసి యొకఁడు చెప్పఁగలఁడు? ప్రాణులవృద్ధికొఱకై ధర్మమును (బ్రహ్మ) యుపదేశించెను. కాఁబట్టి యేది యభివృద్ధి గలిగించుచున్నదో యది ధర్మమనుట నిశ్చయము. అహింస, సత్యము, క్రోధములేమి, తపము, దానము, దమము, మతి, అనసూయ, (పరులను నలవఱుచుటయందు) సామర్థ్యములేమి, ఈర్ష్యలేమి, శీలముననెడి యివి ధర్మమని దేవదేవుండగు బ్రహ్మచెప్పెను. ఇదియు సనాతమయిన

---

* కర్ణపర్వము (అధ్యా. 72) మూఢుఁడగు నొకసత్యవాది దొంగకుభయపడి దాఁగియుండిన కొందఱుమనుష్యులను నాదొంగ లెక్కడనని తన్నడుగఁగా సత్యవచనమే చెప్పుదునన్న యభిమానముచేత వారుపోయియున్నమార్గమును జెప్పి దొంగలచే వారినిజంపించెను. ఆకథ యిట యనుసంధింపఁబడినది.

† కర్ణపర్వము 72. అధ్యాయము. ఒకగుడ్లగూబ తనముక్కుతో నొక యాఁడుసర్పము పెట్టిన వేయిగుడ్లను దిని గొప్పపుణ్యమును బొందినకథ యిట యనుసంధింపఁబడినది.

ధర్మమే ! రాజా ! ఈధర్మమందు వర్తించువాఁడు భద్రము లనుగాంచును. వేదవిహితమయిన వధయును నిజమునకు హింసాత్మకముగాని ధర్మమేయగును. * లోకమును ధరించుట (పోషించుట) వలన ధర్మమని చెప్పుదురు. ప్రజలు ధర్మముచేత ధరింపఁబడుచున్నారు. ఏది ధరించుశక్తితోఁగూడినదో యది ధర్మమనుట నిశ్చయము. ప్రాణులకు హింసలేకుండుకొఱకు ధర్మోపదేశము చేయఁబడినది. వేదమందుఁ జెప్పఁబడినదే ధర్మమని మఱికొందఱు చెప్పెదరు. † అవి కాదని తక్కినకొందఱు చెప్పెదరు.అందులకుమేము వారిని నిందింపము. అన్నియు వేదమందు విధింపఁబడలేదు. కొన్నియెడల దొంగలు మఱొకనిసొమ్మునపహరింపఁగోరి యాకందువ నడిగిరేని వారల కాపట్టును జెప్పరాదు. అది ధర్మమనుట నిశ్చయము. చెప్పకుండుటవలనఁ దప్పించుకొనఁగూడునేని యేవిధమునను జెప్పక యే యుండవలయును. చెప్పియే తీఱవలసివచ్చినను జెప్పకుండినచో వారు సందేహింతురేనియు నట్టియెడల సత్యమును జెప్పుటకంటె శపథముచేసియైనను నసత్యమును జెప్పి పాపుల సంబంధము నుండి విడివడుట మిక్కిలి యొప్పిదమందురు. శక్యమైనచోఁ బాపుల కేవిధమునను ధనము నీయరాదు. ఏలనఁగా పాపులకిచ్చిన ధన మట్టిచ్చిన వానికిని బీడ కలి

---

* 'ధారణాద్ధర్మ మిత్యాహుః ధర్మేణవిధృతాః ప్రజాః' అని ధర్మశబ్ద నిర్వచనము.

† 'నేత్యాహురపరేజనాః' అని జె. మూలము. 'నానాన్యాహుఃపరేజనాః' అని దా. మూలము. తక్కినజనులు వేఱు ప్రమాణములనుగూడఁ జెప్పుచున్నారని యర్థము.

గించును. * రొక్కమిచ్చినవాఁ డప్పులకాఁపును శరీరకష్టము పడి తనకుఁబనిచేయించికొని యాయప్పను దీర్చుకొనఁదలఁచిన వాఁడై యొడంబడిక నిజమును రూఢిపఱుచుటకు సాక్షులను బిలిచి యడుగునేని, వారు చెప్పవలసినది చెప్పకపోయిరేని యనృతము చెప్పినవారగుదురు. ప్రాణమున కపాయము గలుగునపుడును, వివాహమందు ననృతమును జెప్పవచ్చును. పరుల ధనమును రక్షించుకొఱకును ధర్మకార్యములు చేయుకొఱకును ననృతమాడవచ్చును. ధర్మమును గోరువాఁడు, పరుల కార్యము సిద్ధించుకొఱకుఁ దక్కువయగు వేషమును దాల్పవచ్చును. † ఒకఁడిచ్చెదనని ప్రతిజ్ఞ చేసినపిదప నిచ్చియే తీఱవలయును. అట్లియ్యక తన పని చూచుకొనువాని నిచ్చునట్లు బలాత్కరింపవచ్చును. ఒకఁడు తాను ధర్మముచొప్పునఁ జేసిన యొడంబడికవలనఁ దప్పి యధర్మమున వర్తించునేని, యట్టిమార్గము నూఁదినవానిని దండముచేత నే కొట్టవలయును. వంచనయే బ్రతుకుగాఁగల యొకఁడు,

---

* ఇచట నర్థము క్లిష్టముగానున్నది. ఇరువురునుజేరి లాభమును బొందునట్లొడంబడిక చేసికొనిరి. అందొకరివలన రొక్కముపుచ్చుకొని మఱొకఁడు పనిచేయుచుండఁగా దొంగలు వానియొద్ద ధనము నపహరించుకొని పోయిరేని రొక్క మిచ్చినవాఁడు పుచ్చుకొన్నవానిని బాధించియైనను ఆధనమును దీసికొనఁగోరునేని యందులకై పిలిపించిన సాక్షులు పుచ్చుకొన్న వానియొద్ద ధనమున్నదని చెప్పుట యనృతముగాఁ బర్యవసించునని భావము.

† ప్రతిశ్రుత్య ప్రదాతవ్యః స్వకార్యస్తు బలాత్కృతః అని. ఔ. మూలము. 'ప్రతిశ్రుత్య నదాతవ్యం శ్వః కార్యస్తు బలాత్కృతః' అని. దా. మూలము. ధనము నార్జించువాఁడు దొంగలచేత బలవంతముగా ధనము గోలుపోయెనేని ధనమిచ్చినవానికిఁ బ్రతిజ్ఞ నేసిన ధనము నీయనక్కఱలేదు అని యర్థము.

ధర్మములన్నిటిని వీడి స్వధర్మములును దిగనాడి తనకడుపుఁ బ్రోచుట కెప్పుడును నసురుల కపటోపాయములనే యూఁదుచునుండును. అట్లు కపటముచే బ్రతుకుచుండు నాపాపాత్ముని సర్వవిధములను జంపవలయును. అట్టి పాపులందఱును లోకమున ధనమునకంటె మించిన దొక్కటియు లేదని తలఁతురు. కపటమార్గములచే నరకమును బడయునట్టి పాపాత్ములతోడ వివాహసంబంధములు కూడదు. పొత్తునఁ గుడుచుటయుఁ దగదు. వారు దేవతలను మనుష్యులను వీడి తొలఁగినవారును, యాగము లేనివారును, దపములేనివారును. బ్రేతముల వంటివారగు నగుదురు. వారితోడఁ జేరరాదు. ధనమునకు నాశముగలిగినచో వారు ప్రాణములు విడుచునట్టి మహాదుఃఖమును జేసికొందురు. పాపులయందు 'ఈధర్మమును నీవు ప్రియముగాఁ జేయు' మని నీవు చెప్పుటకుఁ దగినవాఁడొక్కఁడును గలుగఁడు. పాపికి లోకమునందు ధనమునకు మించిన దొక్కటియు లేదనియే నిశ్చయము; అట్టివాని నెవఁడు చంపునో వానికిఁ బాపముగలుగదు. ఒకఁడు వానిని జంపునేని తనకర్మములచేత మునుపె చచ్చినవానిని జంపినవాఁడగును. వాఁడు చంపఁబడినయెడలఁ జచ్చినవానిని జంపుటయేయగును. దుష్టబుద్ధులను జంపునట్లు ప్రతినపట్టినవాఁ డా ప్రతినను దప్పరాదు. అట్టిపాపులు కాకులవలెను గుక్కలవలెను వంచనచేతనే కడుపు పోషించికొనుచుందురు. వారు దేహమును వీడినపిదపఁ గాకి కుక్కలజన్మములే యెత్తుదురు. ఎవఁ డెవనియెడల నెట్లు వర్తించునో వాఁడు వానియెడల నట్లె వర్తింపవలయును. అదియే ధర్మము. కపటముగా నడచువానిని గపటముచేతనే బాధింపవలయును. మంచి నడకగలవానిని మంచిని

గొనియెం రాఁబట్టుకొనవలయును' అనెను. ఇది నూటతొమ్మిదవ యధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

### (భీష్ముఁడు ధర్మరాజునకు దుర్గతిని దాఁటు నుపాయము నుపాయ ముసు జెప్పుట.)

ధర్మరాజు 'పితామహా! ప్రాణు లాయావిషయములచేత వేఱువేఱ యెడతెగక కాఱియపడుచున్నవి. ఏయుపాయముచేత నట్టికడింది దుఃఖములను గడవవచ్చునో చెప్పుము' అని యడిగెను. భీష్ముఁడు 'ద్విజాతులెవరు తమయాత్మలనడంచి విధ్యుక్తములయిన యాశ్రమములందు శాస్త్రములఁ జెప్పఁబడినరీతిని వర్తింతురో వారు కడిఁది కష్టములను గడతురు. ఎవరు ధర్మమును దంభమునకై చేయరో, ఎవరు కట్టుపాటుల కిడఁగి జీవనముచేయుదురో, ఎవరు విషయముల నిగ్రహింతురో, వారును గడపరాని కష్టములను గడతురు. ఎవరు నిందింపఁబడినను మాఱు పలుకరో, హింసింపఁబడినను హింసింపరో, యిత్తురుగాని పుచ్చుకొనరో, వారుకడింది యిడుమలను గడతురు. అతిథుల కెప్పుడును వసతి గలిగించువారును, ఎప్పుడు నసూయ లేకుండువారును, ఎప్పుడును వేదాధ్యయన శీలురును నగువారు కడిఁది కష్టములను గడతురు. ఎవరు ధర్మములందుఁ బ్రవీణులై, తలిదండ్రులయెడ నడచుకొనవలసిన విధమున నడచుకొనుచును, బగటియందు నిదురపోవకయు నుందురో వారును గడిందికష్టములను గడతురు. ఎవరు మనస్సుచేతను, వాక్కుచేతను, గ్రియచేతను, బాపమును జేయకయుఁ బ్రాణులను దండింపకయు నుందురో వారునుగడింది

కష్టములను గడచనుదురు. ఏరాజులు రజోగుణముగలిగి లోభ
మువలన బరువయిన పన్నులు దీయకయు, తమదేశములను
జక్కఁగా రక్షించుచును నుందురో వారును గడింది కష్టము
లను గడతురు. ఎవరు న్యాయంబుగ లభించిన తమభార్యలను
ఋతుకాలములఁ జెల్లను బొందుచుఁ దక్కినకాంతల పొత్తుసే
యక యగ్నిహోత్రములం దాసక్తిగలిగియుందురో యట్టి సాధు
వులు కడింది కష్టములను గడతురు. ఏశూరులు మరణమువలని
భయమును దిగవిడిచి యుద్ధములందు ధర్మముచొప్పున జయ
మును గోరుదురోవారు కడింది కష్టములను గడతురు. ఈలోక
మం దెవరు ప్రాణములు విడువవలసి వచ్చినను సత్యమే చెప్పుచుఁ
బ్రాణులకు విశ్వాసపాత్రులై యుందురోవారు కడింది కష్టము
లను దాఁటుదురు. ఎవరి క్రియలు నిందింపఁదగనివిగాను, మాట
లు సాధువుల కుపయోగపడునవిగను నున్నవో వారు కడింది
కష్టములను గడతురు. ఏ బ్రాహ్మణులు, అధ్యయనము చేయరాని
దినములందు నధ్యయనము చేయకయు తపమునందు నిష్ఠగలిగి
మిక్కిలి తపస్సంపన్నులయ్యు, నుందురో వారు కడిందికష్టము
లను గడతురు ఎవరు కౌమారమందు బ్రహ్మచారులై యుండి
తపముసలిపి, విద్యలందును వేదములందును వ్రతములాచరించి
నెఱవేర్చిన వారగుదురో (స్నాతకులగుదురో) వారు కఠిన
ములయిన యిడుమలనుం గడతురు. ఎవరు రజోగుణమునడఁచి
తమోగుణమును నిగ్రహించి సత్త్వగుణమందు నెలకొని
యుందురో యట్టిమహాభాగులును గడింది కష్టములను గడతురు.
ఎవరివలన నొకరికిని భయముగలుగదో, ఎవరికి, నొకరివలనను
భయము గలుగదో, ఎవరు లోకులనందఱను దమవలెఁ

జూతురో వారును గడిందికష్టములను గడతురు. పురుషవ ర్యులగు నేసాధువులు పరులసంపదను జూచి పరితాపపడకయు నీచ మయినయాచారములనుండి తొలఁగియు నుందురో వారును గడిందికష్టములను సైతము గడతురు. ఎవ రెల్ల దేవతలకు నమస్కరించువారును, ఎల్లధర్మములను వినువారును, శ్రద్ధ గలవారును, అడఁకువ గలవారునుగా నుందురో, వారుకడిఁది కష్టములను గడతురు. ఎవరు తమకు గౌరవమును గోరక యిత రులను గారవించుచు గౌరవింపఁబడుచున్నవానిఁ బూజించుచు నుందురో వారు కడిఁది కష్టములనేని గడతురు. ఎవరు బిడ్డలను బడయఁగోరి మిక్కిలి పరిశుద్ధములగు మనంబుల నొక్కొకతిథి యందును జేయఁదగు శ్రాద్ధాదులను జేయుదురో వారు కడిఁదికష్టములనుగడతురు. ఎవరు తమకోపమును మిక్కిలియు నడంచి కోపవంతులను మిక్కిలి శాంతులుగాఁ జేయుచును, * భృత్యులయందును గోపము లేకయు నుందురో వారుకడిఁది కష్టము లనయినను గడతురు. ఏ మనుష్యులు పుట్టినది మొదలుగా మధువును మాంసమును బడఁతులను, గల్లును నెప్పుడును వర్జించి యుందురో వారు కఠినములయిన యిడుమలనుగూడఁ గడతురు. ఎవరు బ్రతికియుండుటకై భోజనమును, సంతతిగలుగు కొఱకు స్త్రీసంగమమును,సత్యము చెప్పుకొఱకు మాటాడుటయుఁ, గలిగి యుందురో వారు కడిఁది కష్టములనేనియుఁ గడతురు.ఎవరు సర్వ భూతములకు నీశ్వరుండును జగమునకు నుత్పత్తి స్థితులుగలుగు పట్టును నగుదేవుని నారాయణుని భజింతురో వారు కడిఁది

* ఏ ప్రాణులయందును గోపము లేకయుందురో యని పాఠాంతరము (ప్రతాప చంద్రరాయులు.)

కష్టముల నేనియుఁ గడతురు. రాజా ! ఇదిగో నున్నయితఁడు తామర రేకులవంటి కన్నుఁగవగలిగి పచ్చనివలువ గట్టినమహాభుజుండును, నీకు సుహృదుండును, భ్రాతయు, మిత్రుండును సంబంధియు నగు శ్రీకృష్ణుఁడచ్యుతుం డగునారాయణుండు చుమీ ! ఇతఁడు సకలము లయినలోకములను దనయిచ్ఛ గలిగెనా తోలువలెఁ జుట్టివై చుటకు సమర్థుఁడు. ఇతని యాత్మస్వరూప మచింత్యము. ఇతఁడు గోవిందుఁడు, పురుషోత్తముఁడు. అర్జునునకును నీకును బ్రియంబును హితంబు నగువానిని జేయుటయం దాసక్తుఁడై యున్నయీపురుషతిలకుఁడు, ఈయదుశ్రేష్ఠుఁ డానైకుంఠుఁడే చుమీ. ఈహరిని నారాయణుని భక్తితో నెవరాశ్రయింతురో వా రిందుఁ గలుగుకడింది కష్టముల నేనియుఁ దరింతురు. ఈవిషయమై విచారింప నక్కఱలేదు. *(ఎవరు తామర రేకులంబోని కన్నుఁగవ గలయీ కృష్ణునియందు సమస్తభావములతోఁ దమకర్మఫలముల నర్పింతురో వారు కడిఁది కిష్టములనేని తరింతురు. ఎవరు లోకములను రక్షింపఁగోరి యదితియందుఁ గశ్యపునకు బుత్రుండై యుదయించిన దేవు నింద్రుని నమస్కరింతురో వారు కడిఁది కష్టములనుఁదరింతురు. ఎవరు లోకములను సృజించినవాఁడును, సజ్జనులకుఁ బతియును, యాగముల చేతఁ బూజింపఁదగినవాఁడును నగు బ్రహ్మదేవునిఁ బూజింతురో వారు కడిఁది కష్టములనుండియుఁ దరింతురు. ఇంద్రుఁడును విష్ణుఁడును శంభుఁడును లోకపితామహుం డగు బ్రహ్మయుఁ బలువిధము లయిన స్తోత్రములచేత స్తుతించుచుండు దేవదేవుఁ డగు మహే

---

* ఈకుండలీ కరణములోని పాఠ మొకానొక ప్రతియందుఁ దప్పఁ బెక్కింటఁగానరాదు గాన, యిది ప్రక్షిప్తముగా నోపునని తెలియునది.

శ్వరుని నెప్పుడును నెవరుపూజింతురో వారు కడిఁది కష్టములను గూడఁ గడతురు.) కడిఁది కష్టములను దాఁటుటకైన యీశ్లోకములను జదువువారును నితరులకు వినిపించువారును, బ్రాహ్మణులతో ముచ్చటించువారును, గడిఁది కష్టములను సైతము తరింతురు. అనఘా! మనుష్యుఁ డీలోకమునను బరలోకమునను గడిఁది యిడుమలను దరించుటకై చేయవలసిన కార్యములను గొన్నింటిని నీకిదె యుపదేశించితిని' అనెను. ఇది నూటపదియవ యధ్యాయము.



## రాజధర్మపర్వము.

ధర్మరాజు 'తండ్రీ! వేండ్రమయినవారు పైకిఁ జల్లని వారుగను, జల్లనివారు పైకి వేండ్రముగలవారుగను జూపట్టెదరు. ఇట్టివారిని మనమెట్లు తెలిసికొనవచ్చును?' అని యడిగెను.

భీష్ముఁడు 'యుధిష్ఠిరా! ఈ విషయమై యొకపులికిని నక్కకును జరిగినసంవాదమై పురాతనమగు నీ యితిహాసము నుదాహరించెదరు. దానిని వినుము. తొల్లి పురికయను శ్రీమంతమగు నొక పురమందు పౌరికుఁ డను నొక రాజుండెను. ఆపురుషాధముఁడు మిక్కిలి క్రూరుఁడై పరులను హింసించుటయందే యాసక్తి గలిగియుండెను. వాని కాయువు ముగియఁగా, గోరఁదగని గతిని బొందెను. వాఁడు పూర్వకర్మములచేత దూషితుఁడై నక్కగాఁ బుట్టెను. ఆనక్క తన మునుపటిజన్మము తలఁచి మిక్కిలియు నిర్వేదమునొంది, పరులొసంగిన మాంసములను

నయితము దినకుండెను. అది, యేప్రాణికిని హింసగావింపక, సత్యముపలుకుచు, వ్రతమును మిక్కిలి దృఢముగా నూఁది, యుక్తకాలమందు పండిరాలిన పండ్లను నాహారము గావించు కొనుచునుండెను. (అది యొకసమయమందు నాకులే యా హారముగాఁ గొనుచు, నొకసమయమందు నీరేయాహారము గాఁ గలిగియు, నిట్లు వ్రతము నియమమునఁ జలుపుచు నొకరి కిని లోనుగాక తనంతట నుండెను). ఆనక్క యు శ్మశానమందు వసించుట మిక్కిలి సమ్మతముగా నుండెను. అది దానికి జన్మ భూమియగుటచేత మఱియొకచోటు నది యొల్లకుండెను. దాని జాతియందుఁగల తక్కిన నక్కలన్నియును దాని శౌచమును సైఁపక మిక్కిలి వినయముతోడి మాటలచేత దాని బుద్ధిని వేఱుపఱుపఁ దొడంగి దానితో 'నీవు భయంకరమైన యీవల్లె కాటియందు వసించియుండియుఁ బరిశుద్ధిని బడయఁ గోరెదవు. నీ యీబుద్ధి విపరీతముగా నున్నది!. ఏలన నీవు స్వభావముచే మాంసము తినుదానవేకదా ? కాఁబట్టి మాతోఁ బాటిగ నుం డుము. నీకుఁ దినవలసినదానిని మేమిచ్చెదము. శుద్ధియనుదానిని దొలఁగఁబుచ్చి యెవి నీకునాహారముకాఁదగునో వానినిదినుము' అని చెప్పినవి. ఆమాటలునువిని యానక్క మధురములై విన యసంపన్నములై సహేతుకములై మృదువు లగు వాక్యముల వానితో 'పుట్టుక నాకుఁ బ్రమాణముకాదు. కులము, శీలమును బట్టియే కలుగును. ఏకర్మముచేతఁ గీర్తివిస్తరిల్లునో యదియే నేను వేఁడుచున్నాను. వల్లెకాటియందు నేను వాసముచేసినను నాసమాధిని (బుద్ధిస్థితిని) జూడవలయును. (వసించుచోటు ధర్మ మునకుఁ గారణముగాదు.) ఒకనియాత్మయే వానికర్మములకుఁ

గారణము గాని వాఁడు వసించుచోటుగాదు. ఆచోటు వానిధర్మమునకును గారణముగాదు. లేక (వాఁడాచరించుచున్న యాశ్రమముగాదు; *ఒకని యాశ్రమమును వానిధర్మమునకుఁ గారణముగాదు) ఆశ్రమమం దొకఁడు బ్రాహ్మణునిఁ జంపుచున్నాఁడు. ఆశ్రమము లేనియెడ నొకఁడు దానముచేయుచున్నాఁడు. ఆచంపుట పాతకము గాకుండునా ? ఆదానము వృథయగునా ? మీకుఁ బ్రియమైనదానియందుఁ బేరాసగలిగి పొట్టఁ బోషించికొను విషయమొక్కటియందె యాసక్తులై యున్నారు. తెలివిచెడినవారు కడపల వచ్చుదోషములను జూడరు. మీరు జరపుచున్న బ్రతుకు సంతోషముగఁ గావింపఁబడునదిగాదు. అది ధర్మహానివలన నెంతయు దూషితమైనది గాన నింద్యముగానున్నది; ఇహమందును బరమందును గీడుగావించునది. కాఁబట్టి, యట్టివృత్తి నే నెంతమాత్రమొల్లను' అనెను. అంతఁ బరాక్రమమందు వన్నెగన్న యొకపులి యానక్కఁ శుచియుఁ బండితుఁడు నగునని తలఁచి తనకుం దగినపూజ దానికిఁ గావించి తానే దానిని మంత్రిగా వరించుకొనఁదలఁచి దానితో 'సౌమ్యా ! నీ స్వరూపము నాకుఁ దెలిసినది. నాతోడఁగూడి రాచటికపుఁ గార్యములను జూచుకొనుము. నీ కిష్టమయినభోగములను బరిపూర్ణముగాఁ గయికొనుము. అక్కఱలేనివానిని వదలుము. మాజాతివారు వేండ్రమునవా రని ప్రసిద్ధిగాంచినవారు. ఇది నీకుఁ దెలుపుచున్నారము. నీవు మెత్తఁబాటు మున్నిడికొని యేలవలయును.

---

* 'నాశ్రమో ధర్మలక్షణమ్' అని మూలము. 'ఒకని యాశ్రమము వానిధర్మమునకుఁ గారణముగాదు' అని ప్రతాపచంద్రరాయలు.

అప్పటికి శ్రేయమును బొందుదువు' అనెను. అంత నక్క మృగపతియైన యాపులి చెప్పిన మాటలనెంతయు గారవించి తలయించుకవాంచి వినయంబుతోడి పలుకుల 'మృగరాజా ! నాపట్ల మీరు చెప్పిన యీమాట మీకెంతయుఁదగియున్నది. మఱియు నీకు మంత్రులుగానుండుటకు ధర్మార్థములందు నిపుణులును, బరిశుద్ధులు నగువారిని వెదకుటయు నీకుఁ దగియున్నది. తగిన మంత్రిలేక గాని, నీప్రాణమునకే విరోధియగు దుష్టమంత్రి కలిగి కాని, నీమహత్త్వమును బాలించుకొనుట శక్యముగాదు. మహాభాగా ! నీవు నీమంత్రులయందు, నీయెడ ననురక్తులును, నీతివిదులును, ఒకరినొకరు రూపనివారును, ఆలోచనముగలవారును, జయమును గోరువారును, పేరాసలేనివారును, మోసములేనివారును, ప్రాజ్ఞులును, నీమేలునందె కన్నుగలవారును, మంచి మనస్సు దిటగలవారును నగువారిని,నీతోఁబుట్టువులను నీతండ్రులనుంబోలెఁ బూజింపుము. మృగాధిపా ! అయినను నాయిప్పటి స్థితితోనే సంతుష్టుఁడనై యుండుటకంటె మఱియొకటి నా కిష్టము గాకున్నది. సుఖములందును, భోగములందును, నీయుద్దఁగల యైశ్వర్యములందును నాకుఁ గోరిక లేదు. నాస్వభావము నీప్రాఁతపనివాండ్రతోడఁ బొసఁగియుండదు. వారు నాయెడల దుశ్శీలురై యుందురేని నీకును నాకును భేదము పుట్టింతురు.*నీవు మిక్కిలి తేజంబు గలుకున్నట్టి వారల కితరులకును నాశ్రయింపఁ

---

*'సంశ్రయః శ్లాఘనీయ స్త్వమన్యేషా మపిభాస్వతామ్'అని దా.మూలము. 'న సంశ్రయః శ్లాఘనీయ స్త్వన్యేషా మపి భాస్వతామ్' అని జౌ. మూలము. 'ఎంత తేజంబు వెలుఁగుచున్నవారికైనను నొకరినాశ్రయించుట యొప్పిదముగా' దని యర్థము.

దగినవాఁడవు. మఱి యెంతయు శ్లాఘనీయుఁడవు. ఇఁక నాఁ బోఁటికి నిన్నాశ్రయింపఁదగియుండుట చెప్పనేల?*మఱియు నీవు కృతాత్ముండవు, మహాభాగుండవు, పాపులయెడను గూ్రరత చూపనివాఁడవు, దీర్ఘదర్శివి, మిక్కిలి యుత్సాహము గలవాఁడవు, దాతవు, మహాబలుండవు. నీవుచేసిన పను లేవియు వ్యర్థములుగావు. భాగ్యములచేత నలంకృతుఁడవు. అయినను నాకుఁ గల యంతపట్టునకు సంతుష్టి నొందియున్నవాఁడను. కష్టమగు సేవకవృత్తిని జేసినవాఁడనుగాను. కాఁబట్టి సేవసేయుటకును నేరను. విచ్చలవిడిని వనమునఁ దిరుగుచుండువాఁడను. నాకివి యెట్లు తెలియును. రాజు నాశ్రయించి మనుచుండువారికి నిందలవలని దోషము లన్నియుఁ గలుగును.వనమునందున్నసో, యేపాత్తునుగలుగదు; ఏభయమును లేదు; ఏవిఘ్నమును జూపట్టదు. రాజు పిలువఁగా మనసునందేమి భయమువుట్టునో యది యడవియందలి ఫలమూలములను దిని తనివినొందియున్నవారికిఁ గలుగదు. కస్తిలేక కలుగునట్టి వట్టి నీరు భయముతోఁగూడిన మేలి యన్నముకంటె నెంతెయు లెస్స. ఈరెంటి నాలోచించి చూడఁగా నెచట నెమ్మదిగలదో యచటనే సుఖమని నాకుఁ దోఁచుచున్నది. రాజుభృత్యులయందొక కొందఱే, చేసిన యపరాధములకుఁ దగిన దండమునొందుదురు.వారియందుఁ బెక్కండ్రు లేనిపోని యపరాధములచేత దూషితులై రాజువలన మృతినొందుదురు. నేరముచేయక దండమునొందువారెందఱో నేరముచేసి

* ఇవన్నియు నక్కకు విశేషణములుగా నుత్తరదేశపాఠములందుఁ జూపట్టుచున్నవి. అయిన నివి పులికి విశేషణములుగానుండుటయె మఱింత యుపపన్నముగాన దాక్షిణాత్యపాఠమె కయికొనఁబడినది.

దండమునొందువా రంద ఱుండరు. మృగేంద్రా! ఇవియన్నియు నట్లుండ నన్ను మంత్రినిగాఁ జేయఁదలఁతువేని నీవు నాయందు నడచుకొనవలసినరీతినిగుఱించి న్యాయముచొప్పున నొకసమయము చేయఁగోరెదను. నన్నుఁ జేరినవారిని నీవు గౌరవింపవలయును. నేను జెప్పుహితమును వినవలయును. నాకై నీ వేర్పఱచున్వృత్తిని నీవుమార్పక మిక్కిలి తిరముగానే యుంపవలయును. నే నొకప్పుడును నీదు తక్కినమంత్రులతోడ మంత్రాలోచనము చేయను. అట్లు చేసితినేని వా రతిశయము గోరుదురు గాన, లేనిపోనితప్పులు నాయెడఁ జెప్పుదురు. నీ వొక్కనితోడనే నే నొక్కండును గలసి హితమును మంతనమునఁ జెప్పుదును. నీజ్ఞాతులను సంబంధించినకార్యములందు నన్ను 'హితమేది యహిత మేది' యని యడుగరాదు. నాతో నాలోచించిన పిదప నీవు నీమంత్రులను హింసింపరాదు. నీవు కోపము నొంది సంబంధించినవారిని దండింపరాదు' అనెను. అందులకుఁ మృగనాథుఁ డా పులి వల్లె యని సమ్మతించి దాని నెంతయుఁ బూజించెను. నక్కయుఁ బులికి మంత్రిగానుండుట నంగీకరించెను. అట్లు పులి యానక్కను సత్కరించి యాయా కార్యములందు నియమించుచుండుటనుజూచి మునుపటి భృత్యులందఱు నొక్కటిగాఁ గూడి యెడతెగక దానిని ద్వేషింపనారంభించినవి. ఆదుష్టబుద్ధులు మొదట మిత్రభావముతోడ మంచి మాటలఁ గయివసముచేసికొని రాజ్యమునం దున్నదోషములందుఁ జొప్పించి దాని నామోదించునట్లు చేయఁజూచెను. ఏలనఁగా వారు పరద్రవ్యములను నపహరించుచు జాలఁగాలము సుఖముగా వసించుచుండిరి. ఇప్పుడు నక్క కట్టుదిట్టములకులోనై

యుండుటచేత నితరులధనముల నించుకయైన నపహరించుట వారికి శక్యము గాకపోయెను. అవి తమయభివృద్ధిని గోరుచు దానిని నధికారమునుండి లేవనెత్తుటకుఁ దివురుచు దాని నింపయిన ముచ్చటలచేత నాసగొలుపఁజూచినవి. మఱియు గొప్పలంచము లిచ్చి దానిబుద్ధిని వశీకరింపఁ బ్రయత్నించినవి. అయినను నానక్క మిక్కిలియుఁ బ్రజ్ఞగలదిగావున నవిచేయువానికిఁ దన మనస్సు దిట తప్పినదిగాదు. పిదపఁ దక్కినవి దానికి నాశము గలిగింపవలయు నని సంకేతించుకొని మృగరాజునకు మిక్కిలి యిాప్సితమై యతనికిఁగాను జక్కఁగాఁ బక్వము సేయఁబడినట్టి మాంసము నెత్తికొనిపోయి యానక్కయింట రహస్యముగాఁ బెట్టినవి. అమాంసము నెవరు దొంగిలి తెచ్చిరో, యది యెవరెందులకుఁగా నట్లుచేసిరో యానక్కకుఁ దెలియును; అది యన్నియు దెలిసియుండియును (దీనిమూలమున నీబంధము మనకుఁ దెగిపోవుగాక యని యీ) యొకకారణమునుబట్టి సహించియుండెను. మంత్రిపదవిని బొందుకాలమునం దానక్క 'ఓరాజా! నీవు నాయందుఁ జెలిమిగోరుదువేని నన్నుఁ దగినకారణము లేక నమ్మకపోవరాదు. (నాకుఁ జెడుగుసేయరాదు)' అని ప్రతిజ్ఞ చేసికొన్నది. ఆయాలోచన మున్న తెలుఁగును దెలియఁగోరియు నావిషయమందపేక్ష గలిగియుండెను. పిదప మృగరాజాఁకలిగొని లేచి రాఁగా నతనికి భోజనము తేవలసిన సమయమందు నామాంసము కనఁబడదయ్యె. మృగరాజు దొంగను వెదకిపట్టవలయునని యానతిచ్చెను. కపటములగు నానక్కలును 'ఆమాంసము విద్వాంసుఁడును మహాప్రాజ్ఞుండు నని తన్ను నెన్నుకొనుచుండుమీా మంత్రి యపహరించినాఁడు' అని తెలిపెను. తోడనే నక్కచాప

లమును విని పులి కోపముగొని చూపోపనిదయ్యె. రాజగు పులి యానక్కను జంపవలయుననియుఁ దలంపుగొనెను. ఆ తెఱపిని జూచి దాని పూర్వమంత్రులు దానితో 'ఆనక్క మాయందఱ జీవనములను జెఱుపఁజూచుచున్నది' యనెను. ఇట్లు చెప్పి మరల నవి యామంత్రినక్కరాజు మాంసమును దొంగలించిన కార్యమును విస్తరించి తెలుపఁబూని యా పులితో 'అదిచేసిన యీ పనియే యిట్లున్నది. ఇఁక మఱెద్ది యదిచేయదు ? అది దేవర యెట్టిదిగా ముందు వింటిరో యట్టిది గానేకాదు. మాటలయందే ధర్మముట్టిపడుచున్నది ; స్వభావమందో బెట్టిదముగా నున్నది. అది నిజమునకుఁ బాపి; పైకి ధర్మవేషము వేసికొనియున్నది. దాని యాచారమంతయు వట్టిబూటకము. తనకార్యముకొఱకు భోజనము మొదలగువానియందు నియమములు పెట్టికొని వ్రతములనుబూని శ్రమపడిన దంతేకాని. ఇది దేవరకు నమ్మికగాదేని దీనిని గన్నులయెదుటఁ జూపెదము' అనెను. ఇట్లు చెప్పి యవి తోడనే వేగముగా నానక్కయింటనుండి యామాంసమును దెచ్చినవి. అట్లు మాంసమును గొంపోవుటయు నవిచెప్పినతక్కిన మాటలును విని పులి నక్కను జంపున ట్లాజ్ఞ చేసెను. అంత నక్కకుఁ గలిగినవ్యసనమును జూచి పులితల్లి హితవచనములచేత బోధించుటకై యామృగరాజుకడకువచ్చి 'పుత్రా ! ఈపన్నుగడ యంతయుఁ గపటంపుఁగుట్రతోఁ గూడినది. దీనిని నీవు గయికొనరాదు. అశుద్ధులగువా రసూయవలని దోషములకులోనై శుద్ధుఁడగు వానియందుఁ దప్పులుపెట్టుదురు. ఒకరియున్నతిని మఱియొవ్వఁడునుజూచి సైఁపఁడు. గొప్పయధికారకృత్యము వైరమును గలిగించునది. తపస్సుమొదలయిన వానియందుఁ బరిశుద్ధునియందు



572. పులి నక్కను జంప ప్రయత్నించుట ; పులితల్లి నివారించుట.

దోషములు వైతురుగదా. వనమందుండి తనకర్మములను గావించుకొనుచుండు మునికినిగూడఁ మిత్రుఁడు, మధ్యస్థుఁడు, శత్రుఁడని మూఁడుపక్షములు నుప్పతిల్లుచున్నవి. లోభులకుఁ బరిశుద్ధులయందును, బిఱికివారలకు బలశాలులయందును, మూర్ఖులకుఁ బండితులయందును, దరిద్రులకు ధనాఢ్యులయందును, అధర్మాత్ములకు ధార్మికులయందును, విరూపులకు చక్కనివారియందును, ద్వేషముగలుగుట సహజము. పండితులందుఁ బెక్కండ్రును, మూర్ఖులును, లుబ్ధులును, కపటమున బ్రతుకువారును, నొకదోషరహితునియందు వాఁడు బృహస్పతివంటి బుద్ధిగలవాఁడయ్యును దోషములు చెప్పుదురు. నీవు లేనపుడు నీయింటనుండి యామాంస మపహరింపఁబడిన దేకానిమ్ము. అయిన నానక్క యొకరిచ్చినదానినిగూడ నొల్లదు. మొదట దీనిని జక్కఁగా నాలోచింపుము. పొల్లయినవి నిజముగాఁ జూపట్టుచున్నవి. నిజములయినవి పైకిఁ బొల్లుగాఁ గనుపట్టుచున్నవి. లోకమునఁ బ్రాణులందు నానావిధములు చూపట్టుచున్నవి. కాఁబట్టి వానియందెది యెట్టిదో పరీక్షింపవలయును. ఆకాశము నల్లనిపాత్రయడుగువలెను మిడుంగురుబురువగ్గిమిడుఁగుఱువలెనుగానఁబడుచున్నవి. నిజమునకు నాకాశమునకడుగులేదు. మిడుగురుబురువునం దగ్గియులేదు. కాఁబట్టి కన్నారఁ గనఁబడునట్టివస్తువును గూడఁబరీక్షింపవలసినదియుక్తముగానున్నది. ఒకఁడేవస్తువునైనఁ బరీక్షించి తెలిసికొనునేని, పిదప దానివిషయమునఁ బరితాపపడకుండును. పుత్రా! ప్రభువగువానికిఁ దనభృత్యునిఁ జంపించుటయొకకష్టముగాదు. కాని లోకమునఁ బ్రభువు లగువారికి మన్నించుటయే యెంతయుఁ గొనియాడఁదగినది. అదియెంతయుఁ గీర్తి

కరము. పుత్రా ! నీ వీనక్కను మంత్రిగాఁ జేసితివి ఇది సామంతుల కెల్లను దెలిసినదే. పాత్రము దొరకుట యరిది. ఇది నీకుఁ జెలి కాఁదు; కాఁబట్టి దీని నుంచుకొనుము. పరిశుద్ధుఁడగు నొకనిని, రాజు, వానిపగవారు మోపిన లేని దోషములను బట్టి, దోషియ నియే వేఱుగఁదలఁచునేని, యారాజు తనమంత్రులును జెడి తాను నువేగనశించుచున్నాఁడు.' అనెను ఆపులి యిట్లు చెప్పి ముగించిన పిదప నానక్క క్రిందియధికారియొకటి మిక్కిలి ధర్మాత్మకమైనది, దానిశత్రువుల నడుమనుండి ముందఱికివచ్చి యాక పటపుఁబన్ను గడ పన్నిన విధమంతయు వెలిపుచ్చెను. అంత నామృగనాథుఁ డా నక్క మంచినడవడిగలదిగాఁ దెలిసి దానిని సత్కరించి విడిచి పుచ్చెను; మఱి చెలిమి గడలుకొనం బలుమాఱు బిగియఁ గౌఁ గిలించుకొనెను. నీతిశాస్త్ర విదం బయినయానక్క యాయవ మానమునకు మిక్కిలి పరితపించి యామృగపతిని బ్రాయోప వేశమునకు ననుజ్ఞయిచ్చునట్లు వేఁడెను. ఆపులి గన్నులు విచ్చి చెలిమివలనఁ దేఱకొనఁజూచి మిక్కిలి ధర్మాత్మకంబయిన యానక్కను నెంతయుఁ బూజించి యట్లు చేయవలదని వారిం చెను. ఆనక్కయు నట్లు తన యేలిక నెయ్యమునఁ దొట్రుపడు చుండుటనుజూచి ప్రణతుఁడై పలుకు కన్నీటిచే డగ్గుత్తికవడ దా నితో 'మొదట నీవు నన్నుఁబూజించితివి; పిదప నవమానించితివి; నీనడత నన్ను నీకు శత్రువై యుండు స్థితికిఁ దెచ్చినది. ఇఁక నీయొద్దనుండుట నాకుఁదగదు. సంతుష్టి లేనివారును, తమ యధి కారపదమునుండి తోయఁబడినవారును, గౌరవము క్రిందు పఱుపఁబడినవారును, తమ్ముఁదామే చెఱుపుకొన్నవారును, తమ (యేలికకోపమువలన) శత్రువులచేత వంచితు లయినవారును,

మిక్కిలి క్షీణించినవారును, పేరాసగలవారును, క్రుద్ధులును, భీతులును, పైయధికారులచే వంచితులును, రాజుచేత సొమ్మపహరింపఁబడినవారును, గరువమగు గొప్పకృత్యములు చేయుటకుఁ దమకము గలిగియుండియు విత్తమార్జించు నుపాయములు లేకుండునట్టివారును, తమకుఁగలిగించిన బాధకు దుఃఖముచనో కోపముననో పొక్కుచుండువారును, తమయేలికకు వ్యసనసమూహములు వచ్చుటకై యెదురు చూచుచుందురు. ఒడయఁడు వంచింపఁగా వారితనిని దిగవిడిచి శత్రువులచేతికి మంచిసాధనము లగుదురు. నీవు నన్నవమానించితివి. మరల నన్నధికారమునందు నిలిపితివేని నన్నెట్లు నమ్మఁగలవు? నిన్నుఁగాని నేనెట్లు నమ్మఁగలను? నన్ను నీవు సమర్థుఁ డని చేరఁబట్టి పరీక్షించి యధికారమందు నిలిపితివి. అప్పుడు చేసినయొడంబడికను నుల్లంఘించి, నన్నవమానించితివి. ఒకనిని బదుగురి నడుమ మొదట శీలవంతుఁ డని ప్రకటముగాఁ జెప్పినచో, అట్లు చెప్పినవాఁడు తానాడి తప్పకుండునేని మరల వానిని గుణహీనుఁ డని చెప్పరాదు. ఇట్లు నన్నవమానించితివి గావున నాయందిఁక నమ్మికయుండఁజాలదు. నీకు నమ్మకము తీసిపోయినపిదప నీయందు నాకుభయము కలుగును. నీకు నమ్మకము లేకుండఁగా, నాకు భయముగుచుండఁగా, మనశత్రువులు మనల బాధించుటకు సందులు వెదకుచుందురు. నీప్రజలు తుదకు నెయ్యములేక, తనివియుఁ గానకపోదురు. ఇట్టిస్థితికిఁ బెక్కుదోషములు గలవు. మొదట గౌరవమును బిదప నవమానమును గలిగినట్టి స్థితి సుఖమైనదిగాఁ బ్రాజ్ఞులెన్నరు. వేఱుపడినది గూడికొనుట కష్టము. వేఱుపడి మరలఁ గూడినచోటఁ గలుగు ప్రీతి మరల స్నేహముచేతఁ బెరుఁగదు.

భర్తవగు నీహితము గోరువాఁడొక్కఁడును గనుపట్టకున్నాఁడు. కొలువు, తనకును దనభర్తకును మంచిసేయు నభిప్రాయము నుండియే కలుగుచున్నది. అన్నిక్రియలును స్వార్థమును బట్టియే కయికొనఁబడుచున్నవి. స్వార్థమునుబట్టి కాక వట్టి నెయ్యమును బట్టి కలుగు నభిప్రాయములు మిక్కిలియు దుర్లభములు. రాజుల కెవరికి మనసు చలించుచును నిమ్మళము లేకయు నుండునో వారి పురుషుల కలరూపు నెఱుంగుట యెంతయుఁ గష్టము. నూర్వుర యం దొక్కఁడే సమర్థుఁడుగను జంకులేని వాఁడుగను దిరుగుచున్నాఁడు. మనుష్యుల కభివృద్ధియు, నాశమును దనంతటనే కలుగుచున్నవి. శుభమును నశుభమును, మహత్త్వమును రానీక నిలుపఁజూచుట బుద్ధి తక్కువయే యగును.' అనెను.

భీష్ముఁడు. 'నక్క యిట్లు ధర్మార్థకామయుక్తము లగు తిన్నని మాటలాడి రాజును బ్రసన్నునిఁ గావించి వనమునకు మరలి పోయెను. బుద్ధిమంత మయినయానక్క మృగరాజు వేఁడుకొన్నను బాటింపక ప్రాయోపవేశముచేసి శరీరమును విడిచి స్వర్గమును బొందెను' అనెను. ఇది నూటపదునొకండవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

{భీష్ముఁ డలసత్త్వ మనర్థహేతువని నిరూపించుటకై లొట్టియ కథను జెప్పుట.}

ధర్మరాజు 'ధార్మికోత్తమా ! రాజు చేయవలసిన దేది ? ఏమి చేసి సుఖమునొందును ? దానిని గలరూపున నాకుఁ జెప్పుము' అని యడిగెను. భీష్ముఁడు 'ఈలోకమందు రాజేమి చేయవలయు




577. లొట్టియ తనగొంతుకు గాలివలన నపాయము లేకుండుటకై
కొండగుహలో నుంచుట ; నక్కలు చలిచే వచ్చి
దానిగొంతును గొఱికి తినుట.

నో, దేనినిజేసెనేని సుఖమునొందునో యట్టి కార్యమును ముఖ్యముగా నిశ్చయించి యిప్పుడు నీకుపదేశించెదను వినుము. ధర్మరాజా! ఒక లొట్టియనుగుఱించి యీ పెద్దకథను మేము వినియున్నాము. దానియట్లుండరాదు; అది తెలియుము. కృతయుగమందొక పెద్ద లొట్టియయుండెను. దానికి పూర్వజన్మస్మరణముగలదు. అది వాఁడి యగునియమముతో నరణ్యమందుఁ దప మనుష్ఠించుచుండెను. దానితపము ముగియఁగా బ్రహ్మ దానియెడఁ బ్రీతుండై కోరినవర మడుగు మనెను. అందుల కా లొట్టిపిట్ట 'మహాత్మా! నీ యనుగ్రహమువలన నాయీకుత్తుక నూఱుయోజనముల తుద నున్న యాహారమునేనియుఁ దీసికొన శక్య మగునంత నిడివిగా నుండవలయును' అనెను. అందులకు బ్రహ్మ 'వల్లె'యని చెప్పఁగా నది గొప్పవరమును బడసి తనయడవిని బోయిచేరెను. అపు డా యొంటె మిక్కిలి చెడుబుద్ధిగలది గాన, బ్రహ్మదేవుఁడు వర మొసంగిన కారణమున సోమరితనము గలిగియుండెను. ఆదురాత్మకమయినది చెడుకాలముచేతఁ దెలివి యుడిగి, యాదినము మొదలుగాఁ బచ్చిక మేయుటకు బయలు వెడలినదిగాదు. ఒక నాఁ డది నూఱుయోజనములు నిడుపయిన తనకుత్తుకను జాఁచి యేశ్రమములేక యాహారము నరయుచుండఁగా నొక గొప్ప గాలిపుట్టెను. అవివేకి యగునాలొట్టియ తనతలనును గుత్తుకనును నొక కొండగుహయందుఁబెట్టి యాగాలివాన యుడుగుటకె నెదురుచూచుచుండెను. తోడనే లోకమునంతయు వెల్లినిముంచునట్టు బెట్టిదమయిన వర్షము గురిసెను. అపు డొకనక్కలిచేత నవయవములు వడఁకుచుండ నాఁకటిచే స్రుక్కుచు వానవెల్లికిఁ గలంగి భార్యయుఁ దానును వేగ యా గుహకువచ్చి

చొచ్చెను. మాంసమువలన బ్రతుకునట్టి యామృగము మిక్కిలియు నాఁకలిచేఁ గటకటంబడుచు నాలొట్టియకుత్తుకను దినఁగడంగెను. తెలివిమాలిన యాలొట్టియ, తాను భక్షింపఁబడుచుండుటను దెలియఁగానే మిక్కిలియు దుఃఖమునొంది కుత్తుకను ముడుఁచుకొనఁ బ్రయత్నించినది. లొట్టియ కుత్తుకను గ్రిందుగను మీఁదుగను ముడుఁచుకొనుటకై కదల్పఁగానే నక్కయు దానిభార్యయుఁ బట్టువిడువక దానిని దినుచునే యుండెను. ఆ లొట్టియ యొకింతసేపటికిఁ బ్రాణమువిడిచెను. ఆనక్కయంత లొట్టియను జంపి తిని తుపాను దీసినపిదప నాగుహనుండి వెడలి వచ్చెను. ఇట్లాలొట్టియ దుర్బుద్ధిచేత మరణము నొందెను. సోమరితనము వెంట గొప్పదోషము క్రమముగా వచ్చుటను జూడుము! నీవట్లు సోమరితనము లేక యింద్రియముల నియమించి తగినయుపాయముతో నేదియుఁ గావింపుము. జయమునకు బుద్ధియే మూలమని మనువు చెప్పెను. కర్మములు బుద్ధిచేతఁ జేయఁబడునవి శ్రేష్ఠములు; భుజబలముచేతఁ జేయఁబడునవి మధ్యములు; పిక్కలచేత (త్రిమ్మరి) చేయఁబడునది యధమములు; బరువుమోసి చేయఁబడునది యన్నిటికంటెఁ దక్కువయైనవి. రాజు రాజ్యము నడుప సమర్థుఁడై యింద్రియముల నిగ్రహించినవాఁడేని యతనిరాజ్యము చెడక నిలిచియుండును. ఆర్తిగలవాఁడు బుద్ధిమూలముననే తాను గోరినది సాధింపవలయునని మనువు చెప్పెను. ధర్మరాజా! రహస్యముగా నున్న మంత్రాలోచనములను వినువారును, సహాయులు మిక్కిలి గలవారును, చక్కఁగాఁ బరీక్షించి నడచుకొనువారును, సమస్తకార్యములయందు సిద్ధినొందుదురు. అట్టి సహాయము గలరాజు భూమినంత

యుఁ బాలింపశక్తుఁడగును. మహేంద్రసమాన ప్రభావా! తొల్లి శాస్త్రవిదు లగు పురుషులచే నిది చెప్పఁబడినది. నేను శాస్త్రమందుఁ గన్నిడియే దీనిని నీకుఁ జెప్పితిని. నీవు పరాకువడక నడచుకొనుము' అని చెప్పెను. ఇది నూటపండ్రెండవయాధ్యాయము.

—-•-—

## రాజధర్మపర్వము.

భీష్ముఁడు బలవంతుఁడగు శత్రువును వశముచేసికొనుటకు వినయ ముపాయమగు నని నదీసాగర సంవాదమును జెప్పుట.

ధర్మరాజు 'భరతసింహమా! రాజు, తగినసాధనములు లేకయే *దుర్లభం బగు రాజ్యమును బడసి మిక్కిలియు వృద్ధినొంది యున్న శత్రువునెడల నెట్లు నడచుకొనవలయును?' అని యడిగెను.

భీష్ముఁడు—'భారతా! ఈ విషయమందు నదులకును సముద్రమునకును జరిగిన సంవాద మయిన పురాతనమయిన యీ యితిహాసమును నుదాహరించుచున్నారు. తొల్లి, యసురులకు మనికిపట్టును నదులకుఁ బతియునగు సముద్రుఁడు సమస్తనదులను జూచి తనకుఁగలిగిన సంశయముల నడుగఁదొడఁగి 'నదులారా! మీరు ప్రవాహములు వెల్లిగొని పెద్దపెద్ద మ్రాఁకులను వేళ్లతోడను గొమ్మలతోడను బెకల్చి యిచ్చటికిఁ దేఁగాఁ జూచుచున్నాను. కాని నీరుప్రబ్బలిని మాత్రము పెకల్చి తేఁగాఁ జూడను. మీగట్టులయందు మొలచు నీరుప్రబ్బలి చిన్న కొలఁది

* 'రాజా రాజ్యమను ప్రాప్యదుర్లభమ్' అని గౌ. మూలము. 'దుర్బలః' అని దాక్షిణాత్య పాఠము.

గలది; దాని సత్తువయు నల్పము. దానిని నలక్ష్యభావముచేతఁ బెకల్చి తేరా? లేక దానివలన మీ కేమయినను బ్రయోజనము గలదా? మీ కందఱ కిట్లు నీరుప్రబ్బలిని గట్టులను ద్రెంచి తేకుండుటకుఁ గలయభిప్రాయము మే మో విన గోరుచున్నాను అని యడిగెను. ఆవిషయమున గంగానది సముద్రుని జూచి యర్థవంతమును హేతుయుక్తమును బోధకరము నగుమాటల తో 'ఈ పెద్దమ్రాఁకు లున్నచోట నేయుండి యాచోటునుండి కదలక మెదలక దృఢముగా నెలకొనియుండును. ఇట్లవి మా నెల్లువల నెదుర్చునవిగా నుండుటవలన నవి పెరిఁగినచోటును విడుచునట్లు గావింపఁబడుచున్నవి. నీరుప్రబ్బలి, యున్నచోట నుండి తొలఁగదు. అది వెల్లువయురవడిని జూచి వంగిపోవు చున్నది. తక్కిన మ్రాఁకు లట్లు వంగవు. ప్రవాహవేగము తీసినదే యానీరుప్రబ్బలి మరలఁ దనయెప్పటిచోటు నొందును. అది కాలమును సమయమును దెలిసినది; మాకు వశ్యమైయుండునది. మాకనుకూలముగా నడచుకొనునది. స్తంభమువలె దిటగా నిలఁబడక యుండును. కాఁబట్టి యది నిన్నుఁ జేరుటలేదు. నీటి యురవడికిని గాలివేగమునకు నడఁగియుండి పిదపఁ బయికి లేచు నట్టి యోషధులును, మ్రాఁకులును, జెట్లును, నవమానము నొందవు' అనెను. యుధిష్ఠిరా! కాఁబట్టి మిక్కిలి వృద్ధినొంది యున్న శత్రురాజువలని బంధమును బోఁగొట్టుకొనుటకు వాని మొదటియురవడి కెవఁడు సైఁచఁడో వాఁడు శీఘ్రముగానే నశించును. మంచి తెలివిగలరా జెవఁడు తనకును శత్రువునకును గల బలాబలములను సేనను బరాక్రమమును దెలిసి నడచుకొను చున్నాఁడో వాఁ డవమానము నొందఁడు. ఇట్లు తెలివిగలవాఁడు,

శత్రువు తనకంటె నెక్కుడుబలముగల వాఁడని తెలిసినప్పుడు నీరు బ్రబ్బలిరీతి నాశ్రయింప వలయును. ఇదియే తెలివికి లక్షణము' అనెను. ఇది నూటపదునూఁడవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

(భీష్ముఁడు సభయందు దుష్టుఁడు చెడ్డమాట చెప్పి నను దానినోర్చుట మంచిదనుట.)

ధర్మరాజు 'మూర్ఖుండును గూర్ఖుండు నగునొక చిట్టమాటల వాఁడు మెత్తనివాఁడగు విద్వాంసుని సభయందు నిందించుచుండఁగా నావిద్వాంసుఁ డేమిచేయవలయును?' అని యడిగెను.

భీష్ముఁడు 'రాజా ! ఈవిషయము చక్కఁగాఁ దెలియునట్లు వినుము. ఎప్పుడు నెఱుకగలవాఁ డల్పబుద్ధి యగు మనుష్యుని మాటలకు సైఁపవలయును. దూషింపఁబడువాఁడు కోపమునొందక యుండెనేని దూషించువాని సుకృతము నెల్లఁ బొందుచున్నాఁడు. అట్లు సైఁచినవాఁడు తనదుష్కృతములను, గోపంబున నట్లు దూషించినవానికె పుచ్చుచున్నాఁడు. * కూపెట్టుచున్న రోగియెడలంబోలె,నిందించుచున్న యామనుష్యునియెడల నుదాసీనుఁడై యుండవలయును. లోకులపగకుఁ బాలయినవాఁడు బ్రతికియు వ్యర్థమే. మూఁఢుఁడు 'నే నట్టిగొప్పవానిని నట్టి సభయం దిట్టి మాటలడిగితిని' అని పలుమాఱు చెప్పుకొనుచుండుటను, నట్లు

---

* 'గర్హితం త ముపేక్షేత వాశ్యమాన మివాతురమ్' అని మూలము 'టిట్టిభం త ముపేక్షేత వాశ్యమాన మివాతురమ్' అని పాఠాం. మూలము. రొదసేయుచున్న టిట్టిభ పక్షినింబోలెనని యర్థము.

చేసిన చెడుగునకుఁ దన్నుఁ బొగడుకొనుచుండుటను మాటికిఁ జూడ వచ్చును. మఱియువాఁడు 'వాఁడు నేను దూషింపఁగా సిగ్గు పడి సత్తువచెడి చచ్చినవానివలె నుండెను' అని చెప్పికొనును. పురుషాధముఁ డితరులు డంబముగాఁ జెప్పికొనరాని యట్టిపని చేసియు సిగ్గుమాలి డంబముగాఁ జెప్పికొనును. అట్టి పురుషాధముని జతనంబున దాంతుఁడగువాఁ డుపేక్షింపవలయును. అల్పబుద్ధిగలవాఁడు చెప్పెడిమాటలనెల్ల నప్పటికి సైఁపవలయును. వాఁ డడవియందు వ్యర్థముగాఁ గూయుచుండు బుద్ధిమాలిన కాకి వంటివాఁడు. అట్టివాఁడు కొనియాడియు దూషించియు నేమిచేయఁగలఁడు; ఒకరిని వట్టిమాటలచేతనే దూషించువారట్లు దూషణములను నిరూపింపఁగలుగుదురేని వారిమాటలకుఁ గొంతపస గలుగును. నిజమునకు వారిమాటలు, మూఢులు తాముకలహరించువారిని జచ్చునట్లు పెట్టుశాపము లంతపసయే కలవిగాని వేఱుకాదు. నిందించువాఁడు తనచేష్టల చేతను మాటలచేతను దనతల్లియందు మాఱుమగనికిఁ బుట్టుటను బ్రకటించికొన్నవాఁ డగుచున్నాఁడు. నెమలి నృత్యముసేయునపుడు గుహ్యప్రదేశమును వెలిపుచ్చును. అది తన నృత్యముననకే విఱ్ఱవీఁగునుగాని తనగోప్యాంగమును జూపుటకు సిగ్గుపడనట్లు నిందించువాఁడును తాను బరుని నిందించినందులకే సంతోషించునుగాని దానివలనఁ దనతల్లిదోషము వెలిపుచ్చినందులకు సిగ్గుపడఁడు. ఎవని కీలోకమందుఁ జెప్పరానిమాటయుఁ జేయరానిపనియు నొకటియుఁ గలుగదో*యట్టివానిపుట్టుకకుమఱి

* 'సంశ్లిష్టజన్మనా' అని మూలము. 'సంశ్లిష్టకర్మణా' అని పాఠాంతరము. ఈపాఠమునం దర్థము క్లిష్టముగా నున్నది.

యొకఁడును (మాఱుమగఁడును) హేతువుగాఁగలసి యున్నాఁడు. అట్టివానితో శుచియగువాఁడు మాటాడరాదు. ఎవఁడొకని యెదుటవాని గుణములను, మఱుఁగున వానిదోషములను, నెత్తి చెప్పునోవాఁడులోకమునఁ గుక్కవంటివాఁడు. వానికి మంచిలోకములును జ్ఞానమును ధర్మమును నశించినవగును. అట్టిమనుష్యుఁడు పెక్కుదినములు దాను చేసిన దానములును వేల్చిన హోమములును, మఱుఁగునఁజేసిన నిందనములచేతఁ దోడనే నాశము చేసికొనుచున్నాఁడు. కాఁబట్టి ప్రాజ్ఞుండును మతిమంతుఁడు నగువాఁ డట్టి పాపచిత్తుండును వర్జనీయుండు నగుమనుష్యునిఁ గుక్కమాంసముంబోలెఁ దోడనే వర్జింపవలయును. పెక్కుజనుల నడుమఁ బరులపయిఁ గొండెములు చెప్పు దురాత్ముఁడు సర్పము తనపడగ నెత్తి చూపునట్లు తనదోషములను వెలిపుచ్చుకొనుచున్నాఁడు. ఆవెనుఁ గొఱుకుఁ దనకుం బోలినపనిని (పరనిందను) గావించుచుండఁగా వానికి మాఱుసేయ నుంకించువాఁడు, బూడిద కుప్పలోముని(ఁ)గిన బుద్ధిమాలిన గాడిదయుంబోలె దుఃఖమున మునుఁగుచున్నాఁడు. జనుల నెప్పుడును నిందించుచుండుట యందే యాసక్తుఁడై యుండు వానిని, జమ్మరేఁగిన తోఁడేలుం బోలెను మత్తిలి యెనరేఁగి గర్జించుచున్న యేనుంగుం బోలెను మిక్కిలి బెడిదమయిన కుక్కనుం బోలెను ద్యజింపవలయును. అయోగ్యులు పోవుమార్గమున వర్తించువాఁడును, ఇంద్రియ నిగ్రహమును వినయమును లేనివాఁడును, పాపుండును, శత్రుత్వమే వ్రతముగాఁగలవాఁడును, ఎప్పుడును నితరుల సంపద నశింపవలయునని యే కోరుచుండువాఁడును, పాపబుద్ధియునగు నట్టిమనుష్యుఁ డీస్సీ! పాడై పోవుఁగాక. మఱియు

వారు నిన్ను మిక్కిలియు నిందించుచుండినను నీవది విని యూరకుం
డ వెంతమాత్రము గాకుము. గొప్పవానికిఁ దక్కువవానితో
వాదము స్థిరబుద్ధు లగువారెంతయు నిందింతురు. వాఁడు గోప
ముగొనెనా కొఱికినను గొఱుకును.కొట్టినను గొట్టును. దుమ్మును
నుముకను బయిని జల్లినను జల్లును. పండ్లు తెఱచి చూపి భయ
పెట్టును. ఇదంతయుఁ గుపితుండును గ్రూరుండు నగు మూఢుని
యందు సిద్ధము. దురాత్ముఁడు సభయందుఁ గావించు నిందను
దుర్జనులను సహించువాఁడును మాటకిని నీ నిదర్శనములను
జదువువాఁడును. మాటలచేత నేవిధమయిన బాధయును బొం
దఁడు' అనెను. ఇది నూటపదునాలుగవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

### భీష్ముఁడు రాజులకు సాహాయ్యము చేర్చుకొనుట యావశ్యకమని చెప్పుట

ధర్మరాజు 'పితామహా! నీవు మిక్కిలియుఁ బ్రాజ్ఞుండవు.
నాకుఁ బెద్దసందేహ మొకటిగలదు. ఇది నీవే తొలఁగింపఁ జాలు
దువు. నీవు మాకులమును వృద్ధి నొందించినవాఁడవు గదా!
తండ్రీ! చెడునడవడియుఁ జెడుమనస్సును గలమనుష్యులు నిం
దించి మాటలాడుటను గుఱించి యిపు డుపన్యసించితివి;మఱియు
నీ కొకటి విన్నవించు కొనుచున్నాను.రాజ్యతంత్రమునకు హిత
మైనదియు, కులమునకు సుఖము కలిగించునదియు, మీఁదటికిని
నిప్పటికిని క్షేమమును వర్ధిల్లఁజేయునదియు, పుత్రులకును బౌ

త్రులకును సంతోషమును బుట్టించునదియు, రాష్ట్రమును వృద్ధిఁబొందించునదియు, అన్న పానములకును దేహమునకును హితమైనదియు నగు దానిని నాకుఁ జెప్పవలయును. రా జభిషిక్తుఁడై రాజ్యము నేలుచు * మిత్రులచేతఁ బరివేష్టితుఁడయ్యు సుహృదులంగూడియుఁ బ్రజల నెట్లు రంజింపవలయును? ఏ రాజు తన నెయ్యములయు ననురాగములయు బారింబడి దుష్ట విషయములందు మిక్కిలియుఁ దగులుగలిగి, యింద్రియముల నడంపఁ జాలమి వలనఁ జెడుమనుష్యులను బరిపాలించుచు నుండునో యతని భృత్యులు కులీనులగు వారందఱును నతని యెడ విముఖలగుదురు. అతఁడు మంచి భృత్యుల బలమువలనఁ బడయఁదగు నర్థములను బడయ నేరఁడు. నీవు బుద్ధియందు బృహస్పతికి సముండవు. రేయుం బగలు రాజ ధర్మములనే చింతించుచున్న వాఁడనుగాన నాకు నీ విషయమును నీవు చెప్ప నర్హుఁడవు. పురుషసింహమా ! నీవు మాకులహితమందే యాసక్తి గలిగి యుందువుగాన మాకు రాజకీయ విషయములను నుపదేశించుచుందువు. మహాప్రాజ్ఞుండగు విదురుం డొక్కండును నెప్పుడును మా కుపదేశము సేయుచుండువాఁడు. నేను నీవలనఁ గులహితమును రాజ్యమునకు హితకరంబు నగునుపదేశమును విని యవ్యయంబగు నమృతంబును ద్రావినట్లు తృప్తినొంది సుఖముగా నిదురించెదను. ఎట్టి భృత్యులు నికృష్టులు? ఎట్టివారు సర్వగుణసంపన్నులు ? ఎటువంటి భృత్యులతోఁ గూడి లేక యెట్టి కులమునఁ బుట్టిన భృత్యులతోఁగూడి, రాజ్యయాత్ర జరుపఁ దగును?

---

* మిత్రులనఁగా ప్రత్యుపకారమును గోరి యుపకరించువారు; సుహృదులది గోరకయే యుపకరించు వారని భేదము తెలియునది.

భృత్యులులేకయె రాజు తా నొక్కఁడును బ్రజలను రక్షింపఁ జాలఁడు గదా. గొప్పకులమునఁ బుట్టిన వారందఱును రాజ్యము నేలుట కువ్విళ్లూరుదురు' అనెను.

భీష్ముఁడు—'భారతా ! రాజు, తా నొక్కఁడే రాజ్యము నేలఁజాలఁడు. భృత్యుల సహాయము లేనిచో నతని కే యర్థము లును బడయ శక్యములుగావు;పడసినవాని నెప్పుడును రక్షించుట కును శక్యముగాదు.ఏరాజునకుఁగల భృత్య జనులందఱును జ్ఞాన విజ్ఞానములందుఁ బండితులును రాజహితమును గోరువారును సత్కుల ప్రసూతులును బరస్పరము నెయ్యము తియ్యము గల వారునై యుందురో యట్టిరాజు రాజ్యమువలనిఫలమును బొందును. ఏరాజు మంత్రులు,కులీనులును,పరులచే వేఱుపఱు పరానివారును, రాజు ప్రక్కఁ బాయకుండువారును, రాజు నకు మతి నుపదేశించు చుండువారును, అన్యోన్య వస్తువుల సం బంధములను లెస్సగా గుఱుతెఱింగిన వారును, మీఁదటి కాల మునకు వలయునవి యెల్ల ముందుగా సమకట్టువారును, కాల గుణములను జక్కఁగా నెఱింగినవారును, గడచిపోయిన వానికి దుఃఖింపకుండువారును, నగుమంత్రు లుందురో యట్టి రాజు రాజ్యమువలనిఫలమును బడయును. ఏరాజునకు సహాయులగు వా రతనితోడ సుఖదుఃఖములు గలవారును, బ్రియముచేయు చుండువారును, రాజు కార్యముల నొడఁగూర్చుటయే యెప్పు డును జింతించు చుండువారును, సభ్యులునై యుందురో యట్టి రాజు రాజ్యమువలని ఫలమును బొందును. ఏరాజుదేశము నందలి వారు కాఱియలేక యెప్పుడు నున్నతి గలిగి నీచులుగా కయు.మంచిమార్గము నూఁదియువర్తింతురో యతఁడు రాజ్యము

వలని ఫలమును బొందును. ఏరాజు బొక్కసము,నతని యాదా యమును వృద్ధిచేయు మార్గములఁ జక్కఁగాఁ దెలిసినవారును నాప్తులును రాజువలన సంతుష్టులును ధనధాన్యసంపత్తిచేఁ బుష్టిగలవారును, నగు మనుష్యులు పరిపాలించు చుందురో యట్టి రాజు రాజ్యమువలని ఫలమును బడయును. ధాన్యాదుల కొట్లు, పరులచే వేఱుపఱుపరాని వారును, ఆప్తులును, పైప యిని సేకరించుటయందాసక్తులును, భాతృలును, బేరాసలేని వారును నగు పురుషులచేఁ బాలింపఁబడుచుండు నేని రా జొప్పిద మును బొందును. ఏరాజు నగరమందలి వ్యవహారము *శంఖలిఖి తుల వ్యవహారముంబోలెఁ గచ్ఛితమై ధర్మఫలమును గలిగించు నదై యుండునో యారాజు ధర్మమువలని ఫలమును బడ యును. ఏ రాజు రాజధర్మములను దెలిసికొని ప్రజలను జేరఁ బట్టుకొనుచు నాఱింట నొకపాలు కప్పముఁ బుచ్చుకొనునో యతఁడు ధర్మమువలని ఫలమును బొందును'అనెను. ఇది నూట పదియేనవయధ్యాయము.

## రాజధర్మపర్వము.

(భీష్ముఁ డొకముని చిఱుత మొదలగు వాని వలన భయపడిన కుక్కను వాయా మృగ ముగాఁ జేయుటను జెప్పుట.)

(ధర్మరాజు 'భరతసత్తమా ! ఏ సమయమందు రాజునకుఁ గులీనులగు సహాయులులేరో యట్టియెడఁ గులీనులుగాని వారిని సహాయులుగా నేర్పఱచు కొనవచ్చునా ?'అని యడిగెను.)

* శంఖలిఖిత చరిత్రమును ఆపదిర్వమునఁ జూచునది.

భీష్ముఁడు 'ఈ విషయమై పురాతనమయిన యొక యితిహాస ముగలదు. అది లోకులకు దృష్టాంతప్రాయమై సజ్జనులచేత నాచరింపఁబడినదయ్యు నెప్పుడు నొప్పుచున్నది. అది ప్రకృత విషయముంబోలినది. దానిని నేను బరశురాముని తపోవన మందు ఋషిసత్తములు చెప్పఁగా వింటిని. మనుష్యులు లేని యొక మహారణ్యమందు, నొకముని ఫలమూలములఁ దినుచు నియతుఁడై యింద్రియముల నడఁచి వసించియుండెను. అతఁడు వ్రతదీక్షలచేత నెంతయు బడలియు, దమముగలిగియు, నెప్పు డును వేదాధ్యయనము చేయుచును శుచియై, యుపవాసముల చేత నాత్మశుద్ధియునొంది యెల్లప్పుడు సన్మార్గమునందే వర్తిం చుచుండెను. ధీమంతుఁ డతఁడు గూర్చుండియుండఁగా నతని మంచిభావమును గాంచి యడివియందుఁ గ్రుమ్మరుచుండు జం తువులన్నియును నతనిని బ్రేమంబున దగ్గఱి వచ్చి యుండును. సింహములును, పులులును, శరభములును మదించిన పెద్ద యేనుఁగులును, జిఱుతపులులును, ఖడ్గమృగములును, ఎలుఁగు గొడ్లును, మఱియు బెట్టిదముగాఁ జూపట్టునవియు, నెత్తురా హారముగాఁ గలవియు నగు తక్కిన మృగములును నన్నియు నామునికడకు వచ్చి కుశలప్రశ్నములు సేయుచుండును. అవి యన్నియు నతనియెడ శిష్యులవలెను, దాసులవలెను నడచు కొనుచు నతని మనసెఱింగి ప్రియమునే యెప్పుడును గావించు చుండును. అవి యతని యొద్దకువచ్చి 'సుఖమా' యని యడిగి యతని బదులును గయికొని తమతమ నెలవులకుఁ బోవుచుం డును. అందొకజంతువు మాత్రము గ్రామ్యమగు కుక్క, యమ్మహాముని నెప్పుడును విడువకయే యుండెను. అది యెప్పు

ము‌ను భక్తియు ననురక్తియుఁ గలిగి యుండెను. అది యుప వాసములచేఁ గృశించి బలహీనమై పండ్లును వేళ్లును నీరును నాహారముగా శాంతమై శిష్యునివలెఁ జూపట్టుచుండును. అమ్మహర్షి యాసనమందుఁ గూర్చుండఁగా నది యతని యడుగుల క్రింద మనుష్యునివలె మనసునుంచి నెయ్యమునచే మిక్కిలియు నతనికి బద్ధమైయుండెను. ఒకనాఁడు రక్తము నాహారించునట్టి యొక బెట్టిదపుఁ జిఱుతపులి యచ్చటికి వచ్చెను. ఆ క్రూర జంతువు కుక్కను జూడఁగానే యెంతయు నుప్పొంగి రెండవ యమునివలెఁ జూపట్టెను. అది యాఁకలియు దప్పియుఁగొని పెలవులు నాఁకికొనుచుఁ, దోఁక నెడతెగక జాడించుచు, నోరు తెఱచుకొని యాకుక్క మాంసమును గోరివచ్చెను. ఆక్రూర మృగమట్లు వచ్చుచుండుటను జూచి కుక్క బ్రతుకుగోరి యామునిని జూచి యిట్లు చెప్పెను. అది చెప్పెడ వినుము— 'మహాత్మా! కుక్కలకు శత్రువయిన యీ చిఱుత నన్నుఁ జంపఁ దివురుచున్నది. మహామునీ! నీ యనుగ్రహముం జేసి యీ పులివలన నుండి నాకు భయము లేకుండ వలయును. మహాబాహూ! అట్లు దయసేయవలయును, నీకన్నియుఁ దెలియుననుటకు సందియము లేదు' అనెను. అమ్ముని సకలప్రాణుల కూఁతలును నెఱింగినవాఁడు; మఱి యణిమాదిసిద్ధులు గలవాఁడు. అతఁ డాకుక్కకుఁ గలిగిన భయమునకు హేతువును నా కుక్క భావమును దెలిసి దానితో 'బిడ్డా! చిఱుతపులి వలన నీ కేవిధమునను మరణ భయము కలుగదు. ఇదిగో నీవు నీకుక్క రూపమునుమాని చిఱుతపులి వగుదువు' అనెను. తోడనే కుక్క చిఱుత రూపము

నొందెను. అప్పు డది బంగారుంబోని మేనును వింతలయినచాఱలు గల యంగములును మిక్కిలియుఁ బ్రకాశించుచున్న కోఱ పండ్లనుగలిగి భయంబుమాని వనంబున నుండెను. చిఱుత యా కుక్క తనకు సాటియైన మృగమై యెదుర నుండంగని తత్క్షణమే దానియెడఁ గల విరోధమంతయు నుడిగిన దయ్యెను. అంత నొక పెద్దపులి మిక్కిలియు భయంకరమైనది యాఁకటిచేత నోరు తెఱచుకొని సెలవులు నాకికొనుచు నెత్తురున కువ్విళ్లూరుచు నాచిఱుతకై వచ్చెను. ఆచిఱుతయు వాఁడి కోఱలుగలిగి యాఁ కటఁ గటకటంబడుచు వచ్చు పెద్దపులినిజూచి ప్రాణరక్షణము కొఱకు ఋషిని శరణుఁజొచ్చెను. పిదప నమ్ముని కూడి మాడు చుండుటవలని నెయ్యము నపుడు నెఱపుచు నా విరోధియగు పెద్దపులికంటె బలవంతమయిన పెద్దపులిగా నాచిఱుతను గా వించెను. అపు డాపెద్దపులి దానిని జూచి పయింబడదయ్యె. ఆకుక్కయో బెబ్బులితనమునొంది బలముగలదై మాంసము నాహరింపఁ దొడఁగినది కాని ఫలమూలముల నెంతమాత్ర మొల్లదయ్యెను. అది మొదలుగా బెబ్బులియైన యాకుక్క మృగరాజువలెనే వనమందలి తక్కిన మృగములను నాహారిం చుచుండెను. ఇది నూటపదియాఱవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

భీష్ముఁ డాముని తనకుక్కను పలువగల మృగములను గావించుటయుఁ బిదప నది తన్నుఁ జంపఁగోరఁగా మరల మునుపటివలెఁ గుక్కను గావించుటయును జెప్పుట.

పెద్దపులియును మృగములను జంపి తినుచుఁ బర్ణశాల మూల యందు హాయిగా నిదురించుచుండెను. ఒకనాఁడది యాశ్రమమున నుండఁగా మదించిన యొక యేనుఁగు పయికిలేచిన మేఘమువలె నచటికి వచ్చెను. దాని చెక్కులందు మదజలము దొరుఁగుచుండెను. అది మిక్కిలి పొడవై పద్మములు గలిగి, వెడఁదయైన కుంభస్థలమును, నిడుదలయిన కొమ్ములును, పెనుకాయమును గలిగి మేఘమువలె గంభీరధ్వనితోఁ గూడియుండెను. అట్లా యేనుఁగు బలమున విఱ్ఱవీఁగుచు మత్తిలి పయికి వచ్చుచుండఁగా నాబెబ్బులి దానికి భయపడి వడఁకుచు నమ్మునిని శరణొందెను. అంత నాఋషిసత్తముఁడు దాని నేనుంగు గావించెను, అప్పుడు వచ్చిన యేనుఁగు పెద్దమేఘమువలె నున్న దానిని జూచి భయమునొందెను. అంత నాక్రొత్తయేనుఁగది మొదలుగాఁ దామర తంపరలంకాను,అందుగు తోఁపులందును,మదంబు మిగులఁ దామరల పుప్పొడి మేనియం దొప్పులు గులుకుచుండ, విహరించుచుండెను. ఇట్లా యేనుఁగా పర్ణశాలయందు ముని యెదుటఁ జెరలాడుచుండఁగాఁ జాలఁగాలము గడచిపోయెను. అంత నొకనాఁడు పర్వత గుహాయందుఁ బుట్టినదియు నేనుఁగుల కులమునకు మృత్యువయినదియు భయంకరమైనదియు నగు సింహమొకటి యెఱ్ఱని జూలు దయివాఱ నచ్చటికివచ్చెను. అట్లు వచ్చుచున్న సింహ

మునుజూచి యాయేనుఁగు భయమునఁగలంగి వడవడ వడంకుచు ఋషిని శరణుఁజొచ్చెను. అప్పుడు ముని దానిని సింహముగావించెను. అప్పు డీక్రొత్తసింహ మెదుటిసింహముజాతిలోనే తాను జేరినదిగాన దానిని సరకుసేయదయ్యెను. వచ్చిన సింహము దీనిని జూచి బాధసేయక చలముడించిన దయ్యెను. ఆక్రొత్తసింహ మా యరణ్యమం దొకయాశ్రమమున నే సుఖముగా వసించియుండెను. అప్పుడు తక్కిన యల్పమృగములు దానికెంతయు భయపడిప్రాణములవలని యాసంజేసి తపోవనమును సమీపింపకయుఁ గనఁబడకయుఁ బోయెను. అట్లుండఁగా, నొకప్పుడు బలవంతమును రక్తము నాహారించునదియు నానాజంతువులకు భయంకరమయినదియు నగునొకశరభమృగము వనమునం ద్రిమ్మరునది యామునిపర్ణశాలయందున్న యాసింహమును జంపుటకువచ్చెను. అట్లువచ్చు శరభమునుజూచి సింహము శత్రు వను భయమున వడంకుచు మునిని శరణొందెను ముని దానిని మిక్కిలి బలముగల శరభము గావించెను. ఓడనే వనమందుండి వచ్చిన శరభము, తనయెదుట మిక్కిలి యుగ్రమును బలవంతమునయిన మునిశరభమును జూచి వేగమున వనమునకుఁ బాఱిపోయెను. ఇట్లు మునిచేత, శరభ పదవియందుంపఁబడిన యామృగ మెప్పుడు మునిప్రక్కఁ బాయక సుఖంబుండెను. రాజా! అంత శరభమునకు భయపడిన మృగసమూహము లన్నియును, ఆ భయమునఁ బ్రాణముల రక్షించుకొనఁగోరి వనమునుండి నలుదిక్కులకుఁ బాఱిపోయినవి. మాంసాశనమగు నాశరభము మిక్కిలి సంతోషమునొంది యెప్పుడును బ్రాణులను జంపుటయందే యాసక్తిగలిగి ఫలమూలముల నాహారింప నొల్లదయ్యె.



593. ఒకముని తన కుక్కను బలువిధములైన మృగములుగాఁ
గావించుట ; పిదప నది శరభము కాఁగానే
మునిని మ్రింగ వచ్చుట.

అంత నాశరభము బలవంతమై గొప్పకులమునందుఁ జేర్పఁబడి నదయ్యు నడవడి నీచమైనదిగాన నెనరుదప్పి యామునినే చంపఁ గోరెను. అపుడు మునుపు కుక్కగానుండిన యామృగండ్లమొక ము 'నే నిమ్మునిమహిమచేత నావాక్కొకటి చేతనే సకల ప్రాణుల కును భయంకరమైనదియు నెంతయుఁ బడయరానిదియు నగు శరభత్వమును బొందితిని. ఈ ముని నాశ్రయించి బ్రతుకు మృగ ములును నట్లె పక్షిసమూహములును, నిందుఁ గలతక్కిన ప్రాణులును భయమున వడఁకుచుఁ గుందుచున్నవి. లోకము నందు సకలములయిన ప్రాణులకంటె నుత్తమమయిన బలము నెలకొని యున్నట్టి యిట్టి శరభత్వమును నొకవేళఁ దక్కినవానికిఁ గూడ నితఁడిచ్చిన నీవచ్చును. ఇతఁడొకవేళఁ బక్షులకును గరుడుని బలమునొసంగవచ్చును. ఈ బ్రాహ్మణుఁడు కరుణగడలుకొన, నెంత యుఁ బ్రీతితళుకొత్త, నుల్లసిల్లుచుమఱియొక్క ప్రాణికిబలము నొ సంగకమునుపే నేను శీఘ్రముగా నీతనిఁ జంపవలయును. మునీం ద్రునిఁ జంపినపిదప నే నిచట నే జంకును లేక యుండవచ్చును' అని యాలోచించెను. అంత నాముని తన తపోమహిమచేతఁ దోడనే దానిని గనుఁగొనెను. అట్లు తెలియఁగానే యాప్రాజ్ఞుండు దానికి శాపమొసంగువాఁడై 'నేను భృగుకులమునంబుట్టినయగ్ని ప్రభుండను మునిని; నేను మనస్సుచేత జగత్తును గాల్పను ధరిం పను జాలుదును. దేవతలును జరాచరము లగు సకలజంతువు లును నాకు లోనై యున్నవి. దేవతలు నావలన భయపడి తమ ధర్మమును విడువకుందురు. నేను స్వధర్మమును దిగవిడిచినవాని నెవని నేనియు నావాక్కుచేతనే కాల్చివుత్తును. ఓరీ! ఏనొవ్వను లేని శరభజన్మమును బొందించిన నాకు నీవెంతమాత్రము ?

నీవు తొలుత సకలప్రాణులయందును క్రూరమై హీనమై యశుచి యైన కుక్కగానుండి నాచేతఁ జిఱుత గావింపఁబడితివి. చిఱుతగా నుండి బెబ్బులితనమును బొందితివి. దానినుండి మదపు టేనుంగు గాను, ఏనుఁగుగానుండి సింహముగాను నయితివి. సింహమ వై యుండి బలమువిఱిచి నీవు మరల మీఁగండ్ల మెక మయితివి. ఇప్పుడు నీప్రాణములకు సందేహించి నేను బలు దెఱంగులుగాఁ గావించినవాఁడవే కాని యాయాకులములందు నిజముగాఁ జేరిన వాఁడవుగావు. పాపా ! ఇట్లే పాపము సేయని నన్ను నీవు చంపఁ దలఁచిన కారణమున మరల నీతొలి పుట్టుకనొంది కుక్కగా నుందువుగాక' యని శపించెను. అంత దుష్టస్వభావమునను నవి వేకమునను దెలివిదూలి యాశరభము ఋషిని ద్వేషించి యా తని శాపమునకుఁబాలై మరలఁ దొంటి కుక్కరూపము నొం దినదాయెను. ఇది నూటపదియేడవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

### భీష్ముఁడు మంత్రి మొదలయిన వారిగుణములను జెప్పుట.

ఋషి యట్లు హుంకారముచేసి తపోవనమునుండి వెలికిఁ దఱుమఁగొట్టఁగా నాజంతువు తన యెప్పటిరూపునొంది మిక్కుట మయిన దీనత్వము పాలయ్యెను. విషయ మిట్లున్నది. కాన మతి మంతుఁ డగు రాజు, శీలము, శౌచము, ఆర్జవము, స్వభావము, బుద్ధి, చదువు, నడత, కులము, అడఁకువ, జాలి, బలము, వీర్య ము, ప్రభావము, మనశ్శాంతి, క్షమ యనువీనిని గనుఁగొని, యోగ్యు లగువారిని మంత్రులుగాను భృత్యులుగాను నాయా

యధికారములందు నెలకొలిపి చక్కఁగా రక్షింపవలయును. రాజు పరీక్షింపక పనివాండ్రను నియమింపరాదు చెడుకులమునఁ బుట్టిన మనుష్యులు రాజుచుట్టు నుందురేని యతఁడు వృద్ధి నొందఁజాలఁడు. రాజా! మంచికులమునఁ బుట్టినవాఁడవివేకిగా నుండినను, దప్పులేక నిందింపఁబడినను, ఆకులమునందుఁ బుట్టిన కారణమున నెప్పుడుగాని పాపమందు బుద్ధిని జెల్లింపఁడు. చెడుకులమునందుఁ బుట్టిన యవివేకి యగువాఁడో సాధువుల నాశ్రయించి పడయరాని యైశ్వర్యమును బడసినను, వానిని నిందించి నచో వైరము చూపఁదొడఁగును. (కాకియు, కుక్కయు, బిల్లియు, పామును, చెడుకులమునందుఁ బుట్టిన మనుజుఁడును, అట్టి స్త్రీయును, సమానులని చెప్పఁబడెదరు. స్త్రీనేనియు, లేక పురుషునేనియుఁ జెడుకులమునందుఁ బుట్టినవారిని లోకపాలురు నయితె మెప్పుడును భయంబునఁ జూతురు. అందులకును గారణము శీలమే. శీలము లేమినిబట్టి వారట్లు చూతురు. పురుషుఁడును స్త్రీయును జెడుకులంబునఁ బుట్టినవారయ్యును, నహింసయు శీలమును గలిగియుండిరేని * ధార్మికులును గొప్పకులమునఁ బుట్టినవారు నగుదురు. రాజా! బృహస్పతి ధర్మమును గుఱించి కొన్నిశ్లోకములు చెప్పెడిని. వానినంతయువిని మనంబున నుంచుకొనుము. అవియేవనఁగా—'దమముగల తపస్వివలెఁ బరిశుద్ధకర్ముం డగువాఁడు నల్లనిచండాలుఁడుగా నుండినను మంచినడవడి గలిగి యుండుటవలన వానిని దేవతలు బ్రాహ్మణునిఁగాఁ దెలియు

* 'ధర్మశ్చాకులతాం వ్రజేత్' ధర్మము కలఁతనొందునని యర్థము. ఇది పూర్వోత్తర విరుద్ధముగాన 'ధర్మ్యస్సుకులతాం వ్రజేత్' అని పాఠము దిద్దంబడెనని తెలియునది.

దురు. ఒకఁడు ప్రజలహితముఁగోరియుఁ దక్కిన సమస్తజంతువుల హితముఁగోఱకును, బాపం బగు నొకజంతువును జంపునేని దానిచేత వాఁడు హింసచేసినవాఁడు గాఁడు. పశువులయు బ్రాహ్మణులయు హితముఁగోఱకును, బిడ్డలను స్త్రీలను వృద్ధులను రోగులను రక్షించుకొఱకును, నెవఁడు చిఱుతపులిని, శరభమును, సింహమును, పెద్దపులిని, ఏనుఁగును, ఎనుమును, అడవిపందిని, ఊరఁబందిని, కుక్కను, సర్పమును జంపునో వాఁడు ధర్మమును బొందును. బ్రాహ్మణుఁడుగా నుండియుఁ బాపము చేయువాఁడుగను, మ్లేచ్ఛుఁడుగా నుండియుఁ బరిశుద్ధుఁడుగను ధార్మికుఁడుగను నుండెనేని వారియందు మ్లేచ్ఛుఁ డధికుఁడును బ్రాహ్మణుఁడు మిక్కిలి పాపాత్ముండును నగును. చెడుకులమునఁ బుట్టినవాఁడైనను మంచికులమునఁ బుట్టినవాఁడయినను నొకఁడు మంచిశీలము గలిగియుండెనేని వాని స్వభావము తెలిసికొని స్థిరముగానో లేక పరీక్షించుటకై కొంతకాలమువఱకో సమాహితుఁడై యొక మంచియధికారమునఁగాని లేక మంచి కార్యమునఁగాని నియోగింపవచ్చును. రాజు చెడ్డనడవడిగలవానిని బాపకార్యములందు నియోగింప వలయును' అనియే. మంత్రియగువాఁడు కులీనుఁడును, జదువునందు శిక్షితుఁడయినవాఁడును, బండితుండును, జ్ఞానవిజ్ఞానములందు నిపుణుండును, సమస్తశాస్త్రార్థముల కలరూపు నెఱింగినవాడునై యుండవలయును. మఱియు నోర్పుగలవాఁడుగను, స్వదేశమందుఁ బుట్టినవాఁడుగను, నెనరుగలవాఁడుగను, బలవంతుఁడుగను, క్షాంతియు దాంతియుఁ గలవాఁడుగను, జితేంద్రియుఁడుగను నుండవలయును. మఱియు లోభములేనివాఁడుగను, దొరకినదానితో

సంతోషించువాఁడుగను, తన యధిపతిని మిత్రులనను వర్ధిలఁ జేయఁ దివురుచుండువాఁడుగను, కార్యాలోచనమందు సహాయుఁడుగను, దేశకాలములను దెలిసినవాఁడుగను, సమస్తప్రాణులను నాదరమునఁ గయికొనుటయం దాసక్తుఁడుగను, బరిశుద్ధుఁడుగను, కొలఁదిమాట లాడువాఁడుగను, హితమునుగోరు స్వభావము గలవాఁడుగను, ప్రాలుమాలిక లేనివాఁడుగను, యుక్తమయిన యాచారముగలవాఁడుగను నుండవలయును. తనదేశమునందువలయు సంధివిగ్రహములందు నిపుణుఁడుగను, బ్రసిద్ధుఁడుగను, ధర్మార్థకామములు మూఁటిని దెలిసినవాఁడుగను, బురజనులకును దేశజనులకును బ్రియుఁడుగను, సైన్యములనొడ్డు పన్నుటను జక్కఁగాఁ దెలిసినవాఁడుగను, సైనికులను నుబ్బునఁ జెలరేఁగునట్లు చేయుటకు దిట్టయైనవాఁడుగను, ఇంగితమును నాకారమును స్వరూపముల నెఱిఁగినవాఁడుగను, దండయాత్రలందు సమర్థుఁడుగను, గజములను నశ్వములను బనుపఱచు తత్త్వములందు సమర్థుఁడుగను, అహంకారము లేనివాఁడుగను, చుఱుకుఁదనముగలవాఁడుగను, ధైర్యవంతుఁడుగను, అడఁకువ గలవాఁడుగను, యుక్తముగ నాలోచనచు సేయువాఁడుగను, బరిశుద్ధుఁడుగను, బరిశుద్ధులగువారు బలసియున్నవాఁడుగను, మంచివేషము గలవాఁడుగను, జూచుట కింపయినవాఁడుగను నుండఁదగును. కార్యములనడుపఁజాలువాఁడుగను, నీతియందుఁ గుశలుఁడుగను, ఆఱుగుణములతోఁ గూడినవాఁడుగను, మోటుఁదనము లేనివాఁడుగను, వినయముగలవాఁడుగను, మృదువయినవాఁడుగను, మెత్తఁగఁ బలుకువాఁడుగను, ధీరుఁడుగను, శూరుఁడుగను, గొప్పపెంపుగలవాఁడుగను, దేశకాలములకుఁబొసఁగునట్లుచేయువాఁడు

గను నుండవలయును. అట్టివానిని మంత్రిగాఁ గావించికొని యత నిని గ్రిందుపఱుపక యేరాజుండునో యతనిరాజ్యము చంద్రుని వెన్నెలవలె విస్తరించును. శాస్త్రములందుఁ బండితుఁడై ధర్మమే ప్రధానమైనదిగాఁ గలిగి ప్రజాపాలనముం దాసక్తుఁడై మీఁది గుణములెల్లఁ గలిగియుండురాజండ్రఱకును గోరందగిన వాఁడగును. అట్టిరాజు ధీరుఁడును, సైఁచువాఁడును, శుచియు, కాలమునకుఁ దగినట్లు చుఱుకుగలవాఁడును, ప్రయత్నమువలని పసనెఱింగినవాఁడును, పెద్దలయెడ శుశ్రూష గలవాఁడును, చదువరియు, అర్హులగువారి యుపదేశముల వినువాఁడును, ఊహమందును నపోహమందును బండితుఁడును, మేధావియు, ధారణాశక్తి గలవాఁడును, న్యాయము చొప్పున జరుపువాఁడు నుగా నుండవలయును. మఱియు నతఁ డెప్పుడును దమముగలిగి, ప్రియభాష లాడువాఁడై, అపకారియందును క్షమనెరపుచు, *తనచేతులార దానము సేయువాఁడును, శ్రద్ధగలవాఁడును, చూచుట కింపయినవాఁడును, ఆర్తులగువారికి నెప్పుడును జేయిచ్చి కాచువాఁడును, ఆప్తులయిన మంత్రులుగలవాఁడును, నీతియం దాసక్తుఁడునై యుండవలయును. మఱియు నేననెడి యహంకారము లేకయు, భార్యలేకుండకయు, తనయిచ్చకుఁదోఁచినట్లెల్ల విచారింపక యేదేనినొకటిచేయకయు నుండవలయును. మంత్రులేదేని మంచికార్యము చేసిరేని వారి కతఁ డుపకారము చేయవలయును. భృత్యజనులయందుఁ బ్రీతిగలిగి యుండవలయును.

---

* 'దానాచ్ఛేదే స్వయంకారీ' అని మూలము. 'నాతిచ్ఛేత్తా స్వయంకారి' అని దా. మూలము. మితిమీఱి త్రుంపనివాఁడును, తానేకార్యమును జేయువాఁడునని యర్థము.

సమస్తజనులను బాగుగాలక రాబట్టుకొనుచుండవలయును. ప్రసన్నమగు మొగముగలిగి యుండవలయును. మఱియు నెల్ల వారిని రక్షించుచును భృత్యజనుల నేకొఱంత లేకుండ నాదరించుచును, గోపము నెరపకయు గొప్ప మనస్సుగలిగియు నుండవలయును. మఱియు దండమును దిగవిడువక దానిని యుక్తముగాఁ బ్రయోగించుచు ధర్మకార్యములం దండఱను నియమించుచుండవలయును. అతఁడు చారులనెడి కన్నులచేతఁ బ్రజలస్థితిగతులను గనుఁగొనుచు ధర్మార్థములం దెప్పుడును గుశలుఁడై యుండవలయును. ఈ నూఱుగుణములును గలిగియున్నట్టి రాజెల్లవారికి గోరఁదగినవాఁడగును. రాజేంద్రా! రాజు తనరాజ్యమును రక్షించుటకు సహాయులుగా సకలగుణగణములతోఁ గూడినవారగు మంచి పురుషులను సైనికులుగా నరసి కూర్చుకొనవలయును. రాజు తనవృద్ధిని గోరునేని వారి నెంతమాత్ర మవమానింపరాదు. ఏరాజు యోధులు, యుద్ధమందుఁ బరాక్రమశాలులును, కృతజ్ఞులును, శాస్త్రకోవిదులును, ధర్మశాస్త్రము చక్కఁగాఁ దెలిసినవారును, పదాతిసమూహములు బలసియున్నవారును, * నిర్భయు లగు గజసైనికులుగలవారును, రథయుద్ధమందు విశారదులును, ఇషువులందును నస్త్రములందును నిపుణులును నగుదురో యట్టిరాజు పాలిసొమ్మే యీభూమి. జ్ఞాతుల నవమానింప కుండుటయు, భృత్యులందుఁ గపటము లేకుండుటయు, ధనముల నార్జించు వ్యాపారములందు నేర్పు మెలపుగలిగియుండుటయును గలరాజు పాలిది యీభూమి. ఆలస్యము, నిద్ర, వ్యసనములు, మిక్కిలి

* అభయా గజపృష్ఠస్థాః ' అని మూలము.

పరియాచకమున నెడి యివి యెవరికిఁ గలుగవో యారాజునకే మిక్కిలియుఁ జిరకాల మీభూమి దక్కియుండును. పెద్దలను గొలుచువాఁడును, మిక్కిలి యుత్సాహము గలవాఁడును, నాలుగువర్ణములవారిని గ్రమముదప్పనీయక రక్షించువాఁడును, ఎప్పుడును ధర్మకార్యములు చేయుచుండువాఁడు నగు రాజునకే యెంతయుఁగాలము నీభూమి దక్కియుండును. నీతిమార్గమునే యనుసరించుటయు, నెప్పుడును బ్రయత్నశీలుఁడై యుండుటయు, పగవారి నవమానింపకుండుటయుఁ గలవానికీభూమి చిరకాలము దక్కియుండును. మనువు తొల్లి పురుషకారమును దైవము ననెడియీ రెంటియందుఁగల పెక్కుదెఱంగులును వర్ణించి యున్నాఁడు. వానిని జెప్పెదను వినుము. రాజులకుఁ బౌరుషమునే బృహస్పతి చెప్పుచున్నాఁడు. నీవెప్పుడును నయమును నసయమును గుఱించినవిధులను దెలిసియుండుము. విరోధుల ఛిద్రములను గనుఁగొనుచును, సుహృదుల కుపకారముచేయుచును, భృత్యుల తారతమ్యములను దెలియుచును నుండురాజు రాజ్యమువలని ఫలమును బొందును. ఏరాజు సమస్తప్రజలను దనపక్షమునఁ గూర్చుకొనుటయందే యెపుడును గనుగలిగి పురుషప్రయత్నము చేయు స్వభావముగలిగి మిత్రుల బలిమి నిండారియుండునో యతఁడే రాజసత్తముఁడు. ఏరాజు మనుష్యులందఱను దనపక్షమున రాఁబట్టుకొని యుండునో యతఁడు వీరులగు వేయిమంది గుఱ్ఱపురౌతులతో భూమినంతయు గెలువ శక్తుం డగును. ఇది నూటపదునెనిమిదవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

భీష్ముఁడు భృత్యులను దగినయధికారములందు నియమింపవలయుననుట ; భృత్యుల లక్షణములనును జెప్పుట.

భీష్ముఁడు—'ఏరాజు, (కుక్క కథవలనఁ దేలిన సిద్ధాంతము చొప్పున) నాయాభృత్యులను వారివారికిఁదగిన స్థానములందు నియమించునో యతఁడే రాజ్యమువలని ఫలమును బొందును. కుక్కను దానికిఁ దగినపదవికోలఁదిని మీఱి పూజించి యెక్కుడుపదమం దుంపరాదు. దానికిఁ దగినపదముకంటె నెక్కుడు దానియందుఁ బెట్టినచోఁ గావరమున విఱ్ఱవీఁగును. మంత్రులను వారికిఁ దగినస్థానములం దేర్పఱుపవలయును. వారును దమపదవులకుఁదగిన గుణములను గలిగియుండవలయును. తగనిస్థానమునం దధికార మేర్పఱుచుట తగదు. ఏరాజు భృత్యులకు వారివారికిఁ దగినపను లొసంగునో యతఁడు వారి గుణములవలనఁ గలుగుఫలమును బడయును. శరభమును శరభస్థానమందును, సింహమును సింహస్థానమందును, బెబ్బులిని బెబ్బులిస్థానమందును, జిఱుతపులిని జిఱుతపులిస్థానమందును నుంపఁదగునట్లే, భృత్యులను విధ్యుక్తముగా వారివారికిఁ దగినపనులయందు నుంపవలయును. కార్యములవలని ఫలమును బడయఁగోరురాజు, ఆయాభృత్యులను వారికి నెక్కుడయిన యధికారములందు విపరీతముగా నేర్పఱుపరాదు. ఏరాజు బుద్ధిమాలి ప్రమాణము నతిక్రమించి భృత్యులను వారికిఁ దగనిపదవులందు నియమించునో, యతఁడు ప్రజలను రంజింపఁజాలఁడు. రాజు గుణములను గోరువాఁడేని, జిన్నవాండ్రను, అల్పులను, ప్రజ్ఞలేనివారలను, ఇంద్రి

యములను జయింపనివారిని, చెడుకులమునఁ బుట్టినవారిని దన కెలన నుంచుకొనఁడు. సాధులును, గులీనులును, శూరులును, ప్రాజ్ఞులును, అసూయలేనివారును, పెద్దఱికము గలవారును, బరిశుద్ధులును, సమర్థులునగు మనుష్యులు రాజుపొంత నుండఁ దగినవారగుదురు. రాజునకుఁ గ్రిందుపడి యతనిమేలిమిని గొండాడువారును, అడఁకువగలవారును, బరిశుద్ధులును, శుభగుణములు సహజముగా నలవడినవారును, తమతమ స్థానములను దప్పకుండువారు నగు మనుష్యులు రాజునకు వెలుపలఁ దిరుగు ప్రాణము లగుదురు.

సింహము ప్రక్క నెప్పుడును సింహమే పరివారముగా నుండవలయును. సింహముగానిది సింహముతోఁ గూడినచో నది సింహమువలె ఫలమునొందును. ఏసింహము సింహము చేయవలసిన కార్యమును బూనునదై, కుక్కలను ప్రక్కందోడుగాఁ బెట్టుకొనునో, యది యాకుక్కల కొలువునలన సింహము పొందఁదగుఫలమును బొందుట కెంతమాత్రము నేరదు. రాజా! ఈవిధముననే శూరులును బ్రాజ్ఞులును మిక్కిలి చదువరులును గులీనులు నగువారిఁ దోడు చేసికొన్నచో భూమినంతయు జయించుటయు శక్యమగును. రాజు తనపొంత విద్యావిహీనుఁడగు వానినిఁ, గపటవర్తనుని, ప్రజ్ఞలేనివానిని, వెనువాసి కెక్కని వానిని జేరఁబట్టరాదు. స్వామి కార్యమం దెంతయు నాసక్తిగల మనుష్యులు తమమేలిక యానతీయఁగానే బాణమువలె దానిని జేయఁ బోవుదురు. అట్టిరాజునకు హితము లాచరించుచుండునట్టి భృత్యులయెడ రా జెప్పుడును మంచిమాటలే యాడుచుండవలయును. రాజులు మిక్కిలి ప్రయత్నపడి యెప్పుడును బొక్కస

మును రక్షించుచుండవలయును. రాజులకు బొక్కసమే యా ధారము. కాఁబట్టి బొక్కసము నెప్పుడును వృద్ధిచేయుచుండ వలయును. నీధాన్యపుకొట్టునం దెప్పుడు ధాన్యములను సమృద్ధముగాను జక్కఁగాను సేకరించియుంచుచుండ వలయును. నీ ధనములను ధాన్యముల నెప్పుడును సత్పురుషులగు భృత్యుల కప్పగించి చూచుకొనునట్లు చేయవలయును. నీభృత్యు లెప్పుడును నెచ్చరికగలిగి యుద్ధములం దాఱితేఱినవారై యుండ వలయును. గుఱ్ఱములను గుఱించిన సకలప్రయోగములందును సామర్థ్య ముండవలయును. పాండుపుత్రా! జ్ఞాతులను, బంధువులను నాదరించుచుండుము. మిత్రులును సంబంధులును బలసియుండ నుండుము. పురజనుల కార్యముల హితమును నరయుచుండుము. నీకెప్పుడును దృఢముగా నుండవలసిన బుద్ధియుఁ బ్రజ్ఞయును నిదె చెప్పితిని. ఇందు నీకుఁ గుక్కయె నిదర్శనము. మఱియునేమి వినఁగోరెదవు' అని యడిగెను. ఇది నూటపందొమ్మిదవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

(భీష్ముఁడు ప్రజాపాలనవిధము మొదలయిన వానిని ధర్మరాజునకుఁ జెప్పుట.)

ధర్మరాజు 'భారతా! రాజధర్మములును వాని ప్రయోజనములను జక్కఁగాఁ దెలిసి పూర్వులు తొల్లి నియమించినట్టి రాజవృత్తములను బెక్కింటిని నాకుఁ జెప్పితివి. సజ్జనులకు నభిమతమయిన యాపూర్వవృత్తమునే నాకు విస్తరించి చెప్పితివి? దానిని సంక్షిప్తముగా నుపదేశింపవలయును' అని యడిగెను.

భీష్ముఁడు 'సమస్తప్రాణులను రక్షించుట క్షత్రియుల కుత్తమ మయిన ధర్మముగా నెన్నఁబడుచున్నది. అట్టి రక్షణ మెట్లు చేయవలయునో చెప్పెదను' వినుము. నెమిలి పలువన్నెలుగల పించెములను ధరించినట్లె ధర్మవిదుండగు రాజును బలువిధములయిన రూపులను బూనవలయును. వాఁడిమియుఁ గపటమును సత్యమును నార్జవమును ననుగుణము లతని కుండవలయును. అతఁడు సుఖమును బడయువాఁడేని, పక్షపాతము లేక మంచితనము నూఁదియుండవలయును. ఏ కార్యమునం దేరూప ముండవలయునో యం దారూపునే నూపవలయును. పెక్కురూపు లొందఁజాలిన రాజునకు మిక్కిలి చిన్నకార్యము సయితము చెడిపోవకుండును. రాజు, శరత్కాలమందు గూఁ బెట్టక మూఁగయై యుండు నెమిలివలె నెప్పుడును మంత్రాలోచనమును బయలు గ్రక్కక కాచుచుండవలయును. * అతఁడు కొంచెముగనే

* శ్లక్ష్ణాక్షరతనుః శ్రీమాన్ భవేచ్ఛాస్త్రవిశారదః । ఆపద్ద్వారేషు యుక్తస్స్యాత్ జలప్రస్రవణేష్వివ । శైలవర్షోదకానీవ ద్విజాన్ సిద్ధాన్ సమాశ్రయేత్ । అర్థకామశ్శిఖాం రాజా కుర్యాద్ధర్మధ్వజోపమామ్ ॥ నిత్యముద్యతదండస్స్యా దాచారే చాప్రమాదవాన్ । లోకే చాయవ్యయౌ దృష్ట్వా బృహద్వృక్షమి వాస్రవత్' ఈ ప్రకరణమందు రాజు వృత్తములు మయూరవృత్తములతోఁ బెక్కులుపోల్చి చెప్పునట్లు చూపట్టుచున్నది. కాన యిట యాయా వ్యాఖ్యాతలు వేఱువేఱువిధముల నర్థములు వ్రాసియున్నను నన్నియు మయూర సాదృశ్యయుక్తముగా నుండున ట్లర్థమె వ్యాసహృదయముగాఁదోఁచుచున్నది. ఎట్లనఁగా - నెమలి కొంచముగను మధురముగను గూయునట్లు రాజు గొంచెముగను దయగను మాటలాడుచు సిరిగులుకుచు నుండవలయును. నెమలి సెలయేళ్లయెడ నెచ్చరికగలిగి యుండునట్లు రాజు నాపద్ద్వారములందు జాగ్రత్తగలిగియుండవలయును. అదికొండయందలి వర్ష జలముల నాశ్రయించినట్లు రాజు

మాటాడవలయును. ఆ కొంచెమును దీయగా నుండవలయును. అతఁడు సిరిగులుకు రేకలుగలిగి శాస్త్రములం దాటితేటియు నుండవలయును. మనుష్యులు చెఱువునుండి నీరువచ్చు తూము కాలువలయందు (నవి మితి మీఱి తమపొలములను నిండ్లను ముంచకుండునట్లుగా) నెచ్చరిక గలిగియుండునట్లు, రాజు తనకా పదలు వచ్చుద్వారములందుఁ గనుగలిగి యుండవలయును. జనులు కొండలనుండి వర్షజలములు క్రొత్తగా వెల్లి గొన్న నదులను నాశ్రయించునట్లు రాజు సిద్ధినిబొందిన బ్రాహ్మణుల నాశ్రయింపవలయును. ధనమును సేకరింపఁగోరు రాజు, పయికి ధర్మచిహ్నములను ధరించు కపటులు తలయందు శిఖ పెంచుకొనునట్లు తాను గపటవేషము నూఁదవలయును. రా జెప్పుడును దండమును జేతనెత్తికొని యుండవలయును. ఆచారములందుఁ బ్రమాదము నొందరాదు. రా జా ప్రజలకుఁ గలయాదాయమును వ్యయమును ముందుఁ బరిశీలించి కనుఁగొని పెద్దపెరిఁగిన తాటిమ్రాన నుండి రసమును దీయునట్లు వారివలనఁ దగ వెఱింగి

---

సిద్ధులగు బ్రాహ్మణుల నాశ్రయింపవలయును. అది తలయందు వేసమునకై జుట్టుం దాల్చి యుండునట్లు ధర్మవేషమునకైన చిహ్నమును దాల్పవలయును. ఎప్పుడును నది కొయ్యను (దండయష్టి) నెక్కి యుండునట్లు రాజు దండము నెప్పుడును దాల్చి పరాకుపడకుండ వలయును. 'లోకేచాయవ్యయౌ దృష్ట్వా వృక్షాద్వృక్షమి వాప్రజేత్' అని పాఠాంతరము. ఇది నెమిలి కనుగుణముగా అర్థమును గలిగియున్నది. నెమలి యొకచెట్టునుండి మేలయిన మఱియొకచెట్టునకు బోవునట్లు రా జాయవ్యయములను జూచి తక్కువ వ్యయముగల కార్యమునకుఁ బూనవలయు నని యర్థము.

పన్ను దీసికొనవలయును. * రాజు తనకూటువవారిని దనయాజ్ఞ యందు మెలఁగించుచును, శత్రువు పంటలను దనసేన గుఱ్ఱముల త్రొక్కుడులచేఁ జెల్లాచెదరు గావించుచుఁ, దనకు బక్షము (సహాయము) బలమయినపుడు శత్రువులపయికిఁ బోవుచునుండవలయును. తనయందుఁగల వికలత్వములనెల్లఁ గనుఁగొనుచుండవలయును. అతఁడు శత్రువుల దోషములను వెలిపుచ్చవలయును. వారిపక్షము వారినెల్లఁ గ్రిందుపఱుప వలయును. అడవినుండి పువ్వులనుంబోలె బయటనుండె ధనములను సంతరించుచుండ వలయును.† కొండలవలెమిక్కిలి యున్నతినొంది పెంపుసొంపారు

* 'అజ్ఞావాన్ స్యాత్ స్వయూథ్యేషు భౌమాని చరణైః కిరన్ జాతపక్షః పరిస్పన్దేత్ ప్రేక్షేద్వైకల్యమాత్మనః' నెమలి తనకదుపులయందుఁ జెల్లుబడిగలిగి భూమియందుఁ గాలితో గ్రుమ్మరుచు (పక్షులు) ఱెక్కలు మొలవఁగానే పయికెగురుచు తనవైకల్యమును (గోప్యస్థానమును) జూపునట్లును, రాజు తనవర్గములందాజ్ఞగలిగి శత్రువులపంటలను గుఱ్ఱముల కాలం జమరుచు పక్షము (సహాయము) రాఁగానే పయినెత్తుచు దనవికలతను గనుఁగొనుచు నుండవలయును.

† ఉచ్ఛ్రితాన్నాశ్రయేత్ స్ఫీతాన్ నరేంద్రా నచలోపమాన్ । శ్రయేచ్ఛాయామవిజ్ఞాతం గుప్తంశరణ మాశ్రయేత్' అని మూలము. ఉచ్ఛ్రిత న్నాశ్రయేత్ ... శ్రయేచ్ఛాయామివ జ్ఞాతిం గుప్తంశరిణ మాశ్రయేత్' అని దా. మూలము. నెమలి తనతోఁకచేతనే కాకి మొదలయినవాని కొఱఁత తోఁపించునట్లు రాజు తనస్ఫూర్తిచేతనే శత్రువుల కొఱఁతలు వెలియగునట్లు చేయవలయును. దా. మూలపాఠమున నెమలి పొడవయిన పర్వతముల నాశ్రయించినట్లు ఉన్నతులై వర్ధిల్లియుండు శత్రువుల నాశ్రయింపవలయును. నెమలి బడలినపుడు నీడ నాశ్రయించినట్లు పెంపుగుండిన కాలమందు జ్ఞాతిని నాశ్రయింపవలయును. నెమలి వేసవికాలమందు చెట్టునందుఁ బదిలముగా మఱఁగి కాచుకొనునట్లు రాజు రహస్యముగా గుప్తినిగావించుకొనవలయుననియర్థము

చుండు మేటి శత్రురాజులను, దెలియరాని కందువపట్టుల నాశ్రయించియు, పదిలమయిన పట్టులందుఁ బొంచియుండియు, నాశము సేయవలయును. * నెమిలి వర్షాకాలమందుంబోలె రాజు రాత్రియందుఁ దన విడిదిపట్టును, వేఱొక్కరును లేకయు నెవ్వరికిని దెలియకయు నుండునట్లు ప్రవేశింపవలయును. నెమిలివలె నేయతఁడు తన మందిరములో నిశలందుఁ జెలువల పొత్తుగూడి విహరింపవలయును కవచమును విడిచియుండరాదు. తన్నుఁ దానే రక్షించుకొనుచుఁ (నెమిలి తానుతిరుగు చోటులందు వైచినవలలను దొలఁగఁ బుచ్చుకొనునట్లు) చారులు చూపెడి చోట్లఁ గపటముగా వైచియున్న పాశములను వర్జింపవలయును. తన శత్రువులచారులను వశము గావించుకొనవలయును. వారలు పట్టువడినచో నాశము సేయవలయును. ఇట్లు నెమిలి ధర్మముచొప్పున నెప్పుడును వర్తించునది. విషమును గోపమును వంకరగతియుఁ గలపాములను జంపునట్లు మిక్కిలి విషము గలవారును గోపముగలవారును వక్రమగు నడవడిగలవారునగు శత్రువులను జంపవలయును. నెమిలి, పురువు మొదలయిన వానికి రోయకుండునట్లు, కుచ్చింపఁదగినవాని యెడ నసూయపడరాదు. నెమిలి బలువయిన పక్షములను బడసియుండునట్లు దిటవయిన మూలము గలమంత్రులు మొదలయిన పక్షమువారిని బట్టు కొలిపికొనవలయును. నెమిలి యెప్పుడుగాని తనపక్షములను నిచ్చచొప్పున విరివిగాఁ జేసికొనునట్లు తనపక్షపువారిని బర్వఁ జేయుమేలికార్యము నాచరింపవలయును. అన్నిచోటులనుండి

* 'ప్రావృషీ వాసితగ్రీవో మాద్యేత నిశి నిర్జనే' అని మూలము. అసితగ్రీవ మనఁగా నెమిలి-నీలకంఠమునకుఁ బర్యాయము.

యుఁ బ్రజ్ఞను బడయవలయును. మిడుతలగుంపు లడవులందుఁ బడి యాకులేకుండఁ జేయునట్లు, ఒక్కటిగాఁగూడి శత్రురాజ్యములపయి దండు వెడలవలయును. రాజిట్లు నెమిలివలెఁ దన రాజ్యమును బరిపాలింపవలయును. సమర్థుండగు రాజు తనకు నెంతయు బుద్ధిని గలిగించునట్టి నీతిని జెల్లింపవలయును. తన బుద్ధిచేతఁ దన్నడంచుకొని పరబుద్ధిచేత విచారముచేసి నిర్ణయించుకొనవలయును. శాస్త్రములచేత సంస్కరింపఁబడిన యాబుద్ధినిగొని యొకఁడు తన కార్యగుణమును నేర్పఱచుకొనవలయును. దీనియందే శాస్త్రములపస యున్నది. శత్రువును సామముచేత నమ్మింపవలయును. తనశక్తిని సయితము చూపవలయును. తన యాలోచనముచేతఁ గార్యనిశ్చయమును దనబుద్ధిచేత నందులకుఁదగిన యాలోచనమును జేయవలయును. సామోపాయమందు మతి గలప్రాజ్ఞుఁడు కార్యాకార్యములను వివేచించి నడపనేర్చును. లోఁతయినబుద్ధిగలధీరునకు నుపదేశింపవలసినది లేదు. ప్రాజ్ఞుండగు నతఁడు బుద్ధియందు బృహస్పతిని బోలినవాఁడయినను గొఱమాలిన ముచ్చట యగు బుద్ధిమాలిన వాదమును మాటాడునేని పరుని యుక్తివాదముచేత, కాఁచఁబడిన యినుము నీరు దగిలి చల్లఁబడునట్లు, తన యెప్పటి ప్రతిభదూలినవాఁ డగును. రాజు తన కార్యములనుగాని పరుల కార్యములనుగాని యాగమములం దుపదేశింపఁబడిన రీతుల చొప్పునఁ జేసికొనవలయును. ధనము నార్జించు విధులను దెలిసినరాజు మృదువుగను క్రూరుఁడుగను బ్రాజ్ఞుఁడుగను శూరుఁడుగను నుండువానిని జక్కఁగా మాటాడునట్టితక్కుఁగలవారినిని దన కార్యములందు నియోగింపవలయును.

రాజు తాను జక్కఁ జూచుచుండక పోయినను దమతమ కను రూపములయిన కార్యములందు నియుక్తులయి యుండువారిని నిడుద లయిన వీణాతంతి స్వరములనుంబోలె ననువర్తింపవల యును. ధర్మములకు విరోధము లేకుండునట్లుగా వారికిఁ బ్రియ మాచరింపవలయును. 'ఈలోకము నాది'యని తలఁచు రాజు వ్యవహారమును గలరూపునఁ దెలిసికొని, సూర్యుఁడు నిడుద లయిన తనకిరణములంబోలె, ప్రియా ప్రియములను సమముగాఁ జేసికొని కొండవలె దిటగానిలిచి ధర్మమునే రక్షింపవలయు. లేక యేరాజును నందఱును 'నితఁడు నావాఁడు' అని భావిం తురో యట్టిరాజు పర్వతమువలెఁ జలింపకుండును. వాది ప్రతివాదు లకువ్యవహారమును జక్కఁ బెట్టుటకుఁ బూనినపుడు రాజు ప్రియు లనియు నప్రియులనియు భేదముచేయక యిరుతెగలను సూ ర్యుఁడు తన కిరణములంబోలె సమముగాఁ జూచుచు ధర్మమునే నిలఁబెట్టవలయును. రాజు తన కార్యము లన్నింటియందును నాయా దేశములను వారివారి ప్రకృతులను నాయా కులము లను దెలిసినవారును, మృదువుగాఁ బలుకువారును, నడివయసు వారును,దోషము లేనివారును,హితము సేయుటయందే యాసక్తి గలవారును, అన్నిటియందు బనుపడి యాఱి తేఱినవారును, పేరాస లేనివారును, జదువరులును, అడఁకువ గలవారును, ధర్మ మునందు నిలుకడగలవారును, సమస్తకార్యములను రక్షించు నట్టివారు నగుపురుషులను నియమింపవలయును. ఈ ప్రకారమున రాజు చారులను మున్నిడికొని వారు చెప్పినచొప్పున నాయాకా ర్యములు జరుగురీతులును వానికిఁ దుదగలుగు ఫలములును దెలిసి కొని మిక్కిలి జాగరూకతతో వాని ననుష్ఠించి సంతుష్టి నొంద

వలయును. రాజు వ్యర్థకోపమును సంతోషమును బొందక యు తానే యొక్కొక్క కార్యమును జక్కఁజూచుకొనుచును, బొక్క సములు (అనఁగా నాదాయవ్యయములను) తనకన్నారఁ బరికిం చుచును నుండునో యతనికి భూమి సకలధనములను నిచ్చుచుం డును. ఏ రాజు తనయధికారులకును బ్రజలకును, వారేదేని మంచి చేసినచోఁ బ్రకటముగా వారిని సమ్మానించునో, దండింపఁదగిన వారిని శాస్త్రోక్తప్రకారమున దండించునో, తన్నుఁదాను రక్షిం చుకొనుచును రాజ్యములను గీళ్లనుండి గాచుచుండునో,యతఁడే రాజధర్మములను దెలిసినవాఁడగును. సూర్యుఁడు తనకిరణము లను గ్రిందనున్న యన్నింటియందును బ్రసరింపఁజేయునట్లు రాజు తనరాజ్యమును దానే యెప్పుడును జూచుకొనుచు బుద్ధిచేతఁ దన చారులను ననుచరులను బరామర్శించు చుండవలయును, రాజు కాలమెఱిఁగి ప్రజలవలనఁ బన్ను పుచ్చుకొనవలయును. తాను జేయునదొక్కటి సూచింపరాదు. బుద్ధిమంతుఁ డగువాఁడావును నొక్కపెట్టునఁగాక నాఁడునాఁటికిఁ బిదుకుకొనునట్లు రాజును భూమిని నాఁడునాఁటికిఁ బిదుకుకొనవలయును. తుమ్మెద పువ్వుల నుండి తేనియను గూర్చుకొను క్రమముననే రాజును,ధనమును కొంచెముకొంచెముగాఁ దీసికొనుచు గూర్చి పెట్టవలయును. కొంతధనమును బదిలముగా నెత్తిపెట్టి మిగిలినదానిని రాజు ధర్మములుచేయుటకును గామము లనుభవించుటకును వెచ్చింప వలయును. శాస్త్రవిధులను దెలిసిన బుద్ధిమంతుఁ డగు రాజు కూర్చిపెట్టిన మొదలు ధనమునుండి వెచ్చము సేయరాదు. ధన మును దేనినిగాని కొంచె మని నిరాకరింపరాదు. పగవాఁడు దుర్బలుఁడని యవమానింపరాదు. అతఁడు తనబుద్ధిచేతఁ దన్నుఁ

బరిశీలించుకొను చుండవలయును. బుద్ధిలేని వారియందు నమ్మక మునుంపరాదు. నిలుకడయు, సమర్థతయు, తన్నుఁ దానడంచు కొనుటయు, బుద్ధియు, ఆరోగ్యమును, వికారపడకుండుటయు, శూరత్వమును, దేశకాలములందుఁ గనుగలిగియుండుటయు ననెడి యీయెనిమిదియు ధనము స్వల్పమయినను నధిక మయినను వెచ్చు పెరుఁగునట్లు చేయును. రవ్వంతయగ్గి, నేయిపోసినచో పెద్దమంటగా మండును. ఒక చిన్నవిత్తు వేల కొలఁది వృక్షము లగును. రాజు తనయాదాయమును వెచ్చ మును మిక్కిలి విపులములని విన్నను వానినిబట్టి యల్పములగు ధనములను నలక్ష్యము సేయరాదు. శత్రువు, బాలుఁడయినను, వయసుకాఁడయినను, ముదుకఁడయినను, బరాకుపడియున్న వానిని జంపనేర్చును. కొఱమాలిన శత్రువయినను గాలమును దోడ్పాటుచేసికొని రాజును వేరతోఁగూడఁ బెకల్ప నేర్చును. కాఁబట్టి కాలమును గనుఁగొనురాజే రాజులందు మిక్కిలియు శ్రేష్ఠుఁడు. శత్రువు బలవంతుఁడయినను, దుర్బలుఁడయినను, దుష్టుఁడగునేని యొకరాజుకీర్తిని శీఘ్రముగా నాశముసేయఁ గూడును; అతనిధర్మమును నడ్డగింపఁగూడును; అతని ధనమునకు విఘ్నము సేయఁగూడును; అతనిబలిమిని నాశము సేయఁగూడును. కాఁబట్టి రాజు తనకు శత్రువుగలఁడేని మనసు కుదురుగానుంచు కొని వానివలనఁ బరాకు పడకుండవలయును. బుద్ధిమంతుఁడగు రాజు సంపదనుగాని జయమునుగాని కోరినచో, యతఁడు తన వ్యయమును వచ్చుబడిని గూడఁబెట్టిన ధనమును బరిపాలనమును జూచుకొని శత్రువుతో సంధిగాని యుద్ధముగాని చేయవల యును. ఈ కారణమునుబట్టి రాజు బుద్ధిమంతుఁ డగు మంత్రి

తోడు నాశ్రయింపవలయును. చక్కఁగాఁ బ్రకాశించుచున్న బుద్ధి యెట్టి బలవంతుఁడగు శత్రువునైనను జంపును. బుద్ధిచేతఁ బెరుఁగుచున్న బలమును బాలింపవచ్చును. వర్ధిలుచున్న శత్రువును బుద్ధితోడ్పాటుచేత దుర్బలునిఁ గావింపవచ్చును. కాఁబట్టి యొక్కొక కార్యమును బుద్ధిని మున్నిడికొని గావించినచో మిక్కిలి కొనియాడఁదగినదగును. రాజు ధీరుఁడును దోషహీనుఁడునగునేని, యతఁడు గోరినచో, మిక్కిలి యల్పమయిన సేన చేతనే తనకామములన్నియు నొడఁగూర్చుకొనవచ్చును. అయిన నతఁడు స్వార్థపరు లయినయిచ్చకపువాండ్రను జుట్టును జేర్చుకొని యుండునేని యల్పమయిన శ్రేయమునుగూడఁ బూరించుకొనఁ జాలఁడు. ఈ కారణములనుబట్టి రాజు ప్రజలనుండి మిక్కిలి మెలపువఁ బన్నుఁ బుచ్చుకొనుచుండవలయును. అతఁడు దీర్ఘకాలము ప్రజలను బీడించుచుండెనేని, * క్షణముసేపు మెఱసి మాయమగు మెఱపుఁదీఁగవలెనే యతనిసంపద సమూలముగా నశించును. విద్యను, తపమును, విపులమయిన ధనమునంతయుఁ బూనికచేతఁ బడయ శక్యమగును. అది దేహధారులయందు బుద్ధిననుసరించి యుండును. కాఁబట్టి పూనిక గొప్పదియని తెలిసికొనవలయును. ఈదేహమందు బుద్ధిగలవారును గొప్పమనస్సు గల

* ఇట 'రాజు ప్రాణులయందు నెయ్యముగలవాఁడై సమస్తప్రజలవలనను సంపదకు మూలమయినధనమును బుచ్చుకొనవలయును. చాలఁగాలము బీడింపఁబడుచున్నను శక్తికిఁదగునట్లు ధనమునుగడించు ప్రయత్నముతోఁ గూడియుండవలయును' అని దాక్షిణాత్యపాఠము. 'తస్మాద్రాజా ప్రగృహీతః ప్రజాసు । మూలం లక్ష్మ్యాః సర్వశో హ్యాదదీత । దీర్ఘంకాలంవ్యాపి సంపీడ్యమానో । వృష్యాత్సంపద్వ్యవసాయేన శక్త్యా' అని దాక్షిణాత్యమూలము.

వారును నగు నింద్రుఁడు, విష్ణువు, సరస్వతియు, భూతములు నెప్పుడును వాసముచేయుచున్నవి. కావఁబట్టి తెలివిగలవాఁడు (ప్రాణికమూలి) దేహము నవమానింపరాదు. పేరాసగలవానిని నెడతెగక దానములిచ్చి లోపఱుచుకొనవలయును. పేరాసగల వాఁడు పరునిధనమును బొందినను దనివి నొందఁడు. పుణ్యఫల మయిన భోగమందు నెల్లవారికి నాసయుండును. ఎవనికి ధన ములేదో వాఁడు (ధనమువలనఁ బడయఁదగిన) ధర్మమును గామ మును బడయఁజాలఁడు. పేరాసగలవాఁడు, ఐశ్వర్యమును బడసి యుండినను బరులధనమును భోగమును బుత్రులను భార్యలను నన్నిటిని గోరును. ఆశగలవానియం దన్నిదోషములునుండును. కాఁబట్టి రాజు పేరాసగలవానిని జేర్చుకొనరాదు. తక్కువ వానినిగూడఁ దాను దనంతటఁ బరిశీలించి పనియందు నేర్పఱుప వలయును. ప్రాజ్ఞుఁ డగువాఁడు పగవాని ప్రాణికలను, సమస్తము లయిన ప్రయోజనములను నాశము సేయవలయును. పాండు కుమారా! కులీనుండును నాప్తుండు నగునేగాఁ ధర్మయుక్త లును జ్ఞానవంతులు నగు బ్రాహ్మణులవలన నుపదేశమునొందఁ గోరునో, మఱి మంత్రులచేత రక్షితుండగునో యట్టిరాజు,తన రాష్ట్రమందలి ముఖ్యులనెల్లఁ దనపక్షమున నిలఁబెట్టుటకుఁ జాలి నవాఁడగును. రాజా! నీకు శాస్త్రప్రోక్తములయిన ధర్మముల నెల్ల సంగ్రహముగాఁ జెప్పితిని. వానిని బుద్ధిచేతఁ దెలిసి కొనుము. ఏరాజు ధర్మముల ననుసరించి కార్యములను గావిం చునో, యతఁడు భూమిని బరిపాలింప శక్తుఁడగును. ఏరాజు నీతిపద్ధతివలనఁ గలుగు సుఖమును బాటింపక యలవ్రాకగాఁ గలుగుసుఖమును వెదకుచున్నాఁడో యతఁడు రాజ్యమువలని

యుత్తమసుఖమును బడయకుండుటయే కాక పరలోకసుఖమును బడయఁజాలఁడు. ధనవంతులును, మతిచేతను శీలముచేతను బూజితులును, గుణసంపన్నులును, యుద్ధమందుఁ బరాక్రమము జూపినవారును, సంధి విగ్రహాదులయిన యాఱుగుణములందు నెచ్చరికగలవారును, బ్రయత్నశీలురునయిన శత్రువులను బరాకు లేకుండునట్టివాఁడు కనుగలిగియుండి శీఘ్రముననే చంపును. * పలువిధములయిన కార్యములందును నుపాయములను జూడవలయును. ఉపాయములేకయె బుద్ధిని జెల్లింపరాదు. దోషములు లేనివారియందును దోషములు చూచునట్టిమనుష్యుఁడుత్తమమయిన సంపదను, వెనుకీర్తిని, ధనమును బడయ నేరఁడు. స్నేహితు లిరువురయందుఁగల ప్రేమమును, నొక్క కార్యమందు వా రెంతంత చేసినదియుఁ దెలిసి విచారించి వారియం దేమిత్రుఁడు వెనుభారము దాల్పఁదగునో వానినే యుత్తమస్నేహితు నిఁగాఁ బ్రాజ్ఞుఁడు చెప్పవలయును. నేను జెప్పిన యీరాజధర్మముల ననుష్ఠింపుము. మనుష్యులను రక్షించుటయందు మతి నుంపుము. సుఖముగా నాపుణ్యములవలని ఫలమును బడయుదువు. రాజా ! జగమునకంతటికిని ధర్మమే మూలముసుమీ' యనెను. ఇది నూటయిరువదియవయధ్యాయము.

---

* పలువిధములయిన కార్యములను బరికించి యుండుటవలన నుపాయములను దెలిసికొనవలయును. ఉపాయము లేక పట్టుదైవమునందే బుద్ధి నూనరాదు' అని యాశయము.

## రాజధర్మపర్వము.

### భీష్ముఁడు యుధిష్ఠిరునకు దండస్వరూపము మొదలగువానిని జెప్పుట.

ధర్మరాజు 'పితామహా! సనాతమయినరాజధర్మము నీవిపుడు చెప్పి ముగించితివి. నీవు చెప్పినదానినిబట్టి దండమె యన్నిటికంటె గొప్పదనియు నన్నింటికి నీశ్వరుఁడనియుఁ దోఁచుచున్నది. ఏలన దండమందే సర్వము నెలకొనియున్నది. ప్రభూ! దేవతలు, ఋషులు, మహాత్ములయిన పితరులు, యక్షులు, రాక్షసులు, పిశాచులు, విశేషించి మనుష్యులు, మఱియు లోకమందుఁ బక్షులు మొదలుగాఁ దక్కువ యోనులందుఁ గలసకల ప్రాణులనీనెడివానికన్నిటికిని, మఱియుఁ దక్కినవానికన్నిటికిని మహాతేజంబగు దండమే యెక్కుడయని నీవు చెప్పితివి. చరాచరములతోడను సురాసురమనుష్యులతోడను గూడిన లోకమంతయు దండమునకు లోనైయుండుట చూచువారికెల్లఁ దెలియుచున్నది. భరతసింహమా! కాఁబట్టి నేను దీనినిగలరూపునఁ దెలియఁగోరుచున్నాను. దండమనఁగా నెద్ది? దాని రూపమేమి? దాని ముఖ్యగతియేమి? దేనితోఁ జేయఁబడినది? ఎక్కడనుండి పుట్టినది? దాని లక్షణములెవ్వి? అదియెట్లు ప్రభువగును? ప్రజలయందు విహితరూపమై యది యెట్లు మేలుకొని (పాలించుచు) న్నది? ఏది మునుపును వెనుకను (అనఁగా నెప్పుడును) లోకమును బాలించుచు మేలుకొనియున్నది. ఏది యన్నిటికి మునుపటిదిగాఁ దెలియుచున్నది. దండ మనఁబడు మేటి యెవరు? దండము దేనియం దూఁదియున్నది. దానిగతియేమి?' అని యడిగెను.

భీష్ముఁడు 'కురునందనా ! దండ మనఁగా నేమియో యది వ్యవహారమనియు నెట్లు చెప్పఁబడునో చెప్పెదను; వినుము. ఈలోకమందన్నియు దేనికి లోనై యున్నదో యదియే దండమనఁబడును. మహారాజా ! ధర్మమును జక్కఁగా నిలఁబెట్టునదే దండము. అది వ్యవహారమనియుఁ గొన్నియెడలఁ జెప్పఁబడును. లోకములందు నజాగ్రత్తలేకుండు బుద్ధిగలవారు, ధర్మమునకు లోపము రాకుండునట్లు చేయుపద్ధతి యేదియో యదియే * 'వ్యవహారము' అనుపదమునకు ముఖ్యమయిన యర్థముగా గ్రహింపఁబడుచున్నది. రాజా ! మనువు మొట్టమొదట నీతత్త్వమును జెప్పెను. అది యేదనఁగా—'ఎవఁడు ప్రియులందు నప్రియులందును సమమయిన బుద్ధిగలిగి పక్షపాతము లేక దండమును జక్కఁగా జరుపుచుఁ బ్రజలను జక్కఁగా రక్షించునో యతఁడు కేవలధర్మమే కాని వేఱుగాదు'—అనియే. నేనుజెప్పినట్లు యీ వచనమును మనువు పూర్వమే చెప్పియున్నాఁడు. ఇది వసిష్ఠుఁడు చెప్పిన బ్రహ్మదేవుని మహావచనము నగును. మునుపె యిట్టివచనము చెప్పఁబడియుండుటవలన దీనిని 'ప్రాగ్వచనము' (మొట్టమొదటి మాట) యని తెలియుదురు. మఱియు దండమువలననే పరులధనమును నపహరించుట లేకుండఁ జేయుటచే నాదండము వ్యవహార మనుపేరను బిలువఁబడున దయ్యెను. ధర్మార్థకామములను త్రివర్గమును, ఆదండమును జక్కఁగా జరుపుటవలననే యెపుడును బ్రవర్తించుచుండును. దండమును జక్కఁగాఁ జెల్లింపనిచో నామూఁడును గొనసాగవు. దండము పరమదైవము.

---

* 'వ్యవహారః' 'వి+అవహారః-అపహారః'=దుర్మార్గమున నితరులధనము నపహరించుట, వి=లేదని వ్యుత్పత్తి.

అది రూపమున జ్వలించుచున్న యగ్నివలెఁ జూపట్టును. అది నల్లగలువ రేకులవలె నల్లగానుండును. దానికి *నాలుగు కోఱలును †నాలుగు భుజములు ‡నెనిమిదిపాదములును §రెక్కెకన్నులును

* మానభంగము, ధనాపహరణము, శరీరదండము, వధము అను నాలుగు ప్రాణిహింసాసాధనములే నాలుగు కోఱలనఁబడును.

† బాహువులనఁగా ధనమునుదీసికొను సాధనములు—1. ప్రజలవలనను సామంతరాజులవలనను పన్నుదీయుట. 2. అబద్ధమాడినవానికి వాఁడుచెప్పిన ధనమునకు రెండింతలపరాధము విధించుట. 3. అసత్య మాడు ప్రతివాదికి సమమయిన ధనమును దండుగ విధించుట. 4. ధనవంతుఁడును లోభియునగు బ్రాహ్మణునియొద్దనుండి ధనమునంతయు నాక్రమించుట యనెడి నాలుగు.

‡ ఇట పాదములనఁగా సంచరించుటకు సాధనములయినవి— అవి 1. ఆవేదనము (సంతకము చేసి వాదాడుట) 2. భాష (ప్రతివాదిని బిలిచి వానిముంగలనన్నె బ్రాఁయుంచుట) 3. సంప్రతిపత్తి (వాదవ్యవహారమును బ్రతివాది యొప్పుకొన్న యెడల నొక్కరికిని దండుగ విధింపక సమాధానము చేయుట.) 4. మిథ్యోత్తరము (వాదియభియోగము మిథ్యయని చెప్పుట.) 5. కారణోత్తరము (వాదిచెప్పినట్లు జరిగినదివాస్తవమే కాని యదిమరల నిచ్చివేసెనని ప్రతివాది చెప్పుట) 6. ప్రాఙ్న్యాయము (ఈవిషయమునే యింతకుముందు నీఁడు నన్నడిగి యపజయమునొందినాఁడని ప్రతివాది చెప్పుట) 7. ప్రతిభువు (ఈ మూఁడుత్తరములకును వాదిప్రతివాదులు చేసిన యావల సపూఁటచీటి) 8. క్రియ (వారివారిపక్షములకు గలయు సాక్షి, పత్రము, అనుభోగము, ప్రమాణము మొదలగువానిని జూపుట) 9. ఫలసిద్ధి (దానినుండి తప్పకుండువానికి జయము) వీని యందు సంప్రతిపత్తి యనుమూఁడవవానియందు దండను విధించుటకుఁ గారణములేనందునఁ దక్కినవెనిమిదియు దండమునకుఁ బాదములని చెప్పఁబడుచున్నవి

§ 'రాజు, అమాత్యుఁడు, పురోహితుఁడు, పరిషత్తు' అనెడి నాలుగు దండమునకుఁ గన్నులగును.

గలిగియుండును. దాని చెవులు శంకువులవలె నుండును. దాని వెండ్రుకలు నిట్టనిలిచియుండును. అది * జటలుగలిగి రెండునాలుకలతోఁ గూడియుండును. దాని మొగము రాగివలె నెఱ్ఱనై యుండును. అది సింహపుఁజర్మమును దొడిగియుండును. దండ మిట్లుగ్రరూపమును దాల్చి యెప్పుడును దారసింప రాకుండును. అది మరల కత్తి, విల్లు, గద, శక్తి, త్రిశూలము, ముద్గరము, బాణము, ముసలము, పరశువు, చక్రము, ప్రాసము, దండము, ఋష్టి, తోమరము, మఱియుఁ గలయాయా యాయుధము లన్నింటిమూర్తులను దాల్చి యాయన్నియుఁ దానై లోకమున సంచరించుచుండును. దండము భేదించుచును, ఛేదించుచును. నొప్పించుచును, ద్రుంచుచును, చీల్చుచును, బ్రద్దలువాపుచును, కొట్టుచును, పఱుఁబడుచును నిట్లు చరించుచుండును. యుధిష్ఠిరా! దండమునకివి పేళ్లు. అసి, విశసనము, ధర్మము, తీక్ష్ణవర్మము దురాసదము, శ్రీగర్భము, విజయము, శాస్త, వ్యవహారము, ప్రజాగరము, శాస్త్రము, బ్రాహ్మణమంత్రము, ప్రవచనము, పరము, ధర్మపాలము, అక్షరము, కోపము, సత్యకము, నిత్యకము, గృహము, అసంగము, రుద్రతనయము, మనువు, జ్యేష్ఠము, శివంకరము, అనునవి. ఇవి దండమునకుఁ జెప్పఁబడుచున్నవి. దండము వ్యాపకుఁడును, యజ్ఞరూపియు, మాటిమాటికిఁ బెనురూపము దాల్చువాఁడును, మహాపురుషుఁడునయిన భగవంతుఁడు నారాయణుఁ

---

* పెక్కు సందేహములు గలుగుటచే జటగలది యనఁబడెను. ఒకటికొకటి సంబంధపడకుండు వాది ప్రతివాదుల రెండువిధములయిన వచనముల వలన రెండువిధములయిన నాలుకలుగలదానివలె నున్నదని యాశయము.

డనువానిని ప్రభువుగాఁ జెప్పఁబడుచున్నది. అట్లు లోకమును బరి పాలించు దండనీతి బ్రహ్మదేవుని పుత్రియనియు, లక్ష్మియనియు, నీతియనియు, సరస్వతియనియు జెప్పఁబడుచున్నది. దండము పెక్కు శరీరములు గలది. కురుకులతిలకా ! అర్థము అనర్థము, సుఖము దుఃఖము, ధర్మము అధర్మము, బలము అబలము, దౌర్భాగ్యము భాగధేయము, పుణ్యము పాపము, గుణము దోషము, కామము అకామము, క్షణము పగలు, రాత్రి, మాసము ఋతువు, ప్రమాదము అప్రమాదము, సంతో షము, శోకము, శమము, దమము, దైవము పురుషకారము, మోక్షము, బంధము, భయము, అభయము, హింస అహింస, తపము, యజ్ఞము, సమాధి, విషము అమృతము, ఆది, మధ్య ము, అంతము, కృతములగువాని విస్తరము, మదము, ప్రమో దము, దర్పము, డంభము, ధైర్యము, నయము అనయము, అశక్తి శక్తి, మానము, స్తంభము, వ్యయము, ఆయము, వినయము, విసర్గము, కాలము అకాలము, అనృతము, అజ్ఞత్వము, సత్యము, శ్రద్ధ అశ్రద్ధ, క్లీబత్వము, వ్యవసాయము, లాభము అలా భము, జయము అపజయము, తీక్ష్ణత్వము మృదుత్వము, అత్యు గ్రము, ఆగమము అనాగమము, విరోధము అవిరోధము, కార్యము అకార్యము, బలము అబలము అసూయ, అన సూయ, ధర్మము అధర్మము, సిగ్గు సిగ్గులేమి, హ్రీ, సంపత్తి, విపత్తి, తేజస్సు, కర్మములు, పాండిత్యము, వాక్శక్తి, బుద్ధిత త్త్వత (వీనిని గలరూపునఁ దెలిసికొనుట) అనియిట్లు దండము నకు పెక్కులురూపు లీలోకమందు వెలయుచున్నవి. ఈలోక మందు దండములేనిచో నొకరినొకరు గొట్టుకొనుచుందురు.

ధర్మరాజా! దండమువలని భయమువననే యొకరినొకరు కొట్టు కొనకున్నారు. రాజా! ఈలోకమందుఁ బ్రజలు ప్రతిదినమును దండముచేత రక్షితులై యేచుమిూ రాజును వర్ధిల్లఁజేసెదరు. కాఁబట్టి దండమే ముఖ్యగతి. రాజా! దండ మీలోకము నెప్పుడును ధర్మమార్గమున నెలకొలుపుచున్నది. సత్యమునం దూనిన దైనధర్మము బ్రాహ్మణులయం దున్నది. ద్విజశ్రేష్ఠులు ధర్మయుక్తులై * దేవతలతోఁ బాటిగాఁ జేర్చి లెక్కింపఁదగినవారగుదురు. దేవతలవలననుండి యాగముగలిగినది. యాగము దేవతలను సంతోషపెట్టుచున్నది. దేవతలును సంతుష్టులై లోకులను నిం ద్రునకు ొప్పగింతురు. ఇంద్రుఁడు నీ ప్రజల ననుగ్రహించు (ధాన్యాదులను బండించు వర్షముయూపమున) నన్నము నిచ్చుచున్నాఁడు. సమస్తభూతములప్రాణములును, అన్నమందే యెప్పుడు నెలకొనియున్నవి. దానివలనఁ బ్రజలు గుదుకుకొనుచున్నారు. దండము (క్షత్రియరాజరూపమున) నాప్రజయందు మేలుకొనియున్నది. ఇట్టి ప్రయోజనముగల దండము క్షత్రియరూపమునొంది ప్రజలను రక్షించుచు, నెప్పుడును మిక్కిలి యెచ్చరికగలదై నాశము లేనిదై మేలుకొనియున్నది. అది యీశ్వరుఁడు, పురుషుఁడు, ప్రాణము, సత్త్వము, వృత్తము, ప్రజాపతి, భూతాత్ముఁడు, జీవుఁడు ననెడి యీయెనిమిది నామములచేఁ జెప్పఁబడుచున్నది. ఈశ్వరుఁడు (సేనారూపమగు) బలముతోఁగూడిన వాఁడును, (ధర్మము, వ్యవహారము, దండము, ఈశ్వరుఁడు, జీవుడనెడి) యైదింటిచేత నయినవాఁడు నగు రాజునకు నైశ్వర్యమును దండమును రెంటిని నొసంగెను. యుధిష్ఠిరా! అతనికిఁ

* 'దేవయుక్తాః' అని పాఠము. 'వేదయుక్తాః' అని ఔ. మూలము తెలియునది.

గులమును, మిక్కిలి ధనవంతులగు నమాత్యులును, ప్రజ్ఞయు, (శరీరము, బుద్ధి యింద్రియములనెడి వీని) బలములును, పూర్వోక్తములయిన యెనిమిది వస్తువులచేఁ గలిగింపఁబడు బలమును, మఱియు (కోశాదులవలనఁ గలుగు) నితరబలమును నావశ్యకములుగాఁ జెప్పఁబడియున్నవి. ఆబలము-గజములు, అశ్వములు, రథములు, పదాతులు, ఓడలు, బరువుమోయువారు, దేశమందలివారు, (అడవియందుఁగల) గొల్లలు ననెడి యెనిమిది యంగములు గలదిగాఁ జెప్పఁబడుచున్నది. మఱియు సన్నాహముతోఁ గూడిన సేనకు, రథికులును, నేనుఁగు రౌతులును, గుఱ్ఱపు రౌతులును, గాలుబంట్లును,మంత్రులును,వైద్యులును నంగములగును. భిక్షుకులును, ప్రాడ్వివాకులును (ముఖ్య న్యాయాధికారులును) జ్యోతిషికులును, శాంతికమారక కర్మములను జేయువారును, బొక్కసమును మిత్రులును ధాన్యమును మఱియుఁ దక్కిన సకలమైన యుపకరణములును రాజ్యమునకు దేహమగును. ఆదేహమునకు, అమాత్యుఁడు మొదలయిన యేడు ప్రకృతులును పూర్వోక్తములయిన యెనిమిదంగములు నుండును. దండమును రాజ్యమునకు బలీయమయిన యంగమగును. (సేనారూపమయిన) దండము రాజ్యమునకుఁ బుట్టుచోటు. అదికారణముగా నీశ్వరుఁడను గ్రహించి యెప్పుడును లోకమును రక్షించునట్టి దండమును రాజునకొసంగెను. సనాతన మయినయీ ప్రపంచమంతయు దండస్వరూపమే. రాజునకు దండమునకంటె మిక్కిలి పూజ్యమయినది లేదు. దండమువలననే ధర్మము రీతులు ప్రదర్శింపఁబడుచున్నవి. లోకమును రక్షించుకొఱకును వారివారి ధర్మములను నెలకొలుపుటకొఱకును బ్రహ్మదేవుఁడే దండము నేర్పఱి

చెను. బ్రహ్మవలననుండి పుట్టినవ్యవహారము మఱియొకటి గలదు. అందులకు వాది ప్రతివాదు లిరువురు కారణము. ఆవ్యవహారమునకు నాయిరువురలో నొకనియందు నమ్మికయుంచి (తీర్పు చేయుట) లక్షణముగా నుండుటంబట్టి యది హింసముతోఁ గూడినదై చూపట్టుచున్నది. మఱియొక విధమయిన వ్యవహారమును గలదు. అది వేదాత్మకమయినది. దానికి వేదము కారణమనియుఁ జెప్పఁబడుచున్నది. వ్యవహారము మూఁడవదియు మఱొకటి గలదు. అది కులాచారమును సంబంధించినది. మఱియు నది శాస్త్రముల ననుసరించినది. * వాదిప్రతివాదు లిరువురయం

---

* వ్యవహారమనఁగా నిప్పటి చట్టమని చెప్పవచ్చును. ఇచట మూఁడు విధములయిన వ్యవహారములు చెప్పఁబడినవి. మొదటిది సాధారణమయిన వ్యవహారము — అనఁగా చట్టము. దీనినిబట్టి వాదిప్రతివాదుల తగవులు తీర్పఁబడును. ఇందు సివిల్ క్రిమినల్ చట్టములు రెండు నడంగియున్నవి. దీనిని భర్తృప్రత్యయ లక్షణమని చెప్పఁబడును. ఇరుదెగలయం దొకరియందని నమ్మిక లక్షణముగాఁగలదియని యర్థము. ఒక వ్యాజ్యము వచ్చినపుడు రాజుగాని మఱే న్యాయాధికారిగాని సాక్ష్యమును విచారించి యిరుదెగ వారిలో నొకరియందు నమ్మకముంచి తీర్పుచెప్పును. దీనివలన విడుదలయో దండనమో కలుగును. ఈరెండుపక్షములకు నది దండరూపమే యగును రెండవ విధమగు వ్యవహారము వేదమునందలి విధియగును. శ్రుతిస్మృతులందు మనుష్యుని యాచారధర్మ మొక్కొక్కటిని గుఱించి విధింపఁబడియుండు విధానములే యివి యగును. మూఁడవదియగు వ్యవహారము కులములను లేక కుటుంబములను సంబంధించినది. ఇది కులాచారమనియుఁ జెప్పఁబడును. కులాచారము స్థాపితమైయున్న చట్టమునకు విరుద్ధముగాని, వేదవిధికిఁ బ్రతికూలముగాని, కాకున్నచో నదియు నంగీకారపాత్రమగును. భీష్ముఁడిచటఁ గులాచారము శ్రుతిస్మృతులకును బ్రతికూలమయినదిగాఁ దలఁపరాదని యభిప్రాయపడుట తెలియునది. (ప్రతాప చంద్రరాయలు)

దోకనియెడ నమ్మికయుంచి తీర్పుచేయుట లక్షణముగాఁ గలదని పూర్వము చెప్పఁబడినట్టి వ్యవహారము, రాజునందు నెలకొని యుండునదిగా మన మెఱుఁగవలయు. దానిని దండమనియుఁ బ్రత్యయమనియు (సాక్ష్యమందలి నమ్మకమనియు) రెండు పేళ్ల మనము తెలియవలయును. దండము ప్రత్యయము చేత నిర్వర్తింపఁబడుట చూపట్టుచున్నను దాని స్వరూపము వ్యవహారమనియె చెప్పఁబడుచున్నది. వ్యవహారమని చెప్పఁబడునది వేదవిషయాత్మకముగా నుండును. (అనఁగా వేద విధుల రూపముగా నుండును.) వ్యవహారమేది వేదము నుండి పుట్టినస్వరూపము గలదియో యది ధర్మమగును. అది ధర్మమునందు శ్రద్ధగలవారికి గుణమును (హితమును) గలిగించునది. కృతాత్ముఁ డగువాఁ డావ్యవహారమును * ధర్మమునుంబోలె వ్యవహరించి యున్నాఁడు. మూఁడవదియగు వ్యవహారము సయితము ప్రజలను రక్షించునది. అందులకును మూలము వేదమే. అది మూఁడులోకముల నుద్ధరించుచున్నది. అది సత్యస్వరూప మయినది ; ఐశ్వర్యమును బెంచునది. దండ మనునదియే సనాతనమయిన వ్యవహారమని మనము చూచితిమి. వ్యవహారమని చెప్పఁబడునదియే వేదము. వేదమనునదియే ధర్మము. ధర్మమనునదియే సత్పథము. ఈకడపటిదియే తొల్లి పితామహుండును బ్రజాపతియు నగు భగవంతుఁడు బ్రహ్మదేవుఁడుగా నుండెను. బ్రహ్మ సురాసురులతోడను మనుష్యులతోడను

* మనువు మొదలయినవారు ధర్మమునకుఁగూడ రాజులు జరుపునట్టి వ్యవహారము (చట్టము) వలెనే లోపడఁదగునని చెప్పియున్నారని యిచట భావము.

నురగులతోడను మఱియుఁ దక్కినవారితోడను గూడిన సకల లోకములకును గర్తచుమీ. కాఁబట్టి యతనివలననుండి భర్తృ ప్రత్యయలక్షణమగు (వాది ప్రతివాదులం దొకరివలన నమ్మికచే దీర్పు చెప్పుట లక్షణముగాఁ గలదగు) వ్యవహారము మనకు నుప్ప తిల్లినది. కాఁబట్టి యతఁడు వ్యవహారము నుద్దేశించి 'తనధర్మము చొప్పునఁ బాలించునట్టి రాజునకుఁ, దల్లిగాని తండ్రిగాని, తోఁబుట్టువుగాని, భార్యగాని, పురోహితుఁడుగాని, దండింపఁ దగని వారొక్కరును లేరు' అని నీనిని జెప్పెను' అనెను. ఇది నూటయిరువదియొకండవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

(భీష్ముఁడు ధర్మరాజునకు వసుహోమ మాంధాతల సంవాదమును జెప్పి దండోత్పత్తి మొదలగు వానిని దెలుపుట.)

భీష్ముఁడు 'ఈవిషయమందుఁ బురాతనమయిన యీయితిహాసము నుదాహరించెదరు. అంగదేశమందు వసుహోముఁ డని ప్రసిద్ధుఁడయిన యొకరాజుండెను. అతఁడు మిక్కిలి కాంతిమంతుఁడు. అతఁ డెప్పుడును ధర్మకార్యములు చేయుచుండువాఁడు. అతఁ డెప్పుడును సత్యము పలుకుచుండును. అతఁడు పత్నిం గూడి దేవర్షు లెప్పుడును సేవించుచుండు ముంజపృష్ఠమునకుఁ బోయెను. అచ్చట నతఁడా హిమవంతపు శిఖరమునందు వసతి గావించుకొనెను. రాముఁడు ముంజ మని యచటఁగల వృక్షము క్రింద జటలు దీయుటకు నాజ్ఞయిచ్చెను. అది మొదలుగా నాప్రదేశమును సంశితవ్రతులయిన ఋషులు ముంజపృష్ఠమని పేరి

డిరి. అందు రుద్రుఁ డుండును. శ్రుతి ప్రోక్తములయిన గుణములు వెక్కులుగల యారాజపు డాముంజపృష్ఠమున బ్రాహ్మణులయను మతిఁబడసి దేవర్షికి సాటిగా నుండెను. ఒకప్పు డచ్చటికి నుదార చిత్తుఁడును నింద్రునకు సఖుఁడు నగు మాంధాతయను రాజు వచ్చెను. అతఁడు వసుహోముని యొద్దకుఁబోయి యామహాతపస్విని జూచి వినయమున నిలుచుండెను. వసుహోముండును మాంధాతకు నర్ఘ్యమును మధుపర్కమునకుఁగాను బశువును నొసంగి యతనిరాజ్యము సప్తాంగములు కుశలమా, కుశలముగావా, యని యడిగెను. పిదప వసుహోముఁడు సజ్జనులు తొంటినుండి యాచరించు విధులను గలరూపున ననుసరించువాఁ డగుమాంధాతనుజూచి 'రాజా! నీకు నేనేమి చేయవలయును?' అని యడిగెను. మాంధాత యందులకు బరమప్రీతుండయి కూర్చుండి యున్న మహాప్రాజ్ఞుని వసుహోమునిఁ జూచి 'రాజా! నీవు బృహస్పతిమతము నంతయుఁ జదివియున్నావు రాజోత్తమా! అట్లె శుక్రుఁడు రచించినశాస్త్రమును నీకుఁ జక్కఁగాఁ దెలిసియున్నది. కాఁబట్టి దండమెట్లు పుట్టినదో వినఁగోరుచున్నాను. దండమునకు మును పేది మేలుకొనియుండును? దానికిఁ దుది యేమందురు? దండమెట్లు క్షత్రియుల నిపు డాశ్రయించినదయ్యె? నీవు దీనిని నాకుఁగలరూపునఁ జెప్పవలయును; నీకు గురుదక్షిణ నొసఁగెదను' అనెను.

వసుహోముఁడు 'రాజా! లోకము నుద్ధరించునట్టి దండమెట్లు పుట్టినదో వినుము. అది ధర్మమున కాత్మయైనది; సనాతనమైనది. అది ప్రజలను బాలించుటకును రక్షించుటకునై యేర్పడినది. సర్వలోకపితామహుం డగు భగవంతుఁడు బ్రహ్మదేవుఁడు

యాగముచేయఁగోరి తనకు సరియైనఋత్విజునిఁ గానఁడయ్యెనని మాకు వినికి. ఆదేవుఁడు పెక్కువర్షములు మనసునందు గర్భము దాల్చియుండెను. పిదప నాగర్భము వేయేండ్లు నిండఁగా నేయతఁడు తుమ్మునపుడు క్రిందఁబడెను. అది యరిందముఁ డగు క్షువుఁడను ప్రజాపతి యయ్యెను. ఆప్రజాపతి మహాత్ముఁ డయినయీబ్రహ్మ దేవుని యాగమందు ఋత్విక్కుగా నుండెను. రాజసత్తమా! బ్రహ్మదేవుని యాసత్రయాగము జరుగుచుండునపుడు, బ్రహ్మ, యాగమందు దీక్షితుఁడై యుండుటవలన నతఁ డపుడు శాంతుఁ డగు యజమానుని రూపమున మెలఁగు చుండుటఁబట్టి (యతని యుగ్రరూపమందు వసతిగలిగియుండిన) దండము (పట్టులేక) మఱుఁగయ్యెను. అది మఱుఁగుపడఁగానే ప్రాణులకు సంకరము (గజిబిజి) గలిగెను. అప్పుడేది చేయఁదగును; మఱేదిచేయ రాదు; భుజింపఁదగిన దేది భుజింపరాని దెద్ది; త్రాగఁదగున దేది యేది త్రాగరా దనెడిభేదము లేకపోయెను. సిద్ధ మెక్కడిది? జను లొకరినొకరు హింసించిరి. స్త్రీపురుషులం దెవరినెవరు పొందవచ్చును బొందరా దను కట్టుపాటు లడుగం టెను. ఒకటి యొకరి సొమ్మనునియతి పోయెను. కుక్కలు మాంసముల నాక్రమించుకొనునట్లు, జను లొకరి ధనముల నొక రపహరింపసాగిరి. బలవంతులు బలహీనులను జంపిరి. లోకము నందు మర్యాద కలుగదయ్యె. అంత బ్రహ్మ సనాతనుం డగు విష్ణునిఁబూజించి యతనితోడ * కేశవా! ఈ సమయమందు

---

*ఇచట నీలకంఠాదిపాఠములందు, కేశవా! యనియున్నది. అయిననతనికి విశేషణములు 'శూలవరాయుధ' అనియున్నది. దాక్షిణాత్య కోశములందు 'శంకర' అని పాఠమును దాని కనుగుణముగా రెండుమూఁడుశ్లోకము లధిక

నాయెడ ననుగ్రహింపఁదగును. ఇపుడు కలిగియున్న సంకరము మాయునట్లు గావింపుమీ' యని వేఁడెను. అంత మేటి శూలమును దాల్చిన యాభగవంతుఁడు విష్ణువా లోచించి తన్నుఁదానే దండముగా సృజించెను. ధర్మము పాదములుగాఁ గల యారూపముననుండి సరస్వతీదేవి దండనీతిని సృజించెను. అది వేగ త్రిలోకములందును ప్రసిద్ధికెక్కెను. ఈదండము పాపకారులందుఁ జెల్లింపఁబడుచున్నది. దండమును నయించు కారణమునంబట్టి యది దండనీతి యని యీలోకమునఁ జెప్పఁబడుచున్నది. (శూలధరుండయిన యాప్రభుఁడు మఱియుఁ జాలసేపు చింతించి దండనీతిని ప్రయోగించువారికి సర్వవిధములఁ బ్రమాణములును శాశ్వతములు నయిన నాలుగువిద్యలను బలువిధములయిన వాని యంతర్భేదములను సమస్త శాస్త్రములనును, గలిగించెను. నాలుగు వేదములును, ఆ అంగములును, మీమాంసయు, విరివియైన న్యాయశాస్త్రమును, పురాణమును ధర్మశాస్త్రమనెడి యీపదునాలుగు విద్యలును, ఆయుర్వేదము, ధనుర్వే

---

ముగాను నున్నదికాన యిదియే 'శూలవరాయుధ' అను విశేషణమునకుఁ బొసఁగినదిగాఁ జూపట్టుచున్నది. అయినను బెక్కుప్రతులందును లేమింబట్టియు ప్రసిద్ధవ్యాఖ్యాత యుదాహరింపమింబట్టియు పైపాఠము గయికొనఁబడెను. దాక్షిణాత్యపాఠమున 'అత్రత్వమనుకంపాం వై కర్తు మర్హసి శంకర । అహం విష్ణుస్సఖాతుభ్యం ధర్మస్యపరిరక్షణే । త్వంహి సర్వవిధానజ్ఞః సత్వానాం త్వంగతిఃపరా) సంకరో నభవేదత్ర యథాతద్వై విధీయతామ్ ॥ తతఃస భగవాన్ ధ్యాత్వా తదా శూలవరాయుధః । (దేవదేవో మహాదేవః కారణం జగతఃపరమ్ । బ్రహ్మవిష్ణ్వింద్రసహితైః సర్వైశ్చ సురాసురైః । లోకసంధారణార్థంచ లోకసంకరనాశనమ్) ఆత్మనాత్మానాదండం ససృజే దేవసత్తమః' అని యున్నది. కుండలీ కరణములోనిది ఔత్తరాహ పాఠములందుఁ గలుగవు.

దము, గాంధర్వమున నెడి మూఁడును, నాలుగవదియైన యర్థ శాస్త్రమునుగా విద్యలు పదునెనిమిదియే యగును. ప్రసిద్ధము లగు నీపదునెనిమిది విద్యలును ధర్మమును సంబంధించినసంహిత లగును. మహేశ్వరుఁడీ పదునెనిమిదివిద్యల యంతర్భాగ ములను జెప్పెను. మున్నూఱు శాస్త్రములును డెబ్బది మహా తంత్రములును, మహాదేవునిచేతఁ జెప్పంబడిన యీవిద్యల యంతర్భేదములే. ప్రసిద్ధమగు పాశుపతతంత్రమును, ప్రసిద్ధమగు పాంచరాత్రమును, యోగశాస్త్రమును, సాంఖ్యమును, లోకా యతనతంత్రమును, బ్రహ్మాదుల యనెడు ప్రసిద్ధతంత్రమును, దేవ తల దయినతర్కవిద్యయు, సుఖదుఃఖములను దెలిసికొను టకుఁ గారణమైనదిగా వన్నెగాంచిన శాస్త్రమును, ఎనిమిది విధ ములయిన తర్కవిద్యలును, విస్తరమయిన న్యాయశాస్త్రమును నతఁడు చెప్పెను. పురాణములంచెలివియు, యాగమును సంబం ధించినవియు నగుసంహితలు పదునెనిమిది యని తెలియవల యును. ఈ లోకములందుఁ గల పురాణములన్నియు సంహిత లన్నియును నతనిచేత రచితములయినవి. ధర్మశాస్త్రములును నట్లె పురాణములును వేదములును నేకార్థములే కాని వేఱు కావు. కాఁబట్టి చేప్పుడు శంకింగూడదు నానార్థము లయినసమస్త శాస్త్రములను, గాలమును దెలుపునట్టి శాస్త్రములను నలువది నాలుగుకళలను, నుత్తరభాగముతోఁ గూడిన యాయుర్వేద మును, పదునెనిమిది విభాగములుగలదియు స్థిరమయినదియు నగు దండనీతిని, గాంధర్వ శాస్త్రమును, పలువిధము లయిన విస్తర ములుగల యితిహాసమును జెప్పెను. ఇట్లు శబ్దార్థము లడఁగి యున్న యీవిద్యలును మరల వాని విస్తరములయిన వేయి

విభాగములును శంకరునిచేతఁ జెప్పఁబడినవి. ఋషులచేతను దేవతలచేతను గంధర్వులచేతను ననంతభేదములు గలదై విస్తరమయిన వేదమొకటియే మాటిమాటికి లోకమున నభ్యసింపఁబడుచున్నది. సంగ్రహమయిన నాలుగువేదములును పెద్దలచేత రచితమయిన ప్రసిద్ధములగు వేదవాదములు ననెడి వీనిపారము నొందినవాఁడే వేదపారంగతుఁ డనఁబడుచున్నాఁడు. రుద్రుఁడును విష్ణువును నింద్రుఁడును బృహస్పతియు శుక్రుఁడును నుత్తమధర్మవిదుండగు స్వాయంభువమనువును, నెప్పుడు సమస్త సురాసుర సహితుండు నగు బ్రహ్మదేవుండును వేదపారగు లగుదురు. వీరలందఱ యనుగ్రహమువలనను వ్యాసుఁడును వేదపారగుఁడగుచున్నాఁడు. శంతనుని పుత్రుం డగు భీష్ముఁడగు నేను విష్ణు శంకర బ్రహ్మల యనుగ్రహమునఁ జేసి వేదపారగుఁ డని చెప్పఁబడుచున్నాను. యాజ్ఞవల్క్యుఁడును సర్వవిధముల వేదపారగుం డగును. ఆదికల్పమందు బ్రహ్మచేతను విష్ణునిచేతను శివునిచేతను సృజింపఁబడిన విద్యలును నొక్కొక్క కల్పమందును మహాభాగ్యవంతులును దత్త్వవిదులు నగు ఋషులచేతను ఋషికుమారులచేతను పెక్కండ్రు గూడిన ఋషిసమూహముల చేతను మఱల విభజింపఁబడుచున్నది. మరల సాధువులచేత విభజింపఁబడుచున్నవి. ఇప్పుడును విభజించు శక్తిగల విద్వాంసులచేత విభజింపఁ బడుచున్నది. ఈ సంస్కృతి పూర్వజన్మము ననుసరించి పెక్కువిధములుగా నున్నది. శూలవరాయుధుఁ డగు నా భగవంతుఁడు మరల చాలసేపాలోచించి యాయావర్గము నకు నొక్కొక్కని యధిపతినిగాఁ జేసెను. సహస్రాక్షుఁడగు నింద్రుని దేవతలీశునిఁగాఁ జేసికొనిరి. సూర్యుని పుత్రుఁ డయిన

యమునిని బితరులకుఁ బతిగావించిరి. దేవతలరాజ్యమందు వరు ణుని జలములకుఁ బ్రభువుగావించిరి. కుబేరుని ధనములకును రాక్షసులకును బతిఁగాను, మేరువును బర్వతములకుఁ బతిగాను, సముద్రమును నదులకుఁబతిగాను, మృత్యువును బ్రాణము లకుఁ బతిగాను, నగ్నిని దేజస్సులకుఁ బతిగాను గావించిరి. మహాత్ముఁడును దేవతలయందుఁ బెద్దయుసనాతనుండు నగు విశా లాక్షుని రుద్రుల కీశ్వరుఁడుగాను, రక్షకుఁడుగాను బ్రభువు గావించెను. (ఈపదునొకండు రుద్రులును నితనిశరీరము వల ననుండి కలిగినవారు. నానారూపధరుం డగు భగవంతుఁడు శివుఁడు వసిష్ఠుని బ్రాహ్మణులకు నీశ్వరునిఁగాను, అగ్నిని పసువు లకుఁ బతిగాను, సూర్యునిఁ దేజస్సులకుఁ బతిగాను, జంద్రుని నక్షత్రములకుఁ బతిగాను గావించెను. సూర్యునిఁదిఁగలకుఁ బతి గాను, షండ్రెండు బాహువులుగల కుమారస్వామిని బ్రాణు లకు రాజుగాను నాజ్ఞాపించెను. వృద్ధిసంహారములకుఁ గారణ మును, సమస్తమునకుఁ బ్రభువునయిన కాలమును (ఆయుధము, శత్రువు, యముఁడు, కర్మని కాని రోగము, బాధకర మగు నాహారమును దినఁజేయు నాశ, యముఁడు, కర్మము కాని)నాలుగువిభాగములుగల మృత్యువునకును,దుఃఖమునకును, సుఖమునకును బ్రభువుగాఁచేసెను. దేవదేవుఁడును, రాజరాజును, బురుషశ్రేష్ఠుఁడును నగు శూలపాణి శివుఁడు సకల రుద్రులకు నీశ్వరుం డని వేదము చెప్పుచున్నది. పిదప మహాదేవుఁడు శివుఁడు బ్రహ్మదేవుని పుత్త్రుఁడును దనకుఁ బిదపఁ బుట్టినవాఁడును సకల ధర్మములను బరిపాలించువారియందు మేటియు నయిన యాత్ము పునిఁ బ్రజలకు నధిపతిగా నొసంగెను. పిదప నాయాగము

ముగియఁగానే మహాదేవుఁడు సమాహితుఁడై ధర్మమునకు రక్షకమయిన దండమును సత్కరించి * విష్ణువున కొసంగెను. విష్ణువు దాని నంగీరసున కిచ్చెను. అమ్మునిసత్తముఁడు దాని నింద్రుఁడు మరీచియను నిరువుర కొసంగెను. మరీచి భృగువున కిచ్చెను. భృగువు ధర్మసహితమయిన దండమును ఋషుల కొసంగెను. ఋషులు లోకపాలకులకును, లోకపాలకులు క్షుపునకును, క్షుపుఁడు సూర్యపుత్రుం డయిన మనువునకును నిచ్చెను. శ్రాద్ధదేవుఁడు (మనువు) సూక్ష్మము లగు ధర్మార్థకామములను బడయుటకై తన పుత్రుల కొసంగెను. దండమునందు నయము నెఱుంగఁగోరువాఁడు నయానయములను వేఱువేఱ తెలిసికొని, దండమును జెల్లింపవలయును. దుష్టులను శిక్షించుటకే దండము. రొక్కమను దండుగలు విధించుట భయమును బయటికిఁ గలిగించు పనికే కాని బొక్కసము నిండించుటకుఁ గాదు. శరీరము నంగహీనముగాఁ జేయుటగాని వధించుటగాని స్వల్పకారణములనుబట్టి విధింపరాదు. శరీరమును దండించుటయు కొండపయినుండి దొరలించుటయు స్వదేశమునుండి వెడలఁగొట్టుటయు గొప్పకారణములనుబట్టి విధింపవలయును. సూర్యపుత్త్రుఁ డగు మనువు జగమును రక్షించుటకై దీనిని పుత్త్రులకొసంగెను. ఈదండము వరుసగానొక్కరిచేతను బ్రయుక్తమై ప్రజలను బరిపాలించుచు మెలంగుచున్నది. ఈదండమువలన భగవంతుఁ డింద్రుఁడును నింద్రునినుండి కాంతిధనుఁ డగు నగ్నియు, నగ్నివలననుండి వరుణుఁడును, వరుణునివలన

* ఇందుఁ జాల నసంబద్ధములు పూర్వోత్తర వ్యాఘాతములును గలవు. కాఁబట్టి దీనియందుఁ బ్రక్షిప్తములు చాలఁగలవని తోఁచుచున్నది. వ్యాఖ్యాతలు నేమియుఁ జెప్పకున్నారు. (ప్ర. రా.)

నుండి వినయస్వరూపమయిన ధర్మమును వెలయుచున్నది. * లేక దండమువలనఁ దొలుత నింద్రుఁడు మొలఁగుచున్నాఁడు. దానివలనఁ బిదప నగ్ని; పిదప వరుణుఁడును బ్రజాపతియు; ప్రజా పతికిఁ బిదప వినయస్వరూపమయిన ధర్మమును మేలుకొని మెలంగుచున్నది.) ధర్మమునకుఁ బిదప బ్రహ్మపుత్త్రుఁడును. (అనఁగా సనాతనమగు నీతియు) నీతివలన వ్యవసాయమును (బూని కయు) మెలంగుచున్నది. ఆవ్యవసాయమువలననుండి లోకమును రక్షించు తేజస్సు వెలుంగుచున్నది. ఆ తేజస్సువలన నుండి యోషధులును, నోషధులనుండి పర్వతములును, బర్వతములనుండి రసమును వెలయుచున్నవి. రసగుణమునుండి నిర్రృతిదేవియు, నిర్రృతిదేవినుండి జ్యోతులును వెలుంగుచున్నవి. జ్యోతిస్సుల నుండి నిలుకడయుగు వేదములును, వేదములనుండి ప్రభుండయిన హయగ్రీవుఁడును, హయగ్రీవునినుండి పితామహుండును నవ్య యుండు నగు బ్రహ్మయు వెలుంగుచున్నారు. బ్రహ్మదేవునినుండి మహాదేవుఁడు శివుఁడు విలసిల్లుచున్నాఁడు. శివునినుండి విశ్వ దేవతలును విశ్వదేవతలనుండి ఋషులును, ఋషులనుండి భగ వంతుఁ డగు సోముండును, సోమునినుండి సనాతనులయిన దేవత లును, దేవతలనుండి బ్రాహ్మణులును లోకమున వెలయుచున్నా రని తెలియుము. బ్రాహ్మణులనుండి క్షత్త్రియులు ధర్మంబుచొప్పున లోకములను రక్షించుచున్నారు. క్షత్త్రియులనుండి సనాతనము లయిన స్థావరములును జంగమములును బ్రజలును నీలోకమున విలసిల్లుచున్నారు. ఆప్రజలయందు దండము వెలుంగుచున్నది.

---

* ఈ శ్లోకములకు నభిప్రాయమేమియో తెలియరాకున్నది. నీలకంఠా చార్యులు నేమియుఁ జెప్పలేదు. (ప్రతాపరాయలు).

అన్నింటి నడంచునట్టి దండము పితామహుని పుత్రుం డగు ప్రభు
వగును. 'భారతా! మొదటను నడుమను గడపటను గాలము
వెలుంగుచున్నది. సకల లోకములకును నీశుఁడును, బ్రజా
పతియు మహాదేవుడును దేవదేవుఁడు నగు శివుఁ డెప్పుడును మేలు
కొని వెలుంగుచున్నాఁడు అతఁడు, కపర్ది, శంకరుఁడు, రుద్రుఁ
డు, భవుఁడు, స్థాణుఁ, డుమాపతి యను పేళ్లను బేర్కొనఁబడు
చున్నాఁడు. ఇట్లు దండము, మొదటను నడుమను గడపటను
మేలుకొని వెలుంగుచున్నది. ధర్మవిదుం డగురాజు దండము
చొప్పున న్యాయముంబుగఁ బ్రవర్తింపవలయును' అనెను.

భీష్ముఁడు—ఇట్లు వసుహోముండు చెప్పిన యీమతము
నెవఁడు మనసార విని వినిన యట్లె లెస్స నడచుకొనునో, యా
రాజు మంచిలోకములను బొందును. మనుజసింహమా! ధర్మ
ముచే నాక్రమింపఁబడిన లోకమునంతయు నియమించునట్టి దండ
మును గుఱించిన సమస్తమును నీకు వివరించితిని. రాజా! మాం
ధాత తొల్లి వసుహోమునివలన విన్నదియు, లోకమునఁ బ్రసిద్ధ
మైనదియు నగు నీయాఖ్యానమును నీకుఁ జెప్పితిని' అనెను. ఇది
నూటయిరువదిరెండవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.



(భీష్ముఁడు ధర్మరాజునకు ధర్మాదుల ప్రయోజనము
మొదలయినవానిని జెప్పి ధర్మమును విడిచినవాఁడు
చేయవలయు ప్రాయశ్చిత్తవిధిని నరిష్టుఁ డను
రాజునకుఁ గామందకుఁడను ముని యుపదేశించిన
దానిని జెప్పుట.)

ధర్మరాజు 'ధర్మార్థకామములను గుఱించిన నిశ్చయమును

వినఁగోరుచున్నాను. లోకయాత్ర పూర్ణముగా నీమూఁటిలో దేనియందు నెలకొనియున్నది? ధర్మార్థ కామములు చేయుటకు మూలము లేమి? ఈమూఁడును గలుగుటకుఁ గారణ మేమి? అవి కొన్ని యెడల నొండొంటిని గలసియుఁ గొన్ని యెడల వేఱు వేఱుగను జూపట్టుచున్నవే! ఇది యెట్లు?' అని యడిగెను.

భీష్ముఁడు'—* లోకమునందు మనుష్యులు మంచిమనస్సులతో ధర్మమును మున్నిడికొని యర్థమును బడయఁగోరునపుడందులకుఁ దగినకాలమును, దేశమును, గార్యమును జతగూడఁగా ధర్మము నర్థము కామము మూఁడును నొక్కటిగాఁ జేరి యుండుట చూపట్టుచున్నది. అర్థమునకు మూలము ధర్మము. అర్థమునకు ఫలము కామమని చెప్పఁబడుచున్నది. ఈమూఁటికిని మూలము సంకల్పము. సంకల్పము విషయములను సంబంధించినది. విషయములన్నియుఁ బరిపూర్ణముగా భోగము సిద్ధించుకొఱకు. కాఁబట్టి యీవిషయము లే త్రివర్గమునకు† మూలము. విషయములనుండి బొత్తిగా నివర్తించుటయే మోక్షము. ధర్మము

* ఇందులకు దృష్టాంత మెట్లనఁగా, ఒక ధార్మికుఁడు తనపత్నిని దగినకాలమునఁ బొందుచున్నాఁడు. ఇట్లు చేయుటచే గర్భాధాన మనువిధి నాచరించి ధర్మమును బడయుటే కాక సుఖరూపమైన కామమును పుత్రరూపమైన ధనమును బడయుచున్నాఁడు. ఇట్లు ధర్మమునను మంచిమనస్సునను నర్థమును బడయఁగోరినపుడు, అందులకుఁ దగినట్లుగాఁ దగినకాలమును దగినవిషయమయిన పత్ని తగినయర్థమైన పుత్రుఁడు నని పొందుపడఁగా నందు ధర్మార్థకామములు మూఁడును గూడియుండుట తెలియుచున్నదని త్రివర్గములు పరస్పరము కూడి యుండుటను గుఱించిన ప్రశ్నకు మొదట నిందుసమాధానము చెప్పఁబడినది.

† ఇది ధర్మార్థ కామముల మూలమేమి యనుటకు నుత్తరము.

శరీరరక్షణమునకును, అర్థము ధర్మమును బడయుటకును, గోరఁబడుచున్నది. కామమనఁగా నింద్రియములఁ దనివినొందించుటయె. కాఁబట్టి ధర్మాదుల మూఁటికిని గామమే (అనఁగా నింద్రియములఁ దనివినొందించుటయె) ఫలముగా నున్నది. ధర్మార్థకామ మోక్షములను మోక్షము మొదలయిన ఫలములకుఁగాను బూనినచో వానిఫలములును బ్రకృష్టము (దూరము) లగుటచే నవియును బ్రకృష్టములుగాఁ జెప్పఁబడుచున్నవి. ఆత్మజ్ఞానమునకై వానిని గోరినపుడు సన్నికృష్టములు (దగ్గఱివి) అనఁబడుచున్నవి. అవి *సన్నికృష్టము లయినవాని నొకఁడాచరింపవలయును. వానిని మనస్సుచేతఁగూడ దిగవిడువరాదు. ధర్మార్థకామములను దిగవిడువఁ గోరినచోఁ దపస్సుచేత విముక్తినొందినపిదపనే దానిని ద్యజింపవలయును. ఆ మూఁటికయిన యుద్దేశము మోక్షమే! మనుష్యుఁడు దానిని బడయుఁగాక. ఒకఁడు బుద్ధిని మున్నిడికొని చేసినకార్యము నయితము దానికుద్దేశించిన ఫలమును బొందినను బొందవచ్చును; పొందక పోయినను బోవచ్చును. ధర్మమే యర్థమునకెప్పటికిని మూలము గాదు. ధర్మముతప్పఁ దక్కినవిగూడ (అనఁగా కొలువు సేద్యము మొదలయినవియు) నర్థమును గలిగింపవచ్చును. అయినను దీనికి విపరీతమయిన యభిప్రాయమునుగలదు. (ఏలనఁగాఁ గొందఱర్థము, అదృష్టముజన్మము మొదలయిన కారణములచేతఁగలుగునందురు) కొన్నియెడల నర్థమును బడయఁగా నది యనర్థమును గలిగించు

* ఒకఁడు ధర్మము నాత్మశుద్ధికొఱకును ; అర్థము, ఫలాపేక్షా రహితము లగు సత్కార్యములకొఱకును ; కామమును దేహధారణ మాత్రమునకు నాచరింపవలయునని భావము.

చున్నది. అర్థమునకంటె నితరము లయినవియు (అనఁగా వ్రతో పవాసాదులును)ధర్మమునుబడయుట కుపకరించుచున్నవి. ఈవిష యమై, తెలివిలేమిచే నికృష్టమయిన బుద్ధిగలవాఁడు ధర్మార్థము లకుఁ బరమమయిన ఫలమును (అనఁగా మోక్షమును) బడ యఁజాలఁడు. ధర్మమునకు ఫలమును గోరుట యేమలము. అర్థ మునకు దాఁచిపెట్టుట మలము. కామమునకు నింద్రియములందలి యతిమాత్రతుష్టి మలము. ఇట్టిమలములు దొలఁగి మంచి గుణ ములు నెరసియుండునేని యీమూఁడును జిత్తశుద్ధిని గలిగించి మోక్షమను మహాఫలము నొసంగును. భారతా! ఈవిషయ మై యరిష్టుఁ డనురాజునకును గామందుఁడను మునికిని జరిగిన సంవాద మయిన యీపురాతన మగు నితిహాసము నుదాహ రించెదరు. కామందుఁ డాసనమునఁ గూర్చుండియుండఁగా నరిష్టుఁ డతనికి నమస్కరించి 'ఋషీ! రాజు కామమోహములు బలవంతపెట్టఁగా నొక పాపముచేసి యందులకుఁబదప ననుతాప పడునేని యతఁ డేకర్మములు చేసినచో నాపాపము నశించును. మఱియు నొకఁడు, జ్ఞానముచేత నధర్మమయిన దానిని ధర్మమను బుద్ధిచేత నాచరించునేని రా జట్టిపాపము లోకులనడుమ నను ష్ఠానమునకు రాకుండునట్లు లెట్లాఁపనచ్చును?' అని యడిగెను.

అందులకుఁ గామందుఁడు 'ఈలోకమం దెవఁడు ధర్మమును నర్థమును బరిత్యజించి కామమునే యనువర్తించు చుండునో వాఁడు ధర్మార్థములును విడుచుటంబట్టి ప్రజ్ఞ నశించినవాఁడగును. ప్రజ్ఞ నశించుట యనెడిమోహము ధర్మార్థముల నశింపఁజే యును. దానినుండి నాస్తికత్వమును దురాచారమును బుట్టు చున్నవి. మిక్కిలి దుష్టములయిన దురాచారములను రాజెప్పు

డడంపకుండునో యప్పుడు లోకమింట నున్నపామునకు వడంకు నట్లా రాజునకు వడంకుచుండును. ప్రజలును బ్రాహ్మణులును సాధువులు నట్టిరాజుయెడ రక్తి గలిగియుండరు. దానివలన నతఁడు మిక్కిలి డిందుపడినవాఁడై వధ్యుఁడు నగుచున్నాఁడు. మఱి బాధయుఁ బడి యవమానమును బొంది యతఁడు దుఃఖంపు బ్రతుకు బ్రతుకును. అట్లు బాధితుఁడై బ్రతుకుట యనఁగా శుద్ధ మరణమే కాని యది మఱొకటిగాదు. అట్టివాని విషయమునం దాచార్యులు, పాపమును దొలంచునట్టి యీయుపాయము నుపదేశించుచున్నారు. అట్టిమనుష్యుఁడు వేదవిద్యల నధిగమింపవలయును; బ్రాహ్మణులను బూజింపవలయును. ధర్మమందు మిక్కిలియు మనముంపవలయును. గొప్పకులమందుఁ బెండ్లాడవలయును. క్షమయు గొప్పమనస్సునుగల బ్రాహ్మణులను సేవింపవలయును. అతఁడు స్నానాదులాచరించుచు, పవిత్రమంత్రములు జపించుచుండవలయును. సంతోషముతోఁ గూడిన ముఖము గలిగి నాస్తికుఁడు గాకుండవలయును. దుష్కార్యములు చేయువారిని వెలుపలఁ దొలఁగఁబెట్టి ధర్మాత్ములగువారిని లోనికిఁ జొప్పింపవలయును. మధురమయిన మాటలచేతను జేఁతలచేతను వారిని బ్రసన్నులను గావించుకొనవలయును. ఎప్పుడును శత్రులయినను బరులగుణములనే చెప్పికొనుచు 'నేను నీవాఁడను' అనవలయును. ఇట్టి నడకగలవాఁడు పాపము దూలి శీఘ్రమున బహుమానమును బడయును. మిక్కిలి కడింది పాపముల నయినను వాఁ డడంచుకొనవచ్చును. ఇందులకు సందేహము లేదు. గురువులు చెప్పినట్టి పరమధర్మ మెద్దియో దాని నట్లే చేయుము.

గురువుల యనుగ్రహముచేతనే పరమం బయినశ్రేయమును బడయఁగలవు' అనెను. ఇది నూటయిరువదిమూఁడవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

{ భీష్ముఁడు ధర్మమునకుఁ బ్రథమ కారణమయిన శీలమును దుర్యోధనునకు ధృతరాష్ట్రుఁడు చెప్పిన యింద్ర ప్రహ్లాద సంవాదమును ధర్మరాజునకుఁ జెప్పుట. }

ధర్మరాజు 'ధార్మికోత్తమా ! ఈలోకమందలి జనులందఱును నెప్పుడును ధర్మంపు శీలమునే మిక్కిలియుఁ గొనియాడుచుందురు. వా రట్లు గొనియాడు టెందుల కని నాకుఁ బెద్దసందేహముగా నున్నది. అది మాకుఁ దెలిసికొన శక్యమగునేని, యా ధర్మశీలము నెట్లు బడయవచ్చునో దానినంతయు వినఁగోరెదను. ఆశీల మెట్లు పొందఁగూడును? దానిలక్షణము లేవియని చెప్పెదరు? నీవు మాటకారులందు మేటివిగదే; వినఁగోరెదఁ జెప్పు'మని యడిగెను.

భీష్ముఁడు. 'మానదా ! మునుపు దుర్యోధనుఁడు నీకుఁగలిగిన సంపత్తినిఁజూచి యింద్రప్రస్థమున నీవునునీతమ్ములను గూడియున్న సభయందుఁ జరిగినపరిహాసమునకును దపించుచుఁదనతండ్రియగు ధృతరాష్ట్రుని నీప్రశ్నమే యడిగెను. అప్పుడు జరిగినది చెప్పెద వినుము. నీదు మహాసభను, నీవు పొందియున్న యుత్తమమయిన సంపత్తినిని,జూచి దుర్యోధనుఁ డపుడు దీనుఁడై యదియంతయుఁ దనతండ్రికిఁ దెలిపెను. అదివిని ధృతరాష్ట్రుఁడు కర్ణసహితుఁడైన యాదుర్యోధనునకు నిట్లనియె.

ధృతరాష్ట్రుఁడు—'పుత్రా! నీవెందులకుఁ దపించుచున్నావో యున్నదియున్నట్టు చెప్పఁగా వినఁగోరుచున్నాను. విన్నపిదప నందులకుఁ దగినకారణము లున్నవని తెలిసెనేని, నేను నిన్ననునయించెదను. నీ కెప్పుడును మహా దైశ్వర్యమును గలిగియున్నది. నీతమ్ములందఱును మిత్రులును సంబంధులును బాంధవులును నీవు చెప్పినపని చేయుచుందురు. మేలయిన వస్త్రములను దొడిగెదవు. మంచి సంజుళ్లయన్నమును గుడిచెదవు. ఆజానేయపు గుఱ్ఱముల స్వారిచేసెదవు. ఇట్లన్నిసొంపులు నిండియుండఁగా నెందులకు శోకించుచున్నావు?' అనియడిగెను. అందులకు దుర్యోధనుఁడు 'తండ్రీ! ధర్మరాజు గృహమందు మహాత్ములయిన స్నాతకులు పదివేలమంది పసిండిపాత్రములందు భుజించెదరు. దివ్యములయిన పుష్పములచేతను ఫలములచేతను నలంకృతమయిన యాతని దివ్యసభనును, తిత్తిరిపిట్టలవలె నానావర్ణములుగల యతని యశ్వములను, నానావిధములయిన యతని రత్నములను జూచియు, మఱియు నింద్రుని వెంపుంబోలె నతిమనోహరమై మిక్కిలియు గొప్పదైయున్న మనపగవారల పాండవుల యా వెంపుసొంపును జూచియు దుఃఖించుచున్నాను' అనెను.

అందులకు ధృతరాష్ట్రుఁడు—'నాయనా! పుత్రా! యుధిష్ఠురునికిఁగల యట్టిసంపత్తినిగాని లేక యంతటికంటె నెక్కుడయిన సంపదనుగాని గోరితివేని శీలవంతుఁడవు గమ్ము. శీలముచేత మూఁడులోకములను జయింప శక్యమగును. ఇందులకు సందేహము లేదు. శీలవంతు లగువారికి లోకమం దసాధ్యమేదియుఁ గలుగదు. మాంధాత యొకరాత్రిని, జనమేజయుఁడు మూఁడు రాత్రులను, నాభాగుఁ డేడురాత్రులను భూమినంతయుఁ బడ

సిరి. ఈరాజులందఱును శీలవంతులును, యశస్సంపన్నులును కావుననే భూమి వారి గుణములకు వశ్యుడువ్రాయి తనంతటనే వారిని బొందినది' యనెను. అందులకు దుర్యోధనుఁడు 'భూమి నంతయు నతిశీఘ్రమున నారాజులు పొందిన యాశీలమును బొందు విధమెట్లు? వినఁగోరెద' నని యడిగెను. ధృతరాష్ట్రుఁడు 'ఈవిషయమై పురాతన మయినయీ యితిహాసము నుదాహరించుచున్నారు. నారదుఁడు మున్ను శీలమునుగుఱించి యిది చెప్పెను. తొల్లి, దైత్యుండగు ప్రహ్లాదుఁడు శీలమునాశ్రయించి మహాత్ముఁడగు మహేంద్రుని రాజ్యమునుహరించి మూఁడులోకములను దనవశము గావించుకొనెను. పిదప నింద్రుఁడు మహాప్రాజ్ఞుండుగాన బృహస్పతినిబొంది యంజలి గీలించి యతనితో 'శ్రేయమెద్దియో తెలిసికొనఁ గోరెదను' అని యడిగెను బృహస్పతి యతనితో '(ముక్తికారణమగు) జ్ఞానమే పరమమయిన శ్రేయ'మని చెప్పెను. ఇంద్రుఁడతనితో మరల 'దానికంటె విశేషించినది గలదా?'యని యడిగెను. బృహస్పతి 'నాయనా! దీనికంటె విశేషించినదియుఁ గలదు. మహాత్ముఁడగు శుక్రుఁడు నీకు దానిని మఱింత లెస్సగా నుపదేశింపఁగలఁడు. అచటికింబొమ్ము. నీకుశుభం బగుఁగాక;పోయి యతనినడుగు'మనెను. మహాతపస్వియు నతిమాత్రకీర్తియు నగు నింద్రుఁడు భార్గవునికడకుఁ బోయి ప్రీతి గడలుకొన మోక్షసాధన మగు జ్ఞానము నుపదేశము నొందెను.పిదప మహాత్ముండగు శుక్రునివలన ననుజ్ఞవడసి యింద్రుఁడతనితో 'దీనికంటె నెక్కుడయిన శ్రేయస్సుగలదా ?' అని యడిగెను. అందుల కాసర్వజ్ఞుండు శుక్రుఁడు 'మహాత్ముం డగు ప్రహ్లాదునకు నింతకంటె నధికమయిన జ్ఞానముగలదు' అని

చెప్పెను. అది విని యింద్రుఁడు హర్షము నొందెను. అంత నింద్రుఁడు బ్రాహ్మణవేషము వేసికొని ప్రహ్లాదుని యొద్దకుఁ బోయి యతనితో 'శ్రేయమెద్దియో తెలియఁగోరుచున్నాను' అని యడిగెను. ప్రహ్లాదుఁ డాబ్రాహ్మణునిఁ జూచి 'బ్రాహ్మణోత్తమా ! మూఁడులోకములను బరిపాలించుటయందుఁ దగులువడి యున్నానుగాన నాకవకాశము లేదు. కాఁబట్టి నీ కుపదేశము సేయనేరను' అనెను. బ్రాహ్మణుఁడు 'రాజా ! నీ కవకాశముగల యప్పుడేని మిక్కిలి యుత్తమమయిన కర్తవ్య మెద్దియో యుపదేశింపవలయును' నని వేఁడెను. అందులకుఁ బ్రహ్లాదుండు ప్రీతుఁడై బ్రహ్మవాది యగునాబ్రాహ్మణునికి వల్లెయని చెప్పి యప్పుడు తగినకాలమున నతనికి జ్ఞానతత్త్వము నుపదేశించెను. ఆబ్రాహ్మణుఁడు బ్రహ్లాదునియెడ గురువుదెస నుండవలసినవృత్తిని గయికొని మనఃపూర్వకముగా నతఁడు గోరినది చేయసాఁగెను. ఆబ్రాహ్మణుఁడు పలుమా ఱతనినిజూచి 'అరిందమా! మూఁడులోకముల రాజ్యమును నీ వే విధమున జయింపనేర్చితివి. ఆయుపాయము లెవ్వియో ధర్మజ్ఞా ! నాకుఁ జెప్పు' మని యడిగెను.

ప్రహ్లాదుఁడు—'బ్రాహ్మణా! నేను రాజనని విఱ్ఱవీఁగను. మఱి బ్రాహ్మణులయెడ నసూయ పడను. వారు శుక్రునిమతము ననుసరించి చెప్పెడి నీత్యుపదేశములను గయికొని యట్లె యనుష్ఠింతును. వారు చెప్పఁగోరినదానిని మిక్కిలి నమ్మికతో నాకుఁజెప్పి యక్రమ మయిన దారినుండి నన్ను వారింతురు. నే నెప్పుడును శుక్రునిమార్గము నే యనుసరింతును. నేను బ్రాహ్మణులకును నా పెద్దలకును నెప్పుడును శుశ్రూష సేయుచుందును. నా కహం

కారము కలుగదు. మఱియు ధర్మాత్ముఁడనై క్రోధమునుజయించి యింద్రియములనడంచి యడఁకువ గలిగియుందును. శాస్త్రజ్ఞులగు బ్రాహ్మణులు తేనెటీఁగలు వెఱలోఁ దేనియనుబోయునట్లింపయిన యుపదేశములతో నామదిని దడుపుచుందురు. ఆ విద్వాంసులారగించునట్టియమృతరసమును గ్రోలుచు నక్షత్రములందుఁ జంద్రుఁడునుంబోలె నాజాతివారియందు వెలుగుచుందును. బ్రాహ్మణులముఖమున శుక్రునీతుల వినుటయు నట్లె యనుష్ఠించుటయు ననెడి యిదియె భూలోకమందలి యమృతము. ఇదియే యుత్తమమయిన చక్షువు. ఇదియే శ్రేయము' అనెను. ఆ బ్రాహ్మణునిచేత శుశ్రూష నందిమరలఁ బ్రహ్లాదుఁడతనితో 'బ్రాహ్మణోత్తమా ! నీవు గురువునెడనుంబోలెనే నాయెడ నడచుకొన్నందులకుఁ బ్రీతుండనయితిని. వరమడుగుము. నీకు శుభంబగుఁగాక. వరమునిచ్చెదను. సందేహము వలదు' అనెను. అందుల కాబ్రాహ్మణోత్తముఁడు 'మంచిది: అట్లె చేసెద' ననెను. ప్రహ్లాదుఁడు 'వరము గయికొను' మని ప్రీతి మీఱ మరలఁజెప్పెను. బ్రాహ్మణుఁడు 'రాజా ! నీవు నాయెడఁ బ్రసన్నుఁడవయితివేని నాకుఁ బ్రియము చేయఁగోరెదవేని నీశీలమును బడయఁగోరుచున్నాను. ఇదియ నాకు వరము' అనెను. ఇందులకుఁ బ్రీతుఁడయినను బ్రహ్లాదుఁడు మిక్కిలియు భయము నొందెను. ఆబ్రాహ్మణుఁ డావరము నడిగినప్పుడు ప్రహ్లాదుఁ డతఁడల్పచిత్తుఁడు గాఁడని తెలఁచెను. అతఁడు మిక్కిలి యాశ్చర్యపడుచుఁ గడపట 'వల్లె' యనెను. ఆ దైత్యనాథుఁడు వరము నొసఁగియు నపుడు మిక్కిలియు దుఃఖమునొందెను. వర మీయఁగానే బ్రాహ్మణుఁడు పుచ్చుకొని వెడలిపోయెను; కాని ప్రహ్లా

డుఁడు మాత్రము మిక్కిలియుఁ జింతకుఁ బాలై యేమిచేయుట కును రూఢిగాఁ దోఁపకుండెను. ఆదైత్యనాథుఁ డావిషయ మును జింతించుచుండఁగా నతని యొడలినుండి యొక ఛాయ యపుడు బయలువెడలెను.అది తేజోరూపముగలిగి మిక్కిలియుఁ బెద్దదిగా నుండెను. ప్రహ్లాదుఁడు దానినిజూచి 'నీవెవ?'రని యడి గెను. అందులకది 'నేను శీలము. నీవు త్యజింపఁగా విడిచిపోవు చున్నాను. నీకు శిష్యుఁడై యుండి నిత్యమును సమాహితుఁడు గా నుండిన యాబ్రాహ్మణోత్తమునియందు వసింపఁగలను' అనెను. ఇట్లది చెప్పి మఱుఁగుపడి యంత నింద్రునిఁ బ్రవేశిం చెను. ఆతేజస్సు పోఁగానే యంత నటువంటిరూపము గలమఱి యొకఁ డాప్రహ్లాదుని దేహమునుండి వెడలివచ్చెను. ఆప్రహ్లా దుఁడు 'నీవెవ?'రని యడిగెను. అది 'అసురేంద్రా! నన్ను ధర్మ మని తెలియుము. ఆబ్రాహ్మణుఁ డెచ్చటనున్నాఁడో యచ్చటికిఁ బోయెదను. ఎచ్చట శీలముండునో యచ్చటనే కదా నే నుండు వాఁడను' అనెను. పిదప మహాత్ముండయిన యాప్రహ్లాదుని దేహ మునుండి కాంతిచే మిక్కిలి జ్వలించుచున్నట్లున్న మఱియొకఁడు వెలికివచ్చెను. ప్రహ్లాదుఁడు'నీవెవ?'రని యడుగఁగా మహాద్యుతి యగు నాపురుషుఁడు 'అసురేంద్రా! నన్ను సత్యమని యెఱుం గుము. ఇపుడు వెలుపలికిఁ బోవుచున్నాను; నేను ధర్మము నను సరించి యుండువాఁడను' అనెను. ఆపురుషుఁడు ధర్మము వెంటఁ బోవఁగానే యాప్రహ్లాదునినుండి మఱియొక పురుషుఁడు వెలికి వచ్చెను.'నీవెవ?'రని ప్రహ్లాదుఁడడుగఁగానే' ప్రహ్లాదా!నన్నువృత్త మని తెలియుము.సత్యముండుచోటనే కదా నేనునుండువాఁడను' అనెను. ఆపురుషుఁడు పోఁగానే యాప్రహ్లాదుని దేహమునుండి

వెనుశబ్దము వెలువడెను. ప్రహ్లాదుఁడు 'నీవెవ'రని యడుగఁగా నది 'నన్ను బల మని తెలియుము. వృత్తమున్నచోటనే యుండు వాఁడను' అనిచెప్పి యది వృత్తమున్నయెడకుఁ బోయెను. పిదప నా ప్రహ్లాదుని దేహమునుండి ప్రభామయియగు నొక దేవిబయలు వెడలెను. ప్రహ్లాదుఁ డాదేవిని 'నీవెవ'రని యడిగెను. ఆయమ, నేను 'లక్ష్మిని ; సత్యపరాక్రమా ! నేను నీయందెప్పుడును సుఖముగా వసించుచుంటిని. నీవు విడువఁగాఁ బోవుచున్నాను. నేను బలము ననుసరించి యుండుదానను గదా' యనెను. అంతఁ బ్రహ్లాదునకు భయముపుట్టెను. అతఁడు 'తామరయందుండు ముద్దరాలా ! నీవు లోకమునకుఁ బరమేశ్వరివి. సత్యవ్రతవునుగదే ! ఎచ్చటికిఁ బోయెదవు ? ఈబ్రాహ్మణ శ్రేష్ఠుఁడెవఁడు ? యథార్థమును దెలియఁ గోరుచున్నాను' అని యడిగెను. అందుల కాలక్ష్మీదేవి 'ప్రభూ ! నీయొద్ద బ్రహ్మచారిగానుండి విద్యగఱచినవాఁడింద్రుఁడు. ముల్లోకములందును నీకుఁ గలిగియున్న యైశ్వర్యమును నతఁ డపహరించెను. ధర్మజ్ఞా! శీలముచేతఁగదా మూఁడు లోకములను నీవు గెలిచితివి. ప్రభూ ! దానిని దెలిసి దేవేంద్రుఁడు నీశీలము నపహరించినాఁడు; మహాప్రాజ్ఞుండవు గదే ! ధర్మమునకును, సత్యమునకును, నట్లే వృత్తమునకును, బలమునకును, అట్లే నాకును, నెప్పుడును శీలమే కారణముగాఁ గలిగియుండును. ఇందులకు సందేహము లేదు' అనిచెప్పి యాదేవి పోయెను. వారలందఱునుం బోయిరి' అనెను.

భీష్ముఁడు—'ధర్మరాజా ! దుర్యోధనుఁ డప్పుడు మరలఁ దండ్రిని జూచి 'కురునందనా ! శీలమునకుఁగల తత్త్వమును దెలియఁ గోరెదను. శీలము నెట్లు పడయవచ్చునో యా యుపాయమును

నా కుపదేశింపవలయును' అనియడిగెను. ధృతరాష్ట్రుఁడు 'రాజా! మహాత్ముండయిన ప్రహ్లాదుఁడు తొల్లి యింద్రున కుపదేశించునపు డాయుపాయములను దెలిపియున్నాఁడు. సంగ్రహముగా శీలమును బడయుమార్గమును జెప్పెదవినుము. సమస్త భూతములందును మనస్సుచేతను వాక్కుచేతను గ్రియచేతను ద్రోహము లేకుండుట, అనుగ్రహము, దానము ననెడియీమూఁడును శీలమని ప్రశంసింపఁబడుచున్నవి. ఏది యితరులకు హితముగా నేరదో, ఏది సిగ్గుపడుటకుఁ గారణమగునో, యట్టికర్మమునుగాని పౌరుషమునుగాని యేవిధమునను జేయరాదు. దేనిని జేసినయెడలసదస్సునందుఁగొనియాడుట గలుగునో యట్టికార్యమును జేయవలయును. నీ కీ శీలమును సంక్షేపముగా నుపదేశించితిని. రాజా! శీలము లేనివారును గొన్నియెడల సంపదను బొందుచున్నారు. అయినను, నాయనా! చాలఁగాల మనుభవింపఁజాలరు; వారు వేరుతోఁగూడఁ ద్రెళ్లుదురు. పుత్రకా! దీనిని గలరూపునఁ దెలిసికొని శీలము గలిగియుండుము. నాయనా! నీవు యుధిష్ఠిరునకంటె నెక్కుడు సంపదనో యంతకంటె నధికమయిన దానినో కోరుదువేని శీలవంతుఁడవు కమ్ము' అనెను. కుంతిపుత్రా! నీవు దీనిని గావింపుము; ఈఫలమును బడయుదువు' అనెను. ఇది నూటయిరువదినాలుగవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

{ భీష్ముఁడాశను నిరూపించుటకై ఋషభసుమిత్ర చరిత్రమును జెప్పఁదొడఁగుట. }

ధర్మరాజు 'పితామహా! నీవు శీలము మనుష్యునకుఁ బ్రధాన

మయినదని చెప్పితివి. ఆశయెట్లు గలుగుచున్నది? అదియేమి? దానిని నాకుఁజెప్పుము. పితామహా! నాకిది పెద్దసందేహముగాఁ గలిగియున్నది. ఈసందేహమును ద్రెంచువాఁడు నీవుదప్ప వేఱొకఁడు లేఁడు. (సుయోధనుని మోటుఁదనమును బట్టి) గొప్ప యుద్ధము జరుగనున్నపుడు వాఁడు యుక్తమయిన దానిని జేయునని నేను వానియెడల గొప్పయాశ గలిగియుంటిని. ఒక్కొక్కని యందు నాశ గొప్పదిగానున్నది. ఆయాశను జెఱిపినపుడు, మిక్కిలియు దుఃఖము గలుగుచున్నది. ఆదుఃఖము మరణమే యనుటకు సందేహము లేదు నేను బుద్ధిమాలిన వాఁడనుగాన దురాత్ముఁడు ధృతరాష్ట్రుని కొడుకు నాయాశను దూలఁ బుచ్చెను. నామందమతిని జూడుము! ఆశ, వృక్షములతోఁగూడిన కొండకంటెఁ బెద్దదియని తెలఁచుచున్నాను. లేక యాకాశముకంటెను విరివియైనది గావచ్చును. లేక యది యింతింతనికొలఁది యిడరాని దగును కురుశ్రేష్ఠా! ఆశ యిట్టిదని తెలపోయుటయు దాని నడంచిపుచ్చుటయు నెంతయుఁ గష్టముగానున్నది. అది యిట్లు దుర్లభముగా నుండుటంబట్టి దానికంటె దుర్లభమయిన దేది'యని యడిగెను.

భీష్ముఁడు-'యుధిష్ఠిరా! ఈవిషయమందు సుమిత్రుఁడను రాజునకును ఋషభుఁడను మునికిని జరిగినకథను నీకుదాహరించెదను. నావలనఁ దెలిసికొనుము. హైహయ దేశమునకు రాజు సుమిత్రుఁడను రాజర్షి యొకఁడుండెను. అతఁడొకనాఁడు వేఁటకుఁ బోయి వంగిన కణుపులుగల (నున్నని) బాణముచేత నొకమృగము నేసి తఱిమెను. ఆజింక మిక్కిలి బలిమిగలదిగాన యమ్మునెత్తికొని పఱచెను. బలవంతుఁడారాజును మిక్కిలి వేగముగా

మృగమును వెంటనంటి పోయెను. ఆమృగము వేగముగొని పల్లమునందును మెఱకయందును బరుగిడెను. రాజేంద్రా! ముహూర్తమువలె నది సకలమయినదారిని బోయినది. పిదప నారాజు యౌవనము చేతను, మేనియందలి బలిమిచేతను విలుగొని వాలుఁబట్టి కవచముదాల్చి దానిని మఱియు వేఁటాడెను. ఆరాజు తానొక్కఁడు నాయడవియం దామృగమును దఱుముచుఁ బెక్కునదులను, నదములను, కొలఁకులను, నడవులను దాఁటిపోయెను. ఆమృగము మిక్కిలియు వేగముగలది గాన యారాజునకుఁ దనయిచ్చ చొప్పున నప్పుడప్పుడు కనుపట్టుచును మహావేగమునఁ బరుగిడుచునుండెను. ఆరా జేసినపెక్కుమ్ములు గాఁడిపాఱఁగా నాయడవిమెకము వేడుకకుంబోలె నతనిని దఱిసి వచ్చును. అది వేగవంతముగాన మరల వడిగొని దాఁట్లు వైచుచుఁబోయి మరల నగ్గఱికివచ్చును. సుమిత్త్రుఁ డామృగము మర్మమును భేదించునట్టి క్రూరంపు బలుబాణమెత్తి వింటినుండి యేసెను. పిదపఁ గడుపునందు గమికాఁడయిన యామెకము రాజునమ్ము నేటుబారికిఁ దొలఁగి రెండుక్రోసుల దూరమునఁ బరిహసించు నదియుంబోలె నిలుచుండెను. కాంతి దళుకొత్తుచున్న యాబాణము భూమియందుఁ బడఁగానే మృగ మరణ్యమందుఁ బ్రవేశించెను. రాజును మృగమును దఱుముకొని పోయెను. ఇది నూటయిరువదియేనవయధ్యాయము.

---

## రాజధర్మ పర్వము.

(భీష్ముఁడు, సుమిత్రుఁడు ఋష్యాశ్రమమునకుఁ బోవుటయు వారిని జూచి యాశపెద్దదియా యాకాశము పెద్దదియా యని యడుగుటయుఁ జెప్పుట.)

అంత సుమిత్రుఁడు మహారణ్యమునఁ బ్రవేశించి ఋషుల యాశ్రమమును జేరి యపుడు బడలికతో నందుఁ గూర్చుండెను. అప్పు డారాజు విలుదాల్చి శ్రమంబునఁ బీడితుఁడై యాఁకట నలంగుచుండుటను జూచి ఋషులువచ్చి యాతనికి విధ్యుక్తముగా నుపచారముచేసిరి. రాజు నా ఋషులొసంగిన పూజను గయికొని వారి నందఱను జూచి 'మీతపము లత్యుత్తముగా వర్ధిలుచున్నవా?' యని యడిగెను. ఆతపోధనుఁ డారాజు మాటను గయికొని యతని నందులకు వచ్చిన దానికిఁ గారణమేమి యనియడుగువారై 'శుభవదనా! నీవెందులకుఁగాను నడుమునఁ గత్తి గట్టి విలునమ్ములు దాల్చి కాలినడకను దపోవనమునకు వచ్చితివి? ఏకులమునఁ బుట్టినవాఁడవు? నీపేరేమి? మాకుఁజెప్పుము' అని యడిగిరి. అంత నారాజా బ్రాహ్మణు లందఱకును దనవృత్తాంతమును గలరూపునఁ దనరాకను జెప్పఁదొడఁగి 'బ్రాహ్మణులారా! నేను హైహయ దేశరాజుల కులమునఁ బుట్టినవాఁడను. నాపేరు సుమిత్రుఁడు. పెద్ద సైన్యముతోడను నమాత్యులతోడను నంతఃపురకాంతలతోడను గూడి బాణములచే మృగసమూహములను వేలకొలఁదిని గొట్టుచు గ్రుమ్మరితిని. ఒకజింక నాయమ్ము దగిలి యాగ్రుచ్చుకొన్న యమ్ముతోడనే పరుగిడినది. అల్లది పరుగెత్తుచుండుఁగా దాని వెంటఁ దఱుము కొనుచు య

దృచ్ఛచే నీవనమును జేరితిని. నేను లక్ష్మిని దిగనాడి యాశచెడి శ్రమంబున సోలి మీాపొంతకు వచ్చితిని. ఇంతకంటె దుఃఖమే మున్నదిః శ్రమార్తుండనై, యాశ వమ్మయి, రాజులక్షణములు వీడి నేను మీాయాశ్రమమును జేరితిని. తపోధనులారా! నాయాశచెడుట నాకుఁ దీవ్రమయిన దుఃఖమును గలిగించు నట్లు రాజ లక్షణములు విడుచుటయు దుఃఖమును గలిగింపదు. తపస్వులారా! హిమవత్పర్వతము తనపాదవృచేతను, మహోదధి యగు సముద్రము తనవిఱివిచేతను, భూమ్యాకాశములనడిమికి నెట్లావరింప కున్నవో యట్లే నే నాశకుం గలతుదిని బొంద కున్నాను. అన్నియు మీాకుఁ దెలిసియుండును. తపోధనులగు ఋషులు సకలమును దెలిసినవారే కదా? మీారు మహాభాగ్య వంతులు. కాఁబట్టి యొక సందేహము నడుగుచున్నాను. ఒక మనుష్యుని కాశయున్నది. ఆకాశము నున్నది.దీనియందు లోక మున నేది పెద్దది యని మీాకుఁ దోఁచుచున్నది. దీనిని గలరూ పున వినఁగోరుచున్నాను. ఈ లోకమందేది దుర్లభము? ఇది యెప్పుడును మీాకు గోప్యముగా కుండునేని జాగులేక చెప్పుఁ డు. బ్రాహ్మణోత్తములారా! మిక్కిలియు రహస్యమయిన దా నిని నే నడుగఁ దలంపను. మీాతపములకు విఘ్నములయిన కార్య మునుండి నేను దొలంగెదను. ముచ్చటించుట కవకాశము గల దేని నే నడిగిన ప్రశ్నమునకుఁ గారణమును సమగ్రతయు యథార్థ ముగా వినఁగోరుచున్నాను. ఎప్పుడును దపములు సలుపుచు సమాధి యం దుండుమీారలే దీనిని జెప్పఁదగుదురు' అనెను.

ఇది నూటయిరువదియాఱవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

{ ఋషభుం డనుఋషి సుమిత్ర రాజునకు దమ తీర్థయాత్రాదులను జెప్పుట. }

అంత నచటం గూడియున్న యా ఋషులలోపల శ్రేష్ఠుం డగు ఋషభుం డను బ్రహ్మర్షి నవ్వుచు రాజుం జూచి రాజసింహమా! మున్నొకప్పుడు నేను దీర్ఘయాత్రకుం బోంగా దివ్యమయిన నరనారాయణాశ్రమమును జేరితిని. అచ్చట సొగసయిన యా బదరీ వృక్షమును నట్లె గంగానదిసంబంధి యగుతటాకమును నున్నవి. రాజా! అచ్చట హయగ్రీవుండు శాశ్వతము లయిన వేదములను జదువుచున్నాండు. నేను మును పాతటాకమందు దేవతలకును బితరులకును విధ్యుక్తముగాం దర్పణముగావించి పిదప నరనారాయణు లనెడి యాఋషు లెప్పుడును గ్రీడించుచుండిన యాశ్రమమునకుం గొంచెము సమీపమున వసింపంగోరి పోయితిని. అప్పు డచ్చట వల్కలము నజినమును దాల్చినవాండును, కృశుండును, మిక్కిలియుం బొడవయిన వాండును, నగు తను వనెడు ఋషి వచ్చుచుండం గాంచితిని. అతని దేహ మితరమనుష్యుల దేహములతో నెంతమాత్రమును బోల్పందగదు. అట్టి కృశత్వమును నేను జూచినది లేదు. చిక్కియున్న యతని శరీరము చిన్నవ్రేలికి సాటిగా నుండును. కుత్తుకయును జేతులును గాళ్లును వెండ్రుకలును మిక్కిలి వింతగాం జూపట్టినవి. తలయును జెవులును గన్నులును నతని మేనికిం దగు మాత్రముగా నుండెను. అతని వాక్కును గర్మమును నొక్కరూపై యుండెను. నేను గృశుండయిన యా బ్రాహ్మణునిం జూచి మిక్కిలియు భయపడి యెంతయు మనం

బునఁ దూలుచు నతని యడుగులకు మ్రొక్కి పిదప నా గోత్ర మును నామమును గార్యమును దెలిపి యంజలిగీలించి యెదుట నిలిచియుంటిని. అతఁ డొసంగిన యాసనమందు మెల్లగాఁ గూర్చుంటిని. మహారాజా ! అంత ధార్మికోత్తముఁ డయినయాఋషియు నట్టి ఋషులనడుమ ధర్మార్థ యుక్తములయిన సుచ్చటలను జెప్పెను. అతఁడు చెప్పుచుండఁగానే తామర రేకుల వంటి కన్నులుగల వీరద్యుమ్నుఁ డనురాజు మహాసైన్యముతోడను నంతఃపుర స్త్రీలతోడను గూడి యక్కడకు వచ్చెను. అమ్మహాకీర్తి, కాననయందుఁ గానక పోయిన తనపుత్త్రుని భూరిద్యుమ్నునిఁ దలంచుకొని మిక్కిలిశోకించుచు 'వాని నిచటఁజూతును. ఇయ్యెడఁజూతు' నని యాశతో వేగము లగు గుఱ్ఱములతోడ వచ్చెను. ఇట్లాశ చేతఁ గృశించిన యారాజు వనమందు సంచరించుచు 'ఆపుత్త్రుని మరల నేను జూడఁగందునా? లేదు. ఒకఁడే పుత్త్రుఁడు మహారణ్యమందు ముందుఁ గనఁబడక పోయెను. వానిని నాకుఁజూడ శక్యముగాకున్నదే. నాకాశయుఁ బెద్దదిగానున్నది. ఆశ నా దేహమునంతయు నావరించియున్నదిగాన నేను మరణమునొంద నర్హుఁడనుటకు సందేహము లేదు' అని యపుడు మాటిమాటికిఁ జెప్పెను. పూజ్యుం డయినయా ఋషితిలకుండు విని తలవంచి యొక ముహూర్తము ధ్యానాసక్తుఁడై యుండెను. మిక్కిలి శోకము గల యారాజాముని ధ్యానము సేయుటను జూచి బుద్ధి విన్నుడై 'దేవర్షీ ! ఏది దొరకుట యరిది? ఆశకంటెఁ బెద్దది యేది? ఇది గోప్యముగాదేని పూజ్యుం డగు నీ వుపదేశింప వలయు'నని మాటికి మిక్కిలి యల్లల్లఁ జెప్పెను. తనువు 'రాజా ! నీకొడుకు మహాత్ముం డయిన యొక ఋషి నవమానించినాఁడు. వాఁడు

మందభాగ్యముచేత బుద్ధిమాలి యట్లుచేసినాఁడు. ఆఋషి నీకొడుకును నొకబంగారు కలశమును వల్కలములను నడిగెను. వాఁ డవజ్ఞచేసియు నతని కవి యొసంగఁడయ్యె. ఆఋషి నీకొడుకుచేత నట్లు భంగపడి యాశ దూలినవాఁడయ్యె' ననెను. ఇది విని లోకపూజితుం డగు ఋషికి నభివాదనముచేసి ధర్మాత్ముఁ డా రాజు నీవలెనే బడలికచే సోలియుఁ గూర్చుండెను. ఆఋషి యరణ్యవాసుల విధిచొప్పున నర్ఘ్యపాద్యములను రప్పించి రాజున కర్పించెను. పిదప సప్తఋషులు ధ్రువునింబోలె ఋషులందఱును నారాజును బరివేష్టించి కూర్చుండిరి. అపుడు వా రారాజును జూచి 'యాశ్రమమునకు వచ్చిన కారణమే' మని యడిగిరి. ఇది నూటయిరువదియేడవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

తను మహర్షి వీరద్యుమ్నునకు దుర్లభ
వస్తువును గృశతరమైన యాశయును బ్రతి
పాదించుట.

రాజు—'నేను వీరద్యుమ్నుం డను రాజను. దిక్కులయందు, బ్రసిద్ధిగన్నవాఁడను. నాకొడుకు భూరిద్యుమ్నుండు గానకపోఁగా వానిని వెదకుటకై యడవికి వచ్చితిని. బ్రాహ్మణోత్తమా! వాఁడొక్కఁడే పుత్త్రుఁడు; మఱియు బాలుఁడు; ఏ తప్పును లేనివాఁడు. అట్టివాఁ డీవనమునఁ గనఁబడకపోయెను. వానిని వెదకుటకై క్రుమ్మఱుచున్నాను' అనెను. అందులకు ముని ముఖము వాంచి మాటాడకయే యుండెను గాని యాసనుయమున రాజును జూచి బదులు చెప్పఁడయ్యె. ఏలనఁగా మును పారాజు

తా నా బ్రాహ్మణుని నంతగాఁ బూజించినవాఁడు గాఁడు. దానిచే నతఁ డాశ చెడి దీర్ఘమయిన తపము నాశ్రయించెను. అతఁ డప్పుడు 'నే నేవిధముననూ రాజులవలనఁగాని తక్కిన జాతులవారివలనఁగాని ప్రతిగ్రహము చేయుట లేదు' అనుబుద్ధిని గలిగించుకొనెను. అతఁడు తనలో 'ఆశయే కదా పట్టుకొని యవివేకి యగు పురుషుని మాఁటాడించుచున్నది. నేను నామనస్సుననుండి యాయాశను దఱిమి వైచెద ' నని తలఁచి యట్లు గట్టిగానుండెను. వీరద్యుమ్నుఁ డా మునివరునిఁ జూచి ' ఆశ పలుచఁదన మెంత ? భూమియందు దుర్లభ మెద్ది ? మహాత్మా ! నీవు ధర్మార్థములను గనుఁగొన్న వాఁడవు గాన దీనిని నాకుఁ జెప్పుము' అని యడిగెను. అంతఁ గృశతనుండయిన యమ్ముని యప్పుడంతయును దలంచుకొని రాజును గూడఁ దలఁపించుచు నతనితో 'రాజా ! పలుచఁదనమునందు (కృశత్వమునందు) ఆశకు సాటియైన దొక్కటియు లేదు. నేను బెక్కురాజులను బ్రార్థించి * యది తోఁపించు వస్తువు కంటె దుర్లభమయినది లేదని కనుఁగొంటిని' అనెను. రాజు 'బ్రాహ్మణోత్తమా, నీమాటలవలన నేది కృశమో యేది కృశముగాదో తెలిసికొంటిని. ద్విజుఁడు గాని వానియందు వేదవాక్యమువలెనే, ఆయాశయందుఁ దోఁచువస్తువే దుర్లభ మని తెలియనయ్యెను. మహాప్రాజ్ఞా ! అయినను నామనసునం దొక సందేహమున్నది. నే నడుగఁగా దానిని గలయూపునఁ జెప్ప

* 'తస్యా వై దుర్లభత్వాచ్చ ప్రార్థితః పార్థివోమయా' అని పాఠాంతరము. దాని నడంప శక్యము గానందున నే రాజును బ్రార్థించితినని యర్థము. ఇది మఱింత సమంజసము.

వలయును. నీకంటె మిక్కిలి కృశముగా నుండున దేది? (ఈభూమి యందు దుర్లభ మెద్ది ?) బ్రాహ్మణవర్యా ! పూజ్యుండ వగు నీవు గోప్యముగా దేని దీనిని జెప్పవలయు' ననెను. ఋషియు 'తృప్తి గల యాచకుఁడు దొరకుట మిక్కిలియు నరిది. లేక యట్టివాఁడీ లోకమునందు లేదనవచ్చును. నాయనా! అంతకంటెను యాచకు నవమానింపకుండువాఁడు దొరకుట మిక్కిలియు నరిది. ఒకటి చేసెదమని ప్రతిజ్ఞ చేసి తమచేతనైన కొలఁదిని యాచకుని కర్హ మగురీతిని దానిని జేయకుండువారి నాశ్రయించిన * యాశయో నా దేహమునకంటెఁ బలుచనైనది. కృతఘ్నులయందును క్రూరులయందును, సోమరులయందును, అపకారులయందును, నుంచినయాశ నాకంటెను బలుచనైనది. ఒక్కఁడే పుత్రుఁడుగల తండ్రి, యాపుత్రుఁడు గానక పోయినను లేక దేశాంతరగతుఁడైనను వాని వృత్తాంతము దెలియకుండునేని యట్టితండ్రి యాశ నాకంటెను బలుచనైనది. రాజా ! ముదుసలి పడఁతులకుఁ బుత్రుఁడు కావలయునని ప్రసవమందుఁ గలుగునట్టి యాశయు, అట్లె ధనవంతులకుఁ గలుగునాశయు, నాకంటెఁ బలుచనైనవి. వయసు పెరిఁగినకన్యలకుఁ దమమోఁగులఁ బెండ్లిముచ్చట లెవ రేని యాడునపుడు వినఁగా వారిమనసునందుఁ బెండ్లి చేసికొనఁ బొడమునట్టియాశయు నాకంటెఁ బలుచనయినది' అనెను. అది విని యారాజు తనయంతఃపుర స్త్రీలతోడ, శిరసు మునియడుగులు సోఁక నతనికిఁ గ్రిందఁబడి మ్రొక్కి 'మహాత్మా ! నీయనుగ్రహమును వేఁడెదను. పుత్రునిఁ జేరుటకు నువ్విళ్లూరెదను.

* అట్టిప్రతిజ్ఞా ఘాతకులను నమ్మరాదనియు, అట్టివారియందు ఆశయుంచువారి యాశ తనదేహమునకంటె పల్చనయనియు ఆశయము.

నీ విప్పుడు చెప్పినదంతయు యుక్తమే; నీవు కోరినవరము లడుగుము. నీవాక్యములు సత్యములనుటకు సందేహము లేదు' అనెను. ఋషభుఁడు—అంత ధార్మికోత్తముఁడా పూజ్యుఁడు తనువు నవ్వి, తపస్సుచేతను శ్రుతముచేతను నతనిపుత్త్రుని వేగ రప్పించి యారాజును (తన్ను మున్నవమానించి నందులకు) దూఱెను. అంత నాధార్మికోత్తముఁడు తన్ను ధర్మదేవతగాఁ జూపెను. అతఁ డద్భుతముగాఁ బొడకట్టుచున్న తనదివ్య స్వరూపమును జూపి యంత నేకోపమును వైరమును లేక దాపుననున్న వన మందుఁ బ్రవేశించెను. రాజా! నేను దీనినంతయుఁ గన్నారఁ జూచితిని, ఈ మాటలును వింటిని. కాఁబట్టి, మిక్కిలి పలుచ నయిన యీయాశను వేగ దిగవిడుపుము' అనెను. భీష్ముఁడు—'రాజా! అప్పుడు మహాత్ముం డగు ఋషభుఁ డట్లు చెప్పఁగా నాసుమిత్త్రుఁడు తోడనే మిక్కిలిపలుచనయిన యాశను వీడెను. కౌంతేయా! నీవు నిట్లు నేను జెప్పిన యీమాటను విని హిమవంతముంబోలె నిశ్చలుండవై స్థిరుఁడవై యుండుము. రాజా! ఈలోకమందు నీవే, కష్టములయిన యిట్టివిషయములను గుఱించి యడుగువాఁడవుగను వినువాఁడవుగను నున్నావు. నావలన నిది విని నీ విఁక నిహవిషయములందు సంతాపము నొందఁ దగదు' అనెను. ఇది నూటయిరువదిఎనిమిదవయధ్యాయము.



## రాజధర్మపర్వము.

(యముఁడు తలిదండ్రులకుఁ బరిచర్య సేయుట వారి ఋణమును దీర్చుకొనుట కుపాయమగునని గౌతమునకుఁ జెప్పుట.)

ధర్మరాజు—'భారతా! అమృతమునందుఁ దృప్తిగలుగనేరని యట్లు, నీవు చెప్పుదానియందుఁ జాలుననెడితలంపు నాకుఁగలుగకున్నది. [ఆత్మజ్ఞాన సమాధియందుండు వాఁ డెట్టి తృప్తినొంది యుండునో యట్టి తనివిగలిగి యున్నాఁడను.] పితామహా! కాఁబట్టి మరల నీవీధర్మవిషయమును నాకుపదేశింపవలయును. నేను నీ ధర్మోపదేశమనెడి యమృతపానము చేసి తృప్తినొందనేరకున్నాను' అనెను. భీష్ముఁడు—'ఈవిషయమున గౌతమునకును మహాత్ముఁడయిన యమునకును జరిగిన సంవాదమును పురాతనమయిన యీ యితిహాసము నుదాహరించెదరు. పారియాత్రమనెడు పర్వతమందు గౌతమున కొక పెద్దయాశ్రమ ముండెను. తపసుచేఁ బాపములనెల్ల దహించినట్టి యాగౌతముఁ డందు వసించుచుండెను. అమ్ముని యఱువది వేలసంవత్సరములు తపము చేసెను. అప్పు డట్లుగ్రముగాఁ దపము సలుపుచున్న యమ్మహాముని కడకు లోకపాలకుండయిన యముఁడు వచ్చి వినయంబు మీఱఁ గాంచెను. ఆ బ్రహ్మర్షి యు నట్లు వచ్చినవానిని, దేజస్సును బట్టి యముండని తెలిసి చేతులుమోడ్చి ప్రణుతుఁడై పొంతకుఁ బోయెను. యముఁడును నా బ్రాహ్మణోత్తమునిఁ జూడఁగానే నమస్కరించి 'నేను ధర్ముఁడను. మీకేమి చేయవలయును?' అని చెప్పి రాఁబట్టుకొనెను. గౌతముఁడు 'పురుషుఁ డేమి కావించి తలిదండ్రులయెడ ఋణము లేని వాఁ డగును? పడయఁ దరము

గాని పుణ్యలోకములను నెట్లు పడయును ?' అని యడిగెను. అందులకు యముఁడు 'ఎప్పుడును దపమును శౌచమును గలిగి సత్యధర్మపరాయణుఁడై యహరహమును దలిదండ్రులకుఁ బూజను దానే చేయుచుండవలయును. ఆప్తదక్షిణలతోఁ గూడిన యశ్వమేధయాగములు పెక్కులు చేయవలయును. దానిచేతఁ బురుషుఁ డద్భుతముగాఁ గనుపట్టు పుణ్యలోకములను బడయును' అనెను. ఇది నూటయిరువదితొమ్మిదవయధ్యాయము.

---

## రాజధర్మపర్వము.

భీష్ముఁడు ధర్మరాజునకు రాజాపత్కాలమందు ప్రజలను బీడించిగూనను బొక్కసము నవశ్యము వృద్ధిచేయువలయునని చెప్పుట.

ధర్మరాజు—'భారతా! మిత్రులు దిగవిడిచిన వాఁడును బెక్కు శత్రువులు గలవాఁడును బొక్కసము క్షీణించినవాఁడును సైన్యము లేనివాఁడును నగు రాజు నడచుకొనవలసిన దెట్లు? మఱియు వానిచుట్టును దుష్టు లగు మంత్రులున్నను, వాని మంత్రము లన్నియునుఁ బర్విననను, వాని కేదారియుఁ దోఁపకున్నను, పరరాష్ట్రముపై దండెత్తినపుడును, పరరాజ్యమునుబట్టి నలంచుచున్నపుడును, దాను దుర్బలుఁడై యున్నను బలవంతునితో విగ్రహించుచుండునపుడును, ఎట్లు నడచుకొనవలయును? మఱియు వాని రాష్ట్రము చక్కఁగా రక్షింపఁబడకున్నను, వాఁడు కాలదేశములను దెలియకున్నను, తాను మిక్కిలియుఁ బీడితుఁడగుటవలనఁ బ్రజలయందు నిమ్మళపాటుగాని శత్రువులయందు భేదముగాని పుట్టింప శక్యముకాకున్నను, వానినడక యేమి? వాఁడు చెడ్డ యుపాయములచేత ధనమును బడయఁ జూడ

వలయునా ? లేక ధనమును గోరకయే ప్రాణమును దిగవిడువ వలయునా ? ఏదిచేసిన లెస్స ?' యని యడిగెను.

భీష్ముఁడు—'ధర్మజ్ఞా ! నీవు మిక్కిలి రహస్యమైన ధర్మమును గుఱించి నన్నడుగుచున్నావు ? ఈ ధర్మము నడుగకయే చెప్పుటకునే నుత్సహింపను. భరతసత్తమా! ధర్మము మిక్కిలియు సూక్ష్మమైనది సుమీ ! అది శాస్త్రములు చెప్పుటవలన నొకఁడు తెలిసికొనుచున్నాఁడు. విన్నదానిని మనస్సునకుఁ దెచ్చుకొని యనుష్ఠించియు మంచి యాచారము లాచరించియు నొకఁడొక్కయెడ సాధువుగావచ్చును. రాజు బుద్ధి మున్నిడికొని కార్యముచేసియు ధనవంతుఁడయినను గావచ్చును ; కాకయుఁ బోవచ్చును. నీవు నీ సొంతబుద్ధినిగొని నీప్రశ్నమున కీవిషయమున నేమి బదులు చెప్పవలయునో యాలోచించి చూడుము. భారతా ! రాజులాపదలందుఁ దాము వ్యవహారము నడపుకొనుటకై మిక్కిలియు ధర్మయుక్తమగు నుపాయ మేదియో వినుము. కేవలము ధర్మమును బట్టిచూడఁగా, నే నిట్టియుపాయములను ధర్మములని చెప్పను. దుఃఖపెట్టి బొక్కసమును నించుకొన్నయెడ నిట్టి నడక రాజును బిదప మృత్యువు దరికిఁదెచ్చును. ఈ విషయమై యాలోచింపఁగా,బుద్ధిమంతుల నిశ్చయమే యిది యగును. మనుష్యుఁడు నిత్యమును నెట్టియెట్టి శాస్త్రమును జదువుచున్నాఁడో యట్టి జ్ఞానమే వానికిఁ గలుగును. అట్టి విజ్ఞానము వాని కిష్టముగానే యుండును. విజ్ఞానము లేమివలనఁ బురుషున కుపాయ నాశమును విజ్ఞానమువలన నుపాయమును గలుగుచున్నది. ఉపాయమనఁగా సంపత్తిని గలిగించెడి పరమ సాధనము. నీవు శంకయు నసూయయులేక నేనిదె చెప్పునది వినుము.

బొక్కసము తగ్గుటవలననే రాజునకు మిక్కిలి బలమును దగ్గును. రా జెప్పుడును జలములేని యడవిపట్టున జలమును బుట్టించువిధమున, నే యుపాయమైనఁ బన్ని బొక్కసమునునిండింపవలయును. రాజు పూర్వు లాచరించిన యీ యుపధర్మము నూఁది కాలము వచ్చినపుడు ముందు పీడించిన ప్రజలయెడ ననుగ్రహము చూపవలయును; సంతోష పఱుపవలయును. ఈ ధర్మ మిట్టి యాపత్కాలమందు యుక్తమగును. సమర్థులగువారికి (సామాన్యసందర్భములందు) ధర్మము వేఱు. ఆపత్సమయములందు ధర్మము వేఱు. బొక్కసములేకయు రాజు (తపోవ్రతాదులవలన) ధర్మమును బడయవచ్చును. ధర్మమునకంటె జీవనము మఱియుగొప్పది. (జీవనము ధనములేక జరుగదుగాని ధనమును బడయుటకు విఘ్నముగావించు ధర్మమును బూనరాదు). బలహీనుఁడయిన రాజు వట్టిధర్మమునుమాత్రము పడయునేని జీవనమునకు న్యాయమయిన మార్గములను బొందఁజాలఁడు. మఱియు నతఁడు తా నెంతపాటు పడినను ధర్మముచేతనే బలిమి నొందఁజాలఁడు. కాన యాపదలందుఁ గావించు నధర్మములును ధర్మలక్షణము గలవిగా వినఁబడుచున్నవి. అయినను విద్వాంసు లట్టికర్మము లధర్మము కలిగించుననియె తెలియుదురు. ఆపద తొలఁగిన పిదప క్షత్త్రియునకు దోషమును బోకార్చునట్టి ప్రాయశ్చిత్త మేమి విధింపఁబడి యున్నది? అతఁ డట్టిసమయమునఁ దనకు ధర్మము కుందకుండునట్లుగా నడచుకొనవలయును. మఱియుఁ దన శత్రువు వారికిఁ * జిక్కకుండునట్లుగాను బ్రవర్తింపవలయును. ఇవియు

* అనఁగాఁ దాను శాంతికవిధులు చేసికొని తాను బీడించినవారికి ద్వేషము గలుగకుండునట్లు హితము లాచరింపవలయునని భావము.

వానికిఁ గర్తవ్యములుగాఁ జెప్పెదరు. అవి పోవఁగా నతఁడు దైన్యము నొందరాదు. ఆపత్కాలమందుఁ దనధర్మమునుగాని, బరులధర్మమునుగాని పాటింపవలసినది లేదు. సర్వవిధముల యిన యుపాయములచేతఁ దన్నుఁ దాను విడిపించుకొనవల యును. ఇదియే నిశ్చయము. ధర్మవిదు లగు బ్రాహ్మణులు ధర్మమునందు నిపుణులుగా నుండవలయు ననుట నిశ్చయింపఁ బడిన దని శ్రుతిగలదు. అట్లె క్షత్రియుఁడు బాహువీర్యము గలవాఁడు గానయుద్ధమందు నిపుణుఁడై యుండవలయునని యది చెప్పెడిని క్షత్రియునకుజీవనమార్గమునకడ్డగలిగినపుడుతాపసులయుక్షత్రియులయుసొమ్ముతప్పఁదక్కిన దేదియువాఁడెత్తికొనవచ్చును. బ్రాహ్మణునకు,గుందునొందినపుడు,యాగముచేయింపరానివానికి యాగముచేయించుటయు భుజింపరానిదానిని భుజించుటయు నెట్లుకూడునోయట్లె,క్షత్రియునకుఁ దక్కిన యెవరిసొమ్ము నేనియుఁగయికొనఁజెల్లును ఇందులకు సందేహము లేదు. ఆపదగలవానికిఁబోరాని దారియేది ? (చెఱ మొదలగునవానిచే) అడ్డగింపఁబడిన వానికి (తప్పించుకొను విషయమునఁ) జెడ్డదారి యేదియుఁగాదు. ఒకఁడు పీడింపఁబడినపుడు వాఁడు తప్పుదారిని దప్పించుకొని పరుగి డును. అట్లె యిదియు. క్షత్రియుఁడు బొక్కసముతఱిఁగి సేన యుఁగుంది మిక్కిలియుఁ గీడ్పడియున్నపుడు వానికి భైక్షచర్య గాని వైశ్యశూద్రుల జీవనవృత్తిగాని విహితముగాదు. వానికి యుద్ధమునను జయమునను ధనమును బడయుటయే స్వధర్మము. వాఁడు తనజాతివాని మఱొకని నెప్పుడును యాచింపరాదు. వాఁడు తన స్వధర్మమును దిగవిడువవలసి నట్టియాపద గలిగిన పుడు తన మొదటికల్పమునకు (స్వధర్మమునకు) రెండవకల్పము

(అనఁగాఁ బ్రజలను బీడించియేని ధనమును బడయుట) చొప్పున జీవనముచేయుట న్యాయమగును. ఆపద నొందినవాఁడు ధర్మమును సంబంధించిన న్యాయమును విడిచియు బ్రదుకవచ్చును. ఇది జీవనమునకు లోపముకలిగినపుడు బ్రాహ్మణులయందుఁ గానఁబడినది. క్షత్రియునివిషయమై యిది నిస్సందేహముగా నిష్కర్షింపఁబడి యున్నది. క్షత్రియుఁడు ధనముగోరినపుడు ప్రజలవలననుండి ధనమును దీసికొనవచ్చును. తానెట్లును గీడ్పడకుండునట్లు చూచుకొనవలసినది ముఖ్యము. క్షత్రియుఁ డార్తులయిన ప్రజలను రక్షించువాఁడని చెప్పుదురు. కాఁబట్టి రక్షనుగావించువాఁడగురాజు ప్రజలధనము నెత్తికొనవలయును. ఈలోకమందు క్షత్రియులు గానివారియందు నయిన మెటునంటె మనుష్యునకును హింసలేని జీవనము గలుగదు. అడవియం దొంటరిగాఁ దిరుగుచుండు మునులకును, తలవ్రాలుచొప్పున జరుగునని నమ్మి బ్రదుకుట శక్యముగాదు. ప్రజారక్షణము సేయఁగోరు క్షత్రియునకు నిది మిక్కిలియు నశక్యము ఆపత్కాలమం దెల్లప్పుడు రాజును రాజ్యమును నొండొరుల రక్షింపవలయును. ఇది సనాతనమయిన ధర్మము. రాజాపత్కాలములందు నరాదులను గొని రాజ్యమును రక్షించునట్లు, రాజ్యము నైతమాపత్కాలమందు రాజును రక్షింపఁ దగియుండవలయును. రాజు తనకెంత యాపదకలిగినను, రాజ్యమును సంబంధించిన బొక్కసమును, దండమును, సైన్యమును, మిత్రులను, సుహృదులను, మఱియుఁదక్కిన ముఖ్యులను దిగవిడువరాదు. ధర్మవిదు లగువా రన్నమును దగ్గించియైన విత్తమును* సంపాదింపవలయు నందురు. ఈ యాపద్ధ

* విత్తములను మిగత పడకుండునట్లు భుజించినచో పిదప భోజనము

ర్మము మహామాయుఁడయినశంబరాసురుని మతమని చెప్పుదురు. ఎవనిరాజ్యము జీవనము లేక కష్టపడుచున్నదో, ఎవఁడు వేఱు గతిలేక జీవనమునకై దేశాంతరమునకుఁ బోవుచున్నాఁడో, యట్టిరాజు బ్రతుకు, ఇస్సీ! నింద్యము. రాజునకు మూలము బొక్కసమును సైన్యమును. అతని సైన్యమునకు మూలము బొక్కసము. ఆసేన సమస్త ధర్మములకును మూలము. ప్రజలకు మూలము ధర్మము. ఈలోకమందు నితరులను బాధింపకయే బొక్కసమును సంతరించుటకు వలనుగాదు. మఱి సేనగాని యెక్కడిది? అట్టి బొక్కసమునకై పీడించుటవలన రాజు దోషమును బొరయఁడు. చేయఁదగనివికూడఁ గార్యముకొఱకు యాగములందుం జేయఁబడుచున్నవి. ఆపత్కాలమందు బొక్కసము కూర్చుటకై చేయఁదగనివి చేసినను, ఈ కారణమునుబట్టి దోషమును బొందఁడు. ఆపదయందుఁ బ్రజలను గట్టిపెట్టుట వారి క్షేమమునకుఁ గారణమగును. గజము లశ్వములు మొదలయిన వానిని రక్షించుట నిష్ఫలమైనను నది యంతయు ధనమును జేర్చుటకుఁ గారణమగును. బుద్ధిమంతుఁడగు రాజట్టి బుద్ధిగలిగి తన కార్యములను నిష్కర్షించుకొనవలయును. యాగములకు మఱొకటి (అనఁగాఁ బశువులు) సాధనము; యాగము మఱొకటికి (అనఁగాఁ జిత్తశుద్ధికి) సాధనము. పశువులు, యాగములు, చిత్తశుద్ధి యన్నియును మోక్షమునకు సాధనము లగుచున్నవి.

---

అరుదగును. అన్నమును దగ్గించియైన విత్తనములను నిలువఁబెట్టినచోఁ బిదప చక్కఁగా దొరకును. అట్లె ప్రజలు ధనముతగ్గినరాజును వృద్ధికిఁ దెచ్చినచో పిదప రాజుచేతఁ బ్రజలు రక్షితులగుదురు. రాజునకు విపత్తుగలిగినచోఁ బ్రజలు నశింతురు - అని యొక వ్యాఖ్యయందుఁ జూపట్టుచున్నది.

ఇట్లే నీతియు దండమును బొక్కసమునకును, బొక్కసము సేనకును, నీతి బొక్కసమును సేనయు మూఁడును బగవారి నుఱుమాడి రాజ్యమును గాచి వృద్ధినొందించుటకును సాధనములగును. ఈవిషయమై ధర్మతత్త్వమును నిరూపించునట్టి యొక దృష్టాంతము చూపెదను. యాగమునకై యూపమునకుఁ దగిన మ్రానును గొట్టుచున్నారు. దానిని గొట్టునపుడు దాని కడ్డుగానున్న తక్కిన చెట్లనుగూడ నఱకుదురు. ఈచెట్లు గూలునపుడు దాపున నున్నయితరవృక్షములను విఱుచుచున్నవి. ఈవిధముననే బొక్కసమును బెద్దది గావించుటకు నడ్డుగానుండు వారినందఱను జంపకతీఱదు. మఱియొక విధమున నీసిద్ధిని బడయుట నాకుఁ దోఁపకున్నది. ధనమువలన నిహమును బరమును సత్యమును ధర్మమును జయింపవచ్చును. ధనములేనివాఁడు శవమే యగును. సర్వవిధములయిన యుపాయములచేతను యాగమునకు నుపయుక్తమగు ధనమును సంపాదింపవలయును. భారతా! ఆపత్కాలమందుఁ జేసిన కార్యమునకుఁ గలుగు దోషమును, ఆకార్యమునకే యితర సమయములందుఁ జేయఁగాఁ గలుగు దోషమును, సమములు గానేరవు. ధనమును బడయుటయు విడుచుటయు రెండును నొక్క పురుషునియందే కలుగుట యరిది. రాజా! అడవియందు ధనవంతుఁడగువానిని నేను జూడలేదు. లోకమున ధనమని కనుపట్టు నొక్కొక్కవస్తువును గుఱించియుఁ బ్రతిమనుజుఁడును మఱియొక్కనితో 'ఇది నాకువలయును. ఇది నాకువలయు' నని మచ్చరికించుచుండును. ఏవిధమునను రాజునకు రాజ్యలాభముతో సమమయిన దొక్కటియు లేదు. బ్రజలకు సాధారణకాలములందు బరువయిన పన్నులు

విధించి పీడించుట రాజున కెంతయు నధర్మము. అది మఱియొక (య్యాపద) కాలమందు వేఱగును (ధర్మమగును). కొందఱు దాన ములచేతను యజ్ఞములచేతను, మఱికొందఱు బుద్ధిచేతను సామ ర్థ్యముచేతను ధనమును సంతరింతురు. ధనము లేనివానిని దుర్బ లుఁ డందురు. ధనముగలవాఁడు బలవంతుఁడగును ధనముగల వాని కన్నియుఁ బడయఁగూడును. బొక్కసము చక్కఁగా నిండి యున్న రాజు, సమస్తమును జయించును. బొక్కసమువలన ధర్మ మును, గామమును, బరలోకమును, నిహలోకమును నన్నిటిని ధర్మంబునఁ బడయవచ్చును. అయినను బొక్కసమును, ధర్మ మును మున్నిడికొనియే నింపవలయునుగాని, యాపత్కా లములందు ధర్మములగు నధర్మములు దప్పఁ దక్కిన యధర్మ ములచే నింపరాదు' అనెను. ఇది నూటముప్పదియవయధ్యా యము.

* రాజధర్మపర్వము సమాప్తము.



శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

ఆ ప ద్ధ ర్మ ప ర్వ ము.

భీష్ముఁడు రాజాపదయందు సర్వస్వమును బరిత్య జించి యైనఁ దన్ను రక్షించుకొనవలయునని చెప్పుట.

ధర్మరాజు—'భారతా! క్షీణించినవాఁడును, సోమరియును, బంధువులు నశింతురనుభయమున యుద్ధమునకు రానివాఁడును,

* ఉదీచ్యకోశములందు రాజధర్మపర్వమునకు రాజధర్మానుశాసనపర్వమని నామాంతరము.

ఎప్పుడును ముఖ్యులయందు సందేహపడుచునే యుండువాఁడును, మంత్రముల గావనేరనివాఁడును నగురాజునకు, నింతవఱకుఁ జెప్పినదికాక మఱియుఁ జేయవలసిన దేమియున్నది? మఱియుఁ దనరాజ్యమును బురజనులను శత్రువులు పంచుకొన్నట్టి వాఁడును, ధనసమూహము గోలుపోయినవాఁడును, దారిద్ర్యము వలన మిత్రులను గారవింప లేనివాఁడును, సర్వవిధముల భిన్నులయినమంత్రులు గలవాఁడును, శత్రుసేనలచే నెదిరింపఁబడినవాఁడును, దుర్బలుఁడును, బలవంతుఁడగు శత్రువులచే మనస్సు గలంపఁబడినవాఁడును నగు రాజునకు మఱియు నేమి చేయఁదగియున్నది? దానిని జెప్పవలయు'నని యడిగెను. భీష్ముఁడు 'దండెత్తివచ్చిన శత్రువు పరిశుద్ధమయిన మనస్సు గలిగి ధనమందే కాక ధర్మమందును గుశలుఁడుగా నుండునేని నీవు చెప్పినట్టిరాజు మునుముట్ట జాగుసేయక యతనితో సంధి చేసికొని ముందు వానిచే నాక్రమింపఁబడిన రాజ్యభాగములను విడిపించుకొనవలయును. అట్లు దండెత్తివచ్చినవాఁడు ధర్మంబున జయింపఁగోరినవాఁడును బలవంతుఁడును బాపమునందె పట్టుగలవాఁడునుగా నుండునేని యట్టివానితోను, దనరాజ్యమందలి కొన్నిగ్రామము లిచ్చియైనను సంధిచేసికొనవలయును. పయినెత్తివచ్చినవాఁడు సంధికెంతమాత్రము సమ్మతింపఁడేని, రాజు, తనరాజధానినైనను విడిచియో లేక మఱియే యుపాయమును జేసియో యాపదను దాఁటుకొనవలయును. రాచఱికమునకుఁ దగినవాఁడుసుఖులోడ నుండినయెడల మరల నట్టి ధనములను సంపాదించుకొనవచ్చును. సంభవించిన యాపదలను బొక్కసమును బలమును దిగవిడిచినచోఁ దప్పించుకొనఁ గూడు

నేని, యప్పుడ సర్వధర్మములు దెలిసినవాఁడెవఁడా రెంటిని ద్యజింపక వానికంటె నెక్కుడయిన తన్నుఁ ద్యజించుకొనఁజూచును? * రాజు తన యంతఃపురపు వారిని బదిలముగాఁ గావఁజూడవలయును. వారు శత్రువు బారిం జిక్కినేని వారికొఱకై (తన్నుఁ జిక్కించుకొనినైన విడిపింపవలయునని) దయచూపరాదు. రాజు తనకు శక్యమయినంతవఱకుఁ దన్ను శత్రువునకుఁ బట్టియిచ్చుకొనరాదు' అనెను.

ధర్మరాజు 'తనమంత్రులు మొదలయినవారు తనయెడఁగోపముగొనియుండఁగాబయటనుండియెత్తివచ్చినవారుతన్నుఁ బీడింపఁగా, తనబొక్కసము క్షీణింపఁగా, తనమంత్ర రహస్యములు బయలుపడఁగా, నపు డట్టిరా జేమి చేయవలయును?' అని యడిగెను.

భీష్ముఁడు 'రా జట్టి సందర్భములందు (శత్రువు ధర్మబుద్ధి గలవాఁడేని) వేగిరముగా సంధిచేసికొనవలయును; (అధర్మబుద్ధిగలవాఁడేని) వేగముగాఁ దీవ్రమయిన పరాక్రమము నెఱపవలయును. పరాక్రమము నెఱపినచో వేగముగాఁ బగవాఁడు పరువిడును. లేక వానిచేత యుద్ధమున మరణము గలుగునేని దానిచేతఁ బరలోకముగలదు. రాజు తనసేన యల్పమయినను నది తనయెడ భక్తియు సంతుష్టియు బుష్టియుఁ గలిగినదై యుండునేని, దానిచేతనే భూమిని జయించును; చంపఁబడినైనను స్వర్గమును జయించును; పగవారిని జంపినైనను సుఖమును బడయును. యుద్ధమునందుఁ బ్రాణములను విడుచువాఁ డింద్రుని

* 'అవరోధాన్ జుగుప్సేత' యనిమూలము. 'అపరాధాన్ జుగుప్సేత' యని దాక్షిణాత్యకోశము. ఇదియొంతయు నప్రాకరణికముగా నుండుట తెలియునది.

తోడి సాలోక్యమును బడయునుగదా. *[యుద్ధమువాని శాంతతను బొందుటకై సకలజనులు తెలియునట్టి మార్గము గావించి నమ్మికగలిగించి యడఁకువగలిగి యుండవలయును. (అడఁకువ తెలుపుటకు) పాదరక్షలనేని విడిచి పుచ్చవలయును. వేగముగా బయటవెడలిపోవఁ గోరువాఁడుతనసైన్యమును మంచిమాటలచే సమాధానపఱిచి దేశాంతరమునకుఁ బోయినపిదప నాలోచించి పిదపఁ దాను వలయుదాని నుపక్రమింపవలయును]' అనెను.
ఇది నూటముప్పదియొకఁడవయధ్యాయము.



## ఆపద్ధర్మపర్వము.

భీష్ముఁడు రాజు దుష్టులనుండి ధనము నాక్రమించి యైన నాపదనొందిన బ్రాహ్మణులను రక్షింపవలయు ననుట.

ధర్మరాజు- 'పితామహా! సమస్తప్రజలకును గోరందగినదియు రాచఱికమునకు మిక్కిలి ముఖ్య మయినదియు నగు ధర్మము కొఱవడఁగా, భూమియందు జీవనమంతయు దొంగల పాలు కాఁగా, నిట్టి చెడుకాలము వచ్చినపుడు బ్రాహ్మణుఁడు, నెయ్యమునను గనికరమునను దనపుత్రపౌత్రులను విడువఁజాలక దేనిని గొని జీవింపఁగలఁడు?' అని యడిగెను.

భీష్ముఁడు—'అటువంటి సమయము వచ్చునపుడు తెలివి బలిమి నూఁది బ్రతుకవలయును. లోకమునందుఁ గనుపట్టు సమస్త వస్తువులును సాధుజనులకే యగును. అసాధువుల కొక్కటియు

* ఈకుండలీకరణములోనిది ప్రతాపచంద్రరాయలపాఠమున లేదు.

నిందుఁ గలుగదు. ఎవఁడు ప్రాప్తికిఁ దన్ను సాధనముగాఁ జేసికొని యసాధులకడ నున్నధనమును దీసి సాధువుల కిచ్చునో వాఁ * డాపద్ధర్మములను దెలిసినవాఁడగును. రాజా ! రాజు తన రాచఱికమును జరుపఁగోరినవాఁడై తన ప్రజలకుఁ గోపముకలిగింపకయుఁ, గలహింపఁజేయకయు, సొంత కాఁపు ధనమును దానై యియ్యకపోయినను దానిని 'తమ్ముని ధనమునాఁది' యని మెలపునఁ దీసికొనవచ్చును. ఒకఁడు జ్ఞానముచేతను,బలిమిచేతను బరిశుద్ధుఁడై తక్కిన సమయములందుఁ జక్కని నడవడి నడవఁ దెలిసినవాఁడగు ప్రాజ్ఞుఁడగునేని యట్టివాఁ డాపత్కాలమునందు నిందితములయిన కార్యములందుఁ బ్రవర్తించుచున్నను నతని నిందు నిందించుట కెవఁడు తగును? ఎవఁడును దగఁడు. యుధిష్ఠిరా ! ఎవరు తమబలిమి నెఱపియె బ్రతుకు గావించుకొను చుందురో యట్టివారికి వేఱువిధమున జీవించుట రుచింపదు. బలవంతులగువారు తేజముతోనే ప్రవర్తింతురు. ఆపత్తున కగుశాస్త్రమిట్లు సామాన్యముగా రాజనుష్ఠింపవలయును. మఱియు నతఁడు మేధావియు నగునేని యాపదలయం దీశాస్త్రము చెప్పననే కాక యింతకంటె † నెక్కువగాను నడచుకొనవచ్చును.

---

* 'ఆపద్ధర్మవిత్' అనిమూలము. 'ఆపద్ధర్మకృత్' అని దా. మూలము. ఆపద్ధర్మముల ననుష్ఠించువాఁ డనుట.

† సామాన్యముగా రాజాపత్సమయములందు జనులపయిని బరువయిన పన్నులు విధించి బొక్కసము నాపద్ధర్మశాస్త్రము చెప్పున నించుకొనును. అతఁడు బుద్ధిమంతుఁడు నగునేని యాశాస్త్రము చెప్పుననే యందఱకును బన్నులు విధించుటను విడిచి యపరాధులు నితర దేశజనులు దుష్టులు మొదలగు వారికి దండుగలు విధించి తక్కిన ప్రజల నొప్పింపకయే బొక్కసము నించునని భావము.

సత్కృతులును బూజితులునగు ఋత్విజులును బురోహితులును నాచార్యులునగు బ్రాహ్మణులును (మిక్కిలిగా ధనముగలవారై యున్నను) వారిని ధనమునకుఁ గాను బీడింపరాదు. పీడించినచో దోషములొందును. ఈ శాస్త్రము లోకమునకుఁ బ్రమాణము. ఇది సనాతనమయిన చూపు. దీనిని బ్రమాణముగాఁ గొని మంచిదో చెడ్డదియో దీని చొప్పున నడచుకొనవలయును. గ్రామమందుండు మనుష్యులు వెక్కండ్రొకరిపై నొకరు దోషములు చెప్పుదురు. రాజు వారలవచనములను విని సత్కారము చేయుటగాని పీడించుటగాని తగదు. అపవాదపు మాట లే విధమునను బలుకఁదగదు; వినను దగదు. అపవాదము లాడు చోటఁ జెవులను మూసికొనవలయును. లేక యచ్చటనుండి మఱియొకచోటికేనియుఁ బోవలయును. అపవాదములాడుటయుఁ గొండెము చెప్పుటయు సాధువుల స్వభావముగాదు. యుధిష్ఠిరా! సాధువు లెప్పుడును గుణములనే యెత్తిచెప్పుదురు. మంచి స్వభావము గలిగి చెప్పినట్లు లోపడునవియును జక్కఁగా బనుపడినవియు బరువు లెస్సగా మోయునవియు నగు కవయెద్దులు, కాఁడికి మెడనిచ్చి బరువును మనఃపూర్వకముగా నీడ్చునట్లు, రాజును నాపదలందుఁ గష్టభరములను సైఁపవలయును. రాజు తానట్టి సమయములం దెట్లుండినఁ బెక్కండ్రు సహాయులు చేరుదురో యట్లు నడచుకొనవలయును. ఆచారమునే ధర్మమునకు గొప్పలక్షణమనికొందఱు చెప్పెదరు. *శంఖలిఖితునిధర్మమందుఁ

* ఇక్కడ భావమేమనఁగాఁ గొందఱు ఋత్విజులను బ్రాహ్మణులను దండించుటయుఁ బన్ను విధించుటయుఁ దగదందురు. ఇది సనాతనమైన యాచారముగాన నీతియేయగును. వేఱుకొందఱు శంఖుఁడు లిఖితునియెడ నడ

బ్రీతిగలమఱికొందఱు ఋత్విజులు మొదలయినవారు తప్పుచేసినను ధనము నపహరించుకొనుదండము తగ దనెడియీ ధర్మమును నెంత మాత్రమునొల్లరు. వారట్టు లాధర్మము నొల్లమనుట మచ్చరముచేతను గాదు, లోభముచేతను గాదు. గొప్పఋషులును. ధర్మవిరుద్ధముగా నడచినచో గురువునయినను దండింపవలయునని విధించుట కనఁబడుచున్నది. అయిన నీఋషులవచనమునకు ననుగుణమయిన ప్రమాణ మొక్కటియు నొక్కచోటను గానఁబడకున్నది. అట్టి మనుష్యులు బ్రాహ్మణాదులు, నీచులై దుష్కర్మము లాచరింతురేని దేవతలే వారిని దండింపవిడువవలయును. నెపము పన్ని ధనము సంపాదించువాఁడు ధర్మమును బోఁగొట్టుకొనును. సత్పురుషులచేతను సంపన్నులచేతను బూజింపఁదగినదియు, దనమనసునకుఁ దృప్తికరమగునదియు నగు ధర్మమేదియో దానినే పూనవలయును. ఎవఁడు * నాలుగు గుణములతోను గూడినట్టి ధర్మమును దెలియుఁడో వాఁడు ధర్మవిదుఁడు. సర్పముసడుగువలెనే ధర్మము కారణములును దెలియుటకష్టము. వేఁటకాఁడు తన బాణము గాఁడినమృగము పోయినదారిని నేలమీఁద దానియడుగు నెత్తురుపడిన పట్టులను

---

చుకొన్న ధర్మమునే యభినందించువారై యీ మతమునొల్లక యెట్టివానినైనను దండింపవలయునందురు. ఇట్లనుటకు వీరియందు మచ్చరముగాని లోభముగాని కారణముగాదు. మొదటి వారివలెనే వీరును ధార్మికబుద్ధులే యగుదురని భీష్ముని యభిప్రాయము దెలియునది. ఈరెండవతెగవారు ఋత్విజులను బ్రాహ్మణులను సైతము దండింపవలయు నందురు. (ప్రతాపచంద్ర రాయలు.)

* నాలుగు గుణములనఁగా శ్రుతి, స్మృతి, ఆచారము, తనమనస్సు లేక, వేదము, తర్కశాస్త్రము, కృషిశాస్త్రము, దండనీతియ నెడి యీ నాలుగు.

బట్టి తెలిసికొనునట్లు ధర్మముచొప్పులను దెలిసికొనవలయును. యుధిష్ఠిరా ! ఇట్లే మనుజుఁడు సత్పురుషులు త్రొక్కినమార్గమును వినయమునఁ ద్రొక్కవలయును. ఇదియె తొంటిరాజర్షుల వృత్తి. నీవు నిట్లె నడువుము" అనెను. ఇది నూటముప్పదిరెండవయధ్యాయము.

---

## ఆపద్ధర్మపర్వము.

భీష్ముఁడు రాజే విధమునను బొక్కసమును బెంపవలయు ననియు, దొంగలు నాపదలయందు ధనమునంతయుఁదోఁచుకొనక కొంతమిగిల్చి తక్కినవాని నపహరింపవలయుననియుఁ జెప్పుట.

భీష్ముఁడు—'రాజు తనరాజ్యమువలననుండియుఁ బరరాష్ట్రమువలననుండియు ధనముగడించి బొక్కసము గలిగించు కొనవలయును. బొక్కసమువలననే ధర్మము పెరుఁగుచున్నది. బొక్కసమువలననే రాజ్యమునకు మూలములు పెరుగుచున్నవి. కాఁబట్టి బొక్కసమును గలిగించుకొనవలయును. దాని నట్లు కలిగించుకొన్నపిదప (రిత్తవెచ్చములపాలుపుచ్చక) యెచ్చరికతో గారామునఁ బాలింపవలయును. అట్లురక్షించి జగమునకు నుపకారము చేయవలయును. ఇది సనాతనమైన ధర్మము. అట్టి బొక్కసము పరిశుద్ధ మయినభావముచేతఁగాని లేక క్రూరత్వముచేతఁగాని నింపఁదరముగాదు. ఈరెంటికి నడిమిపదము నూఁది కోశమును జేర్పవలయును. బలహీనుఁ డగువానికి బొక్కసమెక్కడిది ? ధనములేనివానికి బలమెక్కడిది ? బలములేనివానికి రాజ్య

మెక్కడిది ? రాజ్యములేనివానికి సిరియెట్లుకలుగును ? గొప్ప పదవి నొందినవానికి సంపద చెడుట మరణమునకు సాటియగును. కాఁబట్టి రాజు బొక్కసమును బలమును మిత్రులను బెంపవలయును. బొక్కసములేని రాజును మనుజు లవమానింతురు. వాఁ డిచ్చుకొంచెమునకు దనివినొందక వానిపనులయం దుత్సాహ మెంతమాత్రమును గలిగియుండరు. రాజు తనసంపదనుబట్టి యెంతయు గొప్పగౌరవమును బొందును. పడఁతి గుహ్యభాగములను బుట్టము గప్పిపుచ్చునట్లు రాజుపాపములను సంపద గప్పిపుచ్చును. రాజు ముందెవ్వరితోఁ గలహించెనో వారందఱు నతని కొ్రత్తసంపదకు ననుతాపపడుదురు. వారు కుక్కలవలె మరల నతనిక్రిందఁ గొలువుగయికొందురు.అయినను వా రతనిని జంపుటకు సమయమునే యెదురుచూచుచున్నను, రాజేమియుఁ గలుగనట్టు లట్టివారిని గయికొని యుండును. భారతా ! అట్టి రాజునకు సుఖమెక్కడిది ? రాజు పయిపయిని బోవుటకే పాటు పడవలయును; గాని యెప్పుడును గీడ్పడరాదు. ఉద్యమమే పౌరుషము. * కణుపులేనిచోట విఱుగనైనవచ్చును గాని యొక్కరికిని వంగరాదు. అతఁ డడవులకేనియుఁ బోయియుండి మృగసమూహములతోఁగూడఁ జరింపవచ్చును. కాని మేరలనుగడచి దొంగలవంటివారయిన మంత్రులు మొదలయినవారితోఁ గూడి మాడి యుండరాదు. భారతా. అడవియందలి దొంగలకునయితము

---

* 'అప్యపర్వణి భజ్యేత న నమేతేహ కస్యచిత్' అని మూలము. ఇది వెదురు మొదలయినవి, కణుపులందు విఱుగునవి గాక తక్కినపట్టుల విఱుగుటను ననుసంధించి చెప్పినది. ,అనఁగా బ్రతికూలమయిన తటిని నశింపనయిన వచ్చునుగాని యొక్కరికిని లొంగిపోవరాదని భావము.

బెట్టిదము లయినకార్యములుచేయుటకు సేనల సమకూర్చి యి చ్చుట సులభము. రాజొక్కఁడె పెట్టు మర్యాదలనెల్ల నతిక్రమించు నేని జనులందఱును నతనియెడల భయమునొందుదురు. దయ యనునది యిట్టిదని తెలియకుండుదొంగలునయిత మిట్టిరాజు నకు నెంతయు జంకుదురు. ఈకారణమునుబట్టి రాజెప్పుడును జనులమనసులను నుల్లసిలంజేయుటకు మర్యాదలను గట్టుపాటు లను స్థాపింపవలయును. మిక్కిలి యల్పములయిన వ్యవహారము లందును మర్యాదయొకటి యుండినయెడ, నది యించుకయినను, జనులు దానినెంతయు గారవింతురు. ఈలోకమే లేదనియుఁ బర లోకమును గల్లయనియు నిశ్చయముగలవారును గలరు. ఇట్టి నాస్తికుఁ డగువానిని, వానిమనసు రహస్యముగా జంకుగొంకుల చేతఁ గలఁగినట్టిదయినను, దానెంతమాత్రమునమ్మరాదు. అడ వియందలి దొంగలు తక్కిన యొప్పిదములు గలిగియుండి పరు లధనముల నపహరించుటమాత్రము గావింతురేనియు నట్టి యపహారములను నహింపఁగాఁ దలంపవలయును. దొంగ లట్టి కట్టుపాటులనుసరించుటవలన వేలకొలఁది ప్రాణులు రక్షితము లగుచున్నవి. యుద్ధము సేయక పాఱిపోవుచున్న శత్రువును జం పుటయు, పరభార్యలను జెఱుపుటయు, చేసినమేలు మఱచు టయు, బ్రాహ్మణధనమును బుచ్చుకొనుటయు, ఒకని ధనమం తయు మిగతలేకుండు నట్లుగా దోఁచుకొనుటయు,కన్యల నపహ రించుటయు,గ్రామములకును బట్టనములకును బోయి వాని యెడ యండ్లవలె నెడతెగక నాక్రమించుకొని యుండుటయు ననునివి దొంగలకు నయితము దోషములేయగును; కాఁబట్టి దొంగలును వాని నెప్పుడు మానియుండవలయును. రాజులు దొంగలతో

సంధిచేసికొని వారికిఁ దమయందు నమ్మికగలిగించు కొనుదురేని యట్టిరాజు దొంగలలోపలి వెలుపలివెల్లఁ గనుఁగొని వాని నిర్మూలము సేయుదురనుట నిశ్చయము. ఈకారణమును బట్టి రాజు దొంగలతో వ్యవహరించునపుడు వారిని నిశ్శేషముగా నాశము సేయరాదు. వారిని దనయేలుబడికి లోఁబువ గావించు కొనఁ జూడవలయును. రాజు తాను వారికంటె బలవంతుఁడనని తలఁచి వారియెడఁ గ్రూరకార్యములు గావింపరాదు. ఏరాజులు వారిని నిశ్శేషులఁ గావింపరో యారాజులకుఁ దాము నిశ్శేషుల మగుదుమని భయముగలుగదు. అయినను వారిని నిశ్శేషులఁ జేయువార లట్లు చేసినందుల కెప్పుడును భయము గలిగి యుండవలసి వచ్చును. ఇది నూటముప్పదిమూఁడవయధ్యాయము.



## ఆ ప ద్ధ ర్మ ప ర్వ ము.

{ భీష్ముఁడు బలమును బొగడుట. పాపమునకుఁ బరిహారోపాయములను జెప్పుట. }

భీష్ముఁడు—'ఈవిషయమై పురాతనమైన యీయితిహాసము నుదాహరించుచున్నారు. ఈవిషయమునఁ బురావిదులగువారు కామందకముని చెప్పిన వచనమును జెప్పెదరు. అదియే దనఁగా- ఎఱుకగల క్షత్రియునకు ధర్మార్థములు రెండును బ్రత్యక్షములే (అనఁగా బ్రత్యక్షధర్మములే) యనుటయే. వాని కతఁడు * ధర్మమునుగుఱించిన సూక్ష్మవాదములచేతను, బరలోకము పరోక్ష

* 'పరోక్ష ధర్మబోధనా' అని దా. మూలము. ధర్మోపదేశము పరోక్షమయినదని యర్థము.

మయి యుండుటంబట్టియు విఘాతము చేయరాదు. భూమి యందు నడుగు *ముద్రలను జూచినంతనే యవి శోఁడేలియడుగులోకావ్రా యని విచారించుట యెట్లో యట్లె యొకటి ధర్మమా యధర్మమాయని విచారముసేయుట యెల్ల నిష్ఫలమే. ఈలోకమున నెవఁడుగాని యెప్పుడేనియు ధర్మఫలమునుగాని యధర్మఫలమునుగాని చూచినవాఁడు లేఁడు. కాఁబట్టి క్షత్రియుఁడు బలమునే పడయఁజూడవలయును. బలముగలవానికే యన్నియు వశమందుండును. సంపదవలన బలము (సైన్యము) గలుగును. బలమువలన నమాత్యులు గలుగుదురు. ధనములేనివాఁడు పతితుఁడు. అల్పనంతయు నెంగిలి వంటిది. బలవంతుఁడు పెక్కులు కార్యములు చేసినను వానివలని భయమున వానిని నెవ్వఁడేమియుఁ జేయఁడు. ధర్మమును బలమును సత్యముతోఁ గూడియుండునేని యవి పెనుభయమునుండి రక్షించును. అయిన నా రెంటిని బోల్చిచూడఁగా ధర్మమునకంటె బలమే యెక్కుడని తోఁచుచున్నది. బలమువలననుండియే ధర్మము ప్రవర్తించుచున్నది. జంగమములెల్ల భూమియందు నెలకొనియున్నట్లు ధర్మము బలమునందు నెలకొనియుండును. పొగ గాడ్పునకు వశమై యుండునట్లు బలమును ధర్మ మనువర్తించుచుండును. ధర్మము తనంతట నియంత గానందునఁ దీఁగ మ్రాఁకునుంబోలె బలము నాశ్రయించియుండును. భోగవంతులకు సుఖము వశమై యుండునట్లు బలవంతులకు ధర్మము లోనై యుండును. బలవంతుల కసాధ్య మెద్దియులేదు. అన్నిటిని బలవంతుఁడు జయిం

* 'యథావృకపదం తథా' అని మూలము. 'యథావృక్షేఫలంతథా' అని దాక్షిణాత్యమూలము. ఇది యంతగాఁ బొసఁగినది గాదు.

చును. బలములేనివాఁడు, దురాచారములను గావించుటవలనఁ దప్పించుకొనలేఁడు. జనులందఱును నట్టివానియెడలఁ దోఁడేలు పట్టింబోలె భయపడుదురు. ధనముదూలినవాఁ డవమానము నొంది దుఃఖంపుబ్రతుకు బ్రతుకును. అవమానముతోఁ గూడిన బ్రతుకు మరణమువంటిదే యగును. ఒకఁడు తనపాపంపునడవడి చేతఁదనకువలయువారందఱును దిగవిడుతురేని, వాఁడితరులమాటలనెడిశల్యములు గ్రుచ్చుకొనఁగా మిక్కిలియు దుఃఖమునఁ బొక్కుచుండునని ప్రాజ్ఞులు చెప్పెదరు. ఆచార్యులగు 'వారొక పాపముచేసినయెడల నందులకు విముక్తిగలుగుకొఱకు మూఁడువేదముల నధిగమింపవలయును. ద్విజుల నుపాసింపవలయును. మనుష్యులను దియ్యని పలుకులచేతను, గార్యములచేతను సంతోషపఱుపవలయును. మఱియు గొప్ప మనస్సు గలవాఁడయ్యు గొప్పకులమునఁ బెండ్లాడవలయును. తనదోషములను జెప్పికొనుచుఁ బరుల గుణములనే కీర్తించుచుండవలయును. స్నానాచమనాదులయిన యుదకకార్యములం దాసక్తుఁడై మంత్రముల జపింపవలయును. మృదువయిన స్వభావముగలిగి మిక్కిలియు మాటాడరాదు. మిక్కిలి దుష్కరములయిన (తపములు)సలుపవలయును. బ్రాహ్మణులను క్షత్రియులను నండఁ గొనవలయును'- అని చెప్పెదరు. పెక్కులు పాపము లాచరించినవాఁడు జనులు తన్నెంత దూషణము లాడుచుండినను వానినెల్ల సరకుసేయక యిప్పుడు చెప్పిన యాచారము లెల్లఁ గయికొనవలయును. ఇట్లు చేయుటవలన నొకఁడు శీఘ్రముగాఁ బాపములను వీడి లోకము వారి మెన్నికకెక్కును.సుఖముగా ధనము ననుభవింపనేర్చును. మంచినడవడి నెప్పుడును రక్షించుకొనవలయును.లోకమునందుఁ

బూజ్యతయును నిహమందును బరమందును మహాఫలమును బొందును. ఇది నూటముప్పదినాలుగవయధ్యాయము.

---

## ఆపద్ధర్మపర్వము.

{ భీష్ముఁడు దొంగగానుండినను శాస్త్రమర్యాద ననుసరించియుండువాఁడు పరలోకమును బొందునని నిరూపించుటకు కాప వ్యచరిత్రమును జెప్పుట. }

భీష్ముఁడు—దొంగ మర్యాదతోఁ గూడినవాఁడై యుండి నచో దొంగతనముచేత సిద్ధి నొందునను విషయమునఁ బురాతనమయిన యీ యితిహాసము నుదాహరించెదరు. *'కాపచ్యుఁడని యొక దొంగయుండెను. వాఁడు క్షత్రియునకు నొకనిషాది యందు (బోయెతయందుఁ) బుట్టినవాఁడు. వాఁడు క్షత్రియధర్మములనే యాచరించుచుండెను వాఁడు గొట్టుటందు సమర్థుఁడును, మతిమంతుఁడును, శూరుఁడును, జదువరియు నై క్రూరత్వములేకుండెను. వాఁడు బ్రాహ్మణులకుఁ దత్పరుఁడై, పెద్దలను బూజించుచు నుండెను. వాఁ డాశ్రమములందలి ఋషులధర్మమును రక్షించుచుండెను. వాఁడు దొంగగానుండినను సిద్ధిని బొందిన వాఁ డయ్యెను. వాఁ డడవియందు రేపును మాపును జింక కదుపులను వేఁటాడి కోపము రేపుచుండును. వాఁడు బోయ వాండ్రు మృగసమూహములను వేఁటాడుటకై పచరించు విధు లన్నియుఁ దెలియును. బోయలందు వాఁడు సమర్థుఁడు. వానికి నడవియందుఁగల ప్రదేశములన్నియుఁ జక్కఁగాఁ దెలియును.

---

* కాయవ్యుఁడని యుత్తరకోశములందెల్లఁ జూపట్టుచున్నది.

వాఁ డెప్పుడును పారియాత్రమను పర్వతమున సంచరించుచుం డును. వానికి సమస్తజాతుల ధర్మములును దెలియును. వాని బాణములు వాడులై యాయుధము లుటిదియై యొప్పుచుం డును. వాఁడు తా నొక్కఁడె పెక్కువందలసేనలను జయించెను. వాఁడు పేరడవియందు ముదుసండ్లయినకన్నతలిదండ్రులను బూజించియు మధుమాంసములచేతను ఫలములచేతను బలువి ధములయిన యన్నములచేతను మరియాదతోడఁ గుడువఁబెట్టు చుఁ జక్కఁగా వారికి శుశ్రూష సేయుచువచ్చెను. అరణ్య మునందు సన్న్యాసు లగుబ్రాహ్మణులను రక్షించుకొనుచు నెప్పు డును వనములందలి మృగములను గొట్టుచు వారలకుఁ బంపుచు వచ్చెను. దొంగపెట్టుభోజనమని శంకించి వానివలన నది పుచ్చు కొననివారి యిండ్లయందు వాఁడు పెందలకడనే మాంసములను బెట్టిపోవును. నిర్దయులై వర్తించు దొంగలయందు మేర మీఱిన వారు పెక్కువేలమంది వానిని గ్రామాధిపతిగా వరించుకొనిరి. దొంగలు వానితో 'నీవు దేశకాలములు చక్కఁగా నెఱుంగు దువు, ముహూర్తములను దెలియుదువు, మంచి తెలివిగలవాఁ డవు, శూరుండవు, స్థిరమయిన వ్రతముగలవాఁడవు. కాఁబట్టి నీవు మాయందఱకు సమ్మతుండును ముఖ్యుండు నగు గ్రామాధి పతిగా నుండుము. నీవు చెప్పినట్లెల్ల మేము చేసెదము.తల్లియుఁ దండ్రియుంబోలె నీవు మమ్ము న్యాయంబున రక్షింపుము' అని చెప్పిరి.

కాపవ్యుఁడు వారితో— 'మీరు స్త్రీలను భయపడినవా రిని, బిడ్డలను, దపస్వులను, జంపరాదు. యుద్ధమునకు రానివా నిని వధింపరాదు. స్త్రీలను బలవంతముగా నపహరింపరాదు.

సమస్తప్రాణులందును స్త్రీని నెవ్విధమునను జంపరాదని తెలి యుఁడు. గోవులకును బ్రాహ్మణులకును నెప్పుడును క్షేమమునే చింతించుచుండవలయును. అందులకొఱకు యుద్ధమును జేయు ను జేయవలయును. వైరులను నాశము సేయరాదు. దేవతలును, బితరులును నతిథులును బూజితులగు వివాహాది శుభకార్యము లకు విఘ్నములు సేయరాదు. సమస్తప్రాణులందు బ్రాహ్మణుఁ డధికుఁడుగాన యతనిని మీకొల్లలనుండి విడిచి పుచ్చవలయును. ఆబ్రాహ్మణులకుఁ బూజసేయవలయును. వారలకు మీకుఁగల యంతయు నిచ్చియును సత్కరింపవలయును. ఈ బ్రాహ్మణు లెవనియెడఁ మిక్కిలి కుపితులగుదురో, యెవని కవమానము గలుగఁగోరుదురో, వానికి మూఁడులోకములందును వారినుండి రక్షించువాఁడు గలుగఁడు. ఎవఁడు బ్రాహ్మణులను నవమానిం చుచున్నాఁడో, మఱి వారలకు నాశమును గోరుచున్నాఁడో వానికి, సూర్యోదయమునఁ జీకటికింబోలె నాశము సిద్ధము. మీ రందఱు నిచ్చటనే వసించియుండి మీశౌర్యములకు ఫలములం దవచ్చును. ఎవరు మనకు నీయవలసినదాని నియ్యరో వారి కడకు సేనల నంపవలయునను. *దండము దుష్టులకొఱకే విధిం పఁబడి యున్నది కాని, సొంతవృద్ధికొఱకుఁ గాదు. ఎవరు సాధు వులను బాధింతురో వారిని వధించుట ధర్మమని చెప్పఁబడుచు న్నది. ఎవరు కొందఱురాజ్యమును బీడించి తమకు వృద్ధిని గలి గించుకొందురో వారు పీనుఁగునుబట్టిన పురువులుంబోలె నారా

---

* 'శిష్ట్యర్థం విహితోదండో న వృద్ధ్యర్థం విధీయతే' అని మూలము. శిష్ట్యర్థం విహితోదండో నవధార్థం విధీయతే' అని దా. మూలము. వధ. ముకొఱకుఁ గాదని యర్థము.

జ్యమందుఁ బాము హింసించినవారితోఁ గూడనే మరణింతురు. దొంగ లెవ రీలోకమందు ధర్మశాస్త్రముచొప్పున వర్తింతురో వారు దొంగలుగా నుండినను శీఘ్రముగా సిద్ధి నొందుదురు' అనెను. ఆదొంగలును గాపచ్యుని యాజ్ఞచొప్పుననే నడచుచు వచ్చిరి. అందఱును బాపములనుండి విరమించుటవలన వృద్ధి నొందిరి. దొంగలను బాపములనుండి యుడిపి సాధువులకు క్షేమముగావించినందునఁ గాపచ్యుఁడు గొప్పసిద్ధిని బొందెను. ఎవఁడు కాపచ్యుని యీకధను నెప్పుడును జింతించునో వాని కరణ్యములందలి ప్రాణులవలన నుండియు నేవిధమునను భయముగలుగదు. వానికి మనుష్యులవలననుండియు భయము గలుగదు. మఱి యేవిధమునను దేవతలవలననుండియు భయముగలుగదు. సాధువుల వలననుండియు భయముగలుగదు. అట్టివాఁ డరణ్యమునకుఁ బోయినను రాజే. (అనఁగా రాజువలెనే సుఖంబుండును) ఇది నూటముప్పదియేనవయధ్యాయము.



ఆ ప ద్ధ ర్మ ప ర్వ ము.

(భీష్ముఁడు ధర్మరాజునకుఁ బొక్కసము వృద్ధిసేయు కొఱకు నేధన మపహరింపవచ్చునో యేదిగూడదో వివేచించుట.)

భీష్ముఁడు:—పురాణవిదులు బొక్కసమును బుట్టించు విధమునుగుఱించి బ్రహ్మదేవుఁడు పాడినగీతములను జెప్పెదరు:— అవి యేవన—యజ్ఞశీలుఁడగువాని ధనమును దేవాలయపు ధనములను నపహరింపరాదు. క్షత్రియుఁడు యాగాదిక్రియలను జేయక దొంగలవలె నెన్నంబడు వారిధనములను నపహరింపఁ

దగును. క్షత్రియులకు నీలోకమందుఁగల ప్రజలు రక్షింపఁదగిన వారును జంపఁదగినవారు నగుదురు. ఈ లోకమందలి ధనము క్షత్రియునిదే; మఱొక్కనిది గాదు. ఆధన మాక్షత్రియునకు బలముకొఱకుఁగాని యజ్ఞముకొఱకుఁగాని కావలయును. భుజించుటకు నర్హ్యములుగాని చెట్లను జేమలను నఱికి కట్టియలుగాఁజేసికొని భుజింపఁదగినయన్నమును జనులు వండుకొందురు. (అట్లె రాజును దుష్టులను దండించి శిష్టులను బోషింపవలయును) ఎవఁడు దేవతలను బితరులను మనుష్యులను హవిస్సుచేత నారాధింపఁడో వానియొద్దఁ గలధనము నిరర్థకమని ధర్మవిదు లగువారు చెప్పెదరు. రాజా! ధార్మికుఁడగురాజట్టివానిధనము నపహరించుకొనవచ్చును. అందువలన రాజు జనులకు సంతోషము గలిగింపఁ డనుట గలుగదు. జనులు నందులకై రాజును నిందింపరు. ఏరాజు తన్ను సాధువులు ధనమును బడయుటకు సాధనము గావించికొని యసాధువులనుండి సాధువులకు ధనమును దీసియిచ్చునో యతఁడే ధర్మమును దెలిసినవాఁడు. భూమిని భేదించుకొనివచ్చు శాకవస్తువులను వజ్రియను క్రిములును నెట్లు పయింబయిఁ దమంతట మిక్కిలియుఁ బెరుఁగునో యట్లె రాజును దనశక్తికొలఁదిని గర్మము లాచరించి పయింపయిఁ బుణ్యలోకములను దనంతట జయించుకొనుచుండును. చెదపురుగు లేనిమిత్తములేకయే కలుగునట్లు * యజ్ఞములు

* అనఁగా యజ్ఞములకు మిక్కిలి ధనముండుటంబట్టి కాక యుద్దేశమును బట్టియె కలుగును. ఉద్దేశముండినచో ధనము గూడునని యుఁ బిదప యజ్ఞములు జరుగుననియు భావము. ఇందులకుఁ జెదపురుగు లేకారణము లేక పుట్టి పెరుఁగుట దృష్టాంతము (ప్రతాప).

నేనిమిత్తము నంతగాలేకయె కలుగును. అడవి యీఁగలును, దోమలును, జీమలును, బురుగులును, నెట్లు పశువులనుండి వానినిపాలుపిదుకునపుడు తొలఁగఁబుత్తురో యట్లె యజ్ఞములకుఁ గూర్పని వారినందఱను రాజ్యమునుండి తొలఁగింపవలయును. ఇట్లే ధర్మము విధింపఁబడియున్నది. భూమియందలి దుమ్మును రెండుకాలనడుమ నిడి మఱియుఁ బొడిగావింపఁగాఁ బయిబయి మఱింత సన్నని నగునట్లు ధర్మవిషయములను బయిబయి విచారించుకొలఁదిని మఱిమఱి సూక్ష్మము లగుచున్నవి. ఇది నూటముప్పదియాఱవయధ్యాయము.



## ఆ ప ద్ధ ర్మ ప ర్వ ము.

భీష్ముఁడు రానున్నయాపదను బోఁగొట్టుటకు పాయము మును మును పే చేసికొనవలయునని రూపించుటకై మత్స్యోపాఖ్యానమును జెప్పుట.

భీష్ముఁడు:— మీఁదటిదానికి మునుపే సమకట్టువాఁడును, (అనాగతవిధాతయు) అప్పటికిఁ దగుబుద్ధి స్ఫురించువాఁడు (ప్రత్యుత్పన్నమతియు) ననెడి యీయిరువురును సుఖముగా వర్ధిలుదురు. దీర్ఘసూత్రుఁడు (జాగుసేయువాఁడు) నశించును. ఈ విషయమై చేయఁదగినదియు చేయరానిదియునను వీని నిర్ణయించుటకై దీర్ఘసూత్రునిగుఱించి యుత్తమమయిన యీయాఖ్యానమును దొట్రుపడక వినుము. కౌంతేయా 'మిక్కిలి లోఁతు గాని యొక కొలనియందుఁ జేఁపలు పెక్కులుండెను. అందు మూఁడు బేడిసలును జేఁపలు నుబరస్పరము చెలిమి గలిగి యొండొంటినిగూడి చరించుచుండెను. ఈ మూఁటి యందొకటి

యప్పటికిఁ దగినవెరవు తోడనే తెలిసికొని చేయునట్టిది ; మఱి యొకటి దవ్వులంజూచి రాఁగలదానికి ముందుగా సమకట్టుకొను నది; మూఁడవది దీర్ఘసూత్రమయినది. పిదప నొకప్పుడు చేఁపలను బట్టువారు (జాలరులు) నలుప్రక్కలను బలుదారుల మూల మునఁ గొలకులోని నీరు క్రిందుగానున్న పల్లములకు వడియ విడిచిరి. అప్పుడా కొలనియందు నీరు రాను రాను దగ్గుచుండుటను జూచి భయముకలుగఁగా దీర్ఘదర్శియగుటచేతఁ దక్కినయిద్దఱు సుహృదు లగు చేఁపలనుజూచి 'నీటియందు వసించువానికెల్ల నీయాపద దాపరించినది. దారి యరికట్టుటకుమునుపే వేగముగా మఱొకచోటికిఁ బోవుదము. ఎవఁడు రానున్న యనర్థమును మంచినీతులవలన వారించుకొనునో వాఁడెప్పుడును సంశయము నొందఁడు. కాఁబట్టి మఱొకచోటికిఁబోవుదము' అనెను. అందు దీర్ఘసూత్రుఁడు 'ఇక్కడఁ జక్కఁగా వసించి యుండవచ్చును. అంతలోపలఁ దొందరపడ నక్కఱ లేదని నాకు నిశ్చయముగాఁ దోఁచుచున్నది' అనెను. అంతఁ బ్రత్యుత్పన్నమతి యగు చేఁప దీర్ఘదర్శినిజూచి 'కాలమే దేని వచ్చినపుడు నాకేమియు నీతివెరవు కొఱవడదు' అనెను. ఇట్లు తక్కినవి రెండును జెప్పఁగా మహా* మతి యగుదీర్ఘదర్శి తోడనే బయలుదేఱి యొకకాలువ వెల్లి

---

* 'యథావ్యాకస్మాద్భవతి భూమాపాంసుర్వి లోలితః' తథైవేహ భవేద్ధర్మః సూక్ష్మః సూక్ష్మతరః స్మృతః' అని ఔత్తరాహమూలము. భూమా పాంసు తృణోపలక్ష్' అని దాక్షిణాత్యపాఠము. ఇందులకు భూమియందు దుమ్మును బుల్లును గల్లును నేకారణమునులేక సూక్ష్మముగను నంతకంటెను సూక్ష్మముగను నుండునట్లె ఈలోకమందు ధర్మమును సూక్ష్మముగను సూక్ష్మతరముగను దనం తటనే యుండును' అని యర్థము.

మూలమున మిక్కిలియు లోఁతయిన యొకమడుఁగును బోయి చేరెను. పిదప జాలరు లాకొలని నీరువడసియుండుటను లెస్సఁగాఁ జూచి పెక్కులుపాయములచేతఁ జేఁపలనుబట్టఁదొడఁగిరి. జలము వడిసి యున్నయాకొలను గలఁపఁబడినపు డం దున్నదీర్ఘ సూత్రము తక్కినచేఁపలతోఁ గూడఁ బట్టువడినది. జాలరులు పెద్దత్రాటికిఁ దాముపట్టు చేఁపలను గ్రుచ్చుచుండఁగాఁ బ్రత్యు త్పన్నమతి యగుచేఁపఁ యట్లు గ్రువ్వఁబడిన చేఁపలనడుమఁ జొచ్చి త్రాటిని బెనఁచుకొని తానును గ్రువ్వంబడినదియుంబోలె వారికిఁదోఁచునట్లు కదలక మెదలకుండెను. జాలరు లాచేఁప లన్నియును నాదారమునఁ గ్రువ్వఁబడియున్నవనియె తలఁచిరి. పిదప వారు మిక్కిలి జలములందు చేఁపలను గడుగునపుడు ప్రత్యుత్పన్నమతి యనుమీను దారమునువదలి విడివడి శీఘ్ర మానీటిలోనికిఁ బోయెను. మందస్వభావమును గలిగియున్న దీర్ఘసూత్రము తెలివిమాలినమూఢము గనుక నింద్రియములు లేనివానివలె విడివడ నేరక నాశమొందెను. ఇట్లెవఁడు తెలివి మాలుటవలన ముఖ్యముగా దొరకొన్న సమయమును దెలి యఁడో వాఁడు దీర్ఘసూత్ర మనుచేఁపవలె శీఘ్రముగా నాశ మొందును. ఏమనుష్యుఁడు తాను సమర్థుఁ డను తలఁపున మొద టనే తనక్షేమమును జేసికొనకుండునో వాఁడు ప్రత్యుత్పన్న మతివలె సంశయ స్థితి నొందును. కాఁబట్టి యనాగతవిధాతయుఁ బ్రత్యుత్పన్నమతియు నగు నిరువురును సుఖముగా వర్ధిలుదురు. దీర్ఘసూత్రుఁ డగువాఁడు నశించును. కాలమైనది లవము క్షణము కాష్ఠ కల ముహూర్తము పగలు రాత్రి పక్షము మాసము ఋతువులు సంవత్సరములు ననియును, దేశము, భూమి

యనియుఁ జెప్పఁబడుచున్నవి. ఆకాలమో కనఁబడుటలేదు.'ఇష్ట
మయినకార్యములు సిద్ధించువిషయమై యొకఁడు దేని నేరీతిని
మనంబునఁ దలపోయునో యారీతినే యది యొనగూడుటయుఁ
జెడుటయుఁ గలుగును. ధర్మశాస్త్రములందును మోక్షశాస్త్ర
ములందును దేశమును గాలమును (లేక దీర్ఘదర్శిత్వమును
బ్రత్యుత్పన్నమతిత్వమును) ముఖ్యములయినవిగా ఋషులు చెప్పి
యున్నారు. మఱియుఁ గామశాస్త్రమందును మనుష్యు లీరెంటి
నంగీకరించియున్నారు. ముందు పరీక్షించి యొకటి చేయువాఁ
డును, ఒకటిసాధించుటకు వలయుయుక్తులు సేయువాఁడును,
దలఁచినకార్యమును జక్కఁగా నొడఁగూర్చుకొందురు. దేశకాల
ములను దెలిసిచేయువారును మునుపుచెప్పిన యిరువురకంటెను
నెక్కుడుఫలమును బొందఁగలుగుదురు' అనెను. ఇది నూట
ముప్పదియేడవయధ్యాయము.



## ఆపద్ధర్మపర్వము.

భీష్ముఁ డాపదయందు శత్రువుతోడ నైతము సంధి
చేసికొనఁ దగునని రూపించుటకై పిల్లికిని
నెలుకకును జరిగిన కథను జెప్పుట

ధర్మరాజు-'భరతసత్తమా! అనాగతములకు ముందుగా సమ
కట్టుకొన్నబుద్ధియు, అప్పటికిఁదగిన వెరవుగాఁ బ్రత్యుత్పన్నమగు
బుద్ధియు శ్రేష్ఠములయినవనియు,దీర్ఘసూత్రమగు బుద్ధి నాశము
గలిగించునదనియుఁ జెప్పితివి. పితామహా! రాజు శత్రువులచేత
నలుగడలఁ జిక్కిలియుఁ బీడితుండైనపు డేబుద్ధిని గయికొ
న్నచోఁ దెలివి దప్పకుండునో యుత్తమమయిన యాబుద్ధిని వినఁ

గోరుచున్నాను. నీవు ధర్మార్థములందు నిపుణుఁడవు, ప్రాజ్ఞుండవు, సర్వశాస్త్రములందును బండితుఁడవు. కాఁబట్టి నిన్నడుగుచున్నాను.దీనిని నాకు వివరించి చెప్పుటకుఁ దగుదువు. పెక్కండ్రు శత్రువులుచుట్టుముట్టికొనఁగా రాజు తన్నెట్లు విడిచిపుచ్చుకొనఁగూడునో యావిధమునంతయు శాస్త్రోక్తప్రకారమున వినఁగోరుచున్నాను. ఒకరాజు సంకటమునఁ జిక్కియున్నపుడు, వానిచేత మునుపు తప్తులయినశత్రువులు పెక్కండ్రుగాఁ జేరి యాయొక్కని కెదురై వానిని వేరుతోడఁ బెకల్పఁ దివురుదురు. రాజు తాను దుర్బలుండును నొక్కరుండునై యుండఁగాఁ బెక్కండ్రు మహాబలు లగు శత్రువు లొక్కటిగాఁ గూడి తన్నునలుగడల మార్గోని నలంచుచుండునపుడు, తానసహాయుండై వారినిమార్కొని యెట్లు నిలువశక్యమగును ? అట్టి సమయములందు రాజు మిత్రులను శత్రువులను బడయు విధమెట్లు ? అప్పు డతఁడు మిత్రులయెడను శత్రులయెడను నెట్లు నడచుకొనవలయును ? మిత్రలక్షణములే యన్నియు గలిగియుండినవారు వాస్తవమున శత్రువులయి రేని యపుడు రాజు సుఖముఁ బడయఁగోరునేని యేమిచేయవలయును? అతఁడెవరితో యుద్ధము పెట్టుకొనవలయును ? ఎవరితో సంధిచేసికొనవలయును ? తాను బలవంతుఁడయి యున్నను శత్రువులనడుమ నున్నపు డెట్లు నడచుకొనవలయును ? ఇది రాజునకుఁ గలసమస్త కృత్యములోపల మిక్కిలి యెక్కుడయిన కృత్యమని తలఁచుచున్నాను. సత్యసంధుఁడును జితేంద్రియుఁడు నగు భీష్ముం డొకఁడు తప్ప దీనిని జెప్పఁజాలిన వాఁడొక్కఁడును లేఁడు. చెప్పినను వినువాఁడు

దొరకుటయు నెంతయు నరుదు. కాఁబట్టి, మహాభాగా ! దీనిని విమర్శించి యంతయు నాకుఁ జెప్పుము' అని యడిగెను.

భీష్ముఁడు —'యుధిష్ఠిరా ! ఇట్టిప్రశ్నము నీకెంతయుఁ దగినది. దీని కుత్తర మెంతయు గుణసంపన్నమైనది. పుత్రా ! అపదలయం దనుష్ఠింపవలసిన ధర్మములను గుహ్యము లయినవానిని నంతయును జెప్పెదను వినుము. శత్రువు మిత్రుఁడగును; మిత్రుఁడుగూడ శత్రుఁడగును. కార్యములగతి యాయాసందర్భముల కూడికచేత నెప్పుడును నొక్కతీరుగా నుండదు. కాఁబట్టి యొకటిచేయ వచ్చునా? చేయఁగూడదా? యని నిశ్చయింప వలసినపుడు, దేశమును గాలమును దెలిసి పరులను విశ్వసించుటయో లేక వారితో విరోధించుటయో చేయవలయును. మఱియుఁ దనచేత నైనంత వఱకుఁ దనంతటఁ బ్రయత్నపడుచును హితమును గోరునట్టి బుధులతో సంధిగలిగి యుండవలయును. భారతా ! ప్రాణములను వేఱువిధమున రక్షించుకొన నలవిగాకుండునేని శత్రువులతోడ సంధి యేనియుఁ జేసికొనవలయును. తెలివిమాలిన వాఁడెవఁడు తనపగవారితో నెప్పుడును సంధిచేయకయే యుండునో వాఁ డొకకార్యమునుగాని ఫలములను బడయ నేరఁడు. ఎవఁడు కార్యమునకుఁదగిన వెరవును జక్కఁగాఁ గనుఁగొనియు మిత్రునితోడ సంధియు మిత్రునితోడ విరోధమును జేసికొనునో వాఁడు మహాఫలమును బొందును. ఈవిషయమై యొకమఱ్ఱి చెట్టునం దుండినపిల్లికిని నెలుకకును జరిగిన సంవాదమై పురాతనమగు నీయితిహాసము నుదాహరించెదరు.

ఒక పెద్దయడవియందు, మిక్కిలిపెద్దది యగు నొకమఱ్ఱి చెట్టుండెను. దానిని బెక్కులు తీఁగజొంపములు గ్రమ్ముకొని

యుండెను. అందు నానావిధములయిన పక్షుల సమూహములు వసించుచుండెను. అది మిక్కిలియుఁ బొడవయిన బలితంపు బోదెగలిగి మేఘమువలెఁ బొడకట్టుచుఁ జల్లని నీడలనొసంగుచు మనోహరముగా నుండెను. మఱియు నది యాయడవి నలుప్రక్కలను బర్వి పెక్కుసర్పములతోను మృగములతోను గూడి యుండెను. దాని యడుగున మిక్కిలియుఁ బ్రజ్ఞగల పలితుఁ డనెడియొక యెలుక నూరుద్వారములుగల యొకలాఁగుగావించుకొని సుఖముగా వసించియుండెను. అప్పుడు లోమశుఁ డను నొక పిల్లి యాచెట్టుకొమ్మయందు సుఖముగా వసించి ప్రతిదినమును బెక్కుపిట్టలను బిలుకుమార్చి తినుచుండెను. కొంతకాలమునకుఁ బిదపఁ జండాలుఁ డొకఁడా యడవికివచ్చి యం దొక గుడిసె మనికిపట్టు గట్టుకొనెను. వాఁడు ప్రతిదినమును బ్రొద్దుగ్రుంకినపిదప మృగాదులనుబట్టి మాయంపు టురులొడ్డుచు వచ్చెను. వాఁడు సన్నపునరములతోఁ జేయబడిన వలత్రాళ్లను బెట్టవలసిన విధిచొప్పునఁ బన్ని యింటికిఁబోయి రేయెల్ల సుఖముగా జరిపి తెల్లవాఱఁగానే యక్కడకు మరలివచ్చును. ఆ యురియందుఁ బ్రతిదినమును రాత్రియందుఁ బలువిధములయిన మృగములు పట్టువడియుండును. ఒకానొకప్పు డాపిల్లియు నేమఱి యాయురియందు గట్టిగాఁ జిక్కుకొనెను. పలితుఁ డను నెలుక, మిక్కిలిబలవంతుఁడును దనకుఁ బగవాడునై తన్నెప్పుడును జంప వచ్చుచుండునట్టి యాపిల్లియు నురియందుఁ జిక్కువడఁగా నా సమయము దెలిసి యించుకయు భయములేక గ్రుమ్మరసాఁగెను. అది యడవియందు జంకులేక యొరకై తిరుగులాడుచుండఁగాఁ గొంతసేపటికి నాబోనునందుఁ (జండాలుఁ) డుంచియున్న

మాంసమును జూచెను. అది యాయురిపయి నెక్కికొని యందలి నంజుడును దినఁదొడఁగెను. అది తనలో నవ్వుకొనుచు నావల నుండుఁ గట్టువడియున్న తనపగవాఁడగు నాపిల్లిపయినిగూడ నెక్కి దానిని దినసాగెను. అది మాంసము దినుటయందే మనస్సు మరిగి తనకుఁ గలభయము గనుఁగొన్నదిగాదు. ఏలనఁగా నది యున్నట్టుండి కన్నెత్తిచూడఁగాఁ దనకు భయంకర మయినశత్రు వొకటి యక్కడికివచ్చి యుండుటను జూచెను. అది రాగివలె నెఱ్ఱనికన్నులుగల హారికమనెడు యొకముంగిస. అది మిక్కిలి చుఱుకైనది. అది నేలబొఱియలలో వసించుచుండినది. దాని మేను తెల్లుపూవులవలె నుండెను. అది యెలుకవాసననుబట్టి వేగిరముగా నచ్చటికి దానిని మ్రింగుటకై వచ్చెను. అది తన పెలవుల నాకికొనుచుఁ దలపయికెత్తికొని వెనుకటికాళ్లు భూమి పయి నానించుకొని నిలుచుండెను. మఱియు నాయెలుక యా సమయమునందే చెట్టుతొఱటలలో వసించు మఱియొక్క శత్రు వపు డాచెట్టుకొమ్మపయిఁ గూర్చుండియుండఁగాఁ జూచెను. అది వాఁడి ముక్కుగల చంద్రకమనెడి యొకగుడ్లగూబ. ఆయెలుక ముంగిసయు గూబయు బారింబడి మిక్కిలియు భయంబునకుఁ బాలై తనలోనిట్లని చింతింప సాగెను —'మిక్కిలియుఁ గష్ట మయిన యాపద యిదే దాపరించినది. మృత్యువు నన్నుఁ దేఱి చూచుచున్నది. ఎటుప్రక్కను భయము పుట్టియున్నది. ఇట్టి సమయమున నొకఁడు తనమేలుగోరి యేమిచేయఁదగును?' అని తలపోసెను. అది యట్లు చుట్టును సరికట్టంబడి యంతటను భయముగలందులకు స్రుక్కి మిక్కిలియు భయమున వడఁకుచు నొక గొప్పయాలోచనము చేసెను. అది తనలో 'పెక్కులాప

దలు వచ్చినపుడు పలువగల యుపాయములచేత వారించికొనుచు జీవితమును గాచుకొనవలసినది ముఖ్యము. ఇప్పుడు నలుప్రక్కల నిదె ప్రాణసందేహము దాపరించియున్నది. కాఁబట్టి యాపద కలిగియున్నది. ఈయురినుండి తొందరపడి దిగి నేలకుఁబోయితి నా ముంగిస నన్నుఁదప్పక పట్టి మ్రింగివైచును; ఈయురియందే యుంటినా గుడ్లగూబ పట్టుకొనును; మఱిపిల్లి, త్రాళ్లు వీడనేని తప్పక నన్నుఁబట్టి చంపును; ననుబోఁటి ప్రాజ్ఞునకు నిట్టియెడఁ దెలివితప్పుట తగవుగాదు. ముక్కున నూపిరి యడఁగువఱకును నాయుసుఱును గాచుటకు వలయుపాటు పడెదను. బుద్ధిగలవాఁడును నీతిశాస్త్రమందుఁ గుశలుఁడు నగు ప్రాజ్ఞుఁడు క్రూరమగున గొప్పవిపత్తినొందినను నందు మునుంగఁడుగదా! ఇప్పు డీయాపదయందుఁ బిల్లికంటె నాకు వేఱుగతి దోఁపకున్నది. నాపగవాఁడయిన యీపిల్లియు సంకటమునఁ జిక్కియున్నది. దీనికిని నా చేతఁ గాఁదగిన సాయము పెద్దదిగానే యున్నది. మూఁడు పగవాండ్రు నన్నుఁ జంప నుంకించుచున్నారు గాన, యిపు డెట్లు నా యుసుఱు గాచుకొనఁజూతును ? నా యుసుఱునుబట్టి యీపిల్లినే మిత్రముగా నాశ్రయించెదను. ఈశత్రుసమూహమును బుద్ధిని మున్నిడికొని వంచింపవలసిన విధముగ నీతి శాస్త్రము నూఁది యీపిల్లికి హితము చెప్పెదను. నాకు నీపిల్లి యత్యంతశత్రువు గాని యిది చిక్కియున్న సంకటమును నత్యంతముగానే యున్నది. ఈమూఢునకు వాని కయిన యర్థమును నేనుజేరి తెలిపితినేని తెలిసికొనునేమో చూచెదను. వీఁ డిట్టి వ్యసనమందుఁ బడియుండుటంబట్టి నాతోడ సంధిచేసికొన వచ్చును. బలవంతుఁడు దఱిసి బాధించుచున్నపుడు పగవానితోనయినను సంధి

చేసికొనవలయును. ఒకఁడు విషమమునఁ జిక్కి తనప్రాణములు గాచుకొనఁగోరునేని యిట్లే నడచుకొనవలయు నని యాచార్యు లగువారు చెప్పెదరు. అ పండితుఁడగు మిత్రునికంటెను బండితుఁ డగు శత్రువే మేలు. ఇప్పుడు నాగతియో, నా బ్రతుకు నాశత్రు వగు పిల్లిచేతియం దున్నది. కాఁబట్టి వీనికిఁ దన్ను రక్షించుకొను టకు నుపాయము నుపన్యసించెదను. ఇట్టిసమయమున నీపిల్లిని పండితుఁ డయినశత్రువుఁగాఁ గొనుట తప్పుగాదు' అని యిట్లు శత్రువులెల్లఁ జుట్టు నరికట్టుయుండఁగాఁ దనలో నాలోచించెను. ఇట్లు తలపోసి యామెలుక యర్థము గతులను గలరూపున నెఱుం గుటదియు సంధివిగ్రహములకుఁ దగు కాలములను దెలిసినది యు నగుటం జేసి మెల్లన యాపిల్లితో 'పిల్లీ ! నీతోడఁ జెలికార మున మాటాడుచున్నానుగాని మఱేమిగాదు. బ్రతికియున్నావే కదా ? నీవు బ్రతుకుదు వనియె యువ్విళ్లూరుచున్నాను. మన యిరువురకును మేలు సమముగాఁ గోరెదనుజుమీ. సౌమ్యా ! నీవు భయపడవలదు. మునుపటివలె హాయిగా బ్రతికి యుందువు పో ! నీవు నన్ను నిజముగాఁ జంపకుందువేని నిన్ను నే నుద్ధరించె దను. ఇట్టియెడరున నాకొక మంచియుపాయముతోఁచి యున్నది. అది మిక్కిలి చాలునని నాకుఁ దోఁచుచున్నది. దానిచేత నీవును దప్పించుకొనవచ్చును. నేనును మిక్కిలియు మేలు పడయవచ్చును. నేను సూటిగా నాలోచనముచేసి నీకొఱకును నాకొఱకును నాయుపాయమును గనుఁగొంటిని. దానివలన మనకిరువురకును మేలుగలదు చుమీ ? * ఇదిగో ముంగిసయు గూబయుఁ బాప

* ఇదిగో ముంగిసయును గూబయును బాపబుద్ధితోఁగూడి యున్నవి గాన యింకను నన్ను బెదరింపఁ దొడంగవు. కాబట్టి యిప్పుడు (నిన్నువిడిచి పుచ్చు

బుద్ధితో వేచియున్నవి. పిల్లీ! అవి నన్నుఁదలపడకుండు నంత వఱకే నా బ్రతుకు క్షేమముగానుండును. ఇదిగో మ్రానికొమ్మ కొనయందుండి గుడ్లగూబ కన్నులిటునటు మాటికిఁ ద్రిప్పుచుఁ గూయుచును నన్నుఁ దేఱిచూచుచున్నది. దానిని జూడఁగా నాకెంతయు వడంకుగలుగుచున్నది. స్నేహము సాధువులకు * నేడడుగులచే గలుగును. నీవు నట్టిపండితుఁడవు గావున నాకు మిత్రమవు. నేనునీయెడ మిత్రునివలెఁ దోడుపడెదను; కాఁబట్టి నీ ప్రాణములకు భయపడవలసినది లేదు. పిల్లీ! నాసాయము లేక నీవుతాళ్లను ద్రెంచుకొన శక్తుఁడవుగావు. నీవు నన్ను హింసింపకుందువేని నీయురి త్రాళ్లను నేను గొఱికివైచెదను. నీవు మ్రానికొనయం దుండువాఁడవు. నేనో మ్రానియడుగున నుండు దానను. మనమిరువుర మీమ్రానియందుఁ జాలఁగాలముగా వసించి యున్నా మనుట నీకును దెలిసినవిషయమే. ఎవని నొక్కరును నమ్మరో, యెవఁ డొక్కరినిని నమ్మకుండునో, యాయిరువురను బ్రాజ్ఞులు గొనియాడరు. వా రెప్పుడును మనస్సున నెమ్మది లేకుందురు. ఈకారణముఁనుబట్టి మనయిరువురకును బరస్పరము ప్రీతి పెరుఁగునుగాన మనయిరువురును గలసిమెలసి యుందము. ఈలోకమందుఁ గాలముతప్పి చేయుకార్యమును బండితులు కొనియాడరు. కాఁబట్టి మనయిరువురకు నిట్టిప్రయోజనముతోఁగూడిన కాల మిదియే యని తెలియుము. 'నీవు

నట్టి నేను క్షేమముగానుండుటంబట్టి) నీబ్రతుకునకును క్షేమము' అని దాక్షిణాత్యకోశములందలి పాఠమునకు నర్థము.

* 'సతాం సాప్తపదమ్ మైత్రమ్' అని మూలము. సాధువు లొకరితో నొకరు గూడి యేడడుగులు పెట్టినచో వారలకు చెలిమిగలుగునని యిందలి యాశయము.

బ్రతుకవలయునని నాకుఁగోరిక ; నీవును నేను బ్రతుకవలయునని గోరెదవు. మనుష్యుఁడు మిక్కిలి లోఁతయిన పెద్దయేటిని నొక కట్టెయనుగొని దాఁటుచున్నాఁడు. వాఁడాకట్టెయను నవ్వలి దరికిఁ గొంపోవుచున్నాఁడు; ఆకట్టెయయు వాని నవ్వలిదరికిఁ జేర్చుచున్నది. ఇట్లే మనయిరువురకార్యమును గూడికొనుటయు మిక్కిలియు గొప్పదిగానున్నది. నేను నిన్నువిడిపించెదను. నీవును నన్ను విడిచిపుత్తువు' అనెను. ఇట్లు పలితుఁ డనెడి యెలుక, యుభయులకును హితంబును యుక్తియుక్తంబును గయికొనందగినదియు నయిన యీవిషయమును జెప్పి దాని యుత్తరమున కెదురు చూచుచుండెను.

అంత నట్లా యెలుక లెస్సగాను సహేతుకముగాను నొప్పుకొనఁదగునట్లుగాను జెప్పినమాటవిని బుద్ధిమంతుఁడును మాటకారియు నగుపిల్లి తానున్నకష్టదశను జింతించి యాయెలుక మాటను గయికొని దానిని మంచిమాటలఁ బూఁజించెను. వాఁడియైన మునిపండ్లును వైడూర్యమణుల వన్నె కన్నులునుగల యాలోమశుఁ డను పిల్లి యెలుకను మెల్లఁగన్నెత్తిచూచి దానితో 'సౌమ్యా ! నాకు నీయందు సంతోషము గలుగుచున్నది. నీవు నన్ను బ్రతికింపఁ గోరుచున్నావుగాన నీకుశుభం బగుఁగాక. నీ వేది శ్రేయమని తలఁచెదవో దానిని ద్వరతోఁ జేయుము. ముందువెనుక విచారింపకుము. నేనో మిక్కిలియు విపత్తియందున్నాను. నీవు నాకంటె నెక్కువ విపత్తియందున్నావు. ఆ పన్నుల మగు మనయిరువురకును సంధిగావలయును,జాగువలదు, సమయమునకుఁ దగినదేదియో దానిని జేయుము. మనయిరువుర కార్యమును సిద్ధింపనీ. నేను గష్టమునుండి విడివడితినేని నీ

చేసినయుపకారము నిష్ఫలముగాదు. నీయెడ గౌరవము నుంచిన వాఁడనగుదును, నీకు భక్తుఁడనగుదును, శిష్యుఁడనగుదును, నీకు హితకరుండ నగుదును, నీపంపు దప్పక సేయువాఁడ నగుదును, నిన్ను శరణుఁజొచ్చితిని' అనెను. ఇట్లది చెప్పఁగా నర్థవిదుండగు పలితుఁడు తనకు వశగతమయిన యాపిల్లితో నర్థయుక్తంబును హితంబునయిన వచనముల నిట్లనియె.

'నీవు చెప్పినది యుత్తమమైనది. ఇది నినుబోఁటివానియం దొకవింతకాదు. మనయిరువురకును హితముగలుగుటకై నేనుబన్నినయుపాయమును జెప్పెదనువినుము. నేను నీమేనిక్రిందఁ జొచ్చియుండెదను. నాకు ముంగిసను జూడఁగా మిక్కిలి భయముగా నున్నది. నీవు నన్ను రక్షింపవలయును; కాని చంపరాదు. నిన్నురక్షించుటకు నేను శక్తుఁడనై యున్నాను. గూబవలన నుండియు నీవు నన్నురక్షింపవలయును. అల్పమయిన యది నన్నుఁ దినఁగోరుచున్నది. మిత్రమా! నీత్రాళ్లను నేను ద్రెంచివైచెదను. ఇట్లని నీకు గట్టిగాఁ బ్రతిజ్ఞ సేయుచున్నాను' అనెను. ఆయెలుక యుక్తియుక్తముగాను బొసఁగునట్లును మంచివిషయముగలయట్లును జెప్పినయప్పలుకువిని లోమశుఁడు సంతుష్టుఁడై తేఱిచూచి పలితుని స్వాగతమునఁ బూజించెను. అట్లాపిల్లి పలితుని నెయ్యము పచరించినందులకుఁ బూజించి కొంత సేపు చింతించి యంతసంతోషము గడలుకొన వేగదానితో 'వేగరమ్ము! నీకు శుభం బగుఁగాక. నీవు నాకుఁ బ్రాణసముఁ డగుచెలికాఁడవు. ప్రాజ్ఞా! నీయనుగ్రహమువలన నేక దా ప్రియ మయినబ్రతుకును మరలఁ బొందుచున్నాను. ఇప్పు డిట్టిస్థితి నొందిన నేను నీకేమేమి చేయవలయునో యానతిమ్ము. నేను జేసెదను. మన యిరువురకును

సిద్ధికలుగుఁగాత. నే నీప్రాణసంశయమునుండి విడివడి నామిత్ర సమూహములను బంధుజనులనుగూడి నీకుఁ బ్రియమును హిత ము నగు కార్యములనెల్లఁ జేయుదును. సౌమ్యా! నే నీవ్యసన మునుండి విముక్తుఁడనై నీకుఁ బ్రీతిని గలిగింతును. ప్రత్యుపకా రము చేయుటకును శక్తుండ నగుదును. మొదట నుపకారము చేసినవానికిఁ బిదపఁ బలువిధములఁ బ్రత్యుపకార లెన్ని చేసినను సాటియగు నని నాకుఁదోఁపలేదు. ఈ యిరువురలో మొదట నుపకరించినవాఁడు కారణములేకయే యట్లు చేయుచున్నాఁడు. రెండవవాఁ డుపకారమును బొందియేకదా చేయుచున్నాఁడు' అనెను.

ఇట్లు పిల్లి సమాధానపఱుపఁగా నెలుక గలయామెలుక మిక్కిలియు నమ్మకమునొంది దానిమేనిక్రిందఁజొచ్చి దానినెం తయు నంగీకరించెను. అట్లది యాపిల్లికిఁ దనకార్యమును దెలిపి నెయ్యము తియ్యముగలదై తలిదండ్రులయెడంబోలె నాపిల్లి కడుపునందు నిదురింపఁదొడంగెను. అట్లామూషిక మాపిల్లి యవయవములందు మఱఁగికొని యుండుటనుజూచి ముంగిసయు గూబయు నిరాశులయి మరలిపోయినవి. ఆపిల్లికిని నెలుకకును గలిగిన యత్యంత ప్రీతిని జూడఁగా నాముంగిసకును గుడ్లగూబ కును మిక్కిలిభయముగలిగి యుత్సాహము తగ్గుటయే కాక యెంతయు నాశ్చర్యమును జనించెను. హరితుఁడును జంద్ర కుఁడు నిరువురును, బలమును బుద్ధియుఁ గలవారు. ఇరువురును దమయెరను బట్టుసమర్థులే. ఆయిరువురును దాపుననేయుండియు నాపిల్లిని నెలుకను వానికిఁ బరస్పరముగలిగిన నెయ్యంపుటొడం బడికనుండి బలవంతముగా విడఁదీయఁ జాలకుండినవి. ఆపిల్లియు

నెలుకయుఁ దమతమకార్యములకొఱకు సంధియిట్లు గావించుకొనుటఁజూచి నకులమును నులూకమును నచ్చోటువాసి తమతమ నెలవులకుఁ బోయినవి. పిదప నెలుకయగు పలితుఁడు కాలదేశముల నెఱింగినదిగాన యాపిల్లిమేని క్రిందనుండి యాయురిత్రాళ్ళను మెల్లగాఁ గొఱుకుచు దానిని ముగించుటకుఁ దగుకాలము నెదురుచూచుండెను. పిల్లి త్రాళ్ళ కట్టులకు మిక్కిలియుఁ గస్తినొంది యా మూషికమును త్వరలేక మెల్లగాఁద్రాళ్లను గొఱుకుచుండుటఁ జూచి దానినిసైఁపకుండెను. అదిదానినివేగిరింపఁదలఁచి దానితో 'సౌమ్యా! ఏల నీవు వేగిరపడకున్నావే! నీవునావలనఁ నక్కఱఁ దీర్చుకొని యిపుడు నన్నుఁ బాటింపకున్నావా? ఆచండాలుఁడు రాకమునుపు త్రాళ్లను ద్రెంపుము' అనెను. ఇట్లు పిల్లి తొట్రుపడుచుఁ జెప్పఁగా బుద్ధిమంతుఁ డగు పలితుఁ డంతఁగాఁ బ్రజ్ఞయందుఁ దేఱుగడగాని పిల్లినిజూచి తథ్యమును నాత్మహితంబునగు వచనముల నిట్లనియె.

'సౌమ్యా! నీ వూరకుండుము. తొందఱపడకు. తొట్రుపాటునువలదు. ఈవిషయమునఁ గాలము దెలిసినవారము మేమే. సమయముతప్పదు; అకాలమందుఁ జేసినకార్యము చేసినవానికి ఫలమునొసంగునది గానేరదు. అదియే సమయమందుఁ జేయఁబడినచో మిక్కిలియు ఫలమునొసంగ నేర్చునదగును. అకాలమున నిన్నువిడిచిపుత్తునేని నీవలననే నాకు భయముగలుగును. కాఁబట్టి సమయము నెదురుచూచుచుండుము. చెలికాఁడా! ఎందులకుఁ దొందర పడెదవు? చండాలుఁ డాయుధపాణియై రాఁగాఁ జూచినప్పు డది యుభయులకును భయావహమయినది గాన యప్పుడుతప్పక నీత్రాళ్లను ద్రెంచివైతును. నీ వాసమయ

మందు విడివడి మ్రానిపై నెక్కికొంచువు. నీ కష్ట దుసుఱును దాఁచుకొనుటకంటె మఱియొకటిచేయుటకు వీలుండదు. అప్పుడు వేఁటకానికి భయపడి నీవు పాఱిపోఁగా నేను బొఱియలోఁజొచ్చి కొందును; నీవు కొమ్మనెక్కికొందువు' అనెను. ఇట్లది యాత్మ హితంబగు మాటచెప్పఁగా మహామతియు మాట పొందెఱింగి నదియునగు పిల్లి తనయుసుఱు గాచుకొనఁ దహతహపడు చుండెను. అది తానుజెప్పినపనిని త్వరితముగా నెఱవేర్చియు నట్లె తనపనియందు వేగిరము లేకున్నయామెలుకను జూచి 'సాధువులు మిత్రులకార్యములను నీచందమునఁ గావింపరు; ప్రేమతోడఁ గావింతురు. నేనెంత వేగిరపడి నిన్ను సంకటము నుండి విడిపించితినో యంత వేగిరముగాఁగదా నీ విదినాకుఁ జేయ వలయును; నీవు మిక్కిలియుఁ బ్రాజ్ఞుండవుగదే! మనయిరువుర కును క్షేమముగలుగునట్లు ప్రయత్నపడుము. అట్లుగాక నీవు మునుపటి వైరమును దలఁచికొని ప్రొద్దుపుచ్చఁ గోరుదువేని తప్పక నాయుసుఱు నశించును. నీవు దుష్టకర్ముఁడవు గదే! చూడుము. నేను దెలియమిచేత ముందు నీ కేదేని కొంచెము కీడుచేసియుండినను నీవు దానిని మనస్సున నుంచుకొనరాదు. నిన్ను మన్నింప వేఁడుకొనుచున్నాను. నాయందనుగ్రహింపు' మనెను. ఇట్లు ప్రాజ్ఞుండయిన యాపిల్లి చెప్పఁగా శాస్త్రవేత్తయు నుత్తమబుద్ధియు నగు నామెలుక యపుడు మేలిమాటల నిట్లనియె.

'పిల్లీ! నీవు స్వకార్యమును బెద్దదిగాఁజేసికొని చెప్పిన మాటనువింటిని. నేను నాకార్యమును బెద్దదిగాఁజేసికొని చెప్పు దానిని నయితము వినుము. ఏమిత్రమును భయముతోడ

సాధింపవలయునో యేమిత్రమునందు భయముగలిగియుండునో వానివలననుండి పాముకోఱలనుండి పాములవాఁడు చేతిని రక్షించుకొనునట్లు తనరక్షను గావించుకొనవలయును. బలవంతునితోడ సంధిచేసికొని యెవఁడు తన్ను రక్షించుకొనక పోవునో వాని కాసంధి పూజితం బయినయపథ్యమువలె మేలునకు మాఱుగాఁ గీడునకు మూలమగును. ఒకఁడు మఱియొక్కనికి మిత్రుఁడే కాఁడు. ఒకఁడు మఱియొక్కనికి శత్రువే కాఁడు. కార్యమునుబట్టియే చుమీ యొకరికొకరు మిత్రులును శత్రులు నయ్యెదరు. ఏనుఁగులచేతఁ బెద్దయేనుఁగులు గట్టుపడునట్లు, కార్యములచేతఁ గార్యములు గట్టుపడుచున్నవి. కార్యముచేసినపిదప నట్లు చేసినవానిని బాటించువాఁ డొక్కఁడును లేఁడు. కాఁబట్టి సమస్తములయిన కార్యములను గొంత మిగతపడునట్లుగాఁ జేసియుంపవలయును. ఆసమయమందును నాచండాలునివలన భయపడి కష్టపడుచుఁ బరుగెత్తుటయె నీకు ముఖ్యముగానుండును గాన, నీవు నన్నుఁబట్టుకొనుటకు శక్తుఁడవుగా నుండనేరవు. త్రాళ్లు పెక్కులు ద్రెంచియైనవి. ఒక త్రాడే మిగతపడియున్నది. దానిని వేగముగా నేను ద్రెంచివైచెదను. లోమశా ! సుఖముండుము' అనెను.

ఇట్లాపన్నులై యున్న యాపిల్లియు నెలుకయు రెండునిట్లు మాటాడికొనుచుండఁగా నారాత్రి గడచినది. లోమశునకు భయ మతిశయించెను. పిదప, వేకువను పరిఘుఁడను చండాలు డాయుధపాణియై కనుపట్టెను. వానినిజూచుటకు భయంకరముగానుండెను. వాఁడునలుపును బింగళవర్ణమునుగల చాయయు బలితములయిన చిఱుదొడలును గలిగియుండెను. వాని నోరు

విఱివిస్తై యీచెవినుండి యాచెవివఱకుఁ జాఁగి మిక్కిలి మలిన మైయుండెను. వాఁడుశంకులవంటి చెవులుగలిగి కుక్కతండములు బలసి రా గుద్దలి యొకటినెత్తికొని బెట్టిదముగాఁ గనుపట్టుచు వచ్చెను. యముని౦బోలి వచ్చుచున్న యాబోయవానిని జూచి లోమశుఁడు భయముచే వడవడవడంకుచు నెలుకనుజూచి 'ఇప్పు డేమిచేయుదువు' అనియడిగెను. ఆయెలుక పిల్లి చిక్కువడియున్న మిగతత్రాఁడొక్కటిని సయితము ద్రెంచివైచెను. పిదపఁ బిల్లి విడివడి యామ్రాని పయినెక్కికొనెను. పలితుఁడును నాతొట్రుపాటునుండియు భయంకరుఁ డగు శత్రువునుండియు విడివడి బొఱియలోఁ దూఱెను. ఆలోమశుఁడు కొమ్మపయినెక్కెను. చండాలుఁ డన్నివిధముల నరసి నిరాశుఁడై యురినెత్తికొని క్షణమున నచటనుండి కదలిపోయెను. భరతసత్తమా! ఆచండాలుఁడు తనయిలుచేరెను. పిదప లోమశుఁ డాభయమునుండి విముక్తుఁడై దుర్లభమయిన ప్రాణములనుబడసి మ్రానికొన యందుండులాఁగు నందున్న యెలుకనుజూచి 'ఒక్కమాటయు నాతో మాటాడకయె నీవు తటాలునఁ బాఱిపోయితివే. నేనే దేని చెడ్డతలంపు గలిగియున్నానని నీకు సందేహము లేదే కద? నేను మిక్కిలియు నెనరు గలిగియున్నాను. నీవు నాకు గొప్ప కార్యముచేసితివి. నీవు నాకు విశ్వాసముగలిగించి నాప్రాణముల నిచ్చితివే. ఇట్టి నీవు చెలికాండ్రురువురనుగూడి నెయ్యము తియ్యంపు సొంపు ననుభవింపవలసిన కాలమున నాయొద్ద కేల రాకున్నావు? మొదట స్నేహితులనుగాఁ జేసికొని పిదప వారిని మఱచిపోవు దుర్బుద్ధి యగువాఁడు కడిఁదిసంకటములు వచ్చినపుడు మరల మిత్రులను బడయఁజాలఁడు. అనుంగుఁజెలికాఁడా!

నీసామర్థ్యమంతయు నెఱపి నన్నెంతయుఁ బూజించితివి. ఇట్టి నీవు మిత్రత్వమును బొందిన ననుబోఁటి పేదవాని పొత్తు ననుభవింపఁ దగుదువు. నాకుఁగల మిత్రులును నాకుఁగల బంధువులును నంద ఱును బ్రియుం డయిన యాచార్యుని శిష్యులుంబోలె నిన్నుఁ బూజింతురు. నేనును నిన్ను నీమిత్రగణములతోడను బంధువులతోడనుగూడి పూజింతును. ప్రాణము నొసంగినవానిని నెనరుగలవాఁ డెవఁడు పూజింపకుండును? నీవు నా దేహము ఇల్లు ధనములు మొదలగునన్నిటికిని నేలికగా నుండవలయును. నీవు నాకాజ్ఞ సేయువాఁడవుగా నుండుము. మహాప్రాజ్ఞా! నీవు నా కమాత్యుఁడవుగా నుండుము. పుత్రునిఁ దండ్రియుంబోలె నీవు నన్నుఁ బనిపంపుము. నీకు నావలన భయమువలదు. ఇట్లని నా ప్రాణులమీఁద నొట్టుపెట్టుచున్నాను. నీవు బుద్ధినిబట్టి శుక్రుఁడవే. మేము బలిమిచేత నధికారముగలవారము. మంత్రబలముగల నీవు మాకు జయమును గూర్తువు' అనెను.

ఇట్లు పిల్లి మంచిమాటలు చెప్పఁగా నాయెలుక నిజమును దెలిసికొని యింపయి యాత్మహితకరములయిన వచనముల వానితో 'లోమశా! నీవు చెప్పినదంతయు వింటిని. నాకుఁ దోఁచునదియుఁ జెప్పెదను వినుము. మిత్రులను జక్కఁగాఁ బరీక్షించి దెలియవలయును. శత్రువులను జక్కఁగాఁ బరికించి తెలియవలయును. ఈ లోకమం దిటువంటిపనిని జేయుట మిక్కిలియు సూక్ష్మమయినదని ప్రాజ్ఞులు నొప్పుకొనుచున్నారు. మిత్రులు శత్రువులవలెను, శత్రువులు మిత్రులవలెను నుందురు. ఒక తెగవారితో సంధిగావించుకొన్నను వారా సంధి కియ్యకొనుట రాగమునకును లోభమునకు లోనైయో కాదో వారికలరూపు దెలియుట

మెంతయుఁ గష్టముగానుండును. *(ఎవరికిఁ జల్లఁదనముగలవారే మిత్రులును గ్రోధశీలురే శత్రువులు నగుదురో వారలకు మంచి మాటలచే మిత్రశత్రుల కలరూపెంత చెప్పినను వారురాగలోభములకులోనైతమకుఁదోఁచినదే తప్పఁ దక్కినవి తెలియరు). పుట్టుకచేత శత్రువగుటలేదు;మిత్రుఁడగుటయు లేదు.ఆయాకార్యములనుబట్టి మిత్రులును శత్రులుఁ నగుచున్నారు. ఎవఁడు తనకొకఁడు బ్రతికియుండు నంతవఱకే తనకార్యములకు సిద్ధిగలుగు ననియు, వాఁడు మృతుఁడయినచోఁ దనకుఁ బీడ గలుగుననియుఁ జూచునో వాఁడు దానిని దనకు మిత్రముగాఁగొని యాసందర్భముల మాఱకుండు నంతవఱకు నట్లె మిత్రముగాఁ దలంచుచుండును. మిత్రత్వమును స్థిరమై యుండునది లేదు. శత్రుత్వమును సతమైనది లేదు. కార్యముల కూడికనుబట్టి మిత్రులుగాను శత్రువులుగాను నేర్పడుచున్నారు. కాలము తిరిగినపుడు మిత్రుఁడును శత్రుత్వమందుచున్నాఁడు; శత్రువును మిత్రత్వము నందుచున్నాఁడు. స్వప్రయోజనమే మిక్కిలి బలీయమైనది సుమీ. కార్యముల పొసఁగుపాటును దలంపక యెవఁడు గ్రుడ్డితనముగా మిత్రులను నమ్ముచును శత్రువులను నమ్మకయు నుండునో వానిబ్రతుకు చంచలమే. ఎవఁడు శత్రువునందుఁగాని మిత్రునందుఁగాని నీతియుక్తిని విచారింపక మక్కువ నుంచునో వాని బుద్ధియుఁ జంచలమే. నమ్మికలేని వానియందు నమ్మికగూడదు. నమ్మిక గలవానియందును మితిమీఱిన నమ్మిక గూడదు. గ్రుడ్డి

* ఈశ్లోకము 'యేషాం సౌమ్యాని మిత్రాణి క్రోధనాశ్చైవ శత్రవః। సాన్త్వితాస్తే న బుధ్యన్తే రాగలోభపళంగతాః' ఇది ఉత్తరప్రతులందులేదు. లేకుండుటయే సమంజసముగానున్నది.

నమ్మికవలనఁ గలుగుభయము వేళ్లనుగూడఁ ద్రెంచును. తల్లియుఁ దండ్రియు కొడుకును మామయు నల్లుఁడును సంబంధులును జుట్టములును గార్యములను బట్టి కలుగుదురు. తల్లియుఁ దండ్రియుఁ బతితులయినచో గారాబు పుత్రునయినను ద్రోసి పుత్తురు. జనులు తమ్మే ముఖ్యముగా రక్షించుకొందురు. స్వప్రయోజనమునకుఁగల పసనుజూడుము! (స్వకార్యమునకుఁ గలసారమును జూడుము!) ప్రాజ్ఞా ఒకఁడు తన యపాయమునుండి విడివడినతోడనే, తనశత్రువుసుఖమునకుఁ గారణ మగు దానిని వెదకు నేని వాఁడు మరలఁ దప్పించుకొనుట సామాన్యముగాదు. నీవు మ్రానికొననుండి యీచోటికి(నేనున్న యెడకునన్నుఁదినుటకై) మునుపు వచ్చితివి కాని బుద్ధిచాపలముచేత నిచ్చట వైచి యుండినగురిని దెలియవయితివి. (బుద్ధి) చాపలముగలవాఁడు తన్నుఁదాను రక్షించు కొనఁజాలఁడు. మఱి తక్కినవారి నెట్లు రక్షింపఁగలఁడు? అట్టివాఁడు తనకార్యముల నన్నింటిని నాశము చేసికొనును. నేను నీకుఁ బ్రియుఁడనని నీవు తీయనిపలుకులు చెప్పుచున్నావు. అదికల్ల. అందులకుఁ గల కారణమంతయు సవిస్తరముగాఁ జెప్పెదను వినుము. ఒకఁ డొక కారణమునుబట్టి ప్రియుఁ డగుచున్నాఁడు; ఒక కారణమును బట్టియే ద్వేష్యుఁడగుచున్నాఁడు. ఈ ప్రాణిలోకమంతయుఁ దనప్రయోజనమునే కోరుచుండును. ఒక్కఁడు నొక్కనికినిఁ బ్రియుఁడుగాఁడు. ఒకకడుపునఁ బుట్టిన తోఁబుట్టువులకుఁ లోకమందుఁగల చెలిమిగాని, ఒకరి నొకరు వరించిన యాలుమగలకుఁ గల వలపుగాని, స్వకార్యము నే యీఁదియుండును. ఈలోకమం దెవ్వరికిగాని పరస్పరముగల యెట్టిప్రేమయు నొక స్వప్రయోజనము నాశ్రయింప

నిది నేను జూడలేదు. అయినను దోఁబుట్టువులును దంపతులును గొన్నియెడల నొక కారణమును బట్టి కలహించినను మరల సంబంధించియున్న స్వభావమును బట్టి ప్రేమతోఁ గలసికొందురు. ఇది పరస్పర మట్టి సంబంధము లేకుండువారియందుఁ జూప ట్టదు. దాతృత్వముచేత నొకఁడు ప్రియుఁ డగుచున్నాడు. ఇంప యిన మాటలచే నొకఁడు ప్రియుఁడగుచున్నాఁడు. మంత్రము చేతను హోమముచేతను జపముచేతను మఱియొకఁడు ప్రియుఁ డగుచున్నాఁడు. ఒకఁడు తా నొదవుకార్యమునుబట్టి ప్రియుఁ డగుచున్నాఁడు. మనయిరువురకును బ్రీతి యొక కారణమునుబట్టి పుట్టినది. ఆకారణ మింక లేదు. అది ముగియఁగానే యాప్రీతియు ముగిసిపోయినది. నీకు నాయందుఁ బ్రీతిగలుగుటకు నన్ను భుజింపవలయు ననుకారణముతప్ప వేఱుకారణ మేమికలదు? చెప్పుము. ఈవిషయము మనయిరువురకును దెలిసినదే. నే నిది మఱచిపోలేదని నీవు తెలియవలయును. కాలము హేతువును మార్చుచున్నది. * ఆహేతువునే స్వార్థము వెంబడించుచున్నది. స్వార్థమును బ్రాజ్ఞుఁడును కనుఁగొనుచున్నాఁడు. ప్రాజ్ఞుని లోక మనువర్తించుచున్నది. నీవు విద్వాంసుఁడును స్వార్థమును జక్కఁగాఁ దెలిసినవాఁడు నగువానినిగూర్చి యిట్టిమాటలు పలుకఁదగదు. నీవు సమర్థుండవే కాని నీస్నేహము గల హేతు వున కిది కాలముగాదు. నేను సంధి విగ్రహములందు గడి దేఱిన వాఁడను; కనుక, స్వార్థమునుండి చలింపను. మేఘముల రూపములుంబోలె సంధికిని విగ్రహమునకుఁ గల సందర్భములు

* 'స్వార్థ స్తమను వర్తతే' అని దా. మూలము. 'స్వార్థ స్త్వమనువర్తసే' అని జే', మూలము. స్వార్థమును నీవు వెంబడించెదవు.' అని యర్థము.

మాటిమాటికిని మాఱుచుండును. నేఁడు నాకు శత్రువుగానుం టివి. నేఁటికే నాకు మరల మిత్రుఁడ వయితివి. నేఁటికే మరల నాకు శత్రుఁడవయితివి. సందర్భములు, మాఱుపడుచుండుట చూడు. మునుపు మనకిరువురకును మైత్రి, యందులకు హేతు వుండి నంతవఱకును నుండియుండెను. హేతువు కాలముతోఁ గూడినదిగాన కాలముపోఁగా దానితోఁగూడనే యదియుం బోయినది. ఆహేతువు పోఁగా నామైత్రియుఁ బోయినది. నీవు నాకు స్వభావముచేత శత్రుఁడవుగదా ! మనయిరువురకు సమ మైన యొక ప్రయోజనము కలుగుటంబట్టి నాకు మిత్రుఁడవయి తివి. ఆప్రయోజనము తీఱినది. కాన యెప్పటి స్వభావ మగు శత్రు త్వము మరల వచ్చినది. ఇట్లు రచింపఁబడియున్న శాస్త్రములను గలరూపున నేను దెలిసియుండఁగా నీకొఱకని మరల నాకట్టు త్రాటియందు నే నేలచొత్తును ? అది నాకుఁజెప్పుము. నీబలిమి చేత నేను విడివడితిని. నాబలిమిచేత నీవు విముక్తుఁడవయితివి. ఒకరి కొకరుపకారముచేసి యైనపిదప మరలఁ గూడికొనుట కలుగదు. సౌమ్యా ! నీకార్యమో యొడఁగూడినది. నాకార్య మును సమకూడినది. ఇంక నాచేత నీకుఁ గావలసినపని నేను భక్ష ణముగుటకంటె మఱియొకటి లేదు. నేను అన్నము ; నీవు తిను వాఁడవు. నేను బలహీనుఁడను, నీవు బలవంతుఁడవు. మనయిరు వుర బలములు, సమానము గాకయుండఁగా (మనయిరువుర స్థితు లిట్లు విషమముగా నుండఁగా) పాసినపిదప మరల మనకుఁ గూడికగలుగదు. నాకు నీప్రజ్ఞ తెలియును. అది మఱేమిగాదు. వలనుండి విడివడిన వెంబడిని, సులువయిన యుపాయమున భోజన మును వెదకుచున్నావు. ఇందులకు సందేహము లేదు. నీ వాహా

ముకొఱకే వలలోఁ జిక్కువడితివి. దానినుండి విముక్తుఁడవయి
తివి. ఇప్పుడు నిన్నాఁకలి వేఁచుచున్నది. శాస్త్రములను జదు
ఘటవలన నుప్పతిల్లెడు బుద్ధినూఁది నన్నుఁ బెందలకడ భోజన
ముగాఁ జేసికొనఁ జూచుచున్నావు. నీ వాఁకలిగొని యుండుట
నెఱుంగుదును. నీ కిది యాహారము గొనుతఱి యనియు నెఱుఁ
గుదును. నీవు నావలనఁ జూపు నిగిడ్చి యెర నెమకుచున్నావు.
ఇంతేకాక చెలికాఁడా! *నీ వాలు బిడ్డలకొఱకు నాయెడ మాట
లాడుమాటలును, చేయఁబూనిన పనిపాటులును, నాకు నెంత
మాత్రము గొలుపవు. నేను నీతోఁగూడ నుండుటను జూడఁగా
నగాదిలి పడఁతియు గారాబుబిడ్డలును, నీవు నెయ్యము గలిగి
యుండఁగనే నన్నుఁబట్టికొని యేలతినకుందురు ? కాఁబట్టి నేను
నతోడఁ గలసియుండను. అట్టి కలయికకు హేతువు గడచిపోయి
నది. నీవు నేను జేసిన మంచికార్యమును మఱవకుందువేని, నీవు
నాకు శుభము దలపోయుచు నెయ్యమున సుఖం బుండుము.
శత్రువయినవాఁడు ధార్మికుఁడని ప్రసిద్ధుఁడుగాకయు, పేరాఁకలి
గొనియు, నాహారమును వెదకుచును నుండఁగాఁ బ్రాజ్ఞుఁ
డెవఁ డట్టివానిబారిం బడును ? ఎవ్వఁడును బడఁడు. నీకు శుభం
బగుఁ గాత. నేను బనివినియెదను. దవ్వులనుండియు నిన్నుఁ

---

* కించాత్రపుత్రదారార్థం యద్వాణీం సృజసేమయి, శూశ్రూషాం యత సే
ద్ధుం సఖే మమ న తత్ క్షమమ్' అని. దా. మూలము. 'త్వంచాపి పుత్రదారస్థో
యత్సంధిం సృజసేమయి' అని మూలము. నీవాలు బిడ్డలుగలవాఁడవు. నీవింకను
నాతోడ సంధిగోరుచు నాకు మక్కువతోఁ బనిపాటులు సేయఁజూచెదవు.
కాని చెలికాఁడా! యివన్నియు నాకుఁ గొలుపవు' అని యర్థము. ఇది యేసఃసం
గసముగాఁ దోఁచుచున్నది. (ప తాపచంద్రరాయలు.)

జూడఁగా నాకు భయమెత్తుచున్నది. నేను నీతోడిపొత్తు నొల్లను. లోమశా! నీ ప్రయత్న ముడుగుము. నేను నీకుఁ జేసినమంచిని మఱవవేని, నేను నమ్మికగలిగి గాని పరాకుపడి గాని క్రమ్మఱఁ గలిగినపుడు చెలిమి ననువర్తింపుము. ఇంతేచాలు; నాకుఁ బ్రతి చేసిన ట్లగును. బలవంతుఁడగు వానిదాపున నుండుటయు నెప్పుడును మెచ్చుగాదు. బలవంతుఁడు మిక్కిలి శాంతుఁడుగను బ్రాజ్ఞుఁడుగను నుండినప్పటికిని నతని దెస నెప్పుడును భయపడుచుండ వలయును. నీ వింతవఱకుఁ జెప్పినట్టి ప్రయోజనము గోరితివేని చెప్పుము. నీకేమిచేయుదును? నేను నీకన్నియు నిత్తునుగాని నన్ను మాత్ర మేవిధమున నియ్యను. తన్ను రక్షించుకొనుకొఱకు సంత తిని రాజ్యమును రత్నములను ధనములను దిగవిడువవచ్చును. తనకుఁగల యంతయు నయినను దిగవిడిచి బుద్ధిమంతుఁడు తన్నుఁ దప్పక రక్షించుకొనవలయును. అందులకై యైశ్వర్యములను ధన ములను రత్నములను బగవారికైన నియ్యవచ్చును. ఏలనఁగా నుసు ఉండినయెడల వానినెల్ల మరలఁ బడయవచ్చును గాన వచ్చుననిమాకువినికి. ధనములంబోలె, రత్నములనుంబోలెఁ దన్ను నిచ్చుకొనుట యొప్పదు. ధనములను దారములను విడిచియైనను దన్ను నెపుడును రక్షించుకొనవలయును జుమీ. తమ్మును రక్షించు కొనుటయందుఁ గన్ను గలిగి, యేకార్యమును ముందుఁ జక్క గాఁబరీక్షించి చేయునట్టి పురుషులకు దోషములు కలుగవు; కాన, దోషములవలనఁ గలుగునాపదలును బుట్టవు. బలహీనులగు వారు దమకంటె బలవంతుఁడగు వాని నెప్పుడును శత్రువుగానే తెలియుదురు. వారలబుద్ధి శాస్త్రార్థములందుఁ దిరముగా నిశ్చిత మైయుండును; కనుక, నది యెన్నఁడును జలింపకుండును' అనెను.

ఇట్లు పలితుఁడు తేటతెల్లముగనే చక్కఁగాఁ బరిహాసము చేయఁగాఁ బిల్లి సిగ్గునొంది దానితో 'నీమీఁద సత్యముగా నొట్టుపెట్టెదను. మిత్రద్రోహ మనుమాట నాకెంతమాత్రము నింద్యము. నాకు నీప్రజ్ఞ తెలియును. నీవు నాహితమం దాసక్తుఁడనియు నెఱుఁగుదును. నీ వర్థతత్త్వము నూఁది మనయిరువురకును భేదమునకుఁ గారణమున్నదని చెప్పితివి. సాధూ! నన్నువేఱువిధముగా గ్రహించుట నినుఁబోఁటికి నెంతమాత్రము దగదు. నీవు నాకుఁ బ్రాణప్రదానము చేయుటంబట్టి నీయందు నాకు మిక్కిలియుఁ జెలిమిగలిగినది. నేను ధర్మములను దెలిసినవాఁడను; పరులగుణములను దెలిసికొన నేర్చువాఁడను; విశేషించి పరులుచేసిన మేలును మఱవకుండువాఁడను; మిత్రులయందు నాకు మక్కువ; అందును నీయందు విశేషించి నాకు భక్తిగలదు. సాధూ! నే నిట్టివాడనయి యుండఁగా నీవు నన్నిట్లు పలుకఁదగదు. నీవు నన్నిట్లు మఱియుఁ బలుకుచుందువేని నేను బంధుసహితముగాఁ బ్రాణములు విడువఁగలను. పండితు లగువారు మనస్వులగు మనబోఁటివారియందు నెయ్యమునే కనుఁగొందురు. నీవు ధర్మతత్త్వములను దెలిసినవాఁడవు. నేను ధర్మము తప్పుదునని సందేహించుట నీకుఁ దగదు' అనెను.

ఇట్లు పిల్లి చెప్పుచున్నను నాయెలుక కొంచె మాలోచించి భావగంభీరముగా దానితో 'నీవు మిక్కిలియు మంచివాఁడవు. నీవు చెప్పినదంతయు వింటిని. అందుల కెంతయు సంతోషించుచున్నాను; గాని యెంతమాత్రము నమ్మఁజాలను. స్తోత్రములు చేసినను గాని ధనరాసులు గుప్పించినను మరల నీవు నన్నుఁ బడయఁ దరముగాదు. చెలికాఁడా! ప్రాజ్ఞు లగువారు కార

ణము లేక శత్రువులవశమునకుఁ బోవరు * (ఈ విషయమై శుక్రుఁడు చెప్పిన గాథలు రెంటిని వినుము. అవి యేవనఁగా) దుర్బలునిని బలవంతునిని నిరువురను సమానముగా శత్రువులు బాధింపఁగా దుర్బలుఁడు బలవంతునితో సంధిచేసికొని బుద్ధి నూఁది మిక్కిలి యెచ్చరికతోడ మెలఁగవలయును. తన కార్యము దీఱినపిదప బలవంతునియందు నమ్మకముంపరాదు. నమ్మఁదగనివానియందు నమ్మికయుంపరాదు; నమ్మినవానియందు సైతమధికముగా నమ్మికయుంపరాదు. ఎప్పుడును నితరులను నమ్మింపవలయునే కాని తాను వారల నమ్మరాదు. కాఁబట్టి సమస్తములయిన యవస్థలయందును దన జీవితమును రక్షించుకొనవలయును. జీవించియుండినచో ధనములును సంతానములును నన్నియుఁ బనికివచ్చును. సంక్షేపముగాఁ జెప్పనెడ, నమ్మకుండుటయె ధర్మశాస్త్రముల యుత్కృష్టమయిన మతము. ఈ కారణమునుబట్టి మనుష్యులందఱియెడ నమ్మకము లేకుండుట పుష్కలమయిన హితమును గలిగించును. జనులు తామెంత దుర్బలులుగా నుండినను శత్రువులను నమ్మకుండిరేని, వారెంత బలవంతులయినను వారికిఁ బట్టువడరు. తాము బలవంతులయినను శత్రువులను నమ్మిరేని వారికిఁ బట్టువడుదురు. మార్జాలమా! నన్ను నీబోఁటివారివలననుండి యెప్పుడును రక్షించుకొనవలసియున్నది. నీవును గుపితుఁడయి కలఁకఁజెందియున్న చండాలునివలననుండి నిన్ను రక్షించుకొనుము' అనెను. ఎలుక యిట్లు చెప్పగాఁ బిల్లి వేఁటకానిపేరు విన్నంతనే దిగులుగొని † యా

---

* ఇది యుత్తరదేశ ప్రతులందుఁ గానరాకున్నదని తెలియునది.

† 'కథాంహిత్వా' అని మూ. 'శంఖాంహిత్వా' అని ఉత్తరదేశపాఠము.

ముచ్చటను విడిచి యచటనుండి వేగముగాఁ బాఱిపోయెను. అంత శాస్త్రార్థతత్త్వములనెల్లఁ దెలిసిన యాపలితుఁడు తనబుద్ధి సామర్థ్యము నట్లె నెఱపి మఱియొక బొఱియలోనికిఁ దూఱెను.

భీష్ముఁడు:—ఇట్లు ప్రజ్ఞ గలపలితుఁడు దుర్బలుఁడయ్యు నొక్కండును మహాబలులగు శత్రువులను బెక్కండ్రను వంచించెను. పండితుఁడగువాఁడు సమర్థుఁడగు శత్రువుతో సంధిచేసికొనవలయును. ఎలుకయును బిల్లియు నొండొరుల నాశ్రయించుటవలన నాపదనుండి విముక్తులయిరి. మహారాజా! నీకిట్లు క్షత్రియధర్మమునకుఁగల మార్గము విస్తరించి నిరూపించితిని; సంక్షేపముగను జెప్పెదనువినుము. పరస్పరము వైరము గలిగియుండిన యిరువురు సంధి లెస్సగాఁ జేసికొనియున్నను వారొకరి నొకరు మించవలయునని మనస్సులోపలఁ దలంపు గలిగియుండుట నిజము. అట్టియెడఁ బ్రాజ్ఞుఁడగువాఁడు తనబుద్ధి బలమునూఁది తక్కినవానిని మించిపోవనేర్చును. ప్రాజ్ఞుఁడు గానివాఁడన్ననో తన యేమఱుపాటువలనఁ బుద్ధిమంతుఁడగు వాఁడు తన్నుమించిపోవునట్లు చేసికొనును. కాఁబట్టి భయపడినను భయములేనివానివలె నుండవలెను. నమ్మకుండినను నమ్మికగలవానివలెఁ గనుపట్టవలయును. ఇట్లెచ్చరికగలిగి నడచుకొను వాఁడెన్నఁటికిని బొరఁబడఁడు. పొరఁబడినను నాశమునొందఁడు. కాలమువచ్చినపుడు పగవానితో సంధిచేసి కొనవలయును. కాలము పొసఁగి నపుడు మిత్రునితోడనైనను యుద్ధము చేయవలయును. ఇట్లు చేయవలయుననియె సంధివిగ్రహతత్త్వముల నెఱింగినవారెప్పుడును జెప్పుదురు. మహారాజా! ఇది తెలిసి శాస్త్రార్థములను మనసునం దిడి మనుజుఁడు మిక్కిలి పూనికతో నెంతయుఁ

బరాకుపడక భయమునకు హేతువు కలుగకమునుపే భయపడు వానివలె మెలంగవలయును. మఱియుఁ బురుషుఁడు, భయ హేతువు నిజముగాఁ గలుగకమునుపే భయపడినవానివలె శత్రువులతో సంధినిగాని యుద్ధమునుగాని చేయవలయును. భయమువలన నెచ్చరికయుఁ బూనికయుఁ గలబుద్ధి యుప్పతిల్లును. భయహేతువు రాకమునుపే భయమునొందినవానివలె నొకఁడాయితపాటు చేసికొనునేని భయము నిజముగా వచ్చియున్నపుడు వానికి భయముగలుగదు. ఎప్పుడును భయపడకుండువానికి భయముకలిగినపుడా భయమునుండి (యాయితపాటులేమిచేఁ గలిగినయశక్తియనెడి) మఱియొక పెను భయము గలుగుచున్నది. 'ఎప్పుడును భయపడకుము' అని యీ మంత్ర మెవ్వనికి నేవిధమునను జెప్పరాదు. ఎవఁడు తనదుర్బలత్వము తెలియుటవలన భీతినొందునో వాఁడు సదా బుద్ధిమంతుల యాలోచనము నడుగుచుండును. ఈ కారణములంబట్టి పురుషుఁడు భయముగలిగియు భయము లేనివానివలెను నమ్మకుండియు నమ్మికగలవానివలెను జూపట్టవలయును. * ఒకఁడెట్టి గొప్పకార్యములను బట్టియుఁ గూడ ననృతమించుకయుఁ బలుకరాదు. యుధిష్ఠిరా! నీ కిట్లు మూషికమార్జాలములను గుఱించిన యితిహాసమును జెప్పితిని. ఇది విని నీసుహృదులనడుమఁ దగురీతి ననుష్ఠింపుము. ఈకథవలన నుత్తమమయినబుద్ధిని బడసి శత్రు

---

* 'కార్యాణాం గురుతాం జ్ఞాత్వా నానృతం కించిదాచరేత్' అని. జౌ. మూలము. 'నాదృతం కించి దాచరేత్' అని. దా. మూలము. కార్యముల గొప్పతనమును జూచి అనఁగా గొప్పయగు కార్యములందే కన్నిడి యాదరింపఁదగని వానిని (అల్పమును) గొంచెమైనను జేయరాదు.' అని యర్థము.

మిత్రులభేదములు దెలిసి సంధి విగ్రహములకుఁ దగుకాలములను నెఱిఁగి యాపదలకుముందు విడివడు నుపాయములను గనుఁగొందువు. తన్నును దనకంటె బలీయుఁడగువానిని శత్రువు పీడించునపుడు బలీయునితో సంధిచేసికొని కలసియుండి బుద్ధితో మెలఁగుటయుఁ,గార్య మొడఁగూడినపిదప వానిని మరలనమ్మకుండుటయువలయును. రాజా! ఈరీతి ధర్మార్థకామములకు మూఁటికిని విరుద్ధముగానిది. నీవీశ్రుతము ననుసరించి మఱలఁ బ్రజలను రంజించుచు నెంతయు నైశ్వర్యమును బడయుము. పాండవా! నీవెప్పుడును బ్రాహ్మణులతోడఁగూడి మాడి కాలము పుచ్చుచుండుము. బ్రాహ్మణులవలననే నిహమందును బరమందును మిక్కిలియు శ్రేయముగలుగును. వీరెప్పుడు ధర్మమును దెలిసియుందురు. కర్తవ్యము లివి యని యెఱుఁగుదురు. వారిని బూజించినచో శుభములను గావింతురు. కనుక జననాథా! వారిని బూజింపుము. రాజా! నీ వట్లు చేయుటవలన యథాన్యాయంబుగ రాజ్యంబును బరమం బయిన శ్రేయమును గొప్పయశస్సును గులమునకుఁ గ్రమముగా సంతతియును బడయుదువు. భారతా! మార్జాల మూషికములకు జరిగిన యీసంధి విగ్రహకథ బుద్ధివిశేషము నెంతయుఁ గలిగించునది. దీనిని లెస్సగావింటివి. రాజగువాఁడు దీనిని లెస్సగాఁ గనుఁగొని శత్రుసమూహమందుఁ బ్రవర్తింప వలయును' అనెను. ఇది నూటముప్పదియెనిమిదవయధ్యాయము.



*

## ఆ ప ద్ధ ర్మ ప ర్వ ము.

భీష్ముఁడు యుధిష్ఠిరునకుఁ బూజనీ బ్రహ్మదత్త సంవాదమును జెప్పుట.

ధర్మరాజు 'మహాబాహూ! నీవు శత్రువులం దెంతమాత్రము నమ్మికయుంపరాదని యాలోచనము చెప్పితివి. రాజెవ్వరియందును నమ్మిక లేకుండినయెడలఁ దానెట్లు మనఁగలఁడు? నమ్మకమువలన రాజులకు మిక్కిలియు భయము గలుగునంటివి. రాజితరులను నమ్మకయెట్లు శత్రువులను జయింపనేర్చును? నాయీసందేహము నుడుపుము. నమ్మకుండుటను గుఱించి నీవు ముచ్చటించినదానిని వినఁగా నామనసేమియుఁ దోఁచక తడఁబడుచున్నది' అనెను.

భీష్ముఁడు 'రాజా! బ్రహ్మదత్తుం డనురాజునకును నతనియింటియం దుండినపూజని యను పక్షికిని, జరిగిన సంవాదమును వినుము. కాంపిల్యదేశమందు బ్రహ్మదత్తుం డను రాజుగలఁడు. అతని యంతఃపురమునందుఁ బూజని యనునొకపక్షి చాలఁగాలముగా నతనితోఁగూడ వసించియుండెను. అది * జీవజీవక మను పక్షివలెనె యన్నిమృగముల యెలుంగులును దెలిసియుండెను. అది పుట్టుకయందుఁ బక్షియైనను దాని కన్నియును నన్నితత్త్వములును దెలియును. అది యక్కడ వసించియుండునపుడు మంచివర్చస్సుగల యొక పిల్లనుగనెను. అక్కాలముననే రాజునకును నతనిదేవియందు నొకపుత్రుఁడు పుట్టెను. పూజని రాజింట నుండినందులకు నతనియెడ నెనరుగలదై ప్రతిదినమును సముద్రతీరములకుఁబోయి తనకూనకును రాజపుత్త్రునకును బోషణము

* జీవజీవకమనునది యొకపక్షి. వేఁటకాఁడనియుఁ గొందఱర్థముచేసెదరు.

నకై రెండుపండ్లను దెచ్చి యిచ్చుచుండెను. అందలియొక పండును దనకొడుకునకును మఱియొకపండును రాజకుమారునకును నిచ్చును. అది తెచ్చుపండ్లు, అమృతము నాస్వాదించినట్లు మిక్కిలి రుచ్యములై బలమును దేజమును బెంచునట్టివిగా నుండెను. అది ప్రతిదినము నట్లె యాపండ్లను దెచ్చుచును నట్లె యిచ్చుచు నుండెను. పూజని యిచ్చుపండ్లను దినుటవలన రాచబిడ్డఁడు మిక్కిలియు బలమునొందెను. ఒకనాఁ డా రాజకుమారుఁడు దాదిచంకయందుఁ దన్నుఁ గొనిపోవుచుండునపుడు పూజని కొడుకును జూచెను. అబిడ్డఁడు దాదిచంకనుండి దిగి యాపిట్టయొద్దకుఁ బరుగెత్తివచ్చి బాల్యమువలన దానితో మిక్కిలి యక్కఱగా నాటలాడుకొనసాగెను. వాఁడు కడపటఁ దన యీడుగల యాపిట్టను నెవరు లేనప్పుడు చేత నెత్తికొని నలిపి చంపి యంత దాదిచేతికి నెత్తుకొనుటకు వచ్చెను. ఆపూజని పండ్లను దీసికొనివచ్చి యాబాలుఁడు నేలఁ దనపుత్రునిఁ జంపివైచియుండుటను జూచెను. అది మొగమునిండఁ గన్నీరు వెల్లిగొనఁ గూలినకొడుకునుజూచి దీనయై మిక్కిలి దుఃఖమునఁ దపించి యేడ్చుచు 'క్షత్రియునితోడి పొత్తు తగదు. వానితోడి చెలిమియుఁదగదు. వానియెడఁ బ్రీతియుఁ దగదు. వారి కేదేని కార్యము కావలసియుండునేని మంచిమాటలతో లాలించి పనితీఱినదే దిగవిడుతురు. క్షత్రియులెల్ల వారికి నపకారము చేయువారుగాన వారినెప్పుడు నమ్మరాదు. అపకారము చేసినపిదప సయితము వారెప్పుడును వట్టి పనికిమాలిన తియ్యనిమాటలమాత్రము బుజ్జగించుచుందురుగాని బదులున కుపకరింపరు. ఈకృతఘ్నుఁ డీ క్రూరుఁ డీవిశ్వాసఘాతుకుఁడు చేసిన యీపనికి వైరము తప్పక దీర్చుకొనెదను. వీఁడు తనపుట్టిన

నాఁడే పుట్టి తనవెరిఁగినచోటనే పెరిఁగి తన పొత్తున భుజించి తన్ను శరణుఁగాఁ గొనియున్న నాయీబిడ్డనిఁ జంపినాఁడుగాన మూఁడువిధములయిన పాపములు చేసియున్నాఁడు' అని యిట్లు చెప్పి యంతఁ దనకాళ్లతో రాచకుమారుని కన్నులను బొడిచి దానివలనఁ గొంతయూఱటనొంది మరల నిట్లనియె—'ఒకఁడు పాపమును వలయునని కోరిచేయునేని వానిని దోడనే యది పయికొనుచున్నది. చేసినదానికి బదులుచేసి తీర్చుకొన్నవారికి దానివలన శుభాశుభములు నశింపవు. ఒకఁడుచేసిన పాపమునకు ఫలము వానియందుఁ గనుపట్టకపోయినచోనదివానిపుత్త్రులందును మనుమలయందును మునిమనుమలయందును వచ్చిపడుచున్నది' అనెను. బ్రహ్మదత్తుఁడు తనకొడుకును బూజని కన్నులుపొడుచుటను జూచి యది తన కొడుకుచేసినందులకుఁ దగిన ప్రతియని తలఁచి యాపక్షితో 'మేము నీకొక యపకారముచేసితిమి. నీవు బదులునకు నపకారముచేసితివి. రెండును సమముగానే యున్నవి. నీ విచటనుండి పోవలదు. ఇచటనే యుండుము'అనెను.

పూజని—'ఒకఁ డొకప్పుడు మఱియొకని కపరాధముచేసి వానియింటనే పోవక నిలిచియుండునేని పండితు లట్టినడకను గొనియాడరు. అట్టిస్థితియందు నపరాధికి తొలఁగి చనుటయె మేలు. వైరము బాహాటముగానున్నచోట వారెంత మంచిమాటలుచెప్పి బుజ్జగించినను నమ్మియుండరాదు. అట్లు నమ్మునట్టి మూఢుఁడు శీఘ్రముననే చంపఁబడును. వైరము త్వరలో నుపశమింపదుగదా. పరస్పరము వైరముగలవారి పుత్త్రులును బౌత్త్రులునుగూడ నావైరము కొనసాగుటవలన నాశమునొందుదురు. అట్లు పుత్త్రులును బౌత్త్రులును నశించుటవలన వారికిఁ బరలోక

మును నశించుచున్నది. ఒండొరులయందు వైరముగలవారికిఁ బరస్పరము నమ్మిక లేకుండుటయే సుఖావహము. విశ్వాసఘాతుకుఁడగువానియం దెడతెగక విశ్వాస ముంపరాదు. విశ్వసింపని వానియందు విశ్వాసముతగదు. విశ్వసించినవానియందు సయితము మిక్కిలి విశ్వాసముతగదు. విశ్వసించుటవలనఁ బుట్టెడి భయము వేళ్లనుగూడఁ ద్రెంచివైచును. పరులను వలయునంత నమ్మింపనైనవచ్చును గాని తానుమాత్రము నమ్మరాదు. బంధువులయందుఁ దలిదండ్రులె శ్రేష్ఠులు. * భార్య క్షేత్రము (పొలము) వంటిది. పుత్త్రుఁడు బీజముమాత్రము. తోఁబుట్టువగువాఁడు (ధనమును బంచుకొనుటచే) శత్రువు. మనుష్యుఁడు (చేతఁ దడియుండునంతవఱకు) మిత్త్రము. ఆత్మయొక్కటియె సుఖదుఃఖముల ననుభవించునది. పరస్పరము వైరముగలవారికి సంధిపొసఁగదు. † నేనిక్కడ వసించుచుండినందులకుఁ గలహేతువు గడచిపోయినది. ఇపుడులేదు. పూర్వమపకారము చేసినవానిని నపకృతుఁడయినవాఁడు, ధనములిచ్చియు సత్కృతులుచేసియుఁ బూజించుచుండు కొలఁదిని నపకారిహృదయ మపనమ్మకమునొందుచుండును. అట్టి పూజాదులు బలవంతుఁడుగా నుండువాఁడు చేయునేని దుర్బలులకు దిగులు పుట్టించుచున్నవి. బుద్ధిమంతుఁడగువాఁడు తా నెచ్చటఁ బిదప నవమానమునొందుటకే మొదట సమ్మానమునొందునో యచ్చోటును విడిచిపెట్టవలయును. తన శత్రువువలనఁ బిదపఁగూడ సమ్మానము గలిగినను వాఁడట్లె

---

* 'భార్యాజరా' యను పాఠమున వీర్యహారమైన జర (ముసిమి) వంటిదని యర్థము. 'భార్యాపాత్రం' అని (ప్రతాపచంద్ర)

† ఇట హేతువు పుత్రరక్షగాని స్నేహముగాని గావచ్చును.

నడచుకొనవలయును. నేను నీ గృహమందు దీర్ఘకాల మేహింస యు లేక సుఖముగా వసించియుంటిని. ఇప్పుడు వైరము పుట్టినది. సుఖం బుండదు. పని వినియెదను' అనెను. బ్రహ్మదత్తుఁడు 'పూజనీ ! ఎవఁడు చేసినదానికి బదులుచేయునో వాఁడట్లు చేసినందులకు నపరాధిగాఁడు. దానివలన వాఁడు ఋణ మీఁగినవాఁడగుచున్నాఁడు. కాఁబట్టి యిచటనే యుండుము. పోవలదు' అనెను. అందులకుఁ బూజని 'మొదట నపరాధము చేసినవానికిని పిదపబదులు చేసినవానికిని మరల సఖ్యమొనఁగూడదు. ఆవిషయమును జేసినవానిమనసునకును బ్రతిచేసిన వానిమనసునకును రెంటికిని దెలియు'ననెను. బ్రహ్మదత్తుఁడు 'చేసినవానికిని బ్రతిచేసినవానికిని మరల సఖ్యముపొసఁగును. అట్టికూడికయందు వైరముపశమించినట్లు కనుపట్టుచున్నది. మరల నట్టియెడఁ గ్రొత్తగా నొకపాపమును గలుగకున్నది' యనెను.

పూజని-'వైరమెన్నటికిని గడచిపోయినది లేదు. నన్నుమంచి మాటలాడినాఁడని తలఁచి యపకారము నొందినవాఁడు శత్రువును నమ్మియుండరాదు. ఈలోకమున మనుష్యులు గ్రుడ్డితనముగా నమ్ముటచేఁ జిక్కులుపడెదరు. కాఁబట్టి యొండొరుల కగపడకుండుటయే మేలు. మిక్కిలి వాఁడియైన యాయుధముల చేతను బలిమిచేతను లోపఱుచుకొనరానట్టివారిని, వెంటియేనుఁగులచేత మగయేనుఁగులంబోలె, (కపటంబగు) సామముచేత నడంచి లోపఱుచుకొనవచ్చును' అనెను. అందులకు బ్రహ్మదత్తుఁడు 'ఒకరికొకరు ప్రాణాంతకు లైన వారికిఁగూడ నొకచోటనే కూడిమాడి వసించియుండుటవలనఁ గుక్కను జంపి తిను చండాలునికిని గుక్కకునుంబోలె బరస్పరము స్నేహ

మును విశ్వాసమును గలుగుట గలదు. ఒకరియెడ నొకరు వైరముగలవారికిని నొక్కటఁగూడి వసించుటవలనవారివైరము మెత్తఁబడుచున్నది. మఱి యది తామరాకునందలి నీరువలె నిలిచియు నుండదు' అనెను. అందులకుఁ బూజని 'వైర మైదు కారణములవలనఁ బుట్టుచున్నది. వానిని బండితులు తెలియుదురు. ఆయైదుకారణములును * స్త్రీ, వాస్తువు, (పరుసని) మాటలు, స్వభావ (విరోధ)ము, అపరాధము అనునవి. అందు వైరమెవరితోఁగలదో వాఁడు దాతయగునేని చంపరాదు. విశేషించి క్షత్రియునకు, నట్టివానిని బ్రకాశముగాఁగాని రహస్యముగాఁగాని చంపుటతగదు. అట్టివిషయమందా పురుషుని దోషమునకుఁగల బలాబలము తెలిసికొనవలయును. సుహృదుఁడయినను వైరము కలిగినపిదప వాని యందు నమ్మిక యుంపరాదు. కట్టెలందగ్గి గూఢముగా నుండునట్లు వైరము వారి యందుఁ బ్రచ్ఛన్నముగా నుండును. వైరమనెడునగ్గి ధనము లిచ్చినను బరుసములాడినను మంచి మాటల బుజ్జగించినను చదువులు చదివియున్నను సముద్రమునందు బడబాగ్నియుంబోలెఁ జల్లాఱదు. ఒకతూరి యపరాధమువలనఁ బుట్టిన వైరాగ్ని యొకమాటు దరికొనెనా, రాజా! యిరు దెసలలో నొకనిని గాల్చిపుచ్చక పోనుఁగువడదు. ఒకఁడు మఱియొకనికపకారముచేసియున్నచో పిదప దానెంతధనములిచ్చియు

---

* ఇందు మొదటికారణమువలన వైరము కృష్ణశిశుపాలురకును, రెండవదానిచే కౌరవపాండవులకును, మూఁడవదానిచే ద్రోణద్రుపదులకును, నాలుగవదానిచే పిల్లియెలుకలకును, ఐదవదానిచేఁ బూజనికిని బ్రహ్మదత్తునకును గలిగినదని తెలియునది.

సమ్మానములుచేసియుఁ బూజించినను నామఱియొకనియందుఁ జెలిమిగాని నమ్మికగాని గలిగియుండరాదు. అపరాధకర్మమే యుపకారము చేసినవానికి జంకు గలిగించుచున్నది. నీకు నే నెప్పుడు నపకారముచేయలేదు. నీవును నాకెప్పుడు నపకారము చేయవు. ఈకారణమును బట్టి నేను నీయింటి వసించియుంటిని. అదంతయు నిపుడు మాఱిపోయినది. ఇప్పటికి నిన్ను నమ్మఁజాల నయ్యెదను' అనెను.

బ్రహ్మదత్తుఁడు 'కాలమే యొక్కొక్క కార్యమును జేయుచున్నది. కార్యములు పెక్కువిధములు. అవియన్నియు కాలము చేతనే నడచుచున్నవి. కాఁబట్టి యెవఁడెవనికి నపరాధము చేయుచున్నాఁడు? జన్మమును మరణమును నొక్కవిధముననే కలుగుచున్నవి. ప్రాణులు కాలముచేత (కార్యములు) చేయింపఁబడుచున్నవి. (పుట్టుచుఁ గిట్టుచున్నవి) అవి జీవము దూలుటకును గాలమే నిమిత్తము. కొన్ని యొక్కుమ్మడినే గిట్టుచున్నవి. కొన్ని యొక్కొక్కటిగా గిట్టుచున్నవి. కొన్ని చాలఁగాలము బ్రతుకుచున్నవి.నిప్పు కట్టియలను గాల్చునట్టు కాల మన్నిటిని గబళించుచున్నది. శుభాత్మురాలా! నేను నీదుఃఖమునకు నిమిత్తము గాను; నీవు నాదుఃఖమునకుఁ గావు. కాలమే దేహధారులకెల్ల నిత్యమును సుఖమును దుఃఖమును నేర్పఱచుచున్నది. కనుక నీ విచట నీయిచ్చవొచ్చున నాయందు నెయ్యము తియ్యము గలిగి యేబాధయునొందక వసించియుండుము. నీవు చేసినది క్షమించితిని. పూజనీ! నీవును నన్ను మన్నింపుము' అనెను.

పూజని 'కాలము నీవు చెప్పిన ట్లన్నిటికిని గారణమగునేని, యొకనికి మఱొక్కనియందు ద్వేషముగలుగదు. బంధువులు తమబంధులు చంపఁబడినయెడల నేల యట్లు చంపినవారిపైఁ బగతీర్చుకొనఁ జూచెదరు? దేవతలును నసురులును నందఱును నొకరి నొక రేల తొల్లి కొట్టుకొనిరి? కాలముచేతనే సుఖదుఃఖములును జనన మరణములును గలుగునేని, వైద్యులెందులకు రోగులకు మందులు సేయఁగోరెదరు? కాలమే దేనిని బరిపక్వము చేయునదేని మందులేల? జనులు శోకమున మూర్ఛితులై (మైమఱచి) యేల మిక్కిలియు బిట్టుగాఁ బలవించెదరు. కాలము నీవుచెప్పిన ట్లన్నికార్యములకుఁ గారణమగునేని, ధర్మకర్మములు చేయువానికే ధర్మముకలుగుట యెట్లు? నీకొడుకు నాకూనను జంపినాఁడు. నే నందులకు వానిని హింసించితిని. రాజా! ఇఁక నేను నీవు బాధించుటకుఁ బాత్రమనయితిని. నేను బుత్త్రశోకముచేత నీకొడుకునం దిట్టి పాపముచేసితిని గదా; కావున నీకు నల్లె నన్నుఁ గొట్టవలసిన దయ్యెను. అందులకుఁగల కారణమును గలరూపున వినుము. మనుష్యులు భక్షించుటకో లేక వేడుకగాఁ బంజరములఁ బెట్టుకొనుటకో పిట్టలను గోరుదురు. వధించుటయు బంధించుటయుఁ దప్ప మూఁడవకారణము మఱి యొక్కటి తగినదిలేదు. పక్షులు కొన్ని వధమునకును బంధమునకును వెఱచి తప్పించుకొని పాఱిపోవు నుపాయము నాశ్రయించుచున్నవి. వేదవిదులగువారు దుఃఖము పుట్టుకవలనను జావువలనను గలుగునందురు. అందఱకును బ్రాణములుతీపు. అందఱకును గన్నబిడ్డలయందు గారాము.అందఱును దుఃఖమునకు వెఱతురు. అందఱును సుఖమునకే యువ్విళ్లూరుదురు. బ్రహ్మదత్తా! దుఃఖ

మునకుఁ గారణములు పెక్కుగలవు. ముదిమి దుఃఖము. ధననాశము దుఃఖము. అనిష్టమగువానితోఁ గూడియుండుట దుఃఖము. ఇష్టములగువాని నెడఁబాయుట దుఃఖము. వధమువలనను బంధమువలనను దుఃఖముగలుగుచున్నది; స్త్రీవలనను దుఃఖముగలుగుచున్నది; సహజములయిన కారణములవలనను నదిగలుగుచున్నది. పుత్త్రమరణమువలనఁ గలుగుదుఃఖ మెప్పుడునుజనులను జుట్టుకొనియుండును. పరులకు దుఃఖము కలుగుటవలనఁ దమకు దుఃఖము లేదని బుద్ధిలేనివారు కొందఱు పలుకుదురు. ఎవఁడు దుఃఖమును బొంది యెఱుఁగఁడో వాఁడే మహాజనుల నడుమ నిట్లు వదరును గాని, యెవ్వఁడు దుఃఖమునఁ బీడితుఁడయి శోకమునెఱుంగునో వాఁడిట్లేల పలుకఁదలంచును? సమస్తవిధములయిన దుఃఖములను జక్కఁగాఁ జవిచూచినవాఁడు తనదుఃఖమునం దెట్లో యట్లే పరులదుఃఖమునందును శోకించును. రాజా! నీవు నాకేమి చేసితివో, మఱి నేను నీకేమిచేసితినో, వీనిని మాయఁజేయుటకు నూఱేండ్లయినను జాలవు. మనము పరస్పరమిట్లు చేసినపిదప సంధి పొసఁగదు. నీవు పుత్త్రునిఁ దలఁచుకొనుకొలఁదిని నాయందు వైరము క్రొత్తఁగాఁ గలుగుచుండును. ఒకఁడొకనిపయి వైరమును దీర్చుకొన్నపిదప వానితోఁ బ్రియముగావించుకొనఁ గోరెనేని యాయిరువురకు, మట్టికుండ పగిలి యొకటిగాఁ గూడికొన నేరనియట్లు, సంధి కలుగఁజాలదు. నమ్మిక సుఖము గలిగింపదనుట సర్వశాస్త్రములయందలి సిద్ధాంతము. తొల్లి శుక్రుఁడును రెండుగాథలనుఁ బ్రహ్లాదునికిఁ జెప్పెను. అవి యేవనఁగా—శత్త్రువు చెప్పుమాటలు సత్యమయినను, నసత్యమయినను

నెవఁడు నమ్మునో వాఁ * డెండుగడ్డి గప్పియున్న గోతిలో నున్న తేనెను నమ్మి దినునట్టివారుంబోలె నాశమునొందును. వైరము లు,కులమందుఁ బదియుగము లయినను జల్లాఱవు. ఆకులమందుఁ బుట్టియున్న పుత్రులకుఁ దమపూర్వుల వైరమును దండ్రులు చెప్పుచునుందురు; (కానయది తరములబడి సాఁగుచునే యుండు ను) అనుటయే. రాజులు వైరముల నడంచుకొని మొదట మంచి మాటలు పలుకుచుందురు; పిదప సమయమురాఁగా నిండినకుం డను ఱాతిమీఁదవైచి పఱియలు గావించునట్లు వాని నుఱు ముదురు. రాజా! 'ఈలోకమందు రా జొకనికిఁ గీడుచేయు నేని, పిదప వానిని నెప్పుడును నమ్మరాదు; ఒకని కపకారము చేసినపిదప వాని నమ్మినచో దుఃఖము పాలగును' అనెను. అందు లకు బ్రహ్మదత్తుఁడు 'ఒకరియందును విశ్వాసము లేకుండిన యెడల నర్థమును సేకరింపఁదరముగాదు; ఒకటియుఁ జేయ శక్య ముగాదు. ఎప్పుడు నొక్కరూపున భయమే పడుచుండువాఁడు చచ్చినవానికి సాటియగునే' యనెను. పూజని 'ఎవనికి నడుగులు పుండ్లుగలవియో వాఁడు పరుగిడునేని యెంతమెలఁకువతో నట్లు చేసినను వానికాళ్లు పడి నొవ్వకమానవు. ఎవ్వనికిఁ గన్నులఁ దెవులుగలిగియుండునో వాఁ డాకన్నులను గాలికెదురుగాఁ బట్టి చూచునేని, యాకన్నులకు గాలిచేత మిక్కిలియుఁ దెవులు తప్పకకలుగును. ఎవఁడు తనబలము దెలియక చెడ్డమార్గమునఁ బోవ సమకట్టి యట్లు యెడతెగక పోవునో,వానిబ్రతుకును దుద

* కొండలయందుఁ దేనెను వెదకుచుఁబోవువాఁడు తేనెటీఁగలు పోవుదారి యందే కన్నుగలిగి యుండుటచే నందలి గోతులు మొదలగు వానియందుఁబడి కెడయుట గలదు. (ప్రతాపచంద్ర.)

ముట్టించుకొనును. సేద్యగాఁడెవఁడు వర్షమును దెలిసికొనక పొల
మును దున్నునో వాఁడు తన ప్రయత్నమంతయుఁ జెడఁగా నందు
లకు ఫలమును బొందకపోవును. ఏమనుష్యుఁడు ప్రతిదినమును
దనకు హితమయిన (పోషకమైన) యాహారమును, (అది చేఁదు
గనో, యొగరుగనో, కమ్మగనో, దీయగనో, యెట్లుండినను లోఁ
గొనునో వాఁడు చిరాయువు గలిగియుండును. ఎవఁడు తనకుఁ బథ్య
మయిన యాహారమును దెలివిలేమివలన విడిచి దుష్టమయిన
భోజనమును, దానివలని ఫలమును దెలిసికొనక కుడుచునోవాని
జీవిత మంతటితోఁ దుదముట్టును. దైవమును బురుషకారమును
నొకటి నొకటి యాశ్రయించుటచే నెలకొనియుండును; అ
ట్లాశ్రయింపనిచో నెలకొనఁజాలవు. గొప్పరకమువారు పురు
షకారమునే యనువర్తింతురు. మగతనము లేని పందలే
(పాటుపడక) దైవము నొక్కటినే నమ్మియుందురు. తీక్ష్ణమో,
మృదువైనదో, తనకు హితమయిన కార్యమును దప్పక చేయ
వలయును. స్వభావముచేఁ బాటుపడకుండు నట్టివాఁడు తుదకుఁ
గానునులేక యెప్పుడును నర్థములబారిఁ జిక్కియుండును. * కాఁ
బట్టి సంశయింపఁదగినట్టి కార్యమందును బౌరుషమునే కావింప
వలయును. మనుష్యులు తమకుఁ గలయంతయు నయినను దిగ
విడిచి యాత్మహితమును గావించుకొనవలయును. విద్య, శౌచ
ము, సామర్థ్యము, బలము, శౌర్యము ననెడి యీయైదును దో
డఁబుట్టిన మిత్రములందురు. బుధు లగువారు వీరి సహాయము

* తస్మాత్సంశయితేప్యర్థే కార్యఏవ పరాక్రమః' అని(దా. మూ.) తస్మాత్స
ర్వం వ్యపోహ్యార్థం' అని ఉత్తరగకోశములు. సమస్తములయిన విషయముల
విడిచి పౌరుషమే కావింపవలయునని యర్థము.

ననే యీలోకమందుఁ గాలముపుత్తురు. గృహములు, రాగి మొదలగు లోహములు, పొలము, భార్య, సుహృత్సమూహము ననెడి యివి శ్రేయమునకు నుపసాధనములుగా బుధులు చెప్పెదరు. మనుష్యుఁడు వీని నెల్లయెడలను బడయవచ్చును. ప్రాజ్ఞుండన్నియెడలను రమించుచుండును : అతఁ డన్నియెడల వెలుంగుచుండును. అతఁడు దేనికి బెదరుపుట్టింపఁడు. బెదరుపుట్టించినను భయమొందఁడు. బుద్ధిమంతుఁ డగువానికిఁ గలధనమెంత యల్పముగానుండినను నిత్యమును పెరుఁగుటతప్పదు. అట్టివాఁ డొక్కొక్క కార్యమును నేర్పుతోఁ జేయును. సంయమమువలన (ఆత్మనిగ్రహమువలన) నతఁడు మంచిప్రతిష్ఠ నొందును. గృహస్థవృత్తియందలి నెయ్యమునకులోనై యల్పబుద్ధు లగు మనుష్యుల మేనిమాంసములను గుత్సితస్త్రీ, యూఁడుటెండ్రిని దానిపిల్లలుం బోలెఁ, దినివైచును. కొందఱు మనుష్యులు బుద్ధితడఁబడుట వలనఁ దమయిండ్లను విడువఁగలిగినచో మిక్కిలియు సొంపుగుంది 'నాయిల్లిది, నాభూములు, నామిత్రములు, నాదేశము, వీని నెట్లు దిగవిడుతు' నని డిందుపడుచున్నారు. * ఒకఁడు తన స్వదేశము వ్యాధిచేతను దుర్భిక్షముచేతను బీడితమై యున్నచో దానిని దప్పక విడువవలయును. ఒకఁడు తనదేశమందు నెప్పుడును నందఱచేతఁ బూజితుఁడై వసించియుండవలయును. అట్లుగానిచో మఱియొక దేశమునకుఁబోయి వసింప

* 'ఉత్పతేత్సహజాద్దేశా ద్వ్యాధిదుర్భిక్ష పీడితాత్' అని జౌ. మూలము. "ఉత్పథాచ్చ విమానాచ్చ దేశాద్దుర్భిక్షపీడితాత్' అని (దా. మూలము.) తప్పు దారినుండియు నవమానముగల పట్టునుండియు కఱవుగల దేశమునుండియు నని యర్థము తెలియునది.

వలయును. ఈకారణమునుబట్టి నేను మఱియొకచోటికిఁబోయె దను. నే నిక్కడ నుండుటకెంతమాత్రమొల్లను. ఏలన నేను నీ పుత్రునకు గొప్ప నేరముగావించి యున్నాను. చెడ్డయిల్లాలిని, జెడ్డపుత్రుని, చెడ్డరాజును, చెడ్డసుహృదుని, చెడ్డచుట్టమును, చెడ్డ దేశమును దూరముననే విడువవలయును. చెడ్డమిత్రునియందు విశ్వాసముండదు. చెడ్డభార్యయందు రతియెక్కడిది. చెడ్డ రాజ్యమం దూఱటగలుగదు. చెడ్డదేశమందు బ్రతుకుఁదెరు వుం డదు. చెడ్డపుత్రునియందు మంచిమనస్సుగలుగదు. చెడ్డసంబంధ మందు ధనమునకు నాశముకలిగినచో నవమానము కలుగును. ఎవ్వతి ప్రియముగఁ బలుకునో యదిభార్య. ఎవనివలన సుఖముగలు గునో వాఁడు పుత్రుఁడు. ఎవనియందు విశ్వాసముదగునో వాఁడు మిత్రుఁడు. ఎచ్చట బ్రతుకుగలుగునో యది దేశము. ఎవఁడు నిర్బంధింపఁడో, బీదలను బోషించునో, ఎవనిరాజ్యమందు భయ ముగలుగదో, వాఁడు దిట్టమయినశాసనము గలరాజు. రాజు గుణవంతుఁడును ధర్మమును జరుపువాఁడునై యుండునేని భా ర్య, దేశము, మిత్రులు, పుత్రులు, సంబంధులు, బంధులు నందఱు నొకనికి సుఖముగాఁ బడయనగును. రాజు ధర్మమును బాటింప లేని యతని దేశమందలి ప్రజలు, నిగ్రహమువలన (పీడనము వలన) నశింతురు. పరాకులేక పరిపాలించునట్టి రాజే ధర్మార్థకా మములకుమూలము. రాజు ప్రజలవలననుండి ఫలమునం దాఱవ పాలు పన్నుపుచ్చుకొని యుపయోగించుకొనవలయును. ప్రజ లను జక్కఁగాఁ బరిపాలింపని రాజు నిజమునకు దొంగయె. ఏ రాజు, అభయమొసంగి, పిదప ధనమందలి పేరాసవలన దాని నెఱవేర్పఁడో యా యధర్మబుద్ధి ప్రజలందలిపాపములను దాను

గయికొని తుదకు నరకమును బొందును. ఏరాజు, అభయమొసంగి యట్లు దానిని నెఱవేర్చునో యతఁ డట్లు ప్రజలను ధర్మంబునఁ బరిపాలించుచుండుటవలన సర్వసుఖావహుఁడని యెన్నఁబడును. రాజు తండ్రియు, దల్లియు, గురువును, రక్షకుఁడును, అగ్నియుఁ, గుబేరుఁడును, యముండు నగునని యతనికి నీయేడుగుణము లను బ్రజాపతియగు మనువు చెప్పెను. రాజు ప్రజలయెడఁ గనికరముతోఁ బ్రవర్తించునేని యతఁడు వారికెల్లఁ దండ్రియగును జుమీ. అతనియొద్దఁ గపటముగా వర్తించునట్టి మనుజుఁడు మఱునటిజన్మమునఁ దిర్యక్కుగాఁ బుట్టును. ప్రజలకు మేలు సేయుచు, బీదలను బోషించుచుండుటవలన రాజు వారలకుఁ దల్లియగుచున్నాఁడు. దుష్టులను గాల్చుటచే నగ్నియనియు, అహితుల నడంచుటచే యముఁడనియు నెన్నఁబడుచున్నాఁడు. ఇష్టులయినవారికి ధనములొసంగుటవలన రాజు కామముల నిచ్చు కుబేరుఁ డగుచున్నాఁడు. ధర్మముల నుపదేశించుటవలన గురుండును బరిపాలించుటవలన రక్షకుండు నగుచున్నాఁడు. పురజనులను దేశజనులను దనగుణములచే నెవఁడు రంజించునో యతఁడు రాజనుటకుఁ దగియుండుటకాక యట్టిగుణములను ధర్మములను బాలించుటవలన నతనినుండి రాజ్యమును వీడదు. ఎవఁడు పౌరజనులను దేశజనులను బూజించుట లెస్సగాఁ దెలియునో యతఁ డిహమందును బరమందును నేకీడునొందక సుఖముగా నుండును. ఎవ్వని ప్రజలు బరువయిన పన్నులచేఁ బీడితులయ్యు నతనికి నెల్లపుడును భయపడుచును, అనర్థములచేతఁ గ్రుంగుచును నుందురో, యారాజు ప్రజలచేత నోటువడును. ఎవ్వని ప్రజలు సరస్సునందుఁ దామరలుంబోలె వర్ధిల్లుచుందురో యా

రాజు సర్వసుఖావహుఁడని వాసికెక్కుటయె కాక స్వర్గలోకమం దెంతయుఁ బూజితుఁడగును, రాజా! బలవంతునితోడ విగ్రహ మెుకప్పుడును గొనియాడఁదగదు. బలవంతునితోడ విరోధము గలరాజునకు రాజ్యమెక్కడిది? సుఖముగాని యెక్కడిది?' అనెను.

భీష్ముఁడు 'ఆపక్షి బ్రహ్మదత్తున కిట్లు చెప్పి యతనిచేత నీడ్కోలు వడసి తనయిష్ట మయినదిక్కునకుఁ బోయెను. బ్రహ్మదత్తునకును బూజనికిని జరిగిన యీ సంభాషణమును నీకుఁ జెప్పితిని. ఇంకను మఱేద్ది వినఁగోరెదవు?'అని యడిగెను. ఇది నూట ముప్పదితొమ్మిదవయధ్యాయము.

---

## ఆ ప ద్ధ ర్మ ప ర్వ ము.

{భీష్ముఁడు శత్రుంతపునకు భరద్వాజుఁడు చెప్పిన యాపద్ధర్మమును ధర్మరాజునకుఁ జెప్పుట.}

ధర్మరాజు 'యుగము క్రమముగాఁ గడచిపోవుటవలన ధర్మమును జనులును నలుగడల క్షీణింపఁగా లోకము దొంగలచేఁ బీడింపఁబడుచుండఁగా నపుడు రా జెట్లుండవలయును?' అని యడిగెను.

భీష్ముఁడు 'భారతా! అట్టి యాపదలందు రా జెట్టినీతిని బూనవలయునో, దయ సయితము దిగవిడిచి యెట్లు నడచుకొనవలయునో, నీకుఁ జెప్పెదను. ఈ విషయములందు శత్రుంతపుఁడనురాజునకును భరద్వాజమునికిని జరిగిన సంవాదమయిన యీయితిహాసమును నుదాహరించుచున్నారు. సౌవీరదేశమునకు

శత్రుంతపుఁ డనురా జుండెను. అతఁడు మహారథుఁడు. అతఁ డొకప్పుడు భరద్వాజునికడకుఁ బోయి యర్థ (ధన) శాస్త్రముల సిద్ధాంతముల నడుగువాఁడై 'లభింపకున్న వస్తువు లభించుట యెట్లు ? లభించినదానిని పెంచుటయెట్లు? పెంచినపిదప దానిని రక్షించుటయెట్లు ? రక్షించినపిదప దాని నుపయోగించుట యెట్లు?' అని యడిగెను. అర్థవిషయమయిన నిర్ణయముల నిట్లడుగఁగా మతిమంతుఁ డాఋషి సహేతుకములైన యుత్తమ వాక్యముల 'రాజెప్పుడును దండమును జేతఁగొని యుండవలయును. ఎప్పుడును పౌరుషమును మెఱయుచుండ వలయును. తనయందు ఛిద్రములు గలిగించుకొనక పరులయందలి ఛిద్రములను గనుఁగొనుచుండవలయును. పరులయందలి సందులను వెంబడించి పయినెత్తవలయును. దండమెప్పుడును బూనియుండు రాజునకు జనులెంతయు వెఱతురు. కాఁబట్టి సమస్తములయిన ప్రాణులను దండముచేతనే యడంచి యేలవలయును. తత్త్వదర్శులగు పండితు లీదండమునే కొనియాడెదరు. కాఁబట్టి యీ నాలుగింటియందును (అనఁగా సామదానభేదదండములయందు) దండమే ప్రధానమయినదని చెప్పఁబడుచున్నది. ఒక పట్టునకు (రాజ్యమునకు) నాధారములయినవి నశించినచో దానిని నాశ్రయించి బ్రతుకు నవియెల్ల హాతము లగుచున్నవి. ఒక పెద్ద మ్రానివేళ్లను నఱికినయెడల దానికొమ్మ లెట్లు నిలిచియుండును? పండితుఁ డగురాజు పగవానిమూలమునే మొదటఁ ద్రెంపవలయును. పిదప వానిసహాయులను దక్కినవాని పక్షమువారిని నందఱను గూల్పవలయును. ఆపద వచ్చినకాలమందు రాజు ముందువెనుక విచారింపక, చక్కఁగ నాలోచించుటయు,

చక్కఁగాఁ బరాక్రమించుటయు, చక్కఁగ యుద్ధము సేయుటయు, వలయునేని లెస్సఁ బాఱిపోవుటయుఁ గావింపవలయును. రాజు వాక్కునందుమాత్రము వినయముగలిగి యుండవలయును గాని హృదయమందు మంగలికత్తివలె వాఁడిగలిగి యుండవలయును. మఱియుఁ గామక్రోధములను వర్జించి మెత్తఁదనముతో మాటలాడవలయును. శత్రువుతోఁ గూటువగలిగి యుండవలసివచ్చి నపుడు మంచిబుద్ధిగల రాజు వానితో సంధి చేసికొని వానియందు గుడ్డినమ్మిక యుంపకుండవలయును. వానితోడి పని తీఱఁగానే శీఘ్రముగా వానినుండి మరలవలయును. శత్రువును ముందుమిత్రునింబోలె మంచితిన్ననిమాటలచే బుజ్జగింపవలయును. మఱి వానివలన నింటియందున్న సర్పమువలనంబోలె భయముగలిగియుండవలయును. ఎవనిబుద్ధి నీబుద్ధికిఁ గీడ్పడినదో వానిని జరిగిన సందర్భములను జూపియు, బుద్ధిపసలేనివానిని రాఁగల సందర్భములను నమ్మఁజెప్పియు, మేలయిన బుద్ధిగలవానిని నప్పటికిఁదగిన సమాధానములఁ బన్నియు సమాధానపఱుపవలయును. ఐశ్వర్యమును గోరునట్టివాఁడు, వలయునట్లు చేమోడ్పును, బ్రతిజ్ఞను, మంచి చల్లనిమాటలను, తలవంచి యభివాదనము సేయుటను, కన్నీ రొలికించుటను గావింపవలయును. కార్యము సమకూడునంతకును నొకఁడు తనశత్రువును మూఁపుమీఁద మోచియుండవలయును. కాలమువచ్చినపు డాశత్రువును రాతిమీఁదఁ గుండను వైచి పగుల్చునట్లు దుత్తుమురు గావింపవలయును. రాజేంద్రా! రాజు ముహూర్తముసేపయినను దుమ్మికి కొఱివివలె ధగధగజ్వలించుట లెస్స; కాని, చిరకాలము నుముక నిప్పువలె జ్వలింపక పొగయుచు మాత్రముండుట తగదు. తాను గృతఘ్నుఁడగు

వానికిఁ బెక్కులు ప్రయోజనములు గావింపవలసియున్నను, అట్టి వానితో నట్టిప్రయోజన మొడఁగూర్చునట్టిసంబంధమును గూడఁ బెట్టుకొనరాదు. ఏలనఁగా(అట్టివాని) ప్రయోజన మీడేర్చినచో, సుఖ మనుభవింప శక్యమగును. అది యొనఁగూర్పనిచో నవమానమే కలుగును. కాఁబట్టి యట్టివాని కార్యములు చేయవలసినప్పుడా కార్యములనెల్లఁ గొంచెము గడమగలిగి యుండునట్లు గానే చేయింపవలయును గాని పూర్ణముగాఁ జేసి తీర్పరాదు. రాజు * కోకిల, పంది, మేరుపర్వతము, పాడిల్లు, † పాము, భక్తుఁడగు నెయ్యుఁడు ననువీరలవలెఁ దనకేది శ్రేయమో చేసికొనవలయును. మఱియు నిత్యమును బెందలకడ లేచి యెచ్చరికతప్పక శత్రువు నింటికిఁబోయి యతనిని గుశలమునుగా నుండినను గుశలమాయని యడుగుచుండ వలయును. సోమరిపోతులు ధనమును బడయఁ

---

* కోకిల తాను బోషింపింపవలసిన వానిని మఱియొకదాని చేతఁ బోషింపించునట్లు రాజు తనకృషి, వర్తకము, మార్గము, అడవులు మొదలయినచోట్లను గల తనధనములను నితరులనుగాని పోషింపఁ వలయును. (లేక మిత్రులను గాని ప్రజలనుగాని యితరులనుగాని పోషింపవలయును.) పంది భోజ్య వస్తువులను మూలముతో బెల్లగించునట్లు రాజును శత్రువులను మూలముతోఁ బెకల్పవలయును. మేరువువలె రాజు చలింపకయు నుల్లంఘింప రాకయు నుండవలెను. శూన్యగృహమునకు సంపదలు రావలయునని కోరునట్లు రాజును ధనములను గోరుచుండవలయును. సర్పమువలె రాజు వైరమునశింపక యుంచుకొని యుండవలెను. భక్తిగల మిత్రునింబోలెఁ దన్ను సంబంధించిన వారల క్షేమములకై పాటుపడుచుండ వలయును.

† 'పాము' మాఱు 'నటుఁ'డని ఉత్తరప్రతులు. (నటుఁడనుపాఠమున నటునివలె నానారూపములు సందర్భానుగుణముగఁ బూనుచుండవలయును)

జాలరు ; మగతనము లేని పందలును, మిక్కిలి విడంబముగల వారును బడయఁజాలరు. లోకుల యాడికకు భయపడువారును విడిచి విడిచిపనిఁబూనువారును(దీర్ఘసూత్రులును)ధనమును బడయ నేరరు. రాజు తన ఛిద్రములను బరులు తెలిసికొనకుండఁ జేయవలయును గాని, పరుల ఛిద్రములను దాను గనుఁగొనుచుండవలయును. మఱియుఁ దాఁబేలివలెఁ దన మంత్రాంగములను బదిలముగాఁ దాఁచుకొనవలయును. తనయందలి రంధ్రముల నెప్పుడునుగాచికొనవలయును.*కొంగవలె(నొక టేధ్యానముగాఁ) గార్యములను జరిపింపవలయును. సింహమువలె (భయము లేక) పరాక్రమము ప్రకటింపవలయును. దోఁడేలివలెఁ బొంచు వేసియుండి బాణమువలెఁ జక్కఁబోయిపడి తునియలు గావింపవలయును. పానము, జూదము, స్త్రీలు, వేఁట, సంగీతము ననువీనిని దగుకొలఁది ననుభవింపవలయును. వీనియందు మిక్కిలియుఁ దగులువలన దోషముగలుగును. పుల్లును విల్లు జేసికొనవలయును; జింకవలెఁ బరుండి యుండవలయును. గ్రుడ్డివలె నుండవలసినపుడు గ్రుడ్డిగా నుండవలయును, చెవిటివానివలె నుండవలసినపుడు చెవిటిగా నుండవలయును. సమర్థుఁడగువాఁడు దేశకాలములను బాటించి పరాక్రమము మెఱయవలయును. దేశకాలములను మీఱి మెఱయించినట్టి పరాక్రమము నిష్ఫలమగునే కదా ? కాలాకాలములను, బిదపఁ దనబలాబలములను జక్కఁగా నిశ్చయించుకొనియు శత్రువు బలమును దెలిసికొనియు నందులకుఁ దగునట్లు తన్ను పయోగించుకొనవలయును. ఏ రాజు దండము

* కొంగ కొలను జంతులందుఁ బెద్దయుఁ బ్రొద్దు చేఁపలకై మిన్నక వేచి యుండుట దెలియునది.

చేత లోఁపఱచుకొనంబడిన శత్రువును బూర్ణముగా నడఁగఁ ద్రొక్కఁడో యతఁ డశ్వతరిగర్భముంబోలె మృత్యువును దన యందు దాఁచిపెట్టుకొన్న వాఁడగును. రాజు పూవులు లెస్సగా పూయవలయునుగాని పండ్లుపండరాదు; పండ్లు పండినను బయికి నెక్కుట కలవి గాకుండవలయును; పక్వము గాకుండినను బక్వమయిన ట్లుండవలయును. రా జిట్లు నడచుకొను నేని యేశత్రువునకుఁ జిక్కి కీడ్పడఁడు. రాజు తన్నుఁగోరువారి కాశలు * బలపఱుపవలయును గాని, వాని నొడఁగూర్చుటకు నడుమ విఘ్నములు పెట్టవలయును. అతఁ డావిఘ్నములకేవో నిమిత్తములను జెప్పవలయును. ఆనిమిత్తములకును దగిన హేతువుల నిరూపింపవలయును. భయమునకుఁ గారణము రాకుండు నంతవఱకును రాజు భయపడినవానివలె వలయు నేర్పాటులన్నియుఁ జేసికొనవలయును. భయకారణము నిక్కముగా వచ్చునపు డతఁడు నిర్భయముగా పైఁబడి కొట్టవలయును. సాహసము నూఁదక శుభములు మనుష్యునకుఁ గలుగవు. మఱియు సంశయముల నడుమఁ జొచ్చియుఁ దన ప్రాణముల నిలఁబెట్టుకొను నేని శుభములను బొందును. రాజు రానున్న భయములను ముందుగాఁ దెలిసికొనవలయును. అవి వచ్చియున్నపుడు వానిని దొలఁగఁ బుచ్చవలయును. అవి మరలఁ బెరుఁగునోయని శంకించి వానిని నడంచిన పిదప సయితము వాని నడంపకుండునట్లు భావింపవలయును. అప్పటికి సమకూడియున్న సుఖమును దిగవిడుచుటయు, నిఁక

* 'ఆశాంబలవతీం కుర్యాత్' అని ఉత్తరకోశములపాఠము. 'ఆశాం కాలవతీం కుర్యాత్' అని దా. మూలము. కాలమునకుఁ దగిన ట్లాశ గొలుపవలయు నని యర్థము.

రాఁగల సుఖమున కువ్విళ్లూరుటయు బుద్ధిమంతులగువారికి నీతి గాదు. ఏ రాజు శత్రువుతో సంధిచేసికొన్న పిదప వాఁడేమియుఁ జేయఁడని నెఱనమ్మకముతో హాయిగా నిదురించునో వాఁడు చెట్టుకొనపై నిదురించి క్రిందఁబడిన వెనుక లేచునట్టివానికి సాటి యగును. తాను దీనత్వము నొందినపుడు మృదువో, క్రూరమో, యేదేనియొకకర్మముచేతఁ ద న్నుద్ధరించుకొనవలయును. అట్లు ద్ధరించుకొని, సమర్థుఁడయినపుడు, ధర్మమును జేయవలయును. రాజు తనశత్రువులకు శత్రువులగువారి నందఱను గౌరవించి యనువర్తింపవలయును. అతఁడు (తనచారులనే శత్రువు లేర్ప ఱచుకొన్న మనుష్యులుగాఁ దెలియవలయును) తనచారునిని బరులకుఁ దెలియకుండునట్లు చేయుటయే కాక తనచారులను బరులచారులను జక్కఁగా గుఱుతెఱింగికొనవలయును. పాషం డులు తాపసులు మొదలగువారిని జారులను గావించుకొని పర రాష్ట్రములకుఁ బంపవలయును. ధర్మమును జెఱుపువారును బాపులును లోక కంటకులును నగు దొంగలు తోఁటలయం దును, విహారస్థలములందును, జలి పందిళ్లయందును, చావడుల యందును, పానశాలలందును, జనులు గూడుచోటులందును, దీర్థములందును, సభలందును వత్తురు. వారలనుగని పెట్టి యడఁచి పుచ్చవలయును; దొంగతనము లేకుండునట్లును గావింపవల యును. విశ్వసింపఁ దగనివానిని విశ్వసింపరాదు. విశ్వసించిన వానిని మిక్కిలిగా విశ్వసింపరాదు. విశ్వాసమువలన భయము గలుగుచున్నది. పరీక్షింపకయు విశ్వసింపరాదు. శత్రువునకు నిజముగాఁ జూపట్టి హేతువులచేత నమ్మించి వాఁడు తనపట్టు నుండి యించుక చలించిన తెఱపిని వైఁబడి కొట్టవలయును.

శంకింపఁ దగనివానియందును శంక గలిగి యుండవలయును. శంకిం పఁదగువారినో యెప్పుడును శంకించు చుండవలయును. ఎవని యందు శంక లేకుండునో యట్టివాని వలననుండి కలుగుభయము వేరుతోడఁ ద్రెంచివైచును. ఎచ్చరిక చేతను, మౌనము చేతను, కాషాయముల చేతను, జటా వల్కలములు ధరించుట చేతను, శత్రువును నమ్మించి సమయము వచ్చినపుడు తోఁడేలివలెఁ బైపడవలయును. పుత్రుఁడో, తోఁబుట్టువో, తండ్రియో, స్నేహితుఁడో, యెవరుగానుండినను నర్థమునకు విఘ్నము చేయు చున్నట్టివారిని సంపద గోరునట్టివాఁడు చంపి తీరవలయును. మిక్కిలియు గర్వమునఁ గన్నుఁగానకయు, కార్యాకార్యములను దెలియకయు దుర్మార్గమున వర్తించుచుండు వాఁడు గురువయి నను వానిని దండించుట యావశ్యకము. వాఁడి ముక్కుగల పిట్టలు తాము వ్రాలెడి చెట్లయందలి పూవులను బండ్లనును గొట్టివైచునట్లు రాజు లేచి యెదుర్కొని యభివాదనములు చేసియు నేదేని కొంచెమిచ్చియు మిక్కిలియుఁ బూజించి తుదకు శత్రువు సర్వస్వమును బుచ్చుకొనవలయును. పరుల మర్మావయవ ములను భేదింపకయు, దారుణమయిన కార్యములు చేయకయు, జాలరివానివలెఁ బట్టిచంపకయు, గొప్పయైశ్వర్యమును బొందుట శక్యముగాదు. పుట్టుక చేత నే శత్రువైనదియు లేదు; మిత్రమైనది యు లేదు. ఉభయులకు సమమయినయొక ప్రయోజనము పొసఁ గుటంబట్టి మిత్రులును శత్రులును గలిగెదరు. శత్రు వగువాఁడు దీనముగా నెంత పలవించినను వానిని విడిచిపెట్టరాదు. వానియెడల జాలి పడరాదు. పూర్వ మపకారము చేసినవానిని జంపవలయును. సంపదనుగోరునట్టిరాజు తనకు వలయునన్ని మనుష్యులను జేరఁ

దీసికొనుటయేకాక వారికి మంచి సేయుచుండవలయును. మఱి ప్రజలయెడ నడచుకొనునపు డసూయపడకుండవలయును. దుష్టులను బ్రయత్నపడి యడంచుచుండవలయును. కొట్టఁబోవునపుడు నింపుగనే పలుకవలయును. కొట్టిన పిదపను మిక్కిలి యింపే పలుకవలయును. కత్తిచేతఁ దలనఱికినపిదప నందులకై దుఃఖంపను నేడువను వలయును. సంపదను గోరునట్టి రాజితరులను మంచి మాటలచేతను, సన్మానములచేతను, దానములచేతను రాఁబట్టుకొనవలయును. ఇట్లతఁడు మనుష్యులను దనసేవకుఁ దెచ్చుకొనవలయును. రాజు వ్యర్థములయిన వైరములు వెట్టుకొనరాదు. ఏటిని దన రెండుచేతులనే కొనియీఁదరాదు. పశువుల కొమ్ములను దినుట పనికిమాలినది. మఱి దానివలనఁ బుష్టి యుఁగలుగదు. పండ్లువిఱిగిపోవుటయేకాక దానివలన రసమును బుట్టదు. ధర్మార్థకామములకు మూఁడువిధములయిన పీడలును మూఁడనుబంధములును గలవు. అనుబంధములను జక్కఁగాఁ దెలిసికొన్నచోఁ బీడలను బరిహరించు కొనవచ్చును. ఋణశేషమును, అగ్నిశేషమును, శత్రుశేషమును నల్లె నిలిపియుంచిన యెడల మాటిమాటికిఁ బెరుఁగుచుండును. కాఁబట్టి వీనినెల్ల నిశ్శేషము గావింపవలయును. ఋణ మెప్పుడును బెరుఁగుచుండును గాన, దానిని నిశ్శేషముగావించిననేతప్ప నది నశింపకయే యుండును. ఇట్లే యవమానింపఁబడిన శత్రువులును, నుపేక్షింపఁబడిన వ్యాధులును గడిందికీడును గలిగించును. ఒక్కొక్క కార్యమును జక్కఁగాఁ జేసి తీర్పవలయును. ఎప్పుడును బరాకుపడకుండవలయును. ముల్లంతటిదికూడఁ జక్కఁగాఁ బెఱికి వైవని యెడలఁ జిరకాలము బుడిపి గట్టియుండును. మనుష్యులను

జంపుటవలనను మార్గములను జెఱుపుటవలనను గృహములను నాశముసేయుటవలనను బరరాష్ట్రమును బాధచేయవలయును. రాజు గ్రద్దవలె (దూర) దృష్టియుఁ, గొంగవలె నిశ్చలత్వమును, గుక్కవలె జాగరూకతయు, సింహమువలెఁ బరాక్రమమును, గాకివలెఁ జంకుఁగొంకును గలిగి శత్రురాష్ట్రములను బామువలె సులువుగఁ జొరవలయును. రాజు శూరుని నంజలిచేసియు, బిఱికివానిని భయపెట్టియు, లోభిని ధనమిచ్చియు, సమానుని యుద్ధముచేసియు వశపఱుచుకొనవలయును. శ్రేణీముఖ్యులయందు భేదమును, ననుంగులయినవారిని లాలనము గావించుటయందుఁ గన్నుగలిగి యుండవలయును. అమాత్యులను భేదపడకుండునట్లును, ఒక్కటిగాఁ గూడికొనకుండునట్లును గాచుచురావలయును. రాజు మెత్తనివాఁడయినచో జనులవమానింతురు; వేండ్రమయినచో భయపడుదురు. రాజు వేండ్రముగ నుండఁదగినకాలమున వేండ్రముగను, మృదువై యుండవలసిన కాలమున మృదువుగను నుండవలయును. మృదువైనదానిచేతనే మృదువగువానిని జంపుదురు. మృదువుచేతనే దారుణమయిన దానిని జంపుదురు. మృదువునకసాధ్యమయినదిలేదు. కాఁబట్టి మృదువు వేండ్రమునకంటె వాఁడియందురు. ఏరాజు మృదువుగానుండవలసినపుడు మృదువుగను, దారుణముగా నుండవలయునపుడు దారుణముగను నుండునో యతఁడు కార్యములను సాధించుటయేకాక శత్రువునుగూడ నడంచివుచ్చును. పండితుఁడగువాని విరోధము పెట్టుకొన్నపిదప వానికి దూరముగా నున్నారమని నమ్మియుండరాదు. బుద్ధిమంతుని బాహువులు చేతులు మిక్కిలియు నిడుదలయినవి. కాన దన్ను హింసించినవారిని వానిని

గాని హింసించును. దేనిదరిని దాఁటఁ దరముగాదో దానిని దాఁటరాదు. దేనిని శత్రువు మరల నపహరింపఁజాలునో దానిని హరింపరాదు. దేనివేరును బెల్లగింపఁ దరముగాదో యట్టిదానిని ద్రవ్వరాదు. ఎవనితల గూల్ప నలవిగాదో వానిని గొట్టరాదు. అయినను రాజెప్పుడును నిట్లు నడచుకొనరాదు. నే నిప్పుడు విధించిన ప్రకారమును నాపదలయందు మాత్రమే యనువర్తింపవలయును. నీహితమును గోరుటంబట్టి నీవు శత్రువులు దలపడినప్పు డెట్లు నడచుకొనవలయునో నీకుఁజెప్పితిని' అనెను.

భీష్ముఁడు - హితార్థియై యాబ్రాహ్మణుఁడు చెప్పినదెల్ల విని సౌవీరదేశపు రాజు మిక్కిలియు సొంపుగల మనసుతో నతఁడు చెప్పినట్లెల్లఁగావించి తాను బంధుసహితముగాఁ బ్రకాశించుచున్నయైశ్వర్యము ననుభవించినవాఁ డయ్యెను. ఇది నూటనలువదియవయధ్యాయము.

---

## ఆ ప ద్ధ ర్మ ప ర్వ ము.

{ భీష్ముఁ డాపత్కాలమందు నభక్ష్యము ను భక్షించియైనను నాత్మరక్షణముచేసికొనవలయునని నిరూపించుటకై విశ్వామిత్రసంవాదమును జెప్పుట. }

ధర్మరాజు - 'పరమం బయినధర్మము లోకు లందఱచేతను నుల్లంఘింపఁబడి కొఱవడినపుడును, అధర్మము ధర్మమయినపుడును, ధర్మ మధర్మ మయినపుడును, మర్యాదలు మిక్కిలియు భిన్నములయినపుడును, లోకమందు ధర్మసిద్ధాంతములు గజిబిజినొందినను, బ్రజలు రాజులచేతను దొంగలచేతను బీడితులయినపుడును,

అన్ని యాశ్రమములవారును స్వకర్మముల తెలివి మాలినపుడును, అగ్ని కర్మములు చెడినపుడును, మనుష్యులు సలుగడలఁ గామమువలనను లోభమువలనను మోహమువలనను భయమును గాంతురేనియు, సమస్తజనులు నొండొరుల నెప్పుడును నమ్మక యొకరినొకరు కపటోపాయములచేతఁ జంపుకొనినపుడును, ఒకరినొకరు మోసపుచ్చుకొనినపుడును, దేశమునం దెల్ల నిండ్లు తగులఁబెట్టఁబడినపుడును, బ్రాహ్మణులు మిక్కిలియుఁ బీడితులయినపుడును, మేఘములు వానకురియ కుండునపుడును, జనులకుఁ బరస్పరము భేదముకలిగినపుడును, భూమియందుఁగల బ్రతుకుఁదెరువులన్నియును దొంగలపా లయినపుడును, నిట్లు మిక్కిలియు నీచమయిన కాలము దాపరించినపుడు పుత్రపౌత్రులను జాలిచేత దిగవిడువ నేరకున్న బ్రాహ్మణుఁడు దేనిచేత బ్రతుకవలయును ? భారతా ! బ్రాహ్మణుఁ డట్టి యాపదయందు నెట్లు నడచుకొనవలయును ? అట్లు లోకమంతయుఁ గలుషముకాఁగా రాజు నైత నెట్లు నడచుకొన్న నతఁ డర్థమునుండియు ధర్మము నుండియుఁ గొఱవడక యుండును?' అని యడిగెను.

భీష్ముఁడు- 'మహాబాహూ ! ప్రజల యోగక్షేమములకును, మంచివరములకును, వ్యాధి రోగము మొదలయిన భయములకును మూలము రాజు సుమీ. భరతసత్తమా! కృతము త్రేత ద్వాపరము కలి యనువీనికిని మూలము రాజే యని నామతము. ఇందులకు సందియము లేదు. ప్రజలకుఁ గీడును గలిగించునట్టి యా కాలము వచ్చునేని యపుడు తెలివి బలిమి నూఁది బ్రతుకవలయును. ఈవిషయమం దొక మాలపల్లెయందు విశ్వామిత్రునకును మాలవానికిని జరిగిన సంవాద మయినయీపురాత నేతి

హాసము నుదాహరించెదరు. తొల్లి త్రేతాద్వాపరయుగముల సంధియందు దైవవ్యత్యాసమువలన లోకమందుఁ బండ్రెండు సంవత్సరములు భయంకరమయిన యనావృష్టి కలిగెను. త్రేతా యుగము మునిఁగి ద్వాపరయుగ మారంభించిన సమయమందు, త్రేతాయుగమందు మిక్కిలియు వృద్ధిఁజెంది యుండిన ప్రజలకు నింద్రుఁడు వానకురియఁడయ్యె. బృహస్పతి వక్రగతిఁ బోయెను. చంద్రుఁడు వేఱువిధముగాఁ దిరిగిన మండలముతో దక్షిణమార్గ ముగఁ జనెను. రాత్రిముగియఁగా నాకాశమందు నొక్కనలుపును లేదయ్యె. మేఘసమూహము లెక్కడనుండును? ఏరులయందు నీరు మిక్కిలియుఁ దగ్గి యడుగునఁ గొంచెము పాఱుచుండెను. కొలఁకులును నదులును బావులును సెలయేళ్లును, దైవవ్యతి క్రమమువలన శోభ నశించి కంటికిఁ జూపట్టుటయు లేకపో యెను. భూమియందుఁ గొలంకు లెండిపోయెను. సభలును జలి పందిరులును దూలినవి. యాగములును వేదాధ్యయనములును నశించినవి. వషట్కారము గలుగదయ్యె. కృషియు, గోరక్షణ మును నశించెను. అంగడులను గ్రయవిక్రయములు నడుగం టెను. పూర్వాచారములెల్ల మానెను. పెద్దయుత్సవములు నశించెను. అంతటఁ బెద్దయెమ్ములును జిన్నయెమ్ములు నెరసియుం డెను. మఱియు జనుల హాహాకారములు భయము గొలుపు చుండెను. పట్టనములు విశేషముగాఁ బాడుపడియు గ్రామము లును గృహములును గాలియు నుండెను. అప్పుడు భూమియందు జనులుఁ గొన్నియెడల దొంగలకుభయపడి విడిచిపోయిరి. కొన్ని యెడల నొకరికొకరు భయపడి పలాయితులయిరి. కాన భూమి బహుతరముగా శూన్యమై యుండెను. దేవాలయములు

నశించెను. ముదుసళ్లును బాలురును గానంబడరైరి. గోవులును మేఁకలును గొఱియలును నెనుములును లేకుండెను. ప్రాణులొకటినొకటి గొట్టుకొనుచుండెను. బ్రాహ్మణులు చంపఁబడుచుండిరి. రక్షకులయిన జనులును హతులయిరి. ఉత్సవములును జనసంఘములును నశించియుండెను. మనుష్యసమూహము చాల వఱకు శవప్రాయములయ్యెను. యుధిష్ఠిరా! ధర్మము నశించి భయంకరమై యున్నయక్కాలమందు మనుష్యులాఁకటికి రేఁగి యొకరినొకరు పట్టి తినఁ దొడంగిరి. ఋషులు నియమములను నగ్నిహోత్రములనును దేవతలనును ఆశ్రమములనును దిగవిడిచి యిటునటు పలువగలఁ బాఱిపోయిరి. అంతఁ బూజ్యుండును బుద్ధిమంతుఁడునయిన విశ్వామిత్రమహర్షి యాఁకలి పయికొనఁగా నెచ్చోటును గానక నలుదిక్కులఁ బఱుగిడఁ దొడంగెను. ఆవిశ్వామిత్రుఁ డగ్నిహోత్రమునువిడిచి యింటిని మాని పుత్త్రులను భార్యను నొకజనసమూహమందు విడిచి భక్ష్యాభక్ష్యములను సమముగాఁగొని సంచరించుచుండెను. అపుడొకసమయమున నొకయరణ్యమందుఁ గ్రూరులును బ్రాణఘాతుకులునగు మాలవారుండుపట్టును గాంచెను. అందుఁ గుండలు చెల్లాచెదరై కుక్కమాంసముల నలంకృతమయి యుండెను. మఱియుఁ బందులయు గాడిదలయు విఱిగినయెముకలును దలపెంకులును గుండలును నిండియుండెను. మఱియు నాపల్లెయందుఁ బీనుఁగుల వస్త్రములు వైవంబడియుండెను. పీనుఁగులపయి వైచినపూదండ లాభరణములుగా నుండెను. అందు గుడిసెల మోసలలందుఁ బాఁపకుబుసముల మాలికలు గుఱుతులుగా నుంపఁబడియుండెను. అందుఁ గోళ్లచప్పుళ్లును గాడిదల యోండ్రలును

భోరుకొను చుండెను. జను లొకరితో నొకరు పరుసనిమాటల తో రచ్చలాడుచు నుండిరి. అందు గూబలయొలుంగులును క్షుద్ర దేవతల స్థానములును జుట్టును గలిగియుండెను. ఇనుపగంట లలంకారముగాఁ గట్టంబడియుండెను. కుక్కతండములు చుట్టును బలసియుండెను. విశ్వామిత్రుఁ డట్టిమాలపల్లెయందుఁ జొచ్చి యాఁకటి యురవడిచేత నాహారమును వెదుకఁ దలంపుగొని మిక్కిలియుఁ బ్రయత్నమును గావించెను. ఆతఁ డాపల్లెయందు బిచ్చమెత్తుటకుఁ బోయినను నందు మాంసముగాని యన్నము గాని ఫలమూలములుగాని మఱియెద్దిగాని యొక్కచోటను బడయఁజాలకపోయెను. విశ్వామిత్రుఁడు 'కట్టా ! నాకేమికష్టము దాపరించినది' యని నిశ్చయించుకొని సత్తువతగ్గుటచేత నా మాలపల్లెయందుఁ గ్రిందఁబడెను. రాజసత్తమా! ఆముని 'మన కేదిమంచిది? ఎట్లు వ్యర్థముగాఁ జావకుండవచ్చును?' అని చింతిం చెను. రాజా ! ఆముని యంత మాలవానియింట వాఁ డాయు ధముచేతఁ జంపిన కుక్కమాంసము గ్రుచ్చియున్న యొక్కకఱ్ఱ పడియుండఁగాఁ జూచెను. అతఁడు 'ఇప్పు డుసురుగాచుకొనుటకు వే ఉపాయము లేదు. ఇపుడు నేను దొంగిలింపవలయును. ఆప త్కాలమం దుత్తములయందును మధ్యములయందును నధముల యందును దొంగతనము చేయఁదగినదిగా విధింపఁబడి యున్నది; అట్టి దానిని బ్రాహ్మణుఁ డుసురుగాచుకొనుటకుఁ జేయవచ్చుననుట నిశ్చయము. మొదట నధమునివలననుండి ముచ్చిలింపవలయును. పిదప మధ్యములవలననుండి నాక్రమింపవచ్చును. ఈ రెండును గలుగకయుండినచో ధర్మాత్ముఁ డగుమేటిపురుషునివలన నుండియు ముచ్చిలింపవచ్చును. ప్రాణులను జంపఁ దెగించినట్టి చండాలురు



741. విశ్వామిత్రుఁడు చండాలుని గృహముననుండు
కుక్కమాంసము నపహరించుట.

వీరు; కాన యిట్టివారి మాంసము నపహరించెదను. ప్రతిగ్రహదోషముతప్ప దొంగతనము దెక్కడను దోషము నాకుఁ గానరాకున్నది. కాఁబట్టి యీసంజుఁడును ముఱ్ఱిచ్ఛిలించెదను' అని యపుడాలోచించెను. భారతా! ఆవిశ్వామిత్రమహర్షి యిట్టిబుద్ధిని గొని మెచ్చటఁబడెనో యచ్చట లెస్సగా నిదురించెను. అపూజ్యుఁ డర్ధరాత్రమగుటను జూచి మాలపల్లెయంతయు నిదురింపఁగా మెల్లగా లేచివచ్చి గుడిసెవాకిటిని దూఱెను. ఆమాలవాఁడు నిదురించుచుండి, కంటియందుఁ బుసి గ్రమ్మియుండ, వికారంబగు నెలుంగుగలిగి, క్రూరుఁడై చూడ నసహ్యపడఁదగువాఁడై చూపట్టుచు, 'మాలపల్లె నిదురించుచుండు నపుడు వాఁ డెవఁడు నాకట్ట నాడించువాఁడు? మేలుకొని యున్నాను, నేను నిదురింపలేదు. క్రూరుని ని న్నిదో చంపెదను' అనెను. అప్పుడు విశ్వామిత్రుఁ డాదొంగతనముచేత లజ్జ గ్రమ్మిన మొగముతో వేగ భయపడి వడఁకుచు, నాచండాలునిఁజూచి 'దీర్ఘాయుష్మంతుఁడా! నేను విశ్వామిత్రుఁడను; ఆఁకలిగొనివచ్చితిని. బుద్ధిమంతుఁడవుగదే. నీవు చక్కఁగాఁ దెలిసికొంటివేని నన్నుఁ జంపకుము' అనెను. విదితాత్ముం డయినయమ్మహర్షి చెప్పినది వినఁగానే మాలవాఁడు పడుకనుండి సంభ్రమమున నతనిఁ గూర్చిపోయెను. వాఁడు కన్నులనుండి నీరుదొరుఁగ గౌరవముచేత నంజలిగీలించి విశ్వామిత్రునితో 'బ్రాహ్మణోత్తమా! రాత్రియందు మీ రేమిచేయఁ దలఁచుచున్నారు'? అని యడిగెను. విశ్వామిత్రుఁడు మంచిమాటలాడుచుఁ జండాలునిఁజూచి 'న న్నాఁకలి పీడించుచున్నది. నాయుసు రెక్కడనో లోన యడంగి మడంగి యున్నది. నేను గుక్కతొడను నపహరించెదను. ఆఁకలి గల

వాఁడు దుష్కార్యమందుఁ జొచ్చును. ఆహారమున కువ్విళ్లూరు వానికి సిగ్గుగలుగదు. ఈవిషయమై కటికియాఁకలి నన్ను దోష వంతునిఁగాఁ జేయుచున్నది. కాఁబట్టి కుక్కతొడను దొంగలించె దను. నాయుసులు నశించుచున్నది. ఆఁకలిచేత నామెలుకతప్పు చున్నది. బలముడిందువడి, తెలివియుంబోయి, భక్ష్యము అభక్ష్య మని భేదముగానక, నేనధర్మమును దెలిసినవాఁడనయ్యుఁ, గు క్కతొడ నపహరించుచున్నాను. మీయింట నేను బిచ్చముఁ బడయనప్పుడు నాకుఁ బాపమందు బుద్ధిగలిగెను. కాఁబట్టి కుక్కతొడను నపహరించెదను. దేవతల ముఖమును, వారికి ముందుఁబోవువాఁడును, బరిశుద్ధముగా నుండుటనుమాత్రము సహించువాఁడును, బ్రభుండు నగు నగ్నిదేవునివలె బ్రాహ్మణుండ నగునేను సర్వమును భక్షింప నర్హుఁడ నగుచున్నాను. నేను ధర్మ ముచొప్పున నుండువాఁడనని తెలియుము' అనెను. ఆచండా లుఁ డావిశ్వామిత్రునిఁజూచి 'మహర్షీ! నామాట వినుము. విన్న పిదప ధర్మమెట్లు కొఱవడకుండునో యట్లుచేయుము. బ్రహ్మర్షీ! నీకుఁగల ధర్మమును వినుము. నేనది మీకుఁ జెప్పుచున్నాను. మృగములయందుఁ గుక్కయధమమని తెలిసినవారు చెప్పె దరు. అందును దానిశరీరమందలి తొడయన్నదో మిక్కిలి నీచ మయిన చోటుగానున్నది. మహర్షీ! ఇది మంచి పూనికగాదు. ఇది విశేషించి యభక్ష్యమైనది. మఱి చండాలుని సొమ్ము; కనుక దీని నపహరించుట నింద్యమగు కార్యమగును. నీవు ప్రాణము రక్షించుకొనుకొఱకు వేఱు మంచియుపాయమును జూడుము. మహామునీ! కుక్కమాంసమును గోరుటవలన నీతపమునకు నాశముగలుగును. తెలివిగలవాఁడు మంచిదారిని బోవలయును.

ధర్మమునకు సంకరముచేయరాదు. ధర్మమును నీవు దిగవిడువరాదు. ఏలనఁగా, నీవు ధర్మవిదులందు త్తముఁడవై యున్నాఁడవు' అనెను. విశ్వామిత్రుఁ డది విని యాఁకటిచేతఁ బీడితుఁడై మరల వానితో 'నేను జాలఁగాలముగా నాహారము లేకయిటు నటుఁ బరుగులిడుచున్నాను. ప్రాణమును గాచుకొనుటకు నాకు వేఱొకయుపాయము తోఁపకున్నది. మనుజుఁడు తాను జచ్చునంతటి కాఁటియ పడుచున్నపుడు ముందువెనుక నాలోచింపక యేకార్యముఁజేసి యైనను దనప్రాణముల నుద్ధరించుకొనవలయును. పిదపఁ దనకు శక్తివచ్చినపుడు ధర్మము నాచరించుకొనవచ్చును. క్షత్రియుఁ డింద్రునిధర్మము లాచరింపవలయును. అగ్నిధర్మము బ్రాహ్మణునికిఁదగును. వేదములగ్ని; అవినాకు బలము. కాఁబట్టి నాయాఁకటి నుడుపుటకై యీయభక్ష్యమును సయితము భక్షించెదను. ఏయేవిధమునఁ జేసియే జీవింపవలయునో దానినెల్ల నలక్ష్యముసేయుక కావింపవలయును. జీవించియుండుట మరణమునకంటె మిక్కిలిమంచిది. జీవించియున్నవాఁడు ధర్మమును బడయును. అట్టి నేను ప్రాణమును గోరి దీని నభక్ష్యమని కూడఁ దెలిసియే భక్షింపఁగోరుచున్నాను. అందులకు నీవు సమ్మతింపవలయును. బ్రతికియుండి ధర్మమును జేసెదను. సూర్యుఁడు మొదలయిన జ్యోతిస్సులు పెనుచీఁకటిని బోఁగొట్టునట్లు, తపముచేతను విద్యచేతను నశుభములను దొలఁగించుకొనెదను' అనెను. చండాలుఁడు 'ఈమాంసమునుదిని నీవిపుడు ప్రాణమును బడయుటలేదు. లేక యమృతమును భుజించునట్లు తృప్తిని బడయుటయు లేదు. వేఱు భిక్షగొనుము. కుక్కమాంసమును దినుటయందు మనసు నుంప

కును. కుక్క బ్రాహ్మణుల కెంతమాత్రమును దిన నర్హముగా నిది చుమీ' యనెను. విశ్వామిత్రుఁడు 'చండాలా! ఇది దుర్భిక్ష కాలము. కనుక వేఱుమాంసము దొరకునని నాకుఁ దోఁప కున్నది; నాకు ధనమును లేదు. ఆఁకట నకనకలాడుచు గతి మాలి యాశదూలి నవయుచున్న నాకుఁ గుక్కతోడ యాఱు రసములకంటె మేలయినదిగాఁ దలఁచుచున్నాను' అనెను. చండాలుఁడు 'బ్రహ్మ క్షత్రియ వైశ్యులకు గోళ్లుగలజంతువులలో నైదుమాత్రమే (అనఁగా ఆళువ, ముండ్లపంది, ఉడుము, కుందేలు, తాఁబేలు ననెడియీయైదుమాత్రమే) భక్ష్యములగును. నీకు శాస్త్రము ప్రమాణమగునేని, యభక్ష్యమందు మనస్సు నుంపకుము' అనెను. విశ్వామిత్రుఁడు 'అగస్త్యుఁ డాఁకలిగొని వాతాపియను నసురను భక్షించెను. నేను నాఁకలిగొని యాపదయందుఁ జిక్కియున్నానుగాన గుక్కతోడను గుడిచెదను' అనెను. చండాలుఁడు 'మఱియొక భిక్ష నడుగుము. నినుఁబోటి కిది సేయుట యెంతమాత్రము దగదు. వాస్తవమున నీ కిట్టిది యెంతమాత్రము చేయఁదగదు. నీ కిష్టముండెనా కుక్కతోడను దీసికొనవచ్చును' అనెను. విశ్వామిత్రుఁడు '(అగస్త్యుఁడు మొదలయిన) శిష్టులే ధర్మమునకుఁ బ్రమాణము. వారి నడక నను వర్తించుచున్నాను. నే నీ కుక్కమాంసమును మేధ్యమైన (పరిశుద్ధమైన) యాహారమునకంటె నిపుడు మేలయిన భక్ష్యముగాఁ దలఁచుచున్నాను' అనెను. చండాలుఁడు 'అసజ్జనులచే నాచరింపఁబడినది సనాతనధర్మము గానేరదు. అకార్య మెన్నఁటికిని గార్యము గానేరదు. నెపమిడి (బేలుపోయి) యకార్యమును జేయకుము' అనెను. విశ్వామిత్రుఁడు 'ఒకఁడు ఋషిగానుండి

(అనఁగా నగస్త్యునివంటివాఁడు) పాతకమును జేయఁజాలఁడు. ఇట్టియెడఁ గుక్కయు జింకయు రెండును (మృగములగుటం బట్టి) సమములనియే తలఁచుచున్నాను. కాఁబట్టి కుక్కతొడను భక్షించెదను' అనెను. చండాలుఁడు, 'ఆయగస్త్యఋషి బ్రాహ్మణులను రక్షింపఁగోరి ప్రార్థితుఁడై యభక్ష్యమగు నాయసుర మాంసమును భుజించెను; కాని యాశపడి భుజింపలేదు. అది ధర్మమే. అందుఁబాపము లేదు. సమస్తములయిన యుపాయములచేతను మూఁడువర్ణములకును బెద్ద (బ్రాహ్మణు) లగువారు రక్షింపఁబడఁదగినవారుగదా' యనెను. విశ్వామిత్రుఁడు 'నేను బ్రాహ్మణుఁడను. నాయీశరీరము నాకు మిత్రము. ఇది నాకు మిక్కిలి ప్రియమయినది. లోకమందు నాకుఁ బూజ్యతమము నది. ఈదేహమును బోషింపవలయునను కోరికనుబట్టియె కుక్కతొడను దినవలయునను కోరికగలిగినది. నాకున్న తమకము నకు నినుబోఁటి నృశంసులకు నే నెంతమాత్రమును వెఱవను' అనెను. చండాలుఁడు 'మనుష్యులు జీవితమును విడుచుటయుఁ గలదు కాని యభక్ష్యమందు బుద్ధి యెవ్వఁడును జొనుపుట గానరాదు. (ప్రాణములనైన విడువవచ్చునుగాని యభక్ష్యమును దినరాదని తోఁచుచున్నది).ఆఁకటిని నోర్చుటవలన నిహమందుఁ గల కామములనెల్లఁ బొందుదురని తెలియుము. నీవు నాఁకటిని గెలిచి యాకామములను బడయుము'అనెను. విశ్వామిత్రుఁడు 'ఆ కామము(అనశనముచేతమరణము) పిదపటిజన్మమందుఁబొగడ్త గలిగింపఁ జాలినదనుట యుక్తమే.(జీవించియున్నవానికి)నాహార ములేనిచోఁ గర్మములకు నాశముగలుగు ననుటకు సందేహము లేదు. నేనో యెప్పుడును వ్రతముగలిగియు బుద్ధియం దడఁకువ

గలిగియు నుండువాఁడను. ధర్మమునకు మూలమగు శరీరమును రక్షింపవలయును. కాఁబట్టి యభక్ష్యమును భక్షించెదను. పరిశుద్ధాత్ముఁడగు వానియందు నిట్టికార్యము ధర్మముగాఁ దలఁపఁబడుననుట స్పష్టము. అశుద్ధాత్ముం డగు వానియందే కుక్కమాంసమునుదినుట పాపముగాఁ గనుపట్టును. నేనిపుడు చేసినది నిశ్చయముగాఁ దప్పిదముగానుండినను (అనఁగా నేను గుక్కమాంసమును దిన్నను) దానినిబట్టి నినువంటివాఁడను నేనుగాను' అనెను. చండాలుఁడు 'ని న్నీపాపమునుండి మరల్పవలయునని నేను మనస్సునందు నిశ్చయించుకొంటిని. బ్రాహ్మణుఁడుగానుండి దుష్కార్యము చేయునేని వాఁడు తనపదవినుండి కీడ్పడును. ఇందులకే ని న్నిట్లు దూఱుచున్నాను?' అనెను. విశ్వామిత్రుఁడు 'కప్పలు బెకబెక లాడుచుండినను నావులు నీరు త్రాగకమానవు. ధర్మమందు నీ కధికారము లేదు. కాఁబట్టి నన్ను నీవు పొగడికొనవలదు' అనెను. చండాలుఁడు 'నీకు మిత్రమనై తిని; కావుననే నిన్ను గుఱించి శోకించుచున్నాను. బ్రాహ్మణా! నీయందు నాకు జాలిచుమీ. కాన యేది మేలో యది చేయుము. లోభమందు మనస్సునుంపకుము' అనెను. విశ్వామిత్రుఁడు 'నీవు నాకు సుహృదుఁడవై నాసుఖమును గోరుదువేని, న న్నీయాపదనుండి యుద్ధరింపుము. అప్పటికి నే నీ కుక్కతోడను దిగవిడుతును గనుక, (నధర్మముచేతఁ గాక) ధర్మముచేత నన్ను రక్షించుకొంటినని తెలియుదును' అనెను. చండాలుఁడు 'నీకు నే నీమాంసము నిచ్చుటకు నెంత మాత్రమొల్లను. మఱి నాయన్నమును నీవు దొంగిలించుకొని పోవుచుండఁగా నూరకుండుటకు నొల్లను. నేను నీ కీమాంసము

నిత్తునేని, బ్రాహ్మణుఁడవు నీవు దీనిని గొందువేని, మనమిరువుర మును గుక్కమలమున బ్రుంగి నరకమునఁ గూలుదుమే' యనెను. విశ్వామిత్రుఁడు 'నే నిప్పు డీ పాపకర్మమును జేసితి నేని మిక్కిలియుఁ బవిత్రమయిన నా ప్రాణమును దప్పక గాచుకొందును. ఇట్లు ప్రాణమును నిలఁబెట్టుకొని పిదప ధర్మము నే యాచరించి నాయాత్మను బరిశుద్ధము చేసికొనెదను. (అన్నము లేక చత్తునా? అశుద్ధమైన యన్నమును దిని ప్రాణమును రక్షించుకొందునా?) ఈ రెంటిలో నేది యెక్కుడో చెప్పుము' అనెను. చండాలుఁడు 'వానివానికిఁ దగిన ధర్మముల నాచరించు విషయమున (తగును దగదని తెలియుటకు) వాని యాత్మయే సాక్షియగును. ఈ రెంటిలో నేది చెడ్డకృత్యమో నీయంత నీవే యెఱుఁగుదువు. ఎవఁడు కుక్కమాంసమును భక్ష్యముగా నాదరించునో వానికి నాహారములందు వర్జింపఁదగిన దేదియు నుండదు. వాఁడన్నిటిని దినును నని నాకుఁ దోఁచుచున్నది' అనెను. విశ్వామిత్రుఁడు 'అభక్ష్యమును బుచ్చుకొనుటయందును భక్షించుటయందును దోషమున్నది. అయినను బ్రాణమున కపాయము గలుగునపుడు విధికి నెప్పుడు నపవాదము గలదు. (ఇట్టిదానిని బుచ్చుకొనుట యందును భుజించుటయందును దోషముగలుగదు.) మఱియు నభక్ష్యమును భక్షించుటయందు హింసయు వంచనయు లేకయుండు నిందమాత్రము కలిగియు నుండునేని యది యంతగాఁ బెద్దదిగాదు' అనెను. చండాలుఁడు 'అభక్ష్యమును దినుట కిది నీకు హేతువగునేని, నీకు వేదమును నార్యధర్మమును బ్రమాణము గానేరవు. బ్రాహ్మణోత్తమా! కాఁబట్టి నీవిపుడు చేయు దానినిబట్టి భక్ష్యమునకును నభక్ష్యమునకును భేదము చూడ

కుండుటయందు దోషము లేదని నాకుఁ దోఁచుచున్నది' అనెను. విశ్వామిత్రుఁడు 'ఒకఁడు భక్ష్యమును భక్షించిన మాత్రమున వానికిఁ బాతకము గలుగుట గానరాకున్నది. కలు త్రాగిన యెడఁ గూలుచున్నాఁడనుట (మనుష్యులకుఁ ద్రాగుబోతుతనము లేకుండుటకై చెప్పిన) వట్టిమాటమాత్రమే కాని నుతేమి కాదు. మఱియు నిట్టివగు తక్కువపాపకర్మములను, అవియెవ్విగా నుండి నను వానిసంబంధము గలిగినంతమాత్రమున నొకఁడు చేసిన పుణ్యమును నాశము సేయఁజాలదు' అనెను. చండాలుఁడు 'ఎవఁడు విద్వాంసుఁడై యుండి మాలపల్లియయును చెడ్డచోట నుండి, దొంగతనమనెడి హీనకర్మముచేత, నియ్యనొల్లకున్న తక్కువవానివలననుండి, పేరాసతోడఁ గుక్కను బొందునో, వాఁడు సాధువుల నడవడికి విరుద్ధమయిన దానిని గావించినవాఁ డగును. వాఁడట్టిపని చేయుటచేత మఱియు దండనమును బొంద వలసియు వచ్చును' అనెను.

భీష్ముఁడు 'అప్పు డాచండాలుఁడు విశ్వామిత్రున కిట్లు చెప్పి యంత నూరకుండెను. విశ్వామిత్రుఁడు బుద్ధియందు నిశ్చయించు కొనియే యాకుక్కతోడను గయికొనెను. అమ్మహాముని బ్రతు కఁగోరి యాకుక్కమాంసము తునుకను బుచ్చుకొని వనమున కుఁగొనిపోయి భార్యయుం దానును దానిని దినఁగోరెను. అంత నతనికి 'నేను మొదటఁ దగుకాలమున దేవతలకుఁ దృప్తిగావిం చినపిదప విధిచొప్పునఁ గుక్కతోడను భక్షించెదను' అని తలంపు గలిగెను. అంత నతఁడు వేదోక్తవిధిప్రకార మగ్నిని దెచ్చి యైం ద్రాగ్నేయమగు విధిచొప్పునఁ దానే చరువును బచనము చేసెను. పిదప విధ్యుక్తముగా వేఱువేఱ యింద్రాదిదేవతలను బిలిచి దైవ

మును బిత్ర్యమునగు కర్మములను గావింపఁదొడంగెను. ఆసమయమందే యింద్రుఁడును విశేషించి వాన గురియించెను; సమస్తప్రాణులను బ్రదికించువాఁడై సమస్తములయిన యోషధులను బుట్టించెను. బ్రాహ్మణశ్రేష్ఠుఁ డతఁ డాకర్మమును ముగించి దేవతలను బితరులను దృప్తిపఱిచి యామాంసమును దాను భుజించెను. ఆ బ్రాహ్మణోత్తముఁడు తపముచేఁ బాపములనెల్ల దగ్ధముగావించి దీర్ఘకాలమునకుఁ బిదప మిక్కిలి యద్భుతమయిన సిద్ధినిబొందెను. ఇట్లు తెలిసినవాఁడు వ్యసనమునం జిక్కినపుడు ప్రాణమును రక్షించుకొనఁ గోరునేని బుద్ధియందు విన్నఁదనము లేక యుపాయములనెఱింగి సమస్తములయిన యుపాయములచేతను దన్నాపదనుండి యుద్ధరించుకొనవలయును. ఇట్టి బుద్ధిగలిగి యెప్పుడును జీవింపవలయును. పురుషుఁడు ప్రాణము నిలఁబెట్టుకొని యున్నయెడలఁ బుణ్యమును శుభమును బడయవచ్చును. కౌంతేయా! కాఁబట్టి బుద్ధిసంపన్నుఁడగు విద్వాంసుఁడు ధర్మాధర్మములను నిశ్చయించు విషయమునఁ దనబుద్ధినే యూఁది యీలోకమందుఁ బ్రవర్తింపవలయును' అనెను. ఇది నూటనలువదియొకండవయధ్యాయము.

